# అభినవసరస్వతి.

జానపాడు
శుక్ల సం॥ భాద్రపదమాసము

సంచిక
౬

శ్రీ శ్రీ శ్రీ

## జగద్గురు వందనము.

శ్లో॥ శ్రీపుష్పగిరి సంస్థాన । రత్నభూషణభూషితం
నృసింహభారతీస్వామి । జగద్గురు మహం భజే॥

ఉభపార్శ్వములనుండు ♦ నారు వేద వేదాంగ
ఘనసుధీంద్రులె మహా ♦ మునులుగాఁగ
భ యుపార్శ్వములందు ♦ నుద్భాసితోద్యోగ
భరితులే యింద్రాది ♦ సురలుగాఁగ
గసుపార్శ్వములందు ♦ వెండిబెత్తము లూను
వేత్రహస్తులె చండి ♦ భృంగిగాఁగ
ర్శ్వద్వయంబునఁ ♦ బ్రిభవిల్లుమఠశిష్య
గణములెల్లఁబ్రమథ ♦ గణముగాఁగ
గీ॥ చంద్రమౌళీశ్వరుండను ♦ సచ్చిదాత్మ
ననిశ మర్చించు పుష్పశై ♦ లాధనాథుఁ
బరమహంసను నరసింహ ♦ భారతీంద్రు
శ్రీజగద్గురు కైలాస ♦ శివునిఁగాఁగ
నరసి సాంష్టాంగవందన ♦ మాచరింతు.

) చంద్రమౌ ♦ ళీశ్వరారాధనం
బఖిలార్తిగహనదా ♦ వానలంబౌ
♦ తేంద్రియవ్యాపార
మాత్మారి శైలవ ♦ జ్రాయుధంబౌ

ఎవ్వాని శమదమా ♦ ద్యైథితవైరాగ్య
మాశాభుజంగనా ♦ గాశనంబొ
ఎవ్వాని యద్వైతీ ♦ యేశ్వరజ్ఞానంబు
నజ్ఞానతిమిరచం ♦ డాంశుధరుఁడొ
గీ॥ ఎవనిపావనదర్శన ♦ మవనియందు
చటులసంసారజలధిదా ♦ శరధిశరమొ
అట్టి నరసింహ భారతీ ♦ యతివరేణ్యు
నరసి సాష్టాంగవందన ♦ మాచరింతు.

సీ॥ ఏయతీశ్వరహస్త ♦ తోయజార్పితమైన
సలిలంబుసాగర ♦ సన్నిభంబొ
ఏజగద్గురుపాద ♦ పూజాభివాదంబు
పూర్ణతీర్థాటన ♦ పుణ్యదంబొ
ఏసంయమీంద్రున ♦ కిడిన భిక్షాన్నంబు
మేరుభూధరదాన ♦ భారసమమొ
ఏసాత్త్వికాగ్రణి ♦ యెనలేని శుశ్రూష
బహుమహాదానమై ♦ భవసమంబొ
గీ॥ అట్టి మహనీయగుణవంతు ♦ నధికశాంతు
పుష్పగిరి పీఠనాథుని ♦ బుణ్యమూర్తిఁ
బరమహంసను నరసింహ ♦ భారతీంద్రు
నరసి సాష్టాంగవందన ♦ మాచరింతు.

సీ॥ ఆస్థానచర్చల ♦ నరవింద జలబిందు
భాతి నెవ్వనిమనో ♦ రీతి మెలఁగు
ఆమ్నాయములయందు ♦ నరవిందమధుపంబు
భాతి నెవ్వనిమనో ♦ రీతి మెలఁగు

హరిహరార్చనలందు ♦ శరలక్ష్యదృక్స్వాంతు
భాతి నెవ్వనిమనో ♦ రీతి మెలఁగు
త్యాగదానములందు ♦ నంబుదారుణజుల
భాతి నెవ్వనిమనో ♦ రీతి మెలఁగు

గీ॥ అట్టి యతిరాజపూజితు ♦ ననఘచరితుఁ
బుష్పశైలాధినాథుని ♦ బుణ్యమూర్తిఁ
బరమహంసను నరసింహ ♦ భారతీంద్రు
నరసి సాష్టాంగవందన ♦ మాచరింతు.

సీ॥ చంద్రమౌళీశ్వర ♦ సముచితార్చనలచే
భగవదారాధన ♦ పథముఁ దెలిపి
కాలత్రయీస్నాన ♦ కల్పితానుష్ఠాన
విధులచేఁ గర్మత ♦ విధులఁ గఱపి
సతతాగమాంతాది ♦ తతవిచారంబుచేఁ
బరమార్థ సోపాన ♦ పథముఁ జూపి
సకలధర్మములందు ♦ సమరసవృత్తిచే
నద్వైతమతతత్వ ♦ మరయఁ జేసి

గీ॥ అరయఁ దీర్థప్రసాద మం ♦ త్రాక్షతలను
ననుదినంబును శిష్యులఁ ♦ దనుపుచుండుఁ
బరమహంసను నరసింహ ♦ భారతీంద్రు
నరసి సాష్టాంగవందన ♦ మాచరింతు.

ఇట్లు,

అవధాని పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీజగద్గురు పుష్పగిరి సంస్థాన విద్వాంసు



## —* కాశీప్రశ్నలకుఁ బ్రత్యుత్తరసంగ్రహము. *—

( సంస్కృతమునకుఁ బరివర్తనము )

—♦ ౮ విజయనగర పండితసమాజము ♦—

౮ వ సం॥ మొదలుకొని ఋతుప్రాదుర్భావము గులోపల స్త్రీలకును ౧౬ వ సం॥ మొదలుకొని ౪౦ సం॥ లోపలఁ బురుషులకున వివాహకాలము. శాస్త్రములయం దాపత్కల్పతచే రజోదర్శనానంతర వివాహమున కనుజ్ఞ యీఁబడినది. పరిస్థితినిబట్టి ౧౦ వ సం॥ మొదలుకొని స్త్రీలకును ౨౦ సం॥ ల పర్యంతమని పురుషులకును వివాహ నియమనము మంచిది.

స్వార్థనిరపేక్షులును శ్రుతిస్మృతిపురాణాది పూర్వాపరసందర్భవిదులును నగు ధర్మజ్ఞులకు సంకోచనాఖ్య ధర్మపరివర్తనము చేయుటకే యధికారమున్నది.

పెండ్లిచేసికొనవలసిన పిల్లయొక్క లక్షణములఁ బరీక్షింపఁ గలదుకావున దేశభేదమునుబట్టి వచ్చిన యవాంతరశాఖలవారితో నొకరు వివాహసంబంధము చేయఁగూడదు.

బ్రాహ్మణులలో విధవావివాహమును నియోగవిధియుఁ గేవల శాస్త్రవిరుద్ధములే కాక నింద్యములుగూడ నయ్యెడిని.

అంత్యజుల యస్పృశ్యత జాతినిబట్టియే యేర్పడినది. మన బావులలోని నీళ్లు తెచ్చుకొననీయఁగూడదు. దేవాలయాయందును గ్రామాదులయందును దర్శనమయినను దూరమున నే చేయనీయవలయును. మ్లేచ్ఛులకంటె వీరు నికృష్టులనియే యభిప్రాయము.

భాగవతధర్మదీక్షచే బ్రాహ్మణత్వాది జాత్యంతరప్రాప్తి వింపదు. యవనాదిజాతి జన్మసిద్ధమైనదే. ఎల్లజాతులవారికిని యం దధికారమున్నది. ఒకజాతిధర్మములయందు మఱియొకజాతి కధికారము లేదు.

మ్లేచ్ఛసంసర్గులకు వర్ష చతుష్టయపర్యంతముఁ బ్రాయశ్చి
యత కలదు. వ్యవహార్యతాదివిషయమున మతభేదమువలనను దే
భేదమువలనను వ్యవస్థచేసికొనునది. ముద్రితమైన దేవలస్మృతి ప్రమ
ణముకాదు. శూలపాణ్యుద్ధృత దేవలవచనముల కప్రామాణ్యము లేద

యూఁకులతరములవఱకే వ్రాత్యసంస్కారము.

జాతి జన్మమునుబట్టియే యేర్పడును.

౯ నల్లాన్ చక్రవర్తులవారు.

౭ వ సం॥ మొదలుకొని ౨ సం॥ లు స్త్రీలకు వివాహము ప్ర
స్తము. తరువాత ౨ సం॥ లు గౌణము. ౧౧ వ సం॥ అధమము. ౧
సం॥ మునఁ బ్రాయశ్చిత్తియత. ఋత్వనంతరవివాహ మయోగ్యమే.

దేవలస్మృతికి మన్వాద్యేకవాక్యతాస్థలమందే ప్రామాణ్యమ
అన్యత్ర లేదు. కనుకనే మ్లేచ్ఛసంసర్గుల నొక్క సం॥ వఱకుఁ బ్రా
శ్చిత్తముచేసి సంఘమునఁ గలుపుకొనుటలో విప్రతిపత్తి లేదు. తదధి
కాల గత సంసర్గులను గలుపుకొనఁగూడదు.

అనేక పరంపరాతిక్రమమునందును వ్రాత్యసంస్కారమున
యోగ్యత యున్నది.

౧౧ చిత్తూరు పాఠశాలాధ్యాపకులు.

౭ వ సం॥ మొదలుకొని ౧౨ సం॥ పర్యంతము స్త్రీలకు
౫౦ సం॥ పర్యంతము పురుషులకును వివాహకాలము.

అవాంతరశ్రేణీవివాహసంబంధము నిషిద్ధము కాకున్న
నాచారమునకు విరోధమగుటవలన నప్రమాణము.

౧౧ ఎమ్. బి. సుబ్రహ్మణ్యంగారు.

రెండ్లేండ్లలోపలఁ బెండ్లియైనదానికిని ఖననము నిషేధిం
బడుటవలన స్త్రీల వివాహకాలమునఁ బూర్వావధి లేదు. పురు
షెనిమిదవయేట నుపనయనముయిన తరువాత నొక్క వేదము పూర్తి

జనుపుటతోడనే వివాహమున కర్హులగుదురు. పరిస్థితినిబట్టి ౧౧ యేండ్ల లోపల స్త్రీలకు వివాహము నిషేధించుట మంచిది.

౧౨ తిరుపతి విద్యాలయపండితు లందఱు

స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని వివాహవిషయమునఁ జేయ వలసిన నియమము నిది. ఏమనఁగా, పదవసంవత్సరము మొదలుకొని స్త్రీలకును బదునెనిమిదవసంవత్సరము మొదలుకొని పురుషులకును వివాహము చేయవలయును. రజోనంతరవివాహ మాపత్కల్పమాత్రము. అదియును సంస్కారరూపము కాదు. రజస్వలయైన తర్వాతఁ బెండ్లియైన స్త్రీకిఁగాని దాని మగనికిఁగాని కర్మాధికారము లేదు.

అవాంతరశ్రేణులలోని పరస్పరవివాహసంబంధము శాస్త్రనిషిద్ధము కాకున్నను నాచారవిరోధమగుటచే నప్రమాణము.

స్వార్థనిరపేక్షులును శ్రుతిస్మృతిపురాణాది పూర్వాపరసందర్భవిదులును నగు ధర్మజ్ఞులకు సంకోచనరూపమైన ధర్మపరివర్తనముఁ జేయుటమట్టుకే యధికారము. కాని పతితుల శక్తినిబట్టి ప్రాయశ్చిత్తవిషయమునఁ బ్రవర్తనరూప పరివర్తన చేయుటకు సమర్థులు కావచ్చును.

బ్రాహ్మణులలోని విధవావివాహమును నియోగవిధియుఁ గూడ శాస్త్రసిద్ధము లే కావు. నింద్యములుఁగూడ (నియోగవిధి యనఁగా సభర్తృక భర్త్రాజ్ఞానుసారముగను విభర్తృక యత్తమామలయాజ్ఞ చేతను దేవరాదులతోడఁ గలసి సంతానము గనుట. వంశ మంతరించు చున్న సమయమున విధవయే కాక, పతి పుంస్త్వహీనుఁ డగుటనో మఱియొక హేతువునుండియో సంతు వడయఁజాలని సధవయు బావలతోఁగాని మఱఁదులతోఁ గాని తదభావమునఁ దుదకుఁ బరిస్థుఁడైన మఱియొకబ్రాహ్మణునితోఁ గాని కలసి ధవు నాజ్ఞాప్రకారము సధవయు, నత్తమామల యాజ్ఞాప్రకారము విధవయుఁ బుత్త్రిణిగా

వంశ ముద్ధరించుకొనుట పూర్వయుగములయం దాచారములో నుండెను. అప్పట్ల నాచారములోనుండిన యీ విధి ననుసరించియే యత్తయగు సత్యవతి యాజ్ఞాప్రకార మంబాంబాలికలు ధృతరాష్ట్ర పాండురాజులను, భర్తయగు పాండునాజ్ఞాప్రకారము కుంతీమాద్రులు యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులను గని కులము నిలుపుకొనిరి. ఇట్టివి యింకను నెన్నియో యున్నవి. అట్టివిధి కలినిషిద్ధము. కనుక నే శాస్త్రసిద్ధమును నింద్యమును)

చండాలుర యస్పృశ్యతయుఁ గూపోదకాది వ్యవహారాయోగ్యతయు జాతినిబట్టియే యేర్పడినవి కాని వేఱుకాదు. వైఖానసాగమము విధించినట్లు దేవాలయాంగణములయందును గ్రామాదులయందును దూరమునుండియే వారికి దర్శనవ్యవస్థ చేయవలయును. మ్లేచ్ఛులకంటెఁ జండాలురు నికృష్టులే.

భాగవతధర్మదీక్షచే బ్రాహ్మణత్వాది జాత్యంతరప్రాప్తి కానేరదు. యవనాదిజాతులు పుట్టుకతో నేర్పడినవే. సమస్త జాతులవారికిని భక్తియందధికారమున్నది. సర్వత్ర సమానులైనను భాగవతధర్మదీక్షచే జాత్యుత్కర్షప్రాప్తికూడ నగునని కొందఱందురు. దేవలస్మృతి మన్వాద్యేకవాక్యతాస్థలమందే ప్రామాణ్యము. ఇతరత్ర కాదు. కనుకనే దేవలస్మృతియని ప్రకృతము ముద్రింపఁబడియున్న పుస్తకము ప్రమాణము కానేరదు. శూలపాణ్యుద్ధృతవచనములుమట్టుకు ప్రమాణములే. మ్లేచ్ఛసంసర్గులకు ర యేండ్లపర్యంతము ప్రాయశ్చిత్తము విధింపవచ్చును. సంఘమునఁ జేర్చుకొనువిషయములో మతభేదమునుబట్టియు దేశాచారమునుబట్టియు వ్యవస్థచేసికొనవలెను. వ్రాత్యసంస్కారము మూఁడు పరంపరలవఱకే కర్తవ్యముకాని యంతకు మించినఁ గూడదు. జాతి పుట్టుకతోడనే యేర్పడును.

౧౩ రామపుర రాజపండితులు

స్త్రీలకు ౮ వ యేడు మొదలుకొని రజస్వలయగువఱకు ౧౬ వ యేటనైనను వివాహము చేయవచ్చును. ౧౧ వయేడు మొదలుకొని యే చేయవలయునని నియమించుటకూడ యోగ్యమే. పురుషులు ౧౬ వ యేడు మొదలుకొని ౪౮ యేండ్ల పర్యంతము వివాహము చేసికొనవచ్చును.

౧౪. మల్లాది రామకృష్ణచయనులుగారు, రాఘవశాస్త్రిగారు.

ఎనిమిదవయేడు మొదలుకొని రజస్వలయగులోపల స్త్రీకిని ౧౬ వ యేడు మొదలుకొని ౫౦ ఏండ్ల పర్యంతము పురుషునకును శాస్త్రీయముగ బట్టియుం బ్రకృతపరిస్థితిని బట్టియు వివాహము నియమింపం దగవలయును. రజస్వలావివాహము సర్వథా నింద్యము.

౧౫. మార్వాడీ బ్రాహ్మణమహాసమ్మేళనసభాపతులు.

స్త్రీల కెనిమిదేండ్లలోపలను రజోదర్శనానంతరమును వివాహము కూడదు.

౧౬. వాణీశర్మా-మిథిల.

పదవయేడు మొదలుకొని స్త్రీలకును ౧౬ వ యేడు మొదలుకొని పురుషులకును వివాహకాలము-ఋతూవనంతరవివాహము ముఖ్యముకాదు.

గంగాస్నానాది సామాన్యప్రాయశ్చిత్తముచేగాని హరినామస్మరణాదికముచేగాని చేయబడిన శుద్ధివ్యవస్థాపనచేఁబంచమస్పర్శము దోషావహము కాకుండఁ బరిష్కరింపవలయును. కూపోదకగ్రహణవిషయమునఁ దారతమ్యరక్షణము సంభవింపదు. దేవాలయాదులయందు దేవదర్శనార్థమై యొక సదుపాయము చేయవలయును.

భాగవతధర్మదీక్షచే స్వజాతియం దుత్కృష్టుఁడగును గాని వర్ణోత్కృష్టుఁడు కాఁడు. యవనత్వజాతి పుట్టుకచేతనే కాక హిందువులకుఁ గర్మముచేఁ గూడఁ గలుగును.

దేవలస్మృతి మన్వాదులతో నేకీభవించునప్పుడే ప్రమాణము గాని యన్యత్ర కాదు. కనుకనే యేకవర్ష పర్యంతమున్న ప్రాయశ్చిత్తి

యతయందు విప్రతిపత్తి లేదు. ఒకసంవత్సరము మ్లేచ్ఛసంసర్గముచేసి వారినే ప్రాయశ్చిత్తశుద్ధులఁజేసి సంఘమునఁ జేర్చుకొనవచ్చును. గా తదధికకాల గత సంసర్గులను గలుపుకొనఁగూడదు. త్రిపూరుషపర్యం తమే వ్రాత్యసంస్కారయోగ్యత. క్వాచిత్కముగా దశపురుష పర్యం ముసు గనఁబడుచున్నది.

౧౭. కురుగంటి వెంకట్రామశాస్త్రిగారు - తెనాలి.

ఎనిమిదవయేడు మొదలుకొని ౧౨ యేండ్లపర్యంతము స్త్రీ కును ౧౬ వ యేడు మొదలుకొని ౩౨ యేండ్లపర్యంతము పురుష కును వివాహము యోగ్యము. స్త్రీల కంతకుఁబూర్వమును బురుష కంతకుఁ దరువాతను యోగ్యముకాదు. రజోదర్శనానంతరవివాహ మాపత్కల్పముగా నైనను జేయఁదగదు. వృషలీత్వబోధకవచనమ లచే రజోదర్శనానంతరము వివాహితయైన స్త్రీ శూద్రాతుల్యాయ నియుఁ దత్పుత్రుఁడు దాయభాగార్హుఁడు కాఁడనియు నవగత బయ్యెడిని. స్మృత్యర్థనిర్ణయమునందే ధర్మజ్ఞుల కధికారము. సంకోచ ముందుఁగాని పరివర్తనమందుఁగాని లేదు.

అవైదికదీక్షయందే యన్నిజాతులవారికి నధికారముగాని వై కములైన యోంకారాదుల దీక్షయందుఁ గాదు.

నిబంధానుసారముగా దేవలస్మృతికిఁ బ్రామాణ్యముండ యున్నది. సంవత్సరపర్యంతము చేయఁబడిన మ్లేచ్ఛసంసర్గమునకు ప్రాయశ్చిత్తము లేదు.

౧౮ మల్లయ్యశాస్త్రిగారు

వివాహము దాన సప్తపదీ సమావేశనాదిరూపమైన రెండేండ్లపిల్లనైనను దానముచేయవచ్చును. సమావేశనాదుల య లైతేఋుత్వనంతరమందును నది యోగ్యము. ఆపస్తంబాదిమతమందై సమావేశనాంగవిశిష్టమగు వివాహము ఋుత్వనంతరమే. గృహ్యాసం హామతమందైన ఋుతువున కొక్కసంవత్సరము ముందుగానే వి హము యోగ్యమని యున్నది.

—(౦)—

## తంగెడ రామకృష్ణకవి స్వర్గయాత్ర

(:o:)

ఈయన గుంటూరుజిల్లా పల్నాడుతాలూకాలోఁ జేరిన మోర్జమపా డనునూరికరణమును నాఱువేలనియోగిబ్రాహ్మణుఁడును బల్నాటికిఁ బ్రసిద్ధకవియు ధనవంతుఁడును సనాతనధర్మనిరతుఁడును నై ప్రసిద్ధివడసి సుమారు ౮౦ సంవత్సరములకు మించినవయస్సున శుక్ల సం॥ భాద్రపద శుక్లప్రతిపత్తిథిని స్వర్గ మలంకరించెను. సంత్యక్తసనాతనధర్ములగు సంఘసంస్కర్తృనామధారకజను లందఱును సామ్రాజ్యశాసనసభలో వివాహగర్భాధానవయోనిర్ణయశాసనములు ప్యాసుచేయించుటకుఁ జేయుప్రయత్నములఁ దిలకించి ప్లేయార్డరు వేయించుటకుఁగాఁబోలు స్వారాట్సభకు సభ్యుఁడుగా నేగియున్నవాఁడు! యతిప్రాసరహితకవిత్వమును వ్యాపింపఁజేయ యత్నించువారిని శాసింపుమని సమవర్తికి సిఫారసు పంపింపఁగాఁబోలు నిప్పట్లఁజేయఁబడిన యీయనస్వర్యాత్ర! అన్నింట నాత్మసదృశుఁడగు నాత్మజు నరసింహారావుగారి నాత్మీయస్థానమునం దభిషిక్తుఁ జేసి రామకృష్ణయ్యగారు భూమండలమును వీడుట ప్రాగుక్తకార్యనిర్వహణమునకే యని బంధుమిత్రాధులు పనవుటలు మాని పరమానందభరితులగుట బహుశ్రేయము.

సీ॥ ఘనుఁ డీతఁ డన సాటికరణాలలోపల
మేటియై పల్నాట మించినాఁడు.
పల్నాటి కీతండె ప్రథమాంధ్రకవియంచుఁ
బండితప్రస్తుతిం బడసినాఁడు.
గౌరీపరిణయాదిఘనగ్రంథముల వ్రాసి
క్షితిఁ బేరు స్థిరముగం జేసినాఁడు.

భూరిశ్వర్యవంతుఁడై పుత్రపౌత్రులఁ గాంచి
తుదదాఁక సౌఖ్యాబ్ధిఁ దోఁగినాఁడు.
చచ్చునంతదాఁక స్వసతీసుతాదులఁ
దనదునాజ్ఞలోన నునిచినాఁడు.
అట్టివానిస్వర్గయాత్రకు సంతోష
మందవలయుఁ గాని కుందఁదగునె?

సీ॥ చదువుసంధ్యలు నేర్పి స్వసమానుఁ గావించి
స్వర్గంబునకుఁ బ్రీతిఁ జన్నవాఁడు.
పుత్రునకుం బుత్రపుత్రిక లుదయించి
రన్నంతపర్యంత మున్నవాఁడు
లక్షాధికారియై టీకించి నీపైనె
పెత్తనం బంతయుం బెట్టినాఁడు.
ఏకపుత్రుం డయ్యు నేలోపములు లేక
యిహసౌఖ్యముల నెల్ల నెనసినాఁడు.
ఇట్టివానిమృతికి నింతయుం గుందక
పారలౌకికంబు బహుఘనముగఁ
దీర్చి స్వర్గమందు స్థిరుఁజేయు తండ్రి స్మృ
సింహరాయ! సుకవిసింహగేయ!

( ఈకవివతంసుని చరిత్రమంతయు వచ్చుసంచికలలో విపులముగ వివరింపఁబడును. )

——(:o·)——

## శ్రీగోదావరీ మండల వర్ణాశ్రమ ధర్మరక్షక మహాసభ.

1929 సం॥రం జూన్ 3వ తేదీ సోమవారము తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకా పాలగుమ్మి గ్రామములో బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులు బియ్యే., బియ్యల్., రిటైర్డు ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు, కప్పగంతుల రామశాస్త్రిగార్లు అధ్యక్షులుగానుండియు, పేరిసూర్యనారాయణమూర్తి శ్రీ తాతా కామేశ్వరశర్మగార్లు ఆహ్వాన సంఘాధ్యక్షులుగానుండియు, నడపిన గోదావరీ మండల వర్ణాశ్రమ ధర్మరక్షక మహాసభలో చేయబడిన తీర్మానములు:—

(1) శ్రీవిక్టోరియా మహారాణీవారియొక్కయు, తద్వంశీయు లగు తదనంతర ప్రభువుల యొక్కయు, వాగ్దానముల ననుసరించి భారతీయ మతాచారవిరుద్ధములగు బిల్లులనెన్నడును శాసనసభలలో ప్రవేశపెట్టనియ్యగూడదనియు, ఇదివరలో ప్రవేశపెట్టబడిన శారదా బిల్లు మొదలగు విషయములలో పాలకవర్గసభ్యులు (Official membres) అనుకూలముగా వోటు (Vote) నియ్యగూడదనియు, ఇతర సభ్యులలో అధిక సంఖ్య గలవా రాబిల్లుల నంగీకరించుట తటస్థించెనేని, దొరతనమువారు తమకుగల వీటో (Veto) అధికారమును సార్థక మగునట్లు వినియోగపరచి, ఆబిల్లుల నిరాకరింపబడునట్లు చేయవలె ననియు నీసభవారు దొరతనమువారిని కోరుచున్నారు.

(2) "Sarada Marriage" బిల్లునుగూర్చియు 'Age of Consent' బిల్లునుగూర్చియు, హిందువులలో నూటికి ముగ్గురుమాత్రమే వ్యతిరేకాభిప్రాయము గలవారై యున్నారని, 'Age of Consent' కమిటీవారు వ్రాసినవ్రాతలు అసంగతములనియు, హిందువులలో అధికసంఖ్యాకులైన సనాతనధర్మపరాయణులందరును, ఆబిల్లుల విషయములో వ్యతిరేకాభిప్రాయముగలవారేయనియు, గర్భాధానవయో నిర్ణయ సమితివారి సంఘనిర్మాణక్రమము సరియైనది కాకపోవుట చేతను, వారివిచారణపద్ధతి క్రమమయినది కాకపోవుటచేతను, వారి తీర్మానములు పాక్షికములనియు, అవిశ్వసనీయములనియు, నీసభవారు అభిప్రాయ పడుచున్నారు.

(3) ఈనడుమ కాశీలో జరిగిన అఖిలభారతవర్షీయ బ్రాహ్మణ మహాసమ్మేళనములో విమర్శింపబడి నిర్ణయింపబడిన వివాహాది విషయక నిర్ణయముల నీసభవా రేకగ్రీవముగా అంగీకరించు చున్నారు.

(4) భారతదేశ పరిపాలనావిషయములో నికముందు పుట్టబోవు సంఘసంస్కారణాది నామములుపెట్టి ప్రజలమతాచార విషయములలో శాసనములుచేయు నధికారము, శాసనసభలకుగాని దొరతనమువారికిగాని లేదని విస్పష్టముగా తెలుపబడవలయునని బ్రిటీషు పార్లమెంటువారిని ఈసభవారు ప్రార్థించుచున్నారు.

(5) పురుషులకు ఉపనయనమువలెనే స్త్రీలకు వివాహము అవశ్యానుష్ఠేయ ధర్మసంస్కారముగనుక, స్మృతికర్తల వాక్యానుసారము, అష్టవర్ష బాలికావివాహములే శ్రేష్ఠములనియు ఎనిమిదేండ్లు దాటి రజోదర్శనముకాని కన్యకలవివాహములు గౌణములనియు, ఋతువ్వనంతర వివాహములు సర్వదా, సర్వథా నిషిద్ధములనియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

(6) బాల్యవివాహములు బాలవితంతువుల సంఖ్యను హెచ్చించునవి కావనియు, శాస్త్రీయ ప్రవర్తనమువలన ఆయుస్తేజోవృద్ధి కలుగుననియు, అవివాహిత ప్రౌఢకన్యాజనసంఖ్య హెచ్చుగుటవలన సంఘదురాచారములు మెండయి సంఘశ్రేయము సన్నగిల్లి హిందూజాతీయతకు, ఉపక్షయము వాటిల్లుననియు యీసభవారభిప్రాయపడు చున్నారు.

(7) ప్రస్తుతము లెజస్లేటివు అస్సెంబ్లిలో సభ్యులుగానున్న హిందూసభ్యులు హారవిలాసశారదాగారి వివాహశాసనమునకు సమ్మతింపగూడదని యీ సభవారు కోరుచున్నారు.

(8) ఇకముందు శాసనసభలకు అభ్యర్థులుగా నుండగోరువారిలో మతాచారములకు సంబంధించిన యెట్టిశాసనములను, శాసనసభలలో ప్రవేశపెట్టమనియు, యితరులు ప్రవేశపెట్టినయెడల వాటిని

ప్రతిఘటింతుమనియు, ప్రమాణపత్రికల నిచ్చినవారికే వోటర్సు, వోట్లు నియ్యవలసియుందురని యీ సభవారు తీర్మానించుచున్నారు.

(9) పై తీర్మానములో నుదహరింపబడిన వివాహవిషయిక శాసనములనుగూర్చి భారతరమణీమణు లనేకులు, అనుకూలాభిప్రాయము కలవారై యున్నారని సంఘసంస్కారప్రియులు చెప్పునది సత్యముకాదనియు, అట్టిఅనుకూలాభిప్రాయముగల స్త్రీలు విదేశీయ విద్యాగంధలేశము కలిగిన స్వల్పసంఖ్యాకులు మాత్రమేయనియు, యీ సభవారి నిశ్చయాభిప్రాయము.

(10) పంచములు వైదికతాంత్రికాగమ ప్రతిష్ఠిత దేవాలయములలో ప్రవేశించుటను గూర్చియు, ప్రణవసహిత మంత్రగ్రహణము చేయుటనుగూర్చియు, మదనమోహనమాలవ్యాగారు, ప్రకృతము చేయుచున్న ప్రచారము శాస్త్రవిరుద్ధమైనదని యీ సభవారు నిశ్చయించుచున్నారు.

(11) హిందూమహాసభయని పిలువబడు సంస్థ శృతి, స్మృతి శిష్టాచారములను ప్రమాణముగా గైకొనని ఆర్యబ్రహ్మసమాజకులతో నిండియున్నదగుటచేత ఆసభవారు చేయు మతాచారవిషయిక నిర్ణయములు సనాతనధర్మపరాయణులకు ఆదరణీయములుకావనియు, యీ సభవారు తీర్మానించుచున్నారు.

(12) పై తీర్మానములలో నుదహరింపబడిన బాల్యవివాహనిషేధకశాసనములు మొదటి తీర్మానములో సూచింపబడినప్రకారము నిరాకరింపబడక చట్టములుగా గ్రహింపబడుట తటస్థించెనేని, ధర్మమే పరాయణమను విశ్వాసముగల సనాతనధర్మతత్పరులు అట్టిచట్టముల ననుసరించి తమపవిత్రమతాచారధర్మములను, ప్రాణసంశయము కలిగినను, విడనాడజాలనివారగుదురని దొరతనమువారితో నీసభవారు వినయపూర్వకముగా విన్నవించుచున్నారు.

(13) ఈ మహాసభయొక్క ముఖ్యోద్దేశములను ప్రవర్తింపజేయుటకు శ్రీ గోదావరీమండల వర్ణాశ్రమ ధర్మరక్షకసంఘమను పేర నొకస్థాయిసంఘము అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసమ్మేళనమున కనుబంధముగా నుండునట్లు యిందుమూలముగా నిర్మింపబడినది. ఆ సంఘమున క్రింద పేర్కొనబడినవారు సభ్యులుగా నిర్ణయింపబడినారు. ఇతరసభ్యులు చేర్చుకొనబడుచుందురు.

(14) ఈక్రింద పేర్కొనబడినవారు కార్యనిర్వాహకసంఘముగా నిందుమూలముగా నేర్పరుపబడినారు.

జయంతి రామయ్యపంతులుగారు
బి ఏ., బి యల్., అధ్యక్షులు.
డాక్టరు రామావధాన్లుగారు
ఉపాధ్యక్షులు
చావలి యజ్ఞేశ్వరసోమయాజిశర్మగారు
బి ఏ., బి యల్., ప్రధానకార్యదర్శి.
ఆకెళ్ళ సూర్యనారాయణమూర్తిగారు
సహాయకార్యదర్శి.
శ్రీ తాతా కామేశ్వరశర్మగారు.
కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిగారు.
కప్పగంతుల రామశాస్త్రిగారు.
కర్రి ఉమామహేశ్వరరావుగారు.
రామభట్ల అప్పన్నశాస్త్రిగారు.
పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు.
పేరి సూర్యనారాయణమూర్తిగారు.
మంథా లక్ష్మీనృసింహంగారు.
ఆకెళ్ళ వెంకటసుబ్బారాయుడుగారు.
శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిగారు.
వెంపరాల సాంబశివశాస్త్రిగారు.
గొర్తి పళ్ళయ్యశాస్త్రిగారు.
వాడ్రేవు గౌరీసోమశేఖరరావుగారు.
ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
ఏలూరిపాటి నృసింహసర్వతోముఖ
యాజిగారు.
భమిడిపాటి చయనులుగారు.

(15) కార్యనిర్వాహకసంఘము వర్ణాశ్రమ ధర్మరక్షణమున కవసరమైన నియమములను (Byelaws) చేయుచుండవలెను. అధమ పక్షము అయిదుగురు సభ్యులైనను లేనిచో కార్యనిర్వాహక సంఘము సమావేశము కాకూడదు. అవసరమునుబట్టి వారు సభ్యులసంఖ్య హెచ్చించుకొనవచ్చును.

(16) ఈసంఘమునకును, సభకును, అమలాపురము కార్యస్థానముగా నుండవలెను.

(17) ఈసభయొక్క ఉద్దేశ్యములను, తీర్మానములను, జనులకు బోధపరచి వారికి ఉద్బోధము కలిగించుటకై యీక్రింద పేర్కొన బడువారిని ప్రచారక (Propaganda) సంఘముగా నేర్పరచడమైనది.

ఈసంఘమునకు బ్ర॥ శ్రీ॥ పుల్య ఉమామహేశ్వర శాస్త్రుర్లు గారిని కార్యదర్శి (Secretary) గా నియమించడమైనది. యీసంఘ కార్యాలయము అమలాపురంతాలూకా గంగలకుర్రు అగ్రహారములో ఉంచుటకు తీర్మానించబడినది. ఈసంఘమువారు చేయుకార్యమంతయు కార్యనిర్వాహక సభవారి విమర్శకు లోబడియుండవలెను.

—: ప్రచారక సభ్యులు :—

పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు కార్యదర్శి.
రామాభట్ల అప్పన్నశాస్త్రిగారు.
కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిగారు
బులుసు అప్పన్నశాస్త్రిగారు
ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
వెంపరాల సాంబశివశాస్త్రిగారు
వడ్డమాని వరహాలశాస్త్రిగారు

శ్రీపాద నరసింహశాస్త్రిగారు
శ్రీపాద విశ్వనాథశాస్త్రిగారు
శ్రీపాద చినవిశ్వనాథశాస్త్రిగారు
పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు
మంథా నృసింహశాస్త్రిగారు
గోవిందరాజుల హరిశ్చంద్రరావుగారు
మొరిటాల వెంకటరత్నంగారు
ఆకెళ్ళ వెంకటసుబ్బారాయుడుగారు

ఇంకా యితరులను చేర్చుకొనుటకు యీ సంఘమువారి కధ కారముకలదు.

శ్రీగోదావరీ మండల వర్ణాశ్రమ ధర్మరక్షక సంఘకార్యస్థానము;
**అమలాపురం.**
తూర్పు గోదావరి జిల్లా.

జయంతి రామయ్యపంతులు
బి యె., బి యల్.,
కప్పగంతుల రామశాస్త్రి
అధ్యక్షులు.

చావలి యజ్ఞేశ్వరసోమయాజిశర్మ
బి యె, బి యల్., కార్యదర్శి.

3—6—1929.



శా॥ అంబా? యీరుజయన్న నీ కలలులాయంబో? బిడాలంబో? యా
లంబున్ జేసి మరల్పఁగావలెనె ? హేలామాత్రసాధ్యంబు, నీ
చం బీరోగము నీకటాక్ష మఱవీసంబేనియుం జాలు దీ
నిం బోకార్పఁగ, మత్కుమారునకుఁ గాంతింగూర్పఁ, గామేశ్వరీ॥

శా॥ సృష్టింపన్ భరియింప శక్తిగలనీదృక్కోణపుంగల్మి, కే
కష్టం బీరుజ మాన్పుటన్న, గళలగ్నక్ష్వేళుఁ డీశుండు నీ
దృష్టింజేసియెకాదె మృత్యుజయ మర్థిన్ జేసి వర్ధిష్ణుఁడై
పుష్టింగాంచెఁ, గటాక్షముంచి కొమరున్ బోషింపు కామేశ్వరీ ॥

శా॥ రక్షింపంగల వే నెఱుంగుదును గ్రూరమ్మైనయీరోగముల్
శిక్షింపంగల, వంతెకాదు కొమరుల్ జేకోముద మ్మొప్పఁగా
వీక్షింపంగల, 'వింటివే'ల్పనుచు మాపెద్దల్ వృథాగొల్చిరే ?
సాక్షాత్కల్పక నీవు, పుత్రు మనుపన్ జాగేల ? కామేశ్వరీ॥

మ॥ వయ సిప్డేఁబది దాఁటు నావిషయమై పార్థింపఁగాఁబూనుచో
నయవేదుల్ విని సమ్మతింపరు, సరే; నాపుత్రునిన్ గుఱ్ఱనిన్
దయతోఁ బ్రోచుట సర్వసమ్మతముకాదా? తల్లి? కొంకేల? బల్
రయమొప్పన్ రుజ మాన్చి చేవ నిడి కుఱ్ఱన్ బ్రోవు కామేశ్వరీ॥

శా॥ పాలన్ ముంచిన, నీట ముంచినను నీపాదంబె దిక్కమ్మరో?
చాలు న్మూలము లేనియీరుజను 'నిష్ఠాసింతు' వంచెంచి వ
ద్యాల న్నీపయిఁ జెప్పినాఁడ, నపహాస్యత్వమ్ము చేకూర్తువే?
చాలున్ జాలు రుజాపనుత్తికి నిఁకం జాగేల ? కామేశ్వరీ॥

శా॥ ఆరోగ్య మ్మలరారునాయువులు సౌఖ్య మ్మిచ్చు, నారోగ్యవి
స్తారంబై యొసలారుసంతతియె మోదం బిచ్చు, నారోగ్యదు
ర్వారంబై తనరారుసంపదయె సర్వ మ్మిచ్చు నారోగ్యమే
కోరంగాఁబడె నాదుసంతతికి నీకున్ మ్రొక్కు కామేశ్వరీ॥

శా॥ నీపై భారము వెట్టి యీశతకము న్నీకిచ్చితిన్ దీని నిం
కీపై వ్యాపృతి నందఁజేసెదను నీవే కీర్త్యకీర్తుల్ రుజా
సాపత్న్యంబుఁ దొలంచి యాయువునెడన్ సంపూర్ణతన్ బెంచి స
ర్వాపత్తుల్ దొలఁగించి పుత్రు మనుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ రక్తిన్ జెందఁగ ముక్తిఁబొందఁగ రుజారాహిత్య మింపొందఁగా
భక్తిన్ జెందఁగ నాకు సర్వమునకున్ బద్ధమ్ములే దిక్కు- నా
వ్యక్తావ్యక్తత లీ వెలుంగుదువు బాల్యమ్మాదిగా, రోగని
ర్ముక్తుం బుత్రు నొనర్పు మీశతక మామోదించి కామేశ్వరీ॥

శా॥ అంబా? యీశతకావసానసమయమ్మందున్ యతీశుండు వ
చ్చెం బూజించితి మద్గృహమ్మునను నిల్చెం గొన్నినా, కృష్ణ శ్వా
సంబున్ గాసముఁ బుత్రు నొంచుతఱి, తత్సంయమ్యాధిశాంత్రఘ్నసే
రం బింతిచ్చితిఁ బైని గన్పడె సుఖారంభంబు కామేశ్వరీ॥ ౧౦౩.

మ॥ ఒకపక్షమ్ము గతించె నిప్పటికి నంతో యింతో యేమందొ పు
త్రకు నాకించుచునుంటి, సౌఖ్యముగఁ గుఱ్ఱం డొప్పుచున్ బౌరశా
లకుఁ దానై చనుచుండె, నీవ యతిలీలన్ బ్రోచితం చెంతుఁ బు
త్రకు నారోగ్యము శాశ్వతంబుసలుపన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ దేవబ్రాహ్మణభక్తి యీయుగమునందే తక్కువై పోయె నిం
దేవాఁడేనియు మగ్నుఁడో నెడల "వీఁడే వాతులుం" డాగ్రహా వై
నీవున్ వారికి సాయమౌనెడల వేఱే చెప్పనా? భక్తపా
ట్లోవిశ్వాంబ? కుమారు మన్చి నను ధన్యుంజేయు కామేశ్వరీ॥౧౦౪

మ॥ కలికాలమ్మునఁగూడ వేలుపుఁగృపల్ గష్టమ్ములం దీర్చుటల్
గల దన్నందుకు నిద్ది లక్ష్య మయినం గావచ్చు నీరోగదు
ర్బలమున్ మాపి కుమారునిన్ మనిచి మేల్ ప్రఖ్యాతి గైకొమ్ము, స
న్నలరన్ జేయుట కీర్తికిం దెరవు సుమ్మా? యమ్మ? కామేశ్వరీ॥

శా॥ గోచారాదిక మింతకన్న నికముఙ్ గ్రూరమ్ముగానున్నటుల్
దోఁచున్, నీకరుణాకటాక్షమది పుత్రుం బ్రోవనున్నప్డు డా
యీచారమ్ముల లెక్క యేమి? యభయంబే యింక మాకున్, సుఖ
పాప్తిచున్స్యంబ భవిష్యదర్థమని సంభావింతుఁ గామేశ్వరీ॥ ౧౦౭

శా॥ శాంతిన్ జెందినయట్టులుండి మరలన్ శౌర్యంబు చూపించె మొ
న్నంతో యింతయొ యీరుజాప్రసరణం; బద్దట్లు వారించి నీ
స్వాంతం బేమతలంచెనో కో? బండ యిది, యీచండాలరోగంబు త్వ
త్ప్రాప్తింతంబంద యడంచిపట్టవలె భద్రం బంబ? కామేశ్వరీ॥

శా॥ అంబా? పద్యమె చెప్పఁగోరి యొకపద్యం బేనియుం జెప్ప వాం
ఛం బూరింపనిఖేదము లేఁ డెచట నోశర్వాణి? నీమీఁదఁ బ
ద్యంబుల్ నూటికి మించఁజెప్పితిని బుత్రారోగ్యసంసిద్ధి వే
గం బాటిల్లుత, నీకృప న్నెగడుతన్ గావ్యంబు కామేశ్వరీ॥

శా॥ 'ఈపద్యమ్ములపుట్టు విట్టి, దివి యీకృత్యమ్ము సాధించె, నే
రీపద్యాళిఁ బఠింత్రు శ్వాసరుజ వారేనాఁడునుం గాంచ' రం
చేపట్లన్ గొమరుండు శిష్యులును సర్వేద్యమ్ముగాఁజెప్పికో
నీపద్యమ్ములకున్ జయ మ్మొసఁగు మోయీశాని? కామేశ్వరీ॥

మ॥ చెవుడేనిఙ్ గలిగింపు మమ్మ? సుతుపైఁ జేసాచు మార్గాలపుఙ్
రవమేనిం దొలఁగింపు మిద్ది పితృకర్ణస్ఫూర్జథుప్రాయ, మీ
రవ మేతండ్రి సహించు? దీని మదగర్వ మ్మాడ్చి మత్పుత్రకుఙ్
శివమారోగ్య మొసంగి ప్రోవఁదగదే? శ్రీమీనాక్షిఁగామేశ్వరీ॥ ౧౧౧

మ॥ జననీ? నీకృపకల్మి శత్రువుల నిచ్చల్ గెల్చితింగాని పు
త్రుని బీడించెడి శ్వాసరోగమయశత్రుఙ్ గెల్వ లేనైతి నిం
దనుకఙ్; దీని కుపాయమున్ దెలిపి నాతాపమ్ముఁ బోకార్చి కు
జ్జని కారోగ్య మొసంగు మియ్యదియ నిఙ్ బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ ఏకార్యమ్మున కేను బూనినను దల్లీ? నీదయోద్రేకసు
శ్రీకల్మిఁ దనయంతఁ దా నయిసటుల్ సిద్ధించుటేకాని యీ
చీకాకిప్పటి కే నెఱుఁగ, నెటులో చేపట్టి రక్షించుటల్
నాకు న్నీకును నాకుమారునకు ధన్యత్వమ్ము కామేశ్వరీ॥ ౧౧౩

శా॥ ఎన్నం గుఱ్ఱనిజాతకం బొకటి కాదీశాని; నిజాతక
మ్ము న్నాజాతక మిన్ని చక్కఁబడినం బూర్ణమ్మగుంగోర్కి యుం
చు న్నాకుం విదితంబ, నీకరుణ కెచ్చోటే దసాధ్యంబటం
చు న్నానమ్మిక బిడ్డపైఁ గరుణ వచ్చుంగాక కామేశ్వరీ॥ ౧౧౪

శా॥ లే కన్నాళులా లేక లేకయె భవల్లీలాకృపావాప్తిచే
నీకుఱ్ఱం డుదయింప నేమిటికి? వీఁ డీలాటి ఘోరామయ
ప్రాకట్యమ్మునఁ జిక్క నేమిటికి? నాపాపంబొ? నీలోపమో?
నా కీతాపము వాపకుంటివిగదా? నాతల్లి? కామేశ్వరీ॥ ౧౧౫.

శా॥ సన్యాసంబు వహింపు మందువా? గృహాసక్తిం విసర్జించి యీ
యన్యాయమ్మును జూడఁజాల కెటకే నల్లంతఁ బొమ్మందువో?
మున్యారాధితమైననీదు మహిమమ్ముం గూడ నాబిడ్డకుం
ధన్యత్వ మ్మిడఁజాలకున్న నిఁక నాదారేది? కామేశ్వరీ॥ ౧౧౬.

మ॥ చదువు న్నేర్పుట పథ్యపానములు నిచ్చుల్ నేర్పుటే, నీతులం
గుదురం జెప్పుట చుట్టకాల్పుపయిఁ గోర్కుల్ గాల్పుటే, కాఁగ నా
కుదయించెన్ గొమరుండు నీదయయొ? కర్మోద్రేకమో? హేతువై
యెదియుం దోఁపదు నిద్రలేదు నిశలం దేమందుఁ? గామేశ్వరీ॥

మ॥ పగట న్నిద్దుర, రాత్రి జాగరణమై, ప్రారబ్ధకర్మక్షయం
బగుపట్టన్ మదిలేక నాపడెడికష్టావస్థ నీచిత్తమె
ప్పగిదిం దాఁ జొరదయ్యె, నాసలుపునీపద్యమ్ములెల్లన్ వృథా
యగునో? లేక ఫలించునోక్కొ? కృతకృత్యత్వమ్ము కామేశ్వరీ॥

శా॥ అంబా? యీరుజచేఁ జరిత్రపురుషుం డైయొప్పెఁ గుష్ఠుండు, ప
ద్యంబుల్ నీపయి నిన్ని పేసికయి చేయంబూను టీదూరుజా
సంబంధమ్మునఁగాదె? చేకుఱు, భవిష్యత్కాల మారోగ్యభో
గ్యం బౌఁగాక, గతమ్ము సర్వము నగణ్యంబౌతఁ గామేశ్వరీ॥

మ॥ ఎవ రెట్లున్నను దేశపర్యటనమం దే నుండునారోజులన్
లవలేశమ్ము విచారమే యెఱుఁగ, బాల్యంబాదిగా దేశముల్
కవితాకేళికిఁ ద్రిప్పిత్రిప్పి, యిపుడేకా? యిల్లువట్టించి, తీ
తెవులా? యింతటఁ జిన్నికుఱ్ఱ కిఁక నేదీ? దారి, కామేశ్వరీ॥

ను॥ అరియేనిన్ శ్రమమందుచున్నయెడ నే హర్షింప, నిక్కమ్ము దా
నెఱుఁగు న్నీమది, శ్వాసకాసల నిటుల్ కృచ్ఛాతికృచ్ఛమ్ముగా
మురిపంబున్ గొమరుండు కస్తివడ, నామ్రోఁ తెట్లు నే విందు? న
క్కరణిన్ సంసృతిసేతు? బిడ్డనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ॥

శా॥ చావన్నన్ భయమంద, రోగమనినన్ శంకింతు, నిప్పట్ల నా
కేవారేనియు నొక్కటే, వృథగ న న్నేలింకఁ బ్రేలింతు?, వే
త్రోవో త్రొక్క యశమ్మొ దుర్యశమొ యేదోయొండు కైకొమ్ము,నీ
వే 'వే'ల్పంచు నుతింతు, నెందులకు నీవేప్రాట కామేశ్వరీ॥

మ॥ అతిశీఘ్రమ్మునఁ బ్రోచుచో జగమునం 'దంతాదరం బుండ దీ
స్తుతియం'దంచుఁదలంచి జాల నిటు లిచ్చోఁ జేయుచున్నావొ యీ
స్తుతియం దాదృతి కేమి? యేను మిగులన్ శుష్కించుచున్నాఁడ, నన్
గృతకృత్యున్ బొనరింపు మింకనయినం గేల్మోడ్తుఁ గామేశ్వరీ॥

శా॥ ' నాకై యింత తపమ్ము మున్ను సలిపె న్నాతండ్రి, నే భక్తిచే
నాకష్టమ్మును దీర్చికోవలయు ' నం చామీఁద నాబిడ్డ దా
నాకైంకర్యమునం గడంగుట కిటుల్ నాకైతఁ బ్రాఁకింతె? మే;
లీకావ్యార్థ మెఱుంగువిద్య రుజ యె ట్లీనిచ్చుఁ? గామేశ్వరీ॥

# ఆరోగ్య కామేశ్వరి

మ॥ కవితాపుత్రులతోడఁ దృష్టిపడి యేఁగాలమ్ము పుచ్చంగ, నీ
తెపులుం గొంటుకుమారు నిచ్చి ననుఁ గుందింపంగ నీ కర్హమే?
శివ వాఖ్యాకృతులందు, భర్త శివుఁడై చెల్వారు, మీవంటివా
రవివేకంపుఁ గృతుల్ పొనర్చు టది యన్యాయంబు కామేశ్వరీ॥

మ॥ 'కవితాగోష్ఠి త్యజించె వీఁ డిపు డెవో కల్పించినంగాని త
ద్వ్యవసాయమ్మునకుం గడంగఁ' డని నీ పాత్మన్ విచారించి యీ
తెపులున్ గల్పనచేసి సారె కిటు లెంతేఁ గ్రైత సాగించెదే?
భువి, 'మార్జాలపుఁ గేళి యెల్క కుసురు ల్వోఁగొట్టుఁ' గామేశ్వరీ॥

మ॥ కవితాసంతతి దుర్భగప్రతతిసంగం బాచరింపంగ న
య్యవివేకమ్మున రోగమంటికొన నే నద్దాని వెన్వెంటనే
సువివేకమ్మునఁ బాఱఁదోలితి, నికన్ సూనున్ గడున్నొంచునీ
తెపులుం దోలవలెం గవిత్వమున నిన్ దేలించి, కామేశ్వరీ॥ ౧-౨౭

మ॥ కుజునందున్ గుజుఁ డేగె, రాహు వికనేగున్ రెండుమాసాల, నీ
కుజరాహుల్ పరికించి చూచిన మహాక్రూరుల్, స్వతస్సౌమ్యుఁడై
విజయంచేయు నికన్ బృహస్పతి, సుఖావిర్భూతి నీ విమ్మహా
ద్విజునంతర్దశనే నొసంగి కొమరున్ దీవింపు కామేశ్వరీ॥ ౧-౨౮

శ్రీ రస్తు - నిరోగశతాయుష్య మస్తు.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి ప్రథమపుత్రుఁడు కామేశ్వరుని
జన్మపత్రిక.

| | | | |
|---|---|---|---|
| శ | | | రా |
| | రాశి | గు | |
| కే చ | ల | ర బు శు | శు |

| | | | |
|---|---|---|---|
| చ కే | కు | | ర |
| శు | అంశ | | |
| గు | బు | | శ రా |

స్వస్తిశ్రీ ఆనంద సం॥ మార్గశీర్ష బ ౯ శుక్రవారము రాత్రి గం 2-47 నిమిషములకు జననము. లగ్నము తుల, నక్షత్రము హస్త, చరణము తృతీయము, జననకాల చంద్రమహాదశాశేషము ౪ సం॥ ౮, ౧౦ నెలలు, ౧౫ రోజులు.

శా॥ ఈరోగం బెటుతగ్గు? బిడ్డనికి, నాయీగో జెటుల్ వోవు?, నా
యారాటం బెటులీఱు? నీకినుక నీయవ్యాజకారుణ్య మే
పాఱన్ దోలవలెన్, భిషగ్వరులు తీర్పంజాలకున్నారు, ని
న్నారాధించితి, నాతనూజునకు సౌఖ్యంబిమ్ము కామేశ్వరీ॥ ౧౨౯.

మ॥ 'కలుగుం బుత్రులవల్ల మోక్ష' మనివక్కాణించు శాస్త్రమ్ము ని
శ్చల, మాతోస్మద్భవుఁగూర్చి కాదె? యిటు లాసాయమ్ము నీధ్యానమున్
సలుపం బూనితి నంబరో? యిదియు మోక్షప్రాప్తి కేకాక యీ
యిల సౌఖ్యమ్ములకెల్ల నెల్లయగుఁగాదే? దేవి? కామేశ్వరీ॥౧౩౦

మ॥ జననీ? గుత్తిపురమ్మునుండి యనిపెన్ జక్రాలవంశ్యుం డొకం
డు నృసింహాహ్వయుఁడు భవల్లలాటధృతసిందూరమ్మునాఁ బొల్చుమం
దు నెదే, నయ్యది చక్రిపై మలపి యీదోరోగరక్షన్ ; నా
తనగేహాఖ్యాను జెల్పె నీకృప కిదే తార్కాణ కామేశ్వరీ॥ ౧౩౧.

మ॥ నినుఁబూజించెడిపట్ల, నేతృణమునేనిన్ దాన మెవ్వారికే
ని నిడంబోయెడిపట్లఁ, బుత్రు రుజయే 'నే నుంటి' నంచున్ మదిన్
దనుకున్ శల్యమపోలె మత్సుకృత మేతద్వ్యాధికై సర్వమున్
వినియోగింపుము, నీవు సాయపడి దీనిన్ దింపు కామేశ్వరీ॥

శా॥ వ్యాపారాంతరమగ్నమానసు భవద్భక్తు న్ననున్ నేర్పుపై
నీపాదమ్ములవంకఁ ద్రిప్పుటకు నీనీచామయవ్యాజ మొం
డాపాదించి తనూజునిం గలఁచెదే, నన్యాయ మట్లైనచో
నేపాపమ్ము నెఱుంగనట్టిడు కదా? యీకుఱ్ఱ కామేశ్వరీ॥ ౧౩౩

శా॥ సంతానంబన? నాఁడు శ్రీదశరథక్ష్మాజాని తాఁ గాంచె, నా
సంతానమ్మును బోలినట్టి దెచటన్ జన్మింపనే లేదు, త
త్సంతానమ్మున నాతఁ డేసుఖము గాంచన్నేర్చె? యోజించినన్
'సంతానంబు సుఖప్రదం' బనుట యుక్తోక్తి కామేశ్వరీ॥ ౧౩౪

శా॥ సూత్త్రప్రాయముగాఁ బ్రవర్తనము నెచ్చోఁ జేయునా కీదృశున్
బుత్త్రుం గల్పనఁజేసి సారె విసువుం బుట్టింతువే? నీకృపా
పాత్త్రుండం గద? తల్లి రో? సుతు నెటో ప్రారబ్ధకర్మార్త్త స
ద్గాత్త్రున్ బూర్ణబలున్ బొనర్చి యిటుపైఁ గాపాడు కామేశ్వరీ॥

శా॥ కాలం బింకను దీఱకే మునుపు స్వర్గంబేగ నా ప్రాణముం
బోలంజాలినవాఁడు తిర్పతి, సుఖంబుం బొందుచున్నాఁడు నా
కాలం బీగతి నేగుచున్నది వృథా కష్టమ్ములపాలై, సుతుం
బాలింపంగదవమ్మ? రోగము త్యజింపంజేసి కామేశ్వరీ॥ ౧౩౬.

మ॥ 'వడుగుంజేయుద' మన్న పీలొసఁగ దీశ్వాసామయం బిట్టియా
చెడురోగమ్ము వివాహమున్ సఱపువాసిన్ గూర్చు టెట్లమ్మ? నీ
యడుగుల్ మ్రొక్కెద దీని కేదో యొకమందంచున్ గనంజేసి నా
కొడుకుం బ్రోవఁ గదమ్మ? నీకొడుకు బాగుం గోరి కామేశ్వరీ॥

మ॥ ఋతువుల్ వచ్చుచుఁ బోవుచున్న వొకటేరీతిన్ రుజాశాంతి యే
ఋతువున్ జేసినయట్లు లేదు; సుఖియై యొప్పేని బిడ్డండు వ
ర్ధితుఁడౌనే? కలనేని దెల్పుము, మనోదీనత్వమున్ బాపు, మా
శ్రితుఁడ న్నీకు ననుగ్రహింపుము సుతశ్రీ నిల్పి కామేశ్వరీ॥ ౧౩౮

శా॥ 'అల్లుం డీతఁడు మా' కటంచు సుతుఁ గన్యాదాత లాడంగ, నా
యుల్లమ్మొండొకభంగి నుండు, నలహా రుత్సాహమున్ జూప నే
మెల్లన్ మిన్నకయుందు, నీరుజకు నేమే నడ్డు కల్పించి త
త్సల్లాపమ్ముల కుత్తర మ్మిడుమనుడుల్ సాగింపు కామేశ్వరీ॥ ౧౩౯

మ॥ ధరలో 'దుష్కరదుస్తరప్రభృతులౌ తత్తన్మహాకార్యముల్
నెఱవేఱున్ దప మాచరించుకతన న్నిక్క' మ్మటంచున్ భవ
చ్చరణారాధన సల్పుచుంటిని యథాశక్తిన్, గుమారామయో
తరణం బెంతదురాపమేని యిఁక సిద్ధం బంబ? కామేశ్వరీ॥ ౧౪౦

# —: క ల గూ ర గం ప :—

;o:

## సనాతన వేదమతానుయాయుల శోకవిన్నపము.

ఆర్యులారా! సనాతనధర్మానుయాయులారా! శ్లో॥ కలౌ పంచ సహస్రాణి జాయతే వర్ణసంకరః- యను న్యాయము మేరకు కలి అయిదువేల వత్సరము లయినది. వర్ణసంకర మారంభమై, జాత్యంతర వివాహ విధవావివాహాది దుష్టశాసనములుచేయించు బ్రహ్మసమాజ ఆర్యసమాజ దివ్యజ్ఞానసమాజములేగాక గాంధిమత మొకటి బయలు దేరి స్వరాజ్యమిషచే అస్పృశ్యతానివారణబోధ మొదలిడినది. పైన వ్రాసిన విధవాపునర్వివాహాదులు ఇష్టమున్నవారు చేసుకొనవచ్చు ననుటచే ఆశాసనము లొనరించునపుడు సనాతన ధర్మానుయాయులు (పూర్వాచారపరాయణులు) వుపేక్షవహించుటచే యక్స్పార్టిడిక్రీల వలె ఐచ్ఛికశాసనములయినవి. ఇదియే మంచిమార్గమని గుర్తెరింగిన ఆర్య బ్రహ్మాది మతస్థులగు హరవిలాసశారదా ముత్తులక్ష్మి గారు మున్నగు శాసనసభ్యులు పనిలేనిమంగలి పిల్లితలగొరిగినట్లు లోకక్షేమ మనుమిషతో నిపుడు బాలబాలికావివాహ గర్భాధానవయో నిర్ణయశాసనము లొనరించుటకు బిల్లులు మూచేసియున్నవారు. అది శాస్త్రవేదవిహితములు! కొందరు జమీందారుల ప్రోత్సాహముచేతను మరికొందరు స్వబుద్ధిపూర్వకముగను శాస్త్రవాదన చేయుచున్నారు. మనలోని కొందరు పండితులు శ్రీమద్వ్యాసజైమిన్యాది సూత్రములకును శ్రుతిస్మృతి పురాణాదులకును వ్యాఖ్యలు రచించిన శ్రీమచ్ఛంకర విద్యారణ్య మాధ్వ రామానుజాది మతకర్తలు (నిబంధనకర్తలు) చూపినమార్గముల నన్వేషించి ఖండించుచు వ్యాసములు వ్రాయు చున్నారు- ఈయిరుతెగలవారిలో సంఘసంస్కర్తల వాదమునకు బలము శ్రుతిస్మృతుల కపార్థములుచేయుట యొకటియె. మనకన్ననో శాస్త్రము ఆచారము నను రెండువిధముల బలముగలదు. మూడవది

శ్రీమద్విక్టోరియా మహారాజ్ఞిగారియొక్కయు వారిపుత్రులగు ఎడ్వర్డు
పౌత్రులగు జార్జిప్రభువులయొక్కయు వాగ్దానమును అయియున్నది.
వాల్గవది వైసురాయిగారి వీటోఅధికారమైయున్నది. అయితే మన
మిప్పుడు గాఢనిద్రావస్థలోనుండి ముందుయీశాసనములవలన కలుగ
బోవు ధనమానభంగములను లక్ష్యముచేయకున్నాము. ధర్మశాస్త్రాను
కూల పత్రికాధిపతులేమి అందు వ్యాసములు వ్రాయు యింగువ
వెంకట సీతారామయ్యగారివంటి లోకానుభవశాలులేమి శాస్త్రలోక
జ్ఞానములతో మనల నెంతహెచ్చరించినను ఎర్రమింగినపాములవలే
మందమతులమై కార్యా కార్యముల నరయజాల కున్నాము- అయితే
శ్రీ మ త్కుం భ కో ణ శ ం క ర పీ ఠా ధి ప తు లు ను
పర్భాంగా కాశీమహారాజులును నవంబరు నెల మొదటి వారములో
సర్వమతాలవాలమైన కాశీపట్టణమున పండితవిద్వత్సభ గూర్చియు
న్నారు. ఆసభకు పలుదేశములనుండి పండితాఖండలు లరుదేరియు
న్నారు. అట్టి పండితులలో కొందరకు స్వార్జితధనము గలదు. మరి
కొందరకు శ్రీపుష్పగిర్యాది పీఠాధిపతులు ద్రవ్యసహాయమొనరించు
చున్నారు. బ్ర॥ వేమూరి నృసింహశాస్త్రి జానపాటి పట్టాభిరామ
శాస్త్రి మున్నగు పండితాగ్రేసరులు శ్లో॥ విద్వత్సు దారిద్ర్యతా యను
న్యాయముమేరకు ధనములేక నివురుగప్పిన నిప్పులవలె నడగియుండవల
సినవారై యున్నారు గాన నోఆస్తికమహాజనులారా మీకు నేజేయు
విన్నపమేమన - మనపూర్వులు వేద శాస్త్రవిద్యాప్రవీణులగుటచే
అట్టి వేదశాస్త్ర పరిపాలకులగు ప్రభువులు మన పూర్వులకు అగ్రహార
ములు యీనాముభూము లొసంగిరి. ఇటీవలి ప్రభువులును శ్లో॥ స్వద
త్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనమను నీతిమేరకు మన భూముల
నస్సై మనల ననుభవింపజేయుచున్నారు. అయితే స్వకర్మసూత్ర గ్రి
థితోహి లోకః యన్నట్లు కొందరు అగ్రిహారాదులన్యాక్రాంతము చేసి

నను పలువురు భూస్వాములు ఆర్థికసంపదలో నున్నారు. మరికొందరాభూములవలననే ఆంగ్లేయవిద్యార్జనచేసి తద్వారా ద్రవ్యార్జనపరులై యున్నారు. "వేదమూలమిదం బ్రాహ్మ్య" మనుధర్మమవలంబించినవారి సంతతివారమై వేదశాస్త్రములకొరకివ్వబడిన భూము లిప్పటికనుభవించుచు కొందరు ఆభూములమ్మినను తద్ధనముతో విద్యాభివృద్ధి ధనాభివృద్ధి కుటుంబవృద్ధినొందిసమరికొందరు యిపుడు నిర్బంధశాసనములకొరకు ధనము వెచ్చించుట ధర్మము. అత్యవసరముగాన మనరాబడిలో రూపాయికొకమూడుపైసలు చందానిచ్చి ఆధనముతో అసెంబ్లిలోపునర్విచారణకువచ్చిన గర్భాధానవివాహవయోనిర్ణయశాసనములు ప్యాసుగాకుండునట్లు మనపూర్వాచారపరాయణులు (వర్ణాశ్రమధర్మతత్పరులు) పలువిధముల ప్రయత్నముల చేయవలసియున్నది. ఇట్లుండ రిత్తురాయనిన మనలోని లుబ్ధాగ్రేసరచక్రవర్తుల నటుంచి వర్ణాశ్రమ ధర్మాభిరతులే తమతమ అగ్రహారాదిభూములవల్లను నిల్వధనముల వల్లను నుద్యోగాదిమాస వేతనములవల్లను మరియితరాదాయముల వల్లను వచ్చు నికరాదాయముపై రూపాయికి మూడుపైసలు వేదమతోద్ధరణకై యిచ్చుట కంగీకరించి మనలో కొందరు నాయకులు ఆయాజిల్లా తాలూకాఫిర్కాలవారీగా సభలుగూర్చి ఆయాసభలకు ప్రెసిడెంటు శెక్రటరీమున్నగుసభాధిపతుల నెన్నుకొని అందుగల ఘరానామనుష్యులవద్ద నిల్వయుంచినధనమునకు క్రమమయిన లెక్కయుంచి అవసరమైనఖర్చులుచేయుట మిక్కిలి అవసరము. ఇట్లు ప్రస్తుతమున ధనమానములు గోల్పోవనున్న గర్భాధానవివాహశాసనములు యేదేని కారణాంతరములచే ప్రభుత్వమువారు ప్యాసుచేసినచో పార్లమెంటువరకు మనము పోరాడవలసియున్నది; యిదిగాక యిపుడు గౌరు.గారు మన వేదమతానుయాయులు యిహమందేగాక పరలోకమందుననుగూడ బంధవిచ్ఛేదముగాదని నమ్మిన వివాహబంధవిచ్ఛేద

మునకై మరియొకబిల్లుగూడ వ్రాయుట కనుజ్ఞనొందినట్లు పత్రికలలో చదువుచున్నారముగదా! వేశినరాయి వేశిన వెఱ్ఱివాడైన గెల్చునను సామెతమేరకు మనమిపుడు యీస్వల్పచందానిచ్చి పనిచేయుట కుపేక్షవహించినచో మనల వెంటడగిలి మనశత్రువులు మన ధనమానములు హరింపజేతురుగావుననె సాక్షా చ్ఛంకరవేదవ్యాసరూపులగు శ్రీ దర్భాంగాకాశీమహారాజులు సర్వమతవిద్యానిలయమగు కాశీపత్తనమున ధనమనోవ్యయముల కోర్చి వేలకొలది పండితాఖండలులను ఆస్తికపీఠాధిపతులను గూర్చి మన పూర్వవర్ణాశ్రమధర్మముల నక్షేమ యుంచుటకు తీర్మానించినారు. మనకోర్కెయు నయ్యదియే గదా. ప్రస్తుతము గాంధి పలుదేశములు తిరిగి దేశాభివృద్ధిమిషతో స్త్రీల పుస్తెలుసహా పుణికి త్రెంపించి లక్షలాది ద్రవ్యముగూర్చి అస్పృశ్యతానివారణమనుపేర మన బావులు సత్రములు దేవాలయాదుల నపవిత్రమొనరింప నుంకించుచుండగా వాని నాపుటకై మనమీపాటి త్యాగమొనరింపకున్నచో మనశత్రు లిపుడే మనల పరిహాసోక్తులాడకమానరు ఈకార్యము గట్టెక్కినచో ముందొక పైసాపండుతోనే రాగలబాధల వారించుకోగలము. మనసనాతనధర్మసౌధమును గూల ద్రోయనుంకించుచున్న బ్రహ్మ ఆర్య దివ్యజ్ఞాన గాంధిమతముల నెదుర్కొనుట కికనైన శ్రద్ధవహించి మూడుపైసలచందా మున్ముందొసగి తదుపరి పైసాఫండు నిల్వఫండుకొరకు సమకూర్చుదము. నెహ్రూప్రణాళిక రాజకీయాభిమానులంగీకరించి పనిచేయుచున్నట్లె శ్రీకాశీ అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసభాతీర్మానముల నమలులోనుంచుటకై మీఆయమునకు తగిన వ్యయరూపమగు చందానొసంగుబుద్ధి నొసంగుటకై సర్వేశ్వరు ప్రార్థించు

ప్రాక్టికలువాది మండ చినవెంకయ్య.

---

చంద్రికా ప్రెస్.

# అభినవ సరస్వతి.

సంపుటము ౨౧ { జానపాడు / శుక్ల సం॥ కార్తికమాసము }

## శ్రీ సూర్యస్తవనక్షత్రమాల.



శా॥ శ్రీమత్పద్మభవుండు, శౌరి, గిరిజాసీమంతినీభర్తయున్
నీమూర్తిన్ విలసిల్లునంచు విబుధానీకంబు కాలత్రయిన్
నీమం బొప్ప భజింతుర్ ప్రత్యహము వర్ణింపంగ నాశక్యమే
నీమాహాత్మ్య మగోచరంబుగద తండ్రీ! సూర్యనారాయణా!

మ॥ తమముం ద్రోచి వనప్రకాండములఁ బద్మవ్రాత మున్మీలన
త్వముఁ గాంచన్ మలినాళి వాడఁగ జగత్సంతాన ముద్యత్ప్రబో
ధమహానందము నొందఁజేసెడు భవన్మాహాత్మ్య మే నెంతు ని
త్యము నారోగ్యమొసంగి ప్రోవవె దినేశా! సూర్యనారాయణా

శా॥ మందేహార్తిదశాహితాబ్జమదవన్మాతంగ దివ్యప్రభా
నందీభూతరథాంగ దుర్భరబృహన్నానారుజాభంగ మా
నిందుస్వచ్ఛమనోనుషంగ నగజాధీశాచ్యుతాంభోజభూ
స్సందీప్తాంగ కృపాంతరంగ హృతదోషా! సూర్యనారాయణా!

శా॥ నీమంత్రంబుఁ బఠించిన న్నిరతము న్నిష్ఠావిధిన్ నీపురో
భూమిన్నిల్చి నమస్కృతుల్ సలిపినన్ ముక్తంబులౌ దుష్కృతి
స్తోమంబుల్ బహురోగసంభవమహాదుఃఖంబులుం బాయు స
త్వామోదంబులు గల్గు దివ్యరుచిసాంద్రా! సూర్యనారాయణా

మ॥ కరసాహస్రమునం బయోధిజల మింకంజేయఁగాఁజాలుదు
ర్భరమై తోఁచెడు నీప్రతాప మఖిలప్రాణివ్రజాధారబం
ధురవర్షాకృతి నీకృపారసము తోడ్తోఁజూపి లోకంబులం
బరిపాలించు ప్రభుండ వీవ కమలాప్తా ! సూర్యనారాయణా !

మ॥ ఒకచక్రంబునఁ బోవు తే, రసమసంఖ్యోపేతవాః వాహస
ప్తకమున్ బయ్యెరతిండి పగ్గములు రథ్యంబో నిరాలంబమున్
వికలాంగుండగువాఁడు సారథి కడుం జిత్రంబు నీయాన మే
రికి శక్యంబు నుతింప నీమహిమ తండ్రీ ! సూర్యనారాయణా !

మ॥ పవలున్ రాతిరి మాసముల్ ఋతువు లబ్దంబుల్ భవద్ధ్యానసం
భవకాలాంగములై జగంబు నడుపం బ్రత్యక్షదైవంబవై
భువనశ్రేణికి సాక్షివై విబుధసంపూజ్యుండవై కర్మసా
క్షివినై యెప్పుడు నిన్నుఁగొల్తు నతిభక్తిన్ సూర్యనారాయణా !

మ॥ అనలుండున్ మిహికాంశుఁడున్ జలసమీరాకాశముల్ ధాత్రి
ఘనతేజంబును గాంతియు న్జలముగాకారంబు శశ్వత్ప్రచా [యున్
లనముం దృశ్యత సత్ఫలోదయము లెల్లం గాంచి దీపింపఁ గా
రణ మీవే! గద లోకరక్షగుణసాంద్రా ! సూర్యనారాయణా !

మ॥ తొలిపల్కుల్ గలతావు చీకటిగమిం దూలింపఁగాఁ జాలు వె
ల్గులకున్ మేలగుపోవు నిచ్చలును మ్రొక్కల్వెట్టు బల్ బాసనా
ల్నెలకూటంబులు వేల్పుటావు చదలన్నీలంపు మేల్కట్టునన్
జెలువౌ కెంపులపూవు నీవుగద తండ్రీ ! సూర్యనారాయణా !

మ॥ ఉదయారంభముగా ధరాగగనమధ్యోర్వీచరజ్జంతువుల్
బొదలున్ మోదముతోడ, నీవు నపరాంభోరాశిలోఁ గ్రుంకఁ దె
ల్వి దొఱంగం గనుమూయు గాఢతమ ముర్విం బర్వ, నీతోడదే
గద లోకంబు సమజ్జనావనసుదీక్షా ! సూర్యనారాయణా !

మ॥ సరసీజాప్త నభోమణీ దినకరా ఛాయామనోవల్లభా
సురసేవ్యాంఘ్రి మహాఘఘస్మర స్వయంజ్యోతీ త్రయీవిగ్రహా
కరుణాసాంద్ర రుజాటవీదహన భక్తవ్రాత కల్పద్రుమా
శరణంటి న్ననుఁబ్రోవవే గ్రహగణేశా ! సూర్యనారాయణా !

మ॥ అనఘంబైన భవన్మయూఖరుచి బ్రహ్మాండంబు నిండంగ సం
జనితామోదమునం జరాచరజగజ్జాలంబు వొల్చున్ ఘనా
ఘనరోధంబున నొక్కచోఁ గనులకుం గాన్పింపమిన్ నాడు దు
ర్దినమై దుస్సహమై తనర్చుగద తండ్రీ ! సూర్యనారాయణా !

శా॥ శుంభజ్జన్యమహావసీనిహతసచ్ఛూరావతంసాళికిన్
జంభారాతిపురప్రవేశఘటనాసంస్తూయమానాఢ్యమై
రంభాదిప్రమదాకుచద్వయపరీరంభానుభావాప్తిచే
సంభావించెడు నీదు మూర్తి పరమేశా ! సూర్యనారాయణా !

మ॥ వ్రతపూజాతపముల్ సభక్తినియమప్రారంభులై నిత్య మం
చితరీతి న్నినుఁగూర్చి చేయుచును నీచే నైహికాముష్మిక
ద్వితయం బంది సుఖింతు రెల్లరును నీదివ్యప్రభావంబు ప్ర
స్తుతి సేయంగను నేర్తురే? గురుఫణీంద్రుల్ సూర్యనారాయణా!

శా॥ ఏకల్యాణగుణాకరున్ ద్విజులు బ్రహ్మేంద్రాదిబృందారకా
నీకంబున్ మదినిల్పి వేదవిధులన్ సేవింపుచున్నారు సం
ధ్యాకాలంబుల భక్తియుక్తులగుచున్ దర్శింపఁగా నట్టిలో
కైకాధీశుఁడ వీవకావె పరమాత్మా ! సూర్యనారాయణా !

శా॥ చారుస్తోత్రవిధిం గనెన్ నిగమపుంజం బున్కి నీయందు సే
వారక్తిన్ గ్రహలోక మొందె నికటావాసం బజేశాచ్యుతుల్
సారధ్యానతపంబులం బడసి రంచద్రూపసాయుజ్యముల్
దూరీభూతసమస్తదోష ! కరుణాళూ ! సూర్యనారాయణా !

మ॥ పొలయల్కం బలతెరేయియెల్ల ముకుళీభూతాస్యయై పద్మినీ
లలనారత్నహిమావగుంఠనము నల్లం బాపుచున్ నీకరం
బుల గిల్గింతల వేతెఱంగుల మొగంబుం దేర్చి నవ్వింతు వ
ర్మిలి నామోదమునం జెలంగ సరసుల్ శ్రీసూర్యనారాయణా!

శా॥ నానారోగవిభంజనంబు మరితైనస్తూలవాతూలమున్
దీనాపద్వనపావకంబు వినమద్దివ్యావనీజంబు వి
జ్ఞానోపార్జనమూలమున్ భవలతాశాతాసిరాజంబు ని
ర్వాణశ్రీసుఖదంబు నీమనుపు దేవా! సూర్యనారాయణా!

శా॥ లోకాలోకమహీధరోత్క్రమణతాలుప్యత్త మోలోకమై
లోకాలోకనపర్వమై వెలుగు నీలోకోత్తరంబౌ మహో
లోకస్ఫూర్తిని గాదె మూడుజగముల్ పుట్టున్ మనున్ లీనమౌ
నీకున్ మించిన వేల్పు లేఁడె చటుఁ దండ్రీ! సూర్యనారాయణా!

శా॥ భూమధ్యంబును దాటి నీవు మకరంబుం జేరు కాలంబునన్
హేమంతం బతిదుస్సహం బగుట నెంతేఁ గుంది నీరాకకై
యేమర్పించెడు పాయసాన్నములచేఁ దృప్తుండవై క్రమ్మరన్
రా, మా కయ్యదె పుణ్యకాలము దినేంద్రా! సూర్యనారాయణా!

మ॥ విమలప్రాగ్జ్వలసింహపీఠిఁ గొలువై వీకన్ వసుస్ఫూర్తిచేఁ
గమలాభ్యంచితకోశజాత మలరంగా శత్రురాజాప్రకా
శమడన్ సత్పథవర్తివై వసుమతీ చక్రావనోల్లాసన
క్రమతం బొల్తు వినాఖ్య సార్థకముగాఁగన్ సూర్యనారాయణా!

శా॥ నీపాదంబుల నాత్మనిల్పుచు సదా నీనామమే యెంచి ని
న్నే పూజింపుచు నుంటి భక్తిమెయి నన్నీపట్ల రక్షింపవే
మాపున్ రేపును నొంచు నీరుజ హరింపం జేసి యారోగ్యమీ
వే పుణ్యాకర! లోకబాంధవ! కృపాబ్ధీ! సూర్యనారాయణా!

మ॥ అకలంకాత్మత నిన్నుతించి మధురవ్యాహారసారప్రభూ
తకవిత్వాంచితకల్పనాపటిమ విధ్వస్తామయుండై మయూ
రకవీంద్రుండు వెలింగె నే నటు లొనర్పం జాల నిర్హేతుకా
చ్ఛకటాక్షంబునఁ బ్రోవవయ్య పరమేశా! సూర్యనారాయణా!

శా॥ నే నల్పుండను బాపకర్ముఁడ మహానీచాత్మకుండన్ రుజా
ధీనాంగుండను మూఢుఁడన్ జడుఁడ నా దీనత్వముం బాపి స్వా
మీ! నన్ గావవె నీదుపాదములె నెమ్మిం గొల్చుచున్నాఁడ వి
జ్ఞానాధీశ్వర! పాపసంహర! దినేశా! సూర్యనారాయణా!

శా॥ భక్తాభీష్టఫలప్రదాత వని నిన్ బల్మారు భాషించు నా
ర్యోక్తి న్నమ్మి భజించుచుంటి నిను నాయుల్లంబులోనన్ రుజా
ముక్తుం జేసి యనుగ్రహింపుము వెసం బూర్ణానుకంపాసుధా
సిక్తస్వాంత! నిజాశ్రితాఘనగవజ్రీ! సూర్యనారాయణా!

శా॥ కోర న్నామది నన్యదైవములఁ గైకో నెల్ల నేమందులన్
క్రూరవ్యాధివిరూపితాంగకములన్ బోషించు దివ్యౌషధం
బై రాజిల్లెడు నీదుపాదభజనావ్యాసంగమే తక్క నా
కారోగ్యంబు నొసంగి ప్రోవవె దినేశా! సూర్యనారాయణా!

మ॥ వనజాతోద్భవశేషవాసవగురుల్ వర్ణింపఁగాఁ జాలరై
నను వాక్సుద్ధి యటంచు భక్తిగదురన్ నానేర్చు చందంబునన్
దనరం గూర్చితిఁ ధప్యాలన్ మనిచి యీ నక్షత్రమాలన్ గ్రహిం
చి ననుం బ్రోవవె సత్కృపాజలనిధీ! శ్రీసూర్యనారాయణా!



# "నేటి కాలపు కవిత్వ" విచారణా

(అవిద్యాశేఖరకృతి)

## ౪ గురువందనాధికరణ విచారణాధికరణము

౧ సూ. అథ గురువందనాధికరణ విచారణా.

ఇటుపైని విద్యాశేఖరులవారు గ్రంథాదియందు చేసిన గురు వందనాదులగు శ్లోకములను గుఱించిన విచారణ గల అధికరణము ఆరంభింపబడు నని సూత్రార్థము. అనగా ఈఅధికరణములో గురు వందనశ్లోక చర్చ చేస్తా మనే తాత్పర్యం గ్రాహ్యం గ్రాహ్యం. ద్విరుక్తిః దృఢార్థా.

౨ సూ. తత్ర శిష్టాన్వవాయేతి, అన్యే ప్రమథనాథేతి చ శ్లోకయో ర్విచారణా.

అందు మొదటిశ్లోకము అయిన శిష్టాన్వవాయ అనేదిన్ని అన్యే ప్రమథనాథాద్యాః- అనేదిన్ని విచారపథానికి వస్తున్నవని వ్యాఖ్యేయం.

విశేయః

మొదటిశ్లోకంలో గురుపాదములు ప్రేమతో (తన) హృదయమున వర్తించుగాక-అని కోరుచున్నారు. ఇందులో గురుపాదాః అనేమాటకు గురువులయొక్క పాదాలు-అనే అర్థంచేస్తే ప్రేమతో వర్తించుటకు మనస్సు మొదలయిన అంతరింద్రియములున్నూ, సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం-అనే న్యాయానుసారము-తలకాయా మొదలయినవి ఉండగా, కాళ్లే హృదయంలో వర్తించవలెనని వీరు కోరుట- అసమంజసంగా కనిపిస్తూన్నది. అట్లా కాకుండా తాతపాదులు మొదలయిన చోట్లవలె పూజ్యార్థకంలో ప్రయోగించారని అనేటట్లయితే క్లిష్టార్థం ఆపతితం అవుతుంది. పైగా ఇట్లా సందిగ్ధంగా చెప్పడం కవిసంప్రదాయం కాదు. కనుక ఇది అనుచితం. ఇట్లే ప్రమథనాథాదులు నిర్వ్యాజములై కరుణాంచితములయిన కటాక్షములను ప్రసరింపజేయుదురుగాక-అనే ఇత్యాది వాక్యాలున్నూ వ్యర్థములే అవుతవి. పునరుక్తములుగూడా అవుతవి. ఏమంటే కటాక్షశబ్దంలోనే కరుణాంచితత్వమున్నూ, నిర్వ్యాజత్వమున్నూ వ్యక్తమవుతున్నవి. కనుక ఇవి కేవల

వ్యర్థాలూ పునరుక్తాలూ మాత్రమే కాకుండా, అపుష్టార్థాలుకూడా అవుతవి.

ఈరీతిగానే వీరాంశ్చ కవితాధీనాన్ ధీరాన్ రసవిమోహితాన్ అన్న శ్లోకం కూడా అనేక సంశయగ్రస్త మగుచున్నది. వాటిలో-వీరులన డంతో-ఏ-ఏవీరులూ? పల్నాటివీరులా? ప్రెసిడెన్సీ కాలేజి వీరులా? లేకపోతే గణాచారులా?-అని ఇత్యాదిగా ఒకసందేహం, వీరులూ అంటే కవులూ అని అర్థం జేసేటట్టయితే కవితాధీనాన్ అనే విశేష ణం అసంగత మవుతుంది. పైగా కవులు కవితకు అధీను లవుతారా? లేకపోతే కవితే కవులకు అధీన మవుతుందా? అనే సందేహాలు గలగ డం, రెండూ. రసవిమోహితులైన ధీరులూ అన్నప్పుడు కాని ధీరు లుంటారా? అనేది మూడో సందేహం. ఇట్లానే అనేక సంశయ గ్రస్తం ఇది అవుతున్నది.

ఈరీతిగానే త్రిలింగజననీం వందే-అన్నశ్లోకం అపార్థాలకు ఆకర మవుతున్నది. ఆపిమ్మట భారతీయవాఙ్మయద్రష్టలను స్తుతిస్తా ననడ ముస్నా అసంబద్ధవచనమే అవుతున్నది. ఈవిధంగా శ్లోకపంచకము నకు పంచకంతలు పట్టుచున్నవి. కాబట్టి-ఇవి సందేహాస్పదాలు.

పూర్వపక్షం

కాదయ్యా! - మీమాటలు బొత్తుగా అసంగతాలు. మొదటి శ్లోకంలో చెప్పిన సీతారామవిపశ్చితులు వీరికి గురువులు. కాబట్టిన్నీ, ప్రమథనాథ భట్టాచార్యులువారు కలకత్తాలో విద్య చెప్పించి విద్యా శేఖరత్వబిరుదు ఇప్పించిన గురువులు కాబట్టిన్నీ, వారిని భక్తితో స్మరించి ధ్యానించి హృదయవర్తులనుగా గ్రంథకర్త చేసికొంటున్నాడు- గనుక మొదటి రెండుశ్లోకాలూ ఔచిత్యం కలిగివున్నవనీ అంటూరా?

సమాధానం

గురువందనం చేయడం అనుచితమని మేము అనటం లేదు. కాని ఆ సీతారామశాస్త్రుల్లవద్ద వీరు తెలుగే చదివారో, లేక సంస్కృ తమే చదివారో, వారు వీరికి ఎట్లాగురువులో చచ్చిపోయిన ఆపాదులు వీరిహృదయంలో ప్రేమతో వర్తించడం ఎట్లాగో సందిగ్ధంగా వున్న దని చెప్పాము. కేవలం ఇంతేకాకుండా గురుపాదాః-అనే ఇతాంది

ప్రయోగములు క్లిష్టార్థాదిదోషజుష్టములని చెబుతాం. కావ్యంలో ఇల్లాంటి ప్రయోగములు అనుచితా లని విద్యాశేఖరులే ముందు వ్రాస్తారు కాబట్టి.

పూర్వపక్షం

సరే. కానీండి. వీరాంశ్చ కవితాధీనాన్, కృష్ణాపినాకినీ... త్రిలింగజననీ, స్తవీమి ధ్వసికారాద్యాన్—అనే ఈమూడుశ్లోకాలయినా ఔచిత్యాన్ని వహిస్తున్నవంటాం. ఎందువల్లా—అంటే, ఇందులో వీరాంశ్చ కవితాధీనాన్ అనేదాన్లో "కవి-కవిత్వము"-ను గుఱించిన తత్త్వం మనోహరంగా ప్రదర్శింపబడ్డదిగనుకా. అని అంటారా?— అట్లా అయితే వినండి:—

సమాధానం

కవులను ఎవ్వరూ వీరు లనడంలేదు. వారు కవితకు అధీనులనీ చెప్పడంలేదు. ఒకవేళ అట్లా చెప్పినా అది యుక్తంగా ఉండదు. కవికి కవిత స్వాధీన కావలెగాని, గుఱ్ఱానికి రౌతు స్వాధీనం పడ్డట్లు కవే కవితకు స్వాధీనుడు కాగూడదు. అయితే అట్టివాడిపని గుఱ్ఱం మూడు కాళ్ళతో నడచినట్లు వుంటుంది.

ఇక నాలుగోశ్లోకంలో త్రిలింగజననిని ప్రయోగించారు. తాను వసించేదేశాన్ని తల్లిగా ఆరోపించుకోవడం మంచిదే గాని, ఆ ఆరోపించుకొనుటలో జననీ-అనే స్త్రీశబ్దసారస్యమునకు అనురూపంగా ఉండేటట్లు త్రిలింగశబ్దాన్ని సవరించుకోవలె. ఇది వీరు చేయలేదు. పైగా త్రిలింగమనేమాట ఆంధ్రదేశానికి రెడ్లపాలన కాలంనుండీ పేరుగా వచ్చినట్టిది. కనుక అసలుపేరైన ఆంధ్రజనని అనకుండా త్రిలింగజనని అనడం అనుచితం అనక తప్పదు.

ఇంతేకాకుండా-త్రిలింగంఅనే మాట వినడంతోటే అపార్థం కూడా స్ఫురిస్తుంది. కనుక అనుచితం (అప్రశస్తం) అని ఇత్యాదిగా అంటున్నాము. ఇంకోటి. దీనికి విశేషణంగా కృష్ణా...తుంగభద్రాప్రయశ్శుభాం—అని నాలుగునదుల యుదకములతో శోభనురాలైనట్లు చెప్పారు. తెలుగుదేశంలో నదులు ఈ నాలుగేనా? అనే ఇత్యాది సందేహాలు అనేకం స్ఫురిస్తవి. కాబట్టి ఈగీతి అనుచితం.

ఈరీతిగానే భారతీయవాఙ్మయ దర్శకులగు ధ్వనికారాదులను ప్రస్తుతించుటలోగల అర్థం విస్పష్టం అగుటలేదు. దీనివలన ప్రకృతము నకు రాగలశోభ వెల్లడికాలేదు. కనుక ఇది అసమర్థాది దోషజుష్టం- అని అంటున్నాము.

### తటస్థాక్షేపం

అవునయ్యా!-త్రిలింగజననీ-అనేప్పుడు త్రిలింగమనే దేశంఅసకదా మీా రర్థంచేశారు! అదికాదు అర్థం. త్రిలింగంఅంటే 14 ఏండ్లకిందట వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండుసన్సువారు ప్రకాశకులుగాను (ఇప్పటికీవీ రేప్రకాశకులు)-ఈఉమాకాంతులవారు సంపాదకులుగానూ ఉన్నట్టి త్రిలింగ అనే పత్రిక-అర్థం. ఆపత్రిక వీరికి కాస్తచేయూత నిచ్చి అన్నం పెట్టి కాపాడింది. అన్నం పెట్టిన పోషకులకు తల్లి అన డం తండ్రి అనడం యుక్తం.కాదా?— అని అనేటట్టయితే—

### సమాధానం

వినండి. వారు వీరికి చేయూత ఇవ్వడం వీరు వారిని తల్లి అనో తండ్రీ అనో చెప్పుకోవడం యాచనాదుల్లోయుక్తం అయితే కావచ్చు. ఇట్లాంటిచోట కాదు. కృష్ణాదినదుల నీళ్ళతో శోభిస్తున్నది- అనే విశే షణం అప్పుడు పొసగదు. వావిళ్ళప్రెస్సులో - మంచినీళ్ళే దొరకవు కదా! అట్టి సందర్భాల్లో ఎక్కడో ఎటుచూచినా పెక్కు ఆమడల దూరంలోవుంటే పయస్సు చాకలపేటలోకి సంతరించడం వగైరా లున్నా, దానిచేత ఈ త్రిలింగ (పేపరు) శోభనురాలు కావడం ఎంత దుస్సాధ్యమో చెప్పతరముకాదు. కనుకనే అపుష్టాదిదోషసహస్రా లకు ఇవి గుఱి అయినవన్నాము.

ఇట్లే సూత్రాణాం .... అనేదానిలో ఏసూత్రాలో ఎక్కడిభా ష్యాలో వివరించకుండా ఆ తోవలో వెళ్తానంటాడు. దిక్కూ మొక్కూ చూసుకోకుండా వెళ్ళితే మధ్య కూలుతాడు. కాబట్టి మనం వదలిపెట్టి కొంతదూరం వెళ్ళనిచ్చి చూతాం.

ఇది అవిద్యాశేఖరకృతిలో వాఙ్మయ పరిశిష్టం పురస్- నేటికాలపు కవిత్వవిచారణలో గురువంద నాధికరణ విచారణ సమాప్తము.

# చచ్చిపోయినవారు తిరిగి బ్రదుకుట

కొన్ని వారముల క్రితము మాస్కో అనుపట్టణమునుండి, మానవ,జంతు మృతకళేబరములకు జీవముల కల్పించి, పునర్ జీవులుగ జేయుటకు శాస్త్రిపరిశోధనలు చేసి వైద్యశాస్త్రి ప్రపంచమునకు, ఇది ఏమి యాశ్చర్యమా అనునట్లు, తల్లడింపజేయుటకు, కేబుల్ ద్వారా తెలియజేసిరి.

ఆపరిశోధన విషయ మేమనగా నొకయింజెక్షనువలన మృతజీవునియొక్క హృదయమును, మరల యథాప్రకారముగ దెబ్బలశబ్దము వినబడునటుల పనిజేయునట్లుగను, యొకనిట్టూర్పువిడుచునట్లుగను జేసినటుల తెలియుచున్నది.

మఱియు విషప్రయోగముచే, నొకకుక్కను చంపివేసి మరల బ్రతికించిరట. అంతియెగాక మరల కొన్నిమాసములకు ఆకుక్కనే చంపివేసి తిరిగి దానికే ప్రాణదానముజేసి బ్రదికించిరి. అంత ఆకుక్క యథాప్రకారముగ జీవము గలిగినకుక్కలవలెనే తిరుగుచున్నట్లు తెలియుచున్నది.

(2) మఱియొకకుక్క తలనుకోసివేసి యొకమందుద్రావకమును ఆ కోసినతలకు ప్రత్యేక గొట్టములద్వారా దానియొక్క రక్తనాళములకు నెక్కించి ఆకుక్కయొక్క నేత్రములను బ్రతికినకుక్కయొక్క నేత్రములవలె చేయగలిగిరి. మఱియు ఆకుక్కతలను తాకినంతమాత్రముననే బ్రతికినకుక్కతలవలె కదలసాగెను. అంతట దాని నాలుకపై నొకక్షారపదార్థమును పెట్టగ ఆపదార్థమును అది విసర్జించెను. అయితే, వెన్ననుమాత్రము పెట్టగనె దానిని మ్రింగివేసెను. అని న్యూయార్కునందు వెలువడు బ్లడ్ లెన్స్ ప్లేబాటమిస్టు అను పత్రికయందు పైవిషయములు డా॥ యస్. జే. చెమాలియన్ దొరగారిచే వ్రాయబడెను.

యన్. కేశవాచార్యులు,
కొత్తపట్టణం.

——:o:——

# పల్నాటి యాత్ర

—— —:o: ——

"చిన్న చిన్న రాళ్లు ♦ చిల్లర దేవుళ్లు,
నాగులేటి నీళ్ళు ♦ నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు ♦ సర్పంబులును దేళ్ళు,
పల్లె నాటి సీమ ♦ పల్లె టూళ్లు"

తమ యప్రమేయశౌర్యధైర్యసాహసాదిసద్గుణంబులచే ఆంధ్ర దేశమునకేగాక భారతవర్షమున కంతకును ఆదర్శప్రాయమై యొప్పిన వీరుల కదనరంగములచే పావనవంతంబగు పల్నాటిసీమను దర్శించి తరింపవలెనని చాల కాలమునుండియు కోరిక కలదు. కాని శ్రీమన్నారాయణు డగు ఆ జగద్రక్షకుని యాజ్ఞ లేనిది మన కోరికలు చెల్లవు గదా. నేటి కట్టియాజ్ఞయైనది. అందుచే బయలుదేరి నర్సారావుపేట యందు ధూమశకటమునుండి దిగి, పల్నాడునకు బోవు బాటను బట్టితిమి. ఎక్కడజూచిన రాళ్ళు. పిండిరాయి కాదు- నల్లరాళ్ళు, నాప రాళ్ళు. పొలములన్నియు ఎఱ్ఱమట్టితో నిండియుండి, 'పల్నాటివీరుల రుధిర మింకను ఈ భూములపై బ్రవహించుచునేయున్నదా?' యను నటుల దోప జేయుచుండెను.

ఇటుల కొంతదూరము అనగా సుమారు ౨౧ మైళ్ళదూరము పోవుసరికి ఎదుట పెద్దబాట యొకటి కొండమీద కానుపించినది. దానినిజూచి యాచక్కగా వేయబడిన బాట నెందులకు వేసిరని ప్రక్క నున్నవారి నడిగితిమి. "మనము క్రమముగానెక్కి ఆకొండమీదనున్న బాటగుండ బోవుచో కొండ కావలివైపునకు సులభముగ బోయెద" మని చెప్పిరి. అట్లేపోయి మరికొన్ని ప్రదేశములను ఎక్కుచు దిగుచు ౨౫ మైళ్ళ దూరము వచ్చితిమి. అంతట దూరమున మిద్దెలతోనిండిన గ్రామమొకటి కాన్పించుచుండెను. పల్నాటిసీమ కంతకును నాయక మణియై ప్రశస్తిగాంచిన కారెంపూడి గ్రామ మదియేయని తెలిసి నప్పుడు "తొలిజన్మమున నోచిననోముల పూజాఫలము లభించెను గదా" యని సంతుష్టాంతరంగుల మైతిమి.

# కారెంపూడి.

ఆనాడే "కారెంపూడి" యందున్న శ్రీచెన్నకేశ్వర గ్రంథాలయముయొక్క ద్వితీయవార్షికోత్సవమునకు నిర్ణీతదినమైయుండెను. అందుచేత గ్రంథాలయభవన మంతయు పచ్చని ఆకుజొంపములతో నలంకరింపబడి, నూతనశోభతో విలసిల్లుచుండెను. ఉత్సాహవంతులగు యువకు లనేకులు ఈ గ్రంథాలయమునకు పట్టుగొమ్మలై నిలిచి, దాని యభివృద్ధికై సదా పాటుపడుచున్నారు.

౧౨ వ శతాబ్దమునందు బ్రహ్మనాయునకును, నాయకురాలునకును "కారెంపూడి" మహాక్షేత్రమునం దొక గొప్పయుద్ధము జరిగెను. ఆ రణరంగమునందు పాల్గొన్న వీరులకే యిచట వీరాలయము నిర్మింపబడియున్నది. జనులా వీరులను దైవములుగ నెంచి, పూజల సలుపుచున్నారు. వారు మానవమాత్రులను తలంపు ఈవైపున 'మనము' జనసామాన్య మని పిలుచువారియం దెవ్వరికిని లేనేలేదు. వీరు లందరును శ్రీ మహావిష్ణ్వంశసంభూతు లనియే వారు నమ్మి పూజించుచున్నారు.

వీరు లందరును తాము యుద్ధమునకు పోవుటకు ముందే కారెంపూడియందున్న గంగధారిమడుగునందు స్నానముజేసి, తమ ప్రాణలింగముల నా మడుగునుండి తీసి, యొడ్డున బడవేసిరి. ఆ ప్రాణలింగములే యిప్పుడు ఈవీరుల యాలయమునందు బ్రతిష్ఠింపబడి, పూజింపబడుచున్నవి. ప్రతివత్సరమును కార్తికమాస అంత్యదినము (అమావాస్య) మొదలు మార్గశిరశుద్ధ చవితివరకు అయిదుదినములు వీరుల తిరునాళ్ళు జరుగును. అప్పటికి ఆంధ్రదేశముయొక్క పలుభాగముల నుండియు జనసామాన్యమునుండి అనేక వేలమంది జనులు- విద్యావంతులు, కన్నమనాయుళ్లు, పోతురాజులు, కొమ్మరాజులు, ఆచారవంతులు, పిన్న పెద్దలు- వీ రందరును వీరుల యుత్సవమునందు తమకు నిర్ణీతమైన భాగములను గైకొనువారు- కారెంపూడికి విచ్చేసెదరు.

(సశేషము)

# పూర్వజన్మలు కలవా, లేవా?

:(౦):

నవీన నాగరికులలో చాలమందికి పూర్వజన్మలంగాను భావి జన్మలంగాను నమ్మిక లేకుండుటచే వారికి కొంత విశ్వాసము గల్గించు నను తలంపున నీమధ్య భరతపూరు రాష్ట్రమున జరిగిన విచిత్ర కథ నొకదాని నిందు బొందుపరచుచున్నాము.

భరతపూర్ సంస్థానములో సాలెంపూరను గ్రామమున నాల్గు సంవత్సరముల వయస్సుగల 'ప్రభు' అను కైరాతి బ్రాహ్మణచిన్న వాడొకడుండెను. వాని చరిత చాల విచిత్రముగా నుండుటచే భరత పూరు మహారాజాగారి యాజ్ఞచే నాప్రాంతముననున్న నాయిబ్ తహసిల్ దారుగారు 1923 వ॥ సంవత్సరము మార్చి నెలలో ఆకుర్రవానిని పరీక్షింప నా కుర్రవా డిట్లు చెప్పదొడంగెను. 'నాపూర్వజన్మములో నేను భరతపూరు సంస్థానములో హాత్యోరియను గ్రామమున హోర్బక్స అను బ్రాహ్మణుడను. నాకు ఘూరె షాంలాల్ అను యిరువురు కుమారులును కోకిల భోలి అను యిద్దరు కుమార్తెలును గలరు. ఆయిద్దరు కుమార్తెలలో పెద్దదానికి డబ్బుతీసుకొని కేర్లిపురమున మన్నమెట్ అనువానికిచ్చి పెండ్లి జేసితిని రెండవదానిని నావారు పురముననున్న గోకుల్ అను వానికి ద్రవ్యమేమియు గైకొనకనే యిచ్చి వివాహ మొనర్చితిని హాత్యోరిగ్రామమున నాకు పెద్ద యిల్లుండెను. నాయింటి ప్రక్కనే స్వరూపజితుడను వానిగృహ ముండెను. వానికొక కుమార్తెయు కుమారుడును గలరు వానియింటిలోనికి పోవుటకు చాల మెత్తయిన మెట్లుండెడివి.

ఆయింటికి ప్రక్కనే పెద్దతటాక మొకటియుండెడిది. ఆతటాకముమధ్య నొక పెద్ద భవనమును దానిపైభాగమున గోపురముగల మండపమును గలవు. ఆవూరికోటలో నొకశిలాశాసన మున్నది. దానిలో నొకపాము గలదు. నేను నాతండ్రి జీవించియుండగనే మాయూరిబైటనున్న యొకయింటిలో చనిపోతిని. నేను చనిపోయిన తరువాత నేను పరలోకము చేరితిని. అక్కడ దేవుని జూచితిని. అతనికి పెద్దగడ్డమును మీసములును గలవు. తరువాత నీవు సాలెంపురము (ప్రస్తుత జన్మస్థానము) నకు బొమ్మని చెప్పెను. '

తరువాత నాతహసిల్ దారుగా రాబాలుని యొక వంకెద్దుబండిపై కూర్చుండబెట్టుకొని వానిపూర్వ జన్మస్థానమగు హాథ్యోరిగ్రామమునకు గొని తనపరీక్షావృత్తాంతము నీవిధముగా దెలియబరచెను.

' నేనాబాలుని దీసికొని హాత్యోరిగ్రామమునకు సాయంసమయమునకు చేరితిని. నేనావూరిబైటకు పోగానే నీవుచెప్పిన తటాక మెక్కడ నున్నదని అడిగితిని. అంతనాత డది వూరికి దిగువనున్నదని చెప్పెనుగాని దాని నిరూపించి చూపలేకపోయెను. అదిచూపుటకు రానిచ్ఛగింపకపోవుటచే నారాత్రి యాపురమున గడిపితిమి.

మరునాటి ప్రాతఃకాలమున నేనావూరిలోని 70, 60, 50, 40, సంవత్సరముల వయస్సుగల నల్గురు పెద్దమనుష్యులను వెంటగొని యీకుర్రవాడు చెప్పినప్రతివిషయములను పరీక్షచేసితిమి. పూర్వజన్మములో యీతడు తనపేరు హార్బక్సుఅనియు తనతండ్రిపేరు సుండే అనియు జెప్పెను. పైపెద్దలు యిది నిజమే ననిరి.

———:o.———

ఓం

# నాగరకత యనగా నేమి?

——:o:——

[ కృష్ణార్యుడు ]

ప్రస్తుతకాలములో నాగరకులు ఎవరు ? చుట్ట, బీడీ, సిగరేటులను త్రాగువారు; సురాపానము చేయువారు; రిఫ్రెషుమెంటు రూములందు మాంసము, కోడిగ్రుడ్ల సారములతో చేరిన వస్తువులను భుజించువారు; స్నానాదులు చేయక కోటు, బూట్సు పెంటలూన్ వీటినిధరించి బల్లపై తట్టలో యుంచబడిన ఆహారమును స్పూనులతో యెత్తి నోటిలోపల యుంచుకొనువారు; శుద్ధజలమునకు మారుగా అపానవాయువు నీరును (Soda water) ఎల్లప్పుడును త్రాగుచుండెడివారు; ముఖ పరిక్షాళన చేయకయే బెడ్ కాఫీ (Bed Coffee) త్రాగువారు; సకలమూ పరబ్రహ్మమే, భేదము లేదు, పరస్త్రీ రతులైనను అది పరస్త్రీయని మాకు భావన యుండదు. సర్వకాల సర్వావస్థలయందును పరబ్రహ్మమునే దర్శించు చుందుము" అని పలుకుచూ పంచమహాపాతకములను ధైర్యముగా జేయుచుండు శుష్క వేదాంత శిరోమణులు; దైవదూషణ జేయువారు, దైవభేదము నెంచువారు; పర మత ఖండన జేయుటయే తమకు ముక్తిపదమని యెంచియుండు వారు; పశుహత్య జేయువారు, రాగద్వేష కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములు సంపూర్ణముగా గలవారు; అజితేంద్రియులు, మనో నిగ్రహము లేనివారు; శ్వపచులు, ఎల్లప్పుడు నిష్కారణముగా అన్యులతో పోరాడుచుండెడివారు. ఈషణత్రయముల వలలో జిక్కుకొని తమస్థితికి తామే ఆనందపడు చుందువారు; మారు వేషము వేసుకొని బాహ్యనటన జేయుచుండు వారు; మౌనభావము యొక్క మర్మము నెరుగక ఎల్లప్పుడు ఏదియో మాటలాడుచు కంఠశోషణ

చేసుకొను చుండువారు; ధన మదముచే బీదల హింసించుచుండు వారు; జీవిత కాలమంతయు కోర్టు కచేరులకు తిరుగుచు తమసర్వస్వ మును వృథా పాడు చేయువారు; అన్య భాషల నభ్యసించి పరకీయ ఆచార వ్యవహారముల నాచరించు వారు; తమస్వనియమ నిష్ఠలను నిప్పున గలిపియుండువారు; సాంఘిక బలము ఎట్టిదను విచారము నెరు గక ఏదియు బనికిరాని వాదనలతో సత్కార్యాచరణల యందుండు వారినికూడ తమ దారికి తెచ్చుటకు యత్నించువారు; పర దారపరద్రవ్యాదుల నపహరించి ఐశ్వర్య మదముచే కండ్లు కానరాక యుండు వారు; సన్మార్గములందునడచు సచ్చారిత్రులను దూషించి అపహా స్యము జేయువారు; జూదమాడి ద్రవ్యార్జన జేయువారు; సకల పాప కృత్యములకు సహాయపడువారు. ఇట్టి వారందరు ఈ కాలములందు నవనాగరకులు. నాగరకమను పదము యొక్క అర్థముగూడ నిదియే.

"నగరాత్ కుత్సన ప్రావీణ్యయోః" (పాణిని) నగర శబ్దాత్ వుఞ్ స్యాత్ కుత్సనే ప్రావీణ్యే చ గమ్యే -

కనుక నాగరకమనగా నింద్యవృత్తి. ఏది ఏది నింద్యమో అది నాగరకమనబడును. పరకీయులు మనలను అనాగరకులని భావించియు న్నారుగదా. అదిమనకు క్షేమమే. అదేమనకు మంచిది. అనాగరకులు ఎవరు? పై జెప్పిన ప్రమాణరీత్యా శాస్త్రానుసారముగా వర్తించువారు, దైవపథమున నడచువారు, సన్మార్గమున బోవుచుండువారు, మనలను అనాగరకులని పిలిచినను సంతోషమే, దైవపథచారులుగా నుందుము గాత !

బ్రాహ్మణుల యందుకూడ చాలా మతభేదము లున్నవి. మత భేదమనగా ఆచారభేదము. వాటిలో ముఖ్యమైనవి రెండు (౧) వైది కులు (౨) లౌకికులు. ప్రస్తుతకాలపు జనులకు లౌకికులని చెప్పుకొను టకు యిష్టము. ఎందుకనగా లౌకికులనగా లోకవ్యవహారము నెరిగి

నట్టి వారనియు, వైదికులనగా ఏమియు ఎరుగని శుద్ధశుంఠలనియు వీరిభావన. అయితే వీటిసరియైన అర్థమేమని విచారించి యున్నారా ! లేదు. ఎందుకు? పరాచార వ్యవహారభాషాదు లంతప్రాబల్యమునకు వచ్చి యున్నవి. వాటిసందడిలో నిశ్చయవిచారములయందే మనమాన సముబోదు. తెల్లపాయ ఉల్లిగడ్డ యివి మెండుగా యుంచియుండు గదిలో సువాసన నుంచినను అది తెలియబడునా ! మన అవివేకము అట్టిది. నిశ్చయముగా చూచినయడల లౌకికులనగా విచారరహితులు; వైదికులనగా వేదజ్ఞులు. వేదము నెరిగి వాటియందు చెప్పబడియుండు నియమముల ననుసరించి నడచువారు; వేదములయందు ప్రపంచపర మార్థ విచారములు రెండును యుండుటచే ప్రపంచపరమార్థ జ్ఞానములు రెంటినీ గలిగియుండువారు వైదికులు. లౌకికులు విచార జ్ఞాన హీనులగుటచే ప్రస్తుతకాలపు నవనాగరకుల తరగతికి చేరినవారు; ఇదియే ప్రస్తుతకాలపు నవనాగరకత.

సోదరులారా ! నవనాగరకతను కూర్చి మరికొద్దివిషయములను తెలియ చేయవలెనని తలంచియుంటిని. ఈవిచారములో విస్తారముగా వ్రాయుటకు వీలులేనందున సంక్షేపముగా వ్రాసియున్నాడను. ఈ లేఖను చదివి మీకు ఏదారియందు బోవుటకు యిష్టమువచ్చునో ఆదారిలో బోవుడు. ప్రస్తుతనాగరకత సకల అనర్థములకు మూలకారణమనెడు విషయమును మాత్రము మరువకుడు, మరువకుడు !

:o:

## నిజాము రాష్ట్రమందలి రెడ్లు.

నిజాము రాష్ట్రమం దాంధ్రులు ౭౦ లక్షలకు పైగానున్నారు. అందు రెడ్లుమాత్రమే సుమారు ౧౩ లక్షల సంఖ్యాకులై యున్నారు. అనగా నాంధ్రులలో వీరైదుగురి కొక్కరి వంతున నున్నారు. నిజాము రాష్ట్రాంధ్రుల విషయమై వేరుచో నేనింతవరకు వ్రాసినదానిలో రెడ్లనుగురించి కొంతవ్రాసియుంటిని. ప్రకృతము రెడ్లస్థితినిగురించి విపులముగా వ్రాసెదను.

పూర్వ మీరాష్ట్రమందు రెడ్లు ప్రబలులై విద్యావంతులై కవులై, దాతలై భుజబలముచే నానారాష్ట్రములను స్థాపించికొనిన వారై యుండిరి. యిప్పటికిని వనపర్తి, గద్వాల, ఆత్మకూరు, జటప్రోలు, గోపాలుపేట, దోమకొండ, మున్నగు సంస్థానములున్నవి. కొందఱు రాజులు తమతమ చిన్న సంస్థానముల ననేక కారణములచే గోల్పోయినవారు. సుఱికొందఱు పరగణాల కధిపతులై దేశముఖ్యులుగా నుండిరి. నేడు వారు 'దేశముఖ్' బిరుదమాత్రముచేతను, సర్కారు వారు దయతో నొసఁగు నాకొంచపు రుసుముచేతను బ్రికాశించుచున్నారు. పూర్వ మీసంస్థానాధిపతులు కొందఱు స్వయముగా కవులైయుండిరి. అష్టభాషలయందుఁబ్రవీణుఁడైన వనపర్త్యధీశ్వరుఁడగు గోపాలరాయలనువారు సంస్కృతమున రామచంద్రోదయమను చంపూకావ్యమును రచించిరి. ఈరాజులందఱును కృతిపతులుగా నుండిరనుట కిప్పుడిప్పుడు ప్రచురింపఁబడిన సంస్థానములందు గ్రంథములే నిదర్శనములు. అల్లసాని పెద్దనయే మరల యవతరించెనో యని భ్రాంతిని బుట్టించి కవనమల్లిన కాణాదము పెద్దన గద్వాల సోమభూపాలుని యాస్థానకవియై, అధ్యాత్మరామాయణ, ముకుందవిలాసాదిగ్రంథకర్తయై యుండినవాఁడు. మహాశౌర్యసంపన్నుఁడై యనేక యుద్ధములందుఁ దనవిజయధ్వజం బెత్తిన ప్రథమ రామేశ్వరరాయలు వనపర్తి సంస్థానాధీశ్వరుఁడై నిజాముగారి మెప్పువడసి 'బహిరీ బలవంత్ మహాభూపాల్ బహాదరు' అను బిరుదావళిని సంపాదించెను.

ప్రకృతమం దీసంస్థానములోకింత కాంతిహీనములై యున్నవని చెప్పవలసివచ్చినది. ఇప్పటి సంస్థానములందు వనపర్తి, జటప్రోలు సంస్థానములు తక్కిన వానికన్న శ్రేష్ఠములైనవని మాత్రము నివేదించి యితరుల విషయమై మౌనము వహించెదను.

ఇఁక సామాన్యులవిషయము. ఈరాష్ట్రములోని రెడ్లు ముఖ్యముగా సేద్యముపై యాధారపడినవారు. వీరే నిశ్చయమైన ముల్కీలు. వీరిస్థితియంతగా ప్రశంసింపఁ దగినదికాదు. నగరములం దుండువారు నౌకరీప్రయత్నములందు విశేషముగాఁ గాలము గడపుచుందురు. గ్రామములం దుండువారు వ్యవసాయముతోఁ బాటిగ కక్షలు (పార్టీ) పెంచుకొనుచుందురు. ఇట్టివి చాలచోట్ల సంభవించుచుండును. విద్యావ్యాపకము వీరియందిప్పుడు విశేషమగుచున్నది. రాష్ట్రమందు రాజభాష, కచ్చేరిభాషయు ఉర్దూభాషయే యగుటచేత విద్యాభ్యాసము చేయురెడ్లు విశేషముగా ఉర్దూభాషయే చదువుచు, అసహాయోద్యమవాదులు బోధించు రీతి నొకవిధముగా హిందూస్థానీకి ప్రాధాన్యమిచ్చినవా రగుచున్నారు. ఉర్దూభాషకన్న నెక్కువకాకున్న సమానముగనైన మాతృభాషయైన యాంధ్రభాషను సహిత మభ్యసించినవారైన శ్రేయస్కరమని విన్నవించుచున్నాను. నిజాములోని రెడ్ల వేషములు సహితము కొంతవిపరీతముగనుండును. ముసల్మానులరీతి టోపీ, షేర్వాని, లాగు తొడిగి బయలుదేరుటచే వీరొకింత హిందూ ముస్లిముల యైకమత్యమును సంధించువారు. ఇదియు నసహాయవాదుల యాప్సితమె. ఇట్లు ముసల్మానులను భ్రాంతిని బుట్టించువారు జాతీయ ధర్మమును వహించి హిందువులకుఁ దగిన యుడుపులనే ధరించిన దోషముండదుకదా? అయితే బ్రిటిషు ప్రాంతములందలివా రింగ్లీషులను వెక్కిరించుటలేదా యని కొందఱి యాక్షేపణ. ఇది యొక యుపమానమే. కాని వారొనరించు దానికిఁ దగిన సమాధానము కాదు.

అయినను ఈడ్రెస్సులు, ఫేషన్లు మనయభివృద్ధికి ప్రధానమైనవికావు. ఐశ్వర్యము, ఐకమత్యము, విద్యావ్యాపకము, మున్నగునవియే మనకావశ్యకమైనవి. విద్యావ్యాపకవిషయమై హైద్రాబాదు నగరములో రెడ్లకొఱకై కొన్ని శ్లాఘనీయములైన యేర్పాటులు జరిగియున్నవి. హైద్రాబాదులో రెడ్లకొఱకై విద్యాలయమను పేర హాస్టలు ఒకటి నిర్మింపఁబడినది. ఈయాలయమునకై సుమారు ౧ లక్ష

రూపాయలు నిధిగా నుంచఁబడియున్నవి. రెడ్డి విద్యాలయమం దిప్పుడు ౭౦ (డెబ్బది) విద్యార్థు లున్నారు. ఈయాలయమునకుఁ గార్యదర్శిగా నుండిన రాజశ్రీ కొత్వాలు వెంకటరామారెడ్డిగారు రాత్రింబవళ్లును విద్యార్థుల సౌకర్యముల నరసికొనువారై, వారికి విద్యాప్రదాతలై యున్నారు. ఈవిద్యాలయమింకను దినదిన ప్రవర్ధమానమగుచున్నదని నివేదించుటకు చాలసంతసించుచున్నాను. రెడ్లవిషయమై శ్రద్ధ తీసుకొనువారిలోఁ గార్యదర్శి యనంతరము రా॥ పింగలి వెంకటరామారెడ్డిగారును, రా॥ వెంకటరెడ్డిగారును, (ఆడిటర్ రైల్వే) శ్రీబారిష్టరు గోపాలురెడ్డిగారును, వకీలు రంగారెడ్డిగారును, మున్నగువారు పేర్కొనఁదగియున్నారు. రెడ్డివిద్యాలయము నొక్కహైదరాబాదులోనే స్థాపించుటతో నిలువక, ప్రతిజిల్లాయందును వీరు త్వరలో స్థాపించుదురని కోరుచున్నాను.

ఈప్రాంతములందు రెడ్లలో పాకనాటివారును, మోటాటివారును, ముఖ్యమైన తెగలవారు. వీరి సంఖ్యయె విశేషముగనున్నది. పాకనాటిశాఖకు శ్రీగద్వాల రాజాగారు ముఖ్యులు. మోటాటితెగకు శ్రీవనపర్తిరాజాగారు ప్రధానులు. సుమారు ౧౦ సంవత్సరములకుమును పీరెండుశాఖల నొకటిగాఁ జేయవలయునని యీరాజులుంగారు ప్రయత్నించిరి. వేలకొలఁది రెడ్డిప్రముఖులును ఆమోదించిరి. పత్రములందు దస్కతులు చేసిరి. ఆపత్రికల నచ్చువేయించియుండిరి. అమితోత్సాహముతో బెద్ద ఉద్యమమును సాగించిరి. కాని నేఁడావిషయమును స్మరించువారే లేరు. తుదకు కర్నూలులో కీర్తిశేషులైన శ్రీరాజారామేశ్వరరావు – వనపర్తిప్రభువుల యాధిపత్యమున జరిగిన సభలో నీశాఖలనొకటిగాఁ జేయవలయుననిన తీర్మానమును సభ్యులు త్రోసివైచిరి. నిజాము రాష్ట్రములోని రెడ్లు, ముఖ్యముగా రాజులీయుద్యమమును బట్టుదలతో సాగించిరేని మనోరథమీడేరునని నాయాశయము. ఈసదుద్దేశమును మరల ప్రయత్నించుదురని నా ప్రార్థన. నిజాము రాష్ట్రమందలి రెడ్ల విషయమింకను విశేషముగ నివేదింపఁదగియున్నది. వేరొక తూరి చర్చింపఁ దలఁచితిని.

శా॥ పంజా బెక్కడ? వేరదెక్కడ? మహాపద్వారకంబౌచుఁ దా
సంజీవిన్యవధానవల్లరియనన్ సంప్రాప్త మౌటెడ? యా
ర్తిం జూడంగొను టెడ? యంబరో? భవచ్ఛ్రీపాదముల్ పద్యపుం
బుంజంబుల్ రచియించి కొల్చుఫల మీపున్నెమ్ము కామేశ్వరీ॥

మ॥ తనసోదర్యవిశ్వాసకాసల నెటుం దా మాన్పికోలేక యం
బ? నినుం గొల్చెడి నన్నుఁబోలె నలబర్మాడాక్ట రుండంగ, నా
తని కీవేరు లభించె, నా కిది యయత్నప్రాప్తమయ్యెన్ జిరం
తనపుణ్యంబున నీకృపాగరిమ చేతం దల్లి? కామేశ్వరీ॥ ౧౬౬

శా॥ బర్మాడాక్టరుసోదరుం డొకరుఁ డల్పప్రాయపుంగుఱ్ఱఁ డో
శర్మాధాయిని? నాదుపడ్డకుని శిష్యవ్రాతమం దుండె నీ
మర్మం బాతఁడు వానిచే నెఱిఁగి తన్మాత్రార్తికై కైకొనెన్
గర్మాంతమ్మయి నాకు భాగ మచటన్ గల్పించెఁ గామేశ్వరీ॥

మ॥ మణిమంత్రౌషధిశక్తు లెంతయు నసామాన్యంబు, లీశక్తు లే
యణుమాత్రంబును గోచరింపవుసుమీ? యంబా? భవత్సేవకా
గ్రణులందక్కఁ దదన్యులందు, నిజమిక్కాలమ్మునం గూడ ని
మ్మణిమంత్రౌషధిశక్తి నీకొలువు సంపాదించుఁ గామేశ్వరీ॥ ౧౬౮

శా॥ ఏవేరీశ్వరవేరు శ్వాసరుగహిస్వేచ్ఛానిరోధమ్మునం
దావేరున్నది నీదుపుట్టినిలుచాయన్ దాని నేయోగిరో?
యీవుంబోలె నెఱుంగు? నింతనె జగం బేరీతి జీవించు? నో
దేవీ? యీకృతి కట్టిశక్తి నిడి పృథ్విన్ బ్రోవు కామేశ్వరీ॥

శా॥ దేనిన్ గంఠమునన్ ధరించు నెడ నుద్రేకింపకే శ్వాసకా
సానూనార్తి యడంగు నయ్యది యమూల్యంబైన వేరద్ది యే
నీనామాంకితమైన కావ్య, మని దీనిన్ బండితుల్ మెచ్చుకోఁ
గా నీ వీకృతికిన్ మహత్త్వ మొసఁగంగాఁ గోర్కి కామేశ్వరీ॥

మ॥ మును నన్నుఁ గనుచుండు నాకవనముఁ మూచూడఁగాంక్షిం
[చి, యో
జననీ ? యిప్పుడు ‘శ్వాసకాసల నడంచ న్నేర్చుఁబో!’ యంచు ద
ర్శనముఁ జేయఁదొడంగి, రేమిగతి? యీసత్కావ్యమం దట్టి శ
క్తిని వేర్వేల్లఁకులందుఁబోలె నిడి ఖ్యాతిం దెమ్ము కామేశ్వరీ॥

మ॥ పడిసెంబో, తలనొప్పియో, జ్వరమొ సంప్రాప్తించుచో వైద్యులం
దడవన్ లాభము గల్గినం గలుగు దుర్దాంతవ్యథాభారముల్
గుడువన్ దాపగుచో నరుం డెఱిఁగి తాఁ ‘గుయ్యో మొఱో ?’
[యంచు నీ
యడుగుల్ పట్టుటయే రుజాపనయనోపాయమ్ము కామేశ్వరీ॥

శా॥ ఏ నేపాటి? సమస్తకారణుఁడు శ్రీకృష్ణుండు ము న్నాత్మసం
తానార్తిన్ దొలఁగించుపొంటె నిను బల్ దైన్యమ్మునై వేఁడి ని
చే నాకోర్కి లభింపఁగా సుఖము వాసిన్ గాంచి సంసారినై
తా నెందున్నగడెన్ భవచ్చరణముల్ ధ్యానింతుఁ గామేశ్వరీ॥

మ॥ ఇహమందు న్నినుఁగొల్చువారలకు సర్వేద్యత్వముఖ్యమ్ములా
బహుసంపత్తులు గల్గు, వ్యాధు లుడుగున్, బ్రఖ్యాతి వర్ధిల్లు, దు
స్సహ మేవారికిఁగల్గ దింకఁ బరమో? స్వర్లోకమున్ మించుఁబో?
యహాహా? నీచరణార్చనం బిడుసుఖం బవ్వారి కామేశ్వరీ॥ ౧౨౪

శా॥ ఇక్కట్టేదియొ నాకుఁ జేకుఱియు, నాయిక్కట్టు నాపట్ల స
మ్యక్కీర్తిప్రదకార్యహేతువుగ బాల్యమ్మాదిగా మాఱు నో
యక్కా? యట్టులె యాత్మజాతురుజ నీయవ్యాజపుం బేర్మి చేఁ
జక్కన్ స్రుక్కి సుకావ్యరూపమున మించంబోలుఁ గామేశ్వరీ॥

మ॥ ఒకయిక్కట్టున విద్య, వేఱొకట విద్యోద్రేక, మింకొక్కటన్
సుకవిత్వమ్ము, మఱొక్కటన్ సుకవితాస్తోకత్వసామగ్రి, వే
ఱొకటన్ యోగము, భోగమో? మఱియు నింకొక్కంట, నీపేర్మిఁ జే
సి కడుం గస్తి సుఖాకృతిన్ బరిణమించెం దల్లి? కామేశ్వరీ॥

శా॥ దారిద్ర్యమ్మున నేమి, జవ్వనపుదుర్దర్పమ్ము చే నేమి, బల్
ధీరత్వమ్మున నేమి, సర్వమున నేదేఁ జిక్కు వాటిల్లునా
యారీతుల్ పొడసూపియున్ దుదకు నీయవ్యాజపుం బేర్మి చేఁ
బేరై మేటిప్రతిష్ఠలై యవి ననున్ బ్రేమించెఁ గామేశ్వరీ॥ ౧౭౭

మ॥ అటులే నేఁడు కుమారు దూరుజయము నీయవ్యాజపుం బ్రేమ చే
నిటు లేతత్కృతిరూపమై సుఖముఖానేకక్రియోదారమై
స్ఫుటకీర్తిన్ ఘటియించు సూచనలు రేపున్ మాపుఁ దోఁచున్ భవ
ద్ఘటనం బెవ్వఁ డెఱుంగు నెల్లొనరుపంగా లేవు? కామేశ్వరీ॥ ౧౭౮

మ॥ అల సత్యవ్రతుఁ డా సుదర్శనుఁడు నేమానట్లు మున్ దోఁచి ర
వ్వల నేమైరి? భవత్కృపావశత, నేవ్యాధుల్ మఱే చిక్కులున్
గలఁచ న్నేరవు నీకృపావశుల, నిక్కమ్మింత, మత్పుత్రునీ
యిల సత్యవ్రతుఁగా, సుదర్శనునిగా నీక్షింపు కామేశ్వరీ॥ ౧౭౯

శా॥ ఆయుశ్శ్రీబలదాయకంబులు త్వదంఘ్ర్యంభోజరేణుచ్ఛటల్
నాయందున్ బ్రసరించినందులకు నానాఁటన్ సుతుం డామయా
పాయమ్మున్ గడఁదోసి వృద్ధికిరవై భాసిల్లుచున్నాఁడు నీ
సాయం బూరక పోదు భద్రముల నిచ్చల్ గూర్చుఁ గామేశ్వరీ॥

శా॥ 'గ్రామారిష్ట మడంగఁజేయు' మని త్వత్కాంతు, న్నినున్ 'బుత్రకున్
గామేశాఖ్యు నరుగ్ణుఁజేయు' మనియున్ గావ్యోక్తిమూలమ్మునన్
మీమీమంచి గణించి వేఁడితిని నన్ మీ రర్థి మన్నించినా
ర్మీమే లెల్లెడ నేను జెప్పికొనెదన్ మిన్ముట్టఁ గామేశ్వరీ॥ ౧౮౧

శా॥ నీ వాపత్తులపట్ల సాయపడినట్లే సంపదర్థమ్ములన్
రావుశ్రీకులరత్నభూషణము శ్రీరామాంబ సాహాయ్యమున్
గావింపన్ వెనుదీయ కోమెడి ననున్, గళ్యాణి? యమ్మాతృకన్

మ॥ చదువుల్ నేర్చితి దిగ్విజేతనయి యాచంద్రార్క భాస్వద్యశః
పదమై మించితి భాగ్యపుంగరిమతో భాసిల్లితిన్ గండముల్
తుదముట్టించితిఁ గంటి సంతతిని సంతోషించుచుంటిన్ భవ
త్పదదాస్యం బొడఁగూర్పలేని దొకభద్రం బున్నె? కామేశ్వరీ॥

మ॥ శశిశేషం బయిదేండ్లు భూసుతదశాసంవత్సరా లేడునున్
గృశతాకారక మాచు వ్యాధి మిగులన్ గ్లేశంబు గల్పించె, నా
ర్తిశమారంభము రాహు వాదినె ప్రసాదించెన్ సమస్తంబు నీ
వశ మన్నింటికిఁ దల్లి; నీయదియ మా భారంబు కామేశ్వరీ॥ ౧౮౪

శా॥ ఏమాత్రంబు వివేకమున్న మనుజుండేనిన్ గృహాపత్యభూ
రామారామమయంబు సంసృతియెడన్ రాగిల్లుటే తప్పు, త
త్కామముల్ కొండొక నీపదాంబుజములన్ ధ్యానించుచో సంతత
క్షేమం బబ్బెడిఁ, దక్కువారి కసదా సేనుంబు కామేశ్వరీ॥ ౧౮౫

మ॥ కొడుకుల్ గూఁతులు నేఁగురిప్పటికి నాకున్ నీకృపం గల్గి రే
యెడ నివ్వాండ్ర ననుగ్రహించుటయు నాయీనన్ను దైన్యంబు పా
ల్పడకుండన్ దగఁజూచుచుండుటయు నిన్ బ్రార్థింతు నోయమ్మ? నీ
యడుగుల్ గొల్చెడిదాసదాసులకు దాస్యత్వమ్మండఁ గామేశ్వరీ॥

మ॥ అతిచిత్రంబు భవచ్చరిత్రము, తదీయంబైన మాహాత్మ్యప
ద్ధతి వర్ణింపఁగ నాకు శక్యమగునే? తల్లీ? సుతున్ మున్నదు
స్థితిలో ముంచిన వ్యాధి యిప్డు సురిఁగెన్, దేహమ్ము నానాఁట వ
ర్ధితమయ్యెన్, గళ, కాంతు, లుప్పతిలె సుశ్రీ మించెఁ గామేశ్వరీ॥

శా॥ నాయంత్రైనను గాకయున్న నెటులో నాపుత్రుపై నీకృపా
వ్యాయామం బుదయించు నక్కతన విద్యాస్ఫూర్తి యవ్వానికిన్
స్వాయత్తం బిఁకఁ గాకతీరదు, రుజాహంకార మింకేపయిన్
ఛాయన్ గూడ స్పృశింపకుండునటులన్ శాసింపు కామేశ్వరీ॥ ౧౮౮

ఉ॥ శాపనియంత్రితుండయిన శంకరుచే బతిమాలఁ బడ్డవై
ఆపయి నాపె యిట్లనె. "నస్మదనుగ్రహమొంది యీసురల్
లోపములేక యెందునను లోకులచేతను బూజ్యమానులై
పాపమువాపి వారికి శుభప్రదులౌదురు. రిఁకేమి కావలెన్. ౨౩౯

ఆ॥ పెండ్లిపీఁటమీఁదఁ బెక్కండ్రుముందఱ నాదుకరము పట్టినావు నీవు.
సప్తమండలములుఁ జనినావు నాతోడఁ. జేసినాఁడ వెవరుఁజేయని పని. ౨౪౦

సీ॥ వేలిమియరుగుపై విధ్యుక్తముగఁ బ్రతిష్ఠింపంగఁ బడినట్టి సెగలపేఁదు
పాలికాముఖర సత్పాత్రస్థపానీయ మాశ్రయించి వసించు నప్పతియును
భువనము ల్పదునాల్గుఁ బూర్తిగా వ్యాపించి యలరారుచుండెడి యంబుజాక్షుఁ
డాత్మవల్లభలతో నన్వితులై యుండు దేవతలును మహీదేవతలును
దిక్పతుష్టయమున దీపించుచుండంగ నింతమందియెదుట నెంతయును స
భాస్థలంబునందు బాసలుగావించి యెట్లు వ్యభిచరించి తీవు చెప్రుము. ౨౪౧

క॥ గురువులుగూడ జనౌఘముకరణి నసన్మార్గమందుఁ గాల్వైచెదరే
నెఱిఁగి ప్రబుద్ధులు నిగ్రహపరులగునదియనుచు శ్రుతులు పలుకుటలేదే. ౨౪౨

సీ॥ జనకుఁ డసన్మార్గసంచారియైనచోఁ గొడుకేని శాసింపఁగడఁగవచ్చు.
గురువు దుష్పథమునఁ గ్రమ్మఱఁదొడఁగుచోఁ శిష్యుఁడుం బట్టి శిక్షింపవచ్చు.
బ్రాహ్మణు ల్గర్వించి పైని వీక్షించుచోఁ భూపతి దండింపఁబూనవచ్చు.
పతి మంచిచెడ్డలఁ బరికింపకున్నచోఁ బత్ని శపింపఁ బాల్పడఁగవచ్చు.
నీచుచేతనేని నిగ్రాహ్యుఁ డెంతటిదండివాఁడుగూడఁ దప్పనడవ
ననివచించు వేద. మపథుం డపూజ్యుండు. సుపథుఁడగును బూజ్యుఁ డెపుడుఁబుడమి.

ఆ॥ ఎవఁడు స్వకులధర్మ మెంతయు విడనాడు వాఁడు పతితశబ్దవాచ్యుఁడగుచు
మరణ మొందువెనుక నరకంబునం గూలి దుఃఖభారమునను దూలుచుండు. ౨౪౪

తే॥ వేఁదు నాస్తిక్యమున జ్ఞాతిభేదమెనసి ధర్మసంత్యాగమొనరించి తాఁ జరించు
వాని మనుధర్మరతులగువారలెల్ల నిగ్రహింపంగవలయును నిశ్చయముగ. ౨౪౫

ఆ॥ వర్ణధర్మములను వంశంపుధర్మముల్ దేశధర్మములును నేశకుండు
వదలిపెట్టు వాఁడు వర్ణచ్యుతుండౌచుఁ బతితుఁడని వచింపఁబడెడిఁ బుడమి. ౨౪౬

సీ॥ గార్హస్థ్యసిద్ధికి ఘనకారణంబౌచుఁ బరఁగుచుండినయట్టి పావకునియు
ఆర్యు లనుష్ఠించు నామ్నాయచోదిత స్వస్వవర్ణాశ్రమాచారములయు
ఇది యిట్లుకావింతు నేనని మును రూఢి వాగ్ద్రిచ్చియుండిన వచనములయు
పుణ్యప్రదములంచుఁ బూనికమైఁ బట్టి వరుసఁ గావించెడి వ్రతములయును

త్యాగముం జేయఁగూడదు తథ్యముగను. వీని త్యాగంబునేసినవాని జనులు
తాము త్యాగంబుసేతురు తప్పకుండఁ. బతితుఁడని చెప్పఁబడును దద్భ్రష్టుఁ డింక.
సీ॥ భువనము ల్వెదుకాడ్తి పొరలించిచూచినం గానంగఁబడఁడు నిన్గన్నతండ్రి.
తల్లి యయిదంత మంతకుమున్న యెవరికి శ్రవణంబులకును గోచరము కాదు.
అన్నదమ్ములునైన నగుపడరెచటను సరిపోల్చుకొనియైన సంతసింప.
మామఁ డితఁడంచు మాటయైన వచింపఁ డెవ్వఁడును వచ్చి నీ యెట్టయెదుట.
ఏవిధంబైన నీవార్త యెఱుంగఁబడదు. విసము తిం. దస్థిమాలను వేసికొందు.
పూసికొందు చితాభస్మమును దనువున. మనసుకొలుపదు నిను ముట్టుకొనుటకేని.
సీ॥ కంపుగొట్టెడి పచ్చిగజచర్మముం గట్టి తలనిండఁ బెంజడ ల్దాల్చినావు.
అణుమాత్రమైన మర్యాద యెఱుంగవు. గెడెకొక్కునుడి నోట నుడువుచుందు.
వింటెంటికింబోయి యెత్తెదు బికిరంబు. సద్వ్రతంబన్న నీచాయ సున్న.
పరికింప మిగుల నబ్రహ్మణ్యుఁడవు నీవు. కపటివి. దుష్టసంకల్పుఁడవును.
ఈదృశుఁడవగు నీతోడ నించుకయును గూడి సంభాషణము చేయఁగూడ దరుగు.
మింక నామ్రోల నుండుటకేని తగ" వటంచుఁ గన్నీళ్ళు కాల్వలై యవనిఁ బాఱ.
క॥ ప్రమథనాయకుండు బతిమాలుచున్నను వెక్కివెక్కియేడ్చి వీడ కలుక
నమ్మహేశుచేష్ట లాక్షేపముంజేయు చివముమలకొమార్తె యిట్టులనియె. ౫౧౦
తే॥ "నీదుహృదయంబులోపల నిశ్చయముగ నార్జవములేదు. కాఠిన్య మూర్జితంబు.
భూసురుల యాసురుల నుడు ల్వెల్లులనుచుఁ దోఁచె నాపయి నీచూపు దుష్టమతిని.
తే॥ పారులెల్లరు వంచింపఁబడినవారు వరుస నీచేతఁ. గావున వారిచేత
నీవు బాధింపఁబడె" దంచు నిట్లు పలికి గౌరి యఱకుండుటయుఁ గాలకంధరుండు.
తే॥ నీతిమయ హేతుమద్వాక్యనిచయమునను సదుపచారంబులను సుప్రసన్నవదనఁ
జేసి మెల్లమెల్లగాను దచ్ఛీతపర్వతేశ్వరాత్మజ దువ్వుచు నిట్టులనియె. ౫౧౩
తే॥ "నిండుజాబిల్లి కీడైన నీముఖంబు నేల కలుషంబుఁజేసెదవే శుభాంగి !
తగదు నీకిది. సర్వభూతములమీఁదఁ గరుణఁజూపింపవలె హితకాంక్షతోడ. ౫౧౪
తే॥ ఎదియొ యొకకార్య మత్యంత మిష్టమగును గాక. పరపీడనము సేయఁ గడఁగఁజనదు.
భువనమంతయు నీకగుఁ బుత్రతుల్య. మఖిలపూజ్యవు నీవయా దఖిలరూప! ౫౧౫
తే॥ నేను దెఱగంట్లహితముకై నింద్యకర్మ మాచరించితి. నైనను నాత్మజుండు
గలుగునీ. కాప్రకారంబు గాకపోయినను ద్వదిష్టము పూరించెదను వచింపు. ౫౧౬
తే॥ నాకు నందఱికంటెఁ బ్రాణములకంటెఁగూడ నెక్కువదానవు చూడ నీవు.
అగ్గలంబు ప్రసన్నవై యాజ్ఞయిమ్ము చారుముఖి ! నీదుకోరిక ల్సత్వరముగ "

ఆ॥ అనుడు దేవి యిట్టులనియెఁ. “ జాతుర్మాస్య బ్రహ్మచర్యమంతఁ బట్టఁజేసి
తగ మహావ్రతంబు ధరియింతువేని నే సుప్రసన్ననగుదుచూ మహేశ! ౭౮

క॥ వేలుపుల సమక్షంబున హేలం దాండవము సేసెదేని వైష్ణవమై
కాలిల త్వదధాంగము నీఁజాలెదవేని గ్రిమ్మతెంతు శాపము శంభూ! ౭౯

క॥ నను సంతసపెట్టుట కీయనువున వర్తించువెడల నగుదుఁ బ్రసన్నా
నన. నట్లుకానిచోఁడిక నిను నమ్మదు నాదుమనసు నిశ్చయముగ ” నాన్. ౮౦

క॥ భగవానుఁడు ప్రీతుండై యగుఁగాకని బదులుచెప్పె. హర్షాన్వితయై
భగవతియు శాపమోక్షము తగుగతిఁ గావించెనపుడు దాసా ! ” యనుడున్

—— శివుని తాండవవర్ణనము. ——

తే॥ శూద్రుఁడిట్లను. “నారయుచో మడువుటయందు నీవు మహాక్లేశ మొందుచుంటి
కాని నీవాక్కు లాశ్చర్యకారకంబు. లెంతవిన్నను దృప్తికా దేమొకాని. ౮౨

క॥ అస్మదదృష్టంబున నాకస్మికముగ వచ్చినావు. గౌరీకథలన్
సస్మితవదనంబునఁ గడు విస్మయముగఁ జెప్పినావు విద్యాదధీశా! ౮౩

సీ॥ బ్రహ్మాద్యమ్ముఖులతోడఁ బరివృతుండై మహేశ్వరుఁ డెట్లు నృత్యంబు సల్పినాఁడు ?
ఎట్టింగినైనది యేమి చాతుర్మాస్య ? నేవ్రతం బపుడు గ్రహింపఁదగిన ?
దుగ్రమైఁ బొడమిన నాగ్రహం బంతయు హిమవదద్రికుమారి కెట్లుపోయె ?
క్రిమ్మఱ నేవిధిఁ గలిగె ననుగ్రహం ? బది కింవిధంబైనయది తలంప ?
ఈయెనర్పఁబడిన యెల్లప్రశ్నములకు దయను విస్తరించి తగినయుత్త
రము వచింపుమయ్య యమివరా ! నీకన్నఁ బూజ్యకథకు లిలను బూజ్యమగుట ”

క॥ అనవిని గాలవముని “ యోయనఘా ! యయుతాధ్వరముల నగునట్టిఫలం
బును గలుగఁజేయు నేత ద్ఘనమగు నితిహాసము విను కాంక్ష వచింతున్ ౮౫

క॥ చాతుర్మాస్యంబున శివుఁ డాతతమగు భక్తి మందరాహార్యమునన్
ప్రూతుఁడయి బ్రహ్మచర్యముఁ బ్రీతిం బూని వసియింప వేలుపులెల్లన్ ౮౬

ఆ॥ అరిగి యెరఁగి మోల నానతకాయులై నిల్వఁబడుడు నట్టినిర్జరాళి
కదిగ్రజాభిహితము నంతయు వాక్రుచ్చి యింక నొక్కమాట యిట్టులనియె. ౮౭

క॥ “ నాచేత నియుక్తంబగు ప్రాచీనాభినయమందు బాసటయగుచున్
మీచాతురి చూపింపుఁడీచాతుర్మాస్యమునను నిందాద్రిద్యమరుల్ ! ” ౮౮

ఆ॥ అనివచించి యంత నాషాఢశుక్లచతుర్దశిని భవానితృప్తిపొంటె
తాండవింపఁదొడఁగెఁ దన్మందరాచలశిఖరమందుఁ జంద్రశేఖరుండు. ౮౯

సీ॥ అంగిరో నారద వ్యాస దేవల శుక కర్దమ గౌతమ కశ్యపులును
క్రతు భృగు భార్గవరామ మరీచి వసిష్ఠ పులోమ ప్రచేతసులును
జమదగ్నియును బులస్త్యమునీశ పులహులు నుత్తంకుఁడు నగస్త్యయోగి యత్రి

౯ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసర్కిలిన స్పెక్టరు, నర్సారావుపేట.

౧౦ నారాయణరావుగారు, దాతారుపల్లి

౧౧ రంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు-పాపురం.

౧౨ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు

౧౩ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౪ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ

౧౫ వేలూరి రామన్న గుప్తగారు, సదాశివునిపేట

౧౬ రాచూరి సుబ్బయ్యగారు – శ్రీ శ్రీ నిరూపాతుసంస్థాన ప్రధానమంత్రి

౧౭ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు – ముసలాపురం

౧౮ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు – ముసలాపురం

౧౯ కప్పగంతు సుబ్బారావుగారు – పోలీసుసబిన స్పెక్టరు – కొమ్మాలపాడు.

౨౦ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట

౨౧ శ్యామాపంతుల గోపాలరావుగారు – హైదరాబాద్.

౨౨ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు – శాతాపురం

౨౩ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౨౪ తాళ్ళవెలిమ లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం

౨౫ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి

౨౬ వెంకటరాజయ్య, ముక్తేదారుగారు – సీతారాంపురం

౨౭ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.

౨౮ కుంటుపల్లి రామారావుగారు, సంగెం.

౨౯ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౦ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౩౧ కొండంభట్లగారి వెంకన్న గారు. గుమ్మడిదల

౩౨ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం

౩౩ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-వెదవీను.

౩౪ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.

౩౫ కుంటుపల్లి అమృతరావుగారు-సంగెం.

౩౬ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాద.

౩౭ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

# అభినవసరస్వతి

సంపాదకుఁడు – నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 2—0—0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిణీశోద్ధారిణి [పూరి వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 4 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 5 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 6 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 7 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము | ... | 0 | 8 | 0 |
| 10 | అస్పృశ్యతానివారణ ఖండనము (మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 11 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 12 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 3 | 0 |
| 13 | పత్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 14 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 15 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 16 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 17 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 18 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 19 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 3 | 0 |
| 20 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 21 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 22 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 23 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | 0 |
| 24 | భారతీయప్రబోధము (పిశుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 25 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 26 | భారతకథాతత్త్వనిర్ణయము (మల్లాదిరామకృష్ణవిద్వచ్చయనులుగారు) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా.

# అభినవ సరస్వతి

| సంపుటము ౨౧ | జానపాడు<br>శుక్ల సం॥ మార్గశిరమాసము | సంచిక ౯ |
|---|---|---|


## శారదా బిల్లు

ఈ నెల 22 తేదీన మదరాసు రాజధానిగెజెట్‌లో ప్రకటింపబడెను.

## 1929-19 వ చట్టము

బాల్య వివాహములను జరుపకుండ నిరోధించునట్టి చట్టము

బాల్యవివాహములను జరుపకుండ నిరోధించుట అవసర మగుటచే, యీ రీతిగా చట్టము చేయబడెను

సంగ్రహ శీర్షిక

(1) 1928 బాల్యవివాహ నిరోధక చట్టమని యీచట్టమును పిలువవచ్చును.

వ్యాప్తి

(2) ఇది బ్రిటిషు యిండియాకంతకును బ్రిటిషుబెలుచిస్తానుకును, సాంతాలు పరగణాలకునుగూడ వర్తించును.

ప్రారంభము

(3) 1930 ఏప్రిలు నెల మొదటితేదీ నిది అమలులోనికి వచ్చును.

నిర్వచనము

(4) ఈ చట్టములో విషయములోగాని సందర్భములోగాని అసంగతమైనదేదైన నుండినతప్ప

(ఏ) "బిడ్డ" అనగా పురుషుడైనచో 18 ఏండ్లలోపు వయసు గలవాడును స్త్రీయైన 14 ఏండ్లలోపు వయసు గలది అని అర్థము.

(బి) "బాల్యవివాహము" అనగా పెండ్లి చేసుకొనుటకు సమ్మతించిన పురుషులిద్దరిలోను యెవరో యొకరు బిడ్డ అని అర్థము.

(సి) పెండ్లిచేసుకొనుటకు "సమ్మతించినవ్యక్తి" అనగా దాని ప్రకారము యే స్త్రీకిని యే పురుషునకును వివాహము జరిగినదో వారిద్దరిలో నొకరని యర్థము.

(డి) "మైనరు" అనగా 18 ఏండ్లలోపు వయసుగల స్త్రీగాని

బిడ్డయగు నొక స్త్రీని యిరువదియొక్క యేండ్లకులోపు వయసు గల పురుషుడు పెండ్లియాడినచో వానికి శిక్ష.

3. ఒకవ్యక్తి పురుషుడై యుండియు 18 యేండ్లకు పైబడినట్టియు 21 యేండ్లకు మించనట్టియు వయసుగలవాడై యుండియుబిడ్డయగు స్త్రీని పెండ్లిచేసుకొనినచో 1,000 రూపాయలవరకు జుల్మానాశిక్ష విధింపబడుట కర్హుడగును.

21 యేండ్లకు మించినవయసుగల పురుషుడు బిడ్డయగు స్త్రీని పెండ్లియాడినచో వానికి శిక్ష

4. 21 యేండ్లకుమించిన వయసుగల పురుషుడై యుండినవాడు బిడ్డయగుస్త్రీని పెండ్లియాడినచో నెలరోజులవరకును విడిఖైదు శిక్షను లేక 1,000 రూపాయలవరకును జుల్మానా శిక్షయును లేక రెండు శిక్షలునుగూడ విధింపబడుట కర్హుడగును.

బాల్యవివాహములు జరిపినందులకు శిక్ష

5. బాల్యవివాహమును జరుపుట, పరిశీలించుట, యాజమాన్యమును వహించుట మున్నగుపనులను చేసినవారు ఆవివాహము బాల్యవివాహముకాదని నమ్ముట కవకాశము గలదని రుజువు చేసినయెడల తప్ప నెల రోజులవరకు విడిఖైదు శిక్షయును లేక 1,000 రూపాయల వరకును జుల్మానాశిక్షయును లేక యీరెండు శిక్షలనుగూడ వేయబడుట కర్హులగుదురు.

బాల్యవివాహముతో సంబంధముగల తండ్రికి లేక తల్లికి లేక సంరక్షకునకు శిక్ష

6. (1) ఒక మైనరు బాల్యవివాహము చేసికొనినచో ఆమైనరువిషయమున బాధ్యతగల తండ్రియైనను లేక తల్లియైనను లేక సంరక్షకుడైనను లేక మరియొకడైనను ఆబాధ్యత న్యాయసమ్మతమైనను కాకపోయినను ఆవివాహము జరుగుటకు సంబంధించిన యేపనినైన జేసినను, లేక ఆవివాహము జరుగుటకు సమ్మతించినను, లేక అశ్రద్ధవల్ల ఆవివాహము జరుగకుండ నిరోధింపకపోయినను, నెలరోజుల

లకు విడిఖైదు శిక్షయును లేక 1000 రూపాయలవరకు జుల్మానా శిక్షయును లేక యీ రెండు శిక్షలునుగూడ విధింపబడుట కర్హుడగును.

స్త్రీయైనచో ఆమెకు శిక్షమాత్రము వేయగూడదు.

(2) ఈ సెక్షను ప్రయోజనమునకును సంబంధించినంత వరకు ఒకమైనరు బాల్యవివాహము చేసుకొనినచో ఆమైనరు విషయమున బాధ్యతగల వ్యక్తి అన్యథా ఋజువుచేసినయెడల తప్ప లేనిచో ఆవ్యక్తి అశ్రద్ధవలన ఆ వివాహము జరుగకుండ నిరోధింపలేదనియే భావింపబడును.

3 శెక్షనుక్రింద నేరము చేసినవారికి కారాగృహవాసశిక్ష వేయుగూడదు.

7. 1897 జనరలు క్లాజెసు ఆక్టు (10-1897) 25 వసెక్షను లోను యిండియనుపినలుకోడు (45-1860) 64 వసెక్షనులోను ఏమియుల నుండినను గూడ 8 వసెక్షను ప్రకారము ఒక దోషికి ఒక న్యాయస్థా నాధికారి శిక్ష విధింప నున్నపుడు ఆదోషికి విధింపబడిన జుల్మానా మొత్తమును ఆదోషి చెల్లింపనిచో అతడు ఎన్ని రోజులవరకైన గాని కారాగృహవాస శిక్ష ననుభవింపవలెనని ఆజ్ఞాపించుటకు ఆన్యాయాధికారికి అధికారము లేదు.

ఈ చట్టముక్రింద జూరిస్‌డిక్షను

8. 1898 క్రిమినలు ప్రొసీజరు కోడు (5-1898) 190 సెక్షను లోయెటులున్నను యీ చట్టము క్రింద జరిగెడు నేరములను గూర్చి దాఖలు పుచ్చుకొనుటకు విచారించుటకు ప్రెసిడెన్సి మేజస్ట్రేటుకును డిస్ట్రిక్టుమేజస్ట్రేటుకును తప్ప యితరులకు అధికారము లేదు.

నేరములను దఖలు పుచ్చుకొనవలసిన పద్ధతి.

9 ఏ వివాహములో నేరము జరిగినట్లు యెంచబడునో ఆ వివాహము జరిగిన సంవత్సరములోగా ఫిర్యాదు దాఖలైనయెడల తప్ప ఏన్యాయస్థానాధికారియును యీ యాక్టుకు సంబంధించిన కేసులలో దఖలు పుచ్చుకొనగూడదు.

ఈచట్టముక్రింద జరిగిన నేరములను గూర్చి ప్రారంభవిచారణ

10. ఈ చట్టము క్రింద ఒక నేరములో దఖలు పుచ్చుకొనిన న్యాయస్థానాధిపతి 1898 క్రిమినలు ప్రొసీజరు కోడు (5_1898) 230వ సెక్షను ప్రకారము స్వయముగా ప్రారంభవిచారణ చేయవలెను. లేదా అట్టి విచారణ చేయుటకొక ఫస్టుక్లాసు మేజస్ట్రేటు నియమించవలెను.

ఫిర్యాదీవద్దనుండి ధరావతు పుచ్చుకొనుట కధికారము

11. (1) ఫిర్యాదీని పరీక్ష చేసినపిమ్మటను ముద్దాయి హాజరగునట్లు నిర్బంధించుటకు సమ్మతులను పంపులోపలను ఫిర్యాదీ ధరావతు కట్టనవసరము లేదని న్యాయస్థానాధికారి తప్ప తలచినయెడల ఆటుల నతడు తలచినచో అందులకుగల కారణములను న్యాయస్థానాధికారి స్పష్టముగా వ్రాయవలెను. 1898 క్రిమినలు ప్రొసీజరుకోడ్ (5_1898) 250 సెక్షను ప్రకారము ఫిర్యాదీ ముద్దాయికి నష్టపరిహారము నియ్యవలెనని న్యాయస్థానాధిపతి ఆజ్ఞాపించవలసిన అవసరము విచారణానంతరము కలుగవచ్చును గాన అందులకుహామీగా 100 రూపాయులకు మించని మొత్తమునకు ఫిర్యాదీ యొకడేగాని లేక జామీనుదారులలో గూడగాని పూచీకత్తును వ్రాసి యియ్యవలెనని ఆజ్ఞాపించవలెను. న్యాయస్థానాధికారి అందుల కేర్పరచిన యుచితమగు గడువులలోపల ఫిర్యాదీ అట్టి ధరావతులు యియ్యనిచో ఆఫిర్యాదును కొట్టివేయవలెను.

2. ఈ సెక్షను ప్రకారము పుచ్చుకొనబడిన పూచీకత్తు 1898 క్రిమినలు ప్రొసీజరు కోడు (5_1898) క్రింద పుచ్చుకొనబడిన పూచీకత్తుగానే భావింపబడవలెనుగాన ఆకోడు 42 వ ప్రకరణము ఆరీతిగా దీనికిగూడ వర్తింపవలెను.

24_10_'29

ఎల్. గ్రాహాము,

ఇండియా ప్రభుత్వ కార్యదర్శి.

———·o·———

# దేశారిష్టము.

గీ॥ ధర్మ మడుగంటు సత్యంబు తరలిపోవు మతవిచక్షణ లంతమౌ;-మతులు విఱుగు
సతులు పతులను దూషింత్రు;-చావుకలుగు విషయసుఖ మబ్బు శారదా-బిల్లువలన.

గీ॥ వేదముల్ జీవకళలతో వెలయుచున్న స్మృతు లసత్యవచనముల్ వచింపకున్న
దైవ మొకడుండె ననుటలోఁ దథ్యమున్న శారదాబిల్లు యమపురిఁ జేరఁగాక.

——:o:——

# శారదాశాసన ఫలితములు.

సీ॥ ప్రౌఢలౌ లోకానుభవశూన్యలేగాని
కన్య లీరేడేండ్లు గడచినంత
సతులౌ ప్రియాన్వేషసక్తచిత్తలెగాని
కన్య లీరేడేండ్లు గడచినంత
ససయలౌ స్మరతప్తచపలాత్మలేగాని
కన్య లీరేడేండ్లు గడచినంత
భ్రష్టలౌ శాస్త్రదూష్యవృషలులేగాని
కన్య లీరేడేండ్లు గడచినంత.

గీ॥ స్త్రీలు స్వాయముగాఁ బతుల వరింతు రేని బాహ్యావేశములకుఁజిక్కి బాధపడెదు
వారలై చెడుదు రేగాని బాలికావివాహమునఁబోలె సుపతులఁ బడయఁగలరె?

సీ॥ బాల్యవివాహాలు పసికిరావనియంట
వృద్ధావివాహాలవృద్ధికొఱకె
బాలరండలసంఖ్య పలుచనయ్యెననంట
యవివాహితలయతివ్యాప్తికొఱకె
బాల్యసంతానముల్ ప్రాప్తింపవనియంట
ముదిమికాన్పులముప్పు లొదవుకొఱకె
జననీజనకు లాత్మజాద్రోహు లనియంట
స్వాత్మవంచకలు స్త్రీ లగుటకొఱకె.

గీ॥ అకట! సంఘసంస్కారనామకుల కెల్ల సమ్మతంబైన శారదాశాసనమున
స్త్రీలుపురుషులు నేకమై తిరిగిమతులు చెఱుచుకొనుటె కాకందున సేమమగునె?

# సంఘసంస్కారులు—రిఫార్మరులు.

—————:o:—————

సీ॥ వేదమే తప్ప యాచారింప మింక ధర్మ
శాస్త్రివాక్యము లంచుఁ జాటువారు
పుట్టినట్టి మొగంబ్రదోశ్ళ ధర్మములెల్ల
పత్రికలకా జెడక బరచువారు
గోవులు గోడిగల్ గొఱ్ఱెలుకా బఱ్ఱెలు
కుక్కలుఁ సమమంచుఁ గూయువారు
స్వారాజ్యమును మేము సాధింతు మని చెప్పి
యున్నరాజ్యం బూడ్చుకొన్నవారు
కన్యలచే నాటు గనిపించి యామీఁదఁ
బెండ్లిసేయంగఁ జూచుపెద్దవారు
ముండమోపుల మొగంబున నున్న తెలిబూది
తొలఁగించి కుంకుమం బలదువారు
మోసంబుచే నోట్లు నాసక్తిగొని ధర్మ
నిర్మూలనమునకై నెగడువారు
సంఘసంస్కారప్రసక్తిచే దేశంబు
పాడొనర్చ మదంబు పడయువారు
అక్కకు నమ్మకు నత్తకు నాలికి
భేద మేమి యటంచుఁ బ్రేలువారు
దొంగ కేనాప్పు పాయెన పేర్వచ్చిన
నంతె చాలు నటంచు నడరువారు.

తే॥ ఈరిఫార్మరు లొనరించుకృత్యములను గ్రమముగాఁ జెప్పఁదలఁచినగ్రంథ మొక్క
టగును గావున నింతతో నలయఁడయ్యె పాదములు సీసమున కిట్టె పదియాఱు నయ్యె.

———

# భారతీయోద్బోధక జాతీయగీతము.

(మిశ్రభాషాసంకలితము - భావకవిత్వోపేతము)

మాకొద్దు భారతస్వరాజ్యం - అయ్యా మాకొద్దు భారతస్వరాజ్యం
ఈ చల్లని బ్రిటిషుప్రభుత్వ మెల్లకాల మేలువలె ॥మాకొద్దు॥

౧ శారదాబిల్లువలన చెడిపోయె పెండ్లిరీతి
గౌరుగారి బిల్లువలన గర్భాధానం సాకరమాయె ॥ మా ॥

౨ సాంఘికస్వరాజ్యమెల్ల సర్కారువారి చేతబెట్టి
పొలిటికల్ స్వరాజ్య మీ బోడిగుండు నేలగలవా ॥ మా ॥

౩ వివిధమైన కట్టులచే పెరిగిపోయె కోర్టులు
విదేశీయులు దండెత్తి వీరిచేత మనేమవ్రను ॥ మా ॥

౪ మాలమాదిగవారికి మహమ్మదీయ మతస్థులకును
ప్రత్యేక స్కూళ్ళుబెట్టి పాలింపుచుండిరి దొరలు ॥ మా ॥

౫ మాలమాదిగెల దెచ్చి మాగుళ్ళలో దూర్చి
వారికి మాకు లడాయిబెట్టి వంత కలుగజేయసాగిరి ॥ మా ॥

౬ మాలమాదిగెలయందు మరి వీరికి దయయుంటె
ప్రత్యేకగుళ్ళుగట్టి భక్తిపరుల జేయరాదా ॥ మా ॥

౭ పొలిటికల్ కష్టములు బోదోల మావోట్లుగొని
సాంఘికములో వానిదూర్చి చావగొట్టిరి మమ్ము ॥ మా ॥

౮ స్వరాజ్యపార్టీ చైర్మన్లు స్వరాజ్యపార్టీ కౌన్సిలర్లు
విదేశలారీలు దేగ వీరిమనసులెట్టులొప్పె ॥ మా ॥

౯ పిక్కింగు రోలింగు బీదకూలీలు జేయ
వారినోట మట్టిగొట్టి స్టీం రోలర్ల దెచ్చిరి ॥ మా ॥

౧౦ ఎద్దు దున్నపోతుబండ్లు మున్సిపల్ చెత్త (పెంట) తీసివేయ
అమెరికా లారీలు దెచ్చి అణగద్రొక్కిరి మమ్ము ॥ మా ॥

౧౧. మొకెవరు తీసివేసిన లోకల్ఫండు టోలుగేట్లు
మళ్ళీ ఓపెన్ చేసి మాదుంప దెంచారు ॥ మా ॥

౧౨ యిరిగేషన్ బిల్లువలన యెన్నోకష్టములు గలవు

౧౩ శెట్టితీర్పుల శాసనంబు మట్టుపెట్టె మాకొంపలు
వానినాప చేతగాదు డైవోర్స్ బిల్లుదప్ప ॥ మా ॥
౧౪ అగ్రహారాల్ మాన్యాలు అందరమ్ముకొనుచుండ
దేవాదాయం బిల్లుబెట్టి త్రెంపిరి అర్చకుల త్రాడు ॥ మా ॥
౧౫ పంచదారజేయు ఫ్యాక్టరి బందరులో పాడాయె
తాడేపల్లి బట్టలమిల్లు దానిపలెనె చెడనున్నది ॥ మా ॥
౧౬ కర్నాటిక్ పేపరుమిల్లు కొనయూపిరితోడనుండే
దుర్గా కళాశాల ముంపద్రెంచె పరిజలసొమ్ము ॥ మా ॥
౧౭ కృష్ణజిల్లాబోర్డు పదవికి బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు
గుంటూరు జిల్లాబోర్డుపదవికి నాయుడు చౌదర్లపోరు ॥ మా ॥
౧౮ బాపట్ల రేపల్లె గుడివాడ తెనాలి
చౌదర్లు చౌదర్లు తగవులాడుకొనసాగిరి ॥ మా ॥
౧౯ ఇంగ్లండు కితూలపోరు కాకులపోరు కలసితిందురు
ఇండియా పార్టీలపోరు కుక్కలు జింపిన విస్తరాయె ॥ మా ॥
౨౦ సంఘసంస్కారాదులు గాంధీ శారదాబిల్లొకటిబెట్టి
పూర్వాచార పరాయణుల పూన్కితో నణగద్రొక్కిరి ॥ మా ॥
౨౧ గారుగారు గర్భాధానం డైవోర్స్ బిల్లు బెట్టి
భార్యాభర్తల శాశ్వతబంధం పాడుజేయదలచెగద ॥ మా ॥
౨౨ ప్రభుత్వంవారు తీసివేసిన సారాకల్లు దుకాణములవద్ద
పరిచారంచేయపిల్చిన రారు ఫిర్కాజిల్లాకాంగ్రెసువాదులు ॥ మా
౨౩ జూన్ నెలలో నీరిచ్చి జనేవరు నెలలో పన్నడిగి
న్యాయప్రభుత్వ విధిని నెగడుచుండిరి దొరలు ॥ మా ॥
౨౪ గవర్నమెంటువారితప్పు కాసంతయైన జూపుడి
సెల్ఫుగవర్నమెంటువలన చెడ్డకష్టము లొందుచుంటిమి ॥ మా ॥
౨౫ సైమన్ గారి సంస్కరణలలో శాసనాధికారమునకు
పూర్వాచార పరాయణుల పూన్కితోడ నిలబెట్టుడి ॥ మా ॥
౨౬ మాగ్డొనాల్డు గూర్చునట్టి రౌండుటేబిల్ సమావేశములో
పొందుగ మాఫీశాధిపతుల బోధవినుట జరుగనిదె ॥ మా ॥
౨౭ మండ చిన్న వెంకయాఖ్య మనుజు డీగీతంబు వ్రాసె

# శారదాస్మృతి

## "హిందూమత పరీక్ష"

మహాశయులారా! ఆర్యమత ధర్మాభిమానులారా,

నేటికి మీ మతధర్మాభిమానమునకు పరీక్షాసమయ మేతెంచినది. పూర్వము "ప్రాటికాయతిందువా, తలగొట్టుపడుదువా", యను సామెత యుండెడిది. "ఇపుడు గరళభక్షణముం జేతువా, కారాగార స్థితిక్షణ మునొందుదువా" యని యుదయించినది. బుద్ధిపూర్వకముగ వోటింగు ఆఫీసులకు వెళ్ళి వెనుకముందు లాలోచింపక, వ్యక్తిత త్త్వముల విమర్శింపక "దున్న యీనినదన్న దూడను కట్టుమన్న" వాని వలె పన్నులు మొదలగువాటిలో నున్న దుర్భరావస్థం బాపెదరను వెర్రి విశ్వాసముతో వారి కపటనాటక ప్రదర్శనమున మోహము జెంది తమకుత్తుకలను నుత్తరించెడు వోట్లనెడి సూరకత్తులను వోటింగుపెట్టెలలో నర్పించి తమకు వధ్యస్థానములగు శాసనసభాభవనములకు స్వహింసకుల బంపినదానికి ఫలమిప్పుడు పాప్తించినదికదా! "ప్రారబ్ధ కర్మణాం భోగాదేవ క్షయ" అనునట్లు యెవరుచేసిన కర్మలకు వారే ఫలమనుభవింపక మరియొకరనుభవింతురా — కాబట్టి (సహసా విదధీత న క్రియాం) అను నీతిందోసిపుచ్చి యనాలోచితముగా—ప్రవర్తించి ఛాందసత్వపు బిరుదమును సార్థకపరచుకొనిన మనమిపు డద్దాని ఫలమనుభవింపవలసి వచ్చినది. పంచతంత్రి పరిశీలనమైననూ లేని మనమిపుడు వాపోయిన నేమిప్రయోజనము. సృష్ట్యాదినుండియు గడుశాఖోపశాఖలతో బెరిగి భారతవర్షమునంతను వ్యాపించిన హిందూమత మహాకల్పవృక్షమునందు వార్ధకవశంబున నేర్పడిన జిన్నికోటరముం గనుపెట్టి కలిపురుషు డైదువేలవత్సరములకు బూర్వముననే యందు సంఘసంస్కరణ విషవృక్ష బీజమును నాటియుంచెను. అయ్యది

లతో బెరిగినది. రానురానిప్పటికది పుష్పించి ఫలించినది. కాని యనంత శాఖలతో దేశమునంత నావరించియున్న యాకల్పవృక్షమునే మనవారు చూచుకొని యానందించినారు. కాని యందలి కోటరమున బయలుదేరిన యీముషిణిచెట్టును పెకలించుట కేరును యత్నించరైరి. ఇయ్యది క్రిమముగ దన విషవాయువుల వ్యాపింపజేసి దేశము నందలి జనులను మోహింపజేయుచు నిప్పటికి ఫలితావస్థకువచ్చి యీ కల్పవృక్షమును నిర్మూలింపజేయుస్థితికి వచ్చినది. ఇపుడు కొందరు కనుగొనిరి. ఇప్పటికిగూడ దీనింగనుంగొననివారును గలరు. ఇట్టిస్థితిలో గోళ్ళకుబోవు కాలముగడచుటయేగాక గొడ్డళ్ళకుగూడ బోవునా లేదా యను విషమస్థితి చేకూరినది. ఇప్పుడైనను సకలఫలాకరమగు హిందూమత కల్పవృక్షము నాధారపరచుకొన నిచ్ఛగించు ప్రతిభారతీ యుడును సిమ్లాశాసనసభాభవనములనుండి శాసనసభ్యులచే బంపబడిన వివాహ గర్భాధానశాసనవిషవాయువులనుండి క్రుంగటి వ్రేళ్ళతో గూడ గూలిపోవ సమకట్టియున్నయీ కల్పవృక్షమును పవిత్ర్యాస్త్ర ప్రయో గములచే విషవాయువుల హరింపజేసి యందు విజృంభించిన యీవిష వృక్షమును క్రుంగటివేరుతో నిర్మూలించుటకు యత్నించకపోయిన చో వెంటనే యధఃపతనము తప్పదు. ఈవిషవృక్షమునకు క్రుంగటి వేరు స్వేచ్ఛాచారము. హిందూమత కల్పవృక్షమునకు స్త్రీ వివా హమే క్రుంగటివేరు. ఈ స్త్రీవివాహధర్మ మెపుడు భ్రష్టమగునో యపుడే హిందూమత ధర్మములన్నియు భ్రష్టములగును.

శ్లో॥ అనిందితైః స్త్రీవివాహై। రనింద్యా భవతి ప్రజా సందితై ర్నిందితా నౄణాం తస్మా న్నింద్యా న్వివర్జయేత్॥ కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేనచ।కులాన్యకులతాం యాంతి బ్రాహ్మ ణాతిక్రమేణచ॥ యథాయుక్తో వివాహ స్తథా యుక్తా ప్రజా భవతి) ఇత్యాది వచనములచే మన్వాపస్తంబాదులు నింద్య వివాహములచే

నింద్యసంతానము కల్గి కులభ్రష్టులగుదురని వేనోళ్ళ చాటుచు న్నారు. రజస్వలావివాహము విధవావివాహము మున్నగు దుర్వివాహములు జాతి కుల మత భ్రంశకములగుచు సర్వ హిందూ ధర్మ నిర్మూలకములనుటలో మతాంతర దుర్వాసనా వాసితులుకాని యార్యమతస్థులకు సంశయమించుకంతయు నుండదు. సంప్రదాయ శుద్ధముగ శాస్త్రముల నభ్యసించిన యేపండితుడు కాని సర్వస్మృతి నిషిద్ధములై జాతిమత భ్రంశాపాదకములగు రజస్వలావివాహ విధవా వివాహములను శాస్త్రసమ్మతములని చెప్ప సాహసించడు. పొట్టకూటికై విపరీతవాసనా వాసితులగు వారి నాశ్రయించి వారి యనుగ్రహమే సర్వేశ్వరానుగ్రహముగ భావించి వారు మెప్పునొందుటకై తనకుగల యల్ప సంస్కృత భాషాజ్ఞానమే సర్వపరిజ్ఞానమునుగా నటించి యపార్థ కల్పనలతో వారి నానందపరచుచు బ్రతుకుపండితాభాసులు రజస్వలా వివాహాదికములు శాస్త్రసమ్మతములని చెప్పవచ్చును. "జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి" అనునట్టిపుడట్టి జ్ఞానలవదుర్విదగ్ధులకు సమాధాన మివ్వవలసినపనిలేదు. శాస్త్రీయ పరిభాషాజ్ఞానమే లేనివారితో శాస్త్రీయ వాదమునకు గడంగుట గొప్ప తప్పు. బ్రాహ్మణబాలిక వివాహము లేక రజస్వలయైనచో దానినింట నుండి వెంటనే వెడలగొట్టి విడుచుటయే ప్రాయశ్చిత్తము. కాని వేరు ప్రాయశ్చిత్తములతో వివాహమును దానికి శాస్త్రకారులంగీకరింప లేదు. క్షత్రియబాలికకు స్వయం వరాదులున్న కాలమునను రజస్వల కాకమున్నే స్వయంవరాదిపూర్వక వి వా హ ము శాస్త్ర సమ్మతము. అట్లు వివాహము కాకపూర్వము రజస్వలయైనచో మూడు సంవత్సరములలోగా దండ్రి యామెకు వివాహము జేయవచ్చును. అట్టి రజస్వల యగు బాలికను వివాహము చేయవలసివచ్చినపుడు తండ్రియు నాకన్యకయు దాని వివాహమాడు వరుడును వేర్వేరుగ

ప్రాయశ్చిత్తములఁ జేసికొని యనంతరమున వివాహము చేయవచ్చును. ఇది రజస్వల కాకపూర్వము గొప్పవిపత్తులవలన జేయు నేరని తండ్రి కాపద్ధర్మము. ఇచ్చట నాపత్తులనగ దేశోపద్రవము. శత్రుసైన్యములచే దేశమాక్రమింపబడుట మొదలగు శాస్త్రోక్తములే గాని వ్యాజములు. ఇట్టి యాపత్తులయం దాయా ప్రాయశ్చిత్తములం జేసి క్షత్రియుఁడు మూఁడుసంవత్సరములలోపల వివాహముం జేయవచ్చును. మూఁడు సంవత్సరములు దాటినచో నా కన్యకయందు తండ్రికిహక్కు తొలగిపోవును. పిమ్మట నాల్గవసంవత్సరము దాటకుండ నాకన్య తనకు సజాతీయుఁడును మంచిగుణములు కలవాఁడునగు వరుని వరించి వివాహమాడితీరవలయును. ఇది కన్య కాపద్ధర్మము. ఇది "ఇచ్ఛయాన్యోన్య సంయోగః" ఇత్యాది వచనబోధిత స్వయంవరమునకు కాలము. తండ్రి యనుజ్ఞచే జేయబడు సుప్రసిద్ధ స్వయంవరమునకు రజస్వల కాకపూర్వమే కాలము. ఇదంతయు రాక్షసస్వయంవర వివాహములు కల పూర్వకాలమునందు క్షత్రియులకు విధింపబడినది. ఇప్పుడట్టి వివాహములు క్షత్రియులలో నెచటను గాన్పించుటలేదు. ప్రాజాపత్య వివాహములే జరుగుచున్నవి. వాటికి రజస్వలకాకమున్నె కాలము. పైన వ్రాసిన యాపత్తులు కూడ యిపుడు లేవు. అట్లు తటస్థించినపుడు శాస్త్రోక్తప్రాయశ్చిత్తములతో చేయవలయును. కావున నిప్పటి క్షత్రియులకుగూడ రజస్వలా వివాహము మంచిదికాదు. ఇది వైశ్యులకు బ్రాహ్మణులకువలెనే స్వయంవరాధికారములులేకపోవుట వలనను నేటివర కేయుగమునందైన నత్యంతాపద్ధర్మముగనైన ప్రాయశ్చిత్తపూర్వకముగ నాచరింపబడకపోవుటవలనను సర్వస్మృతి నిషిద్ధమగు రజస్వలావివాహము వారికిగూడ జాతిమతభ్రంశకమే యగును. ఈ విషయమునే "స్వయంవరః క్షత్రియాణా మితీయం ప్రథితా శ్రుతిః" అని క్షత్రియులకే స్వయంవరాధికారము గాని యితరులకు లేదను

మహాభారత ద్రౌపదీస్వయంవర పర్వ వచనముచే నిరూపింపబడినది. శూ
ద్రులకు గూడ భ్రూణహత్యాదోషాపాదకమగుటచే రజస్వలావివాహ
ము న్యాయము కాదు. ఈ విషయములన్నియు మావ్రజదర్పణమున
సపరిష్కారముగ విస్తరించి నిరూపింపబడినవి. ఇపుడు మనకట్టిశాస్త్రి
వాదములతో బనిలేదు. ముట్టుదాని పెండ్లియు విధవపెండ్లియు తప్పని
యార్యజాతీయులగు నాడువారు మొదలు పెద్దపండితుల వరకూ నెవ
రికి తెలియును. ఇట్లాబాలగోపాలముగ నార్యజాతికంతకును తెలిసిన
విషయమున శాస్త్రవాదము లెందులకు. విదేశీయ వేష భాషాలంకృతులై
విదేశీయకర్మమోహితులై స్వచ్ఛందచారప్రవృత్తులగు విపరీతవాసనా
వాసితుల మరలించుట కెప్పుడైన నివి యుపయోగించునా. "పిత్తేన
దూనే రసనే సితాపి తిక్తాయతే" యనునట్లు పైత్యపు నాలుకవానికి
పంచదార చెగటగును. ఆపైత్యము దిగినగాని దాని తీపి యెట్లు
తెలియును.? ఆపైత్యమిపుడు కొంతకాలమువరకును దిగదు. కమిటీ
రిపోర్టుతో గూడ శారదాస్మృతి పూర్తిగ నమలునకు వచ్చి యిదివర
కుపయోగింపబడుచున్న సంఘసంస్కార మాత్మసంస్కారమునకే
ప్రవర్తించి బహుసంఖ్యాకులుగ వ్యాసకర్ణాదులుదయించి వివాహ
ములు రిజష్టరీ కావడమే కష్టసాధ్యమై సంవత్సరమునకు రెండు
మూడుసార్లు రిజష్టరీకావలసినట్లేర్పడుట తటస్థించి వివాహ నిర్మూలన
శాసనపు బిల్లునే యెపుడు ప్రవేశపెట్టవలసివచ్చునో యట్టులనే తన
కుమారితను డాక్టరువద్దకు తీసుకొనివెళ్ళి గర్భాధానార్హురాలినిగా
డాక్టరుగారిచే సర్టిఫైపొందించుటలో తన సర్వస్వహారణమైనపుడును
కొలదిగ నాపైత్యము దిగిన దిగవచ్చును. అపుడుకూడ ప్రభుత్వము
వారి సహాయముననో ప్రజలకండ్లలో దుమ్ముగొట్టి యార్జించిన ద్రవ్య
ముననో వారొకవేళ పైకి తమ కష్టముల బాపుకొన్నట్లు నటించినను
ప్రజాసామాన్యముయొక్క గతి యెట్టిదగునో యెవరు చెప్పగలరు.

నూటికి తొంబదియేనుగురు రజస్వలా వివాహములనే చేయుచున్నా రని. వీరు లెక్క చెప్పుచున్నారుగదా? ఈ రజస్వలా వివాహములంజేసి కొన్నవారికి పుట్టిన సంతానమంతయు బలిష్ఠముగానుండి యుద్ధవీరులు గానున్నవు డీముగ్గురుమాత్రమే బలహీనులుగానున్న దేశమున కేకొందువ మూడినదో తెలియదు. వీరు చెప్పు శిశుమరణ సాంఖ్యయం తయు బ్రాహ్మణ వైశ్యులలోనే కలదా? అట్లు చూపించగలరా? చూ పించిరా? 14 వత్సరములు దాటినపిమ్మట వివాహముం జేసిన దాని భర్తను పోకుండ నాపగలుగుదురా? 8 వత్సరముల పిల్లలకు వివాహ ములంజేసిన వారిభర్తలందరును పోవుచున్నారా? పోయిరా? ఈసభ్యులం దరి తల్లులును రజస్వల లయిన పిమ్మటనే వివాహితలయిరా? అందు వలననే వీరింతబుద్ధి దేహదార్ఢ్యములంగల్గి ధర్మనిర్ణాయకులు కాగల్గిరా? ఇష్టమున్న సహగమనము చేయవచ్చును. లేకున్న యావజ్జీవ బ్రహ్మచర్యతో నుండవచ్చునను సహగమన విధిని సర్వధర్మ నిర్మూలకమై జాతిమతాధఃపాతసంపాదకమగు రజస్వలా వివాహమునకు దృష్టాంతముగ నిచ్చి శ్రీప్రభుత్వమువారిని మోస పుచ్చుట తగునా. పానుగల్లు ప్రభుత్వము దేవోత్సవ విధ్వంసనముం గావించినట్లే శారదాగారి ప్రభుత్వము వివాహగర్భాధాన ధర్మవిధ్వం సకమైనది. వర్షము కురిసినవెంటనే క్షేత్రమునందు విత్తనముల జల్ల కూడదనియు 6 మాసములు యెండగట్టిన బలిష్ఠమగును గనుక నంత వరకాపియుంచమనియు గూడ వీరు ముందుశాసింతురనుటలో నాశ్చర్య ములేదు. ఇక గొలదిరోజులలో విధవావివాహ నిర్బంధన శాసనము గూడ ప్రవేశపెట్టబడును. కావున నాశాసన మిపుడున్న విధవలకందర కును వర్తింపజేయబడును. అందుచే నిపుడున్న విధవరాండ్రిందరు వయస్సుతో నిమిత్తములేక వివాహమునకు సంసిద్ధులు కావలసియు న్నారు. ఇన్నిశాసనములంజేసి దేశమునుద్ధరింప బాటుబడు వీరికి వివాహనిర్మూలన శాసనమునే ప్రవేశబెట్టు బుద్ధి యేల యుదయించ

లేదో గానరాకున్నది. వేశ్యలకువలెనే యొకడు భర్తయను నియమము లేకున్నచో సర్వస్వతంత్రితతో విధవాశబ్దము నొందక యర్థకామముల ననుభవింతురే—ఇదికూడ కొలదికాలముననే రావచ్చును. కాని మతవిషయమున నెంతమాత్రమును జోక్యమును కల్గించుకొనమని యభయహస్తమిచ్చి చల్లని ధర్మప్రభుత్వమని విఖ్యాతిజెందిన శ్రీప్రభుత్వమువారి తరపున క్రేరాయిగారు (ఈబిల్లును ప్రభుత్వమువారు మనస్ఫూర్తిగా నామోదించెదరు. సమర్థించెదరు) అని చర్చకు పూర్వమే చెప్పుటమాత్రము మిక్కిలి యాశ్చర్యకరము. రాజభక్తి పరాయణులై యెట్టి రాజకీయమునందును జోక్యమును కలుగజేసికొనక స్వధర్మానుష్ఠాన తత్పరులగు బ్రాహ్మణాదుల జాతిమత ధర్మముల నిర్మూలించు హిందూమత ధర్మద్వేషులగు సంస్కర్తల దుష్టశాసనమునకు ప్రభుత్వము వారనుమతినిచ్చుట వారి కపటవాక్యములకు మోహితులగుట పెరి దుర్గతియని చెప్పవలసినందులకు జింతిల్లుచున్నాము. నిష్కారణముగ ప్రజాసామాన్యముయొక్క శాశ్వత మత ధర్మముల నిర్మూలించుట వివేకవంతులగు ప్రభుత్వమువారికి న్యాయమైయుండదు. కమిటీవారు ప్రజాసామాన్యముయొక్క యభిప్రాయమును తెలిసికొనలేదు. ఈ శారదాబిల్లు సందర్భమున ప్రజాసామాన్యములో వేయికొకడును గూడ నామోదించినవారు లేరు. పల్లెటూరి ప్రజల నసలే కనుగొనలేదు. పట్టణములయందైనను రిఫార్మర్లవలననే సాక్ష్యము లధికముగ దీసికొనబడినవి. ప్రభుత్వమువారు జనాభా లెఖ్ఖల మాదిరిని ప్రతిగ్రామమునందును ప్రజల యభిప్రాయమును తెలిసికొనిన నీతత్వము తేటపడియుండును. అట్లు చేయలేదు. హిందూధర్మశాస్త్ర పండితుల యొక్కగాని ధర్మాచార్య పీఠాధిపతుల యొక్కగాని యభిప్రాయములను కమిటీవారు పాటించలేదు. ఇట్టిస్థితిలో జాతి మత భ్రంశకమగు నీబిల్లు నామోదించి యాచరించువారు యిదివరలో రజస్వలావివాహా

ములంగూడ జేయుచున్న తెగలవారామోదింతురేమో? కాని యితర జాతీయులగు బ్రాహ్మణ వైశ్యాదులలో రిఫార్మర్లుగాక తక్కినవారు ప్రాణత్యాగమునైన జేతురుగాని యీబిల్లు ప్రకారమాచరించి జాతి మతభ్రష్టులగుట కిచ్ఛగింపరు. కాంగ్రెస్ నం నుండి స్వరాజ్యవాదులలో చేరి యాందోళనముం జేయువారుకూడా యింగ్లీషు భాషావాసన గల్గి రిఫార్మర్లుగా నుండువారే సాధారణముగానున్నారు. పూర్వాచార పరాయణులగు వారెట్టి రాజకీయమునను ప్రవేశించరు. వీరు రాజభక్తి పరాయణులు. సంస్కర్తల మోసపు వాక్యములవలన యువివేకులగు గొందరత్యల్ప సంఖ్యాకులు శారదాబిల్లు నామోదించినట్లు వ్రాసిన మాదిరిని గాంధిగారు మున్నగు స్వరాజ్యవాదుల మోసపు వాక్యములకు మొదట నత్యల్ప సంఖ్యాకులు కాంగ్రెసు సంఘములయందు జేరిననూ అస్పృశ్యతా నివారణాది ధర్మబాహ్యముల ప్రసక్తివచ్చిన తోడనే యాటనుండి తొలగిరి. ఇపుడు కాంగ్రెసు సంఘములయందు పూర్వాచారపరాయణులెవ్వరును లేరు. వీరికి కాంగ్రెసుతో సంబంధమెంతమాత్రమును లేదు. ఇట్టిస్థితిలో ప్రభుత్వమువారు వీరిమొరల నాలకించకపోవుట విషాదకరము. ఏవిధముచేతనైననూ హిందూమతమునకిపుడు పరీక్షాకాల మేతెంచినది. న్యాయమగు హిందూమతము నవలంబించినవారు కలరో లేరో — తెలియవలసియున్నది. ఆర్యమహాశయులారా! సనాతన ధర్మపరాయణులారా! నేటికైనను సంఘ సంస్కరణ స్వరూపము గోచరించినదా. గాంధి మున్నగు దేశోద్ధారకుల దేశోద్ధరణము గోచరించినదా! శాసన సభ్యులార్థికాంశమున నిసుమంతయు నుపకారమును చేయలేకపోవుటయేకాక కాస కార్డు నర్ధణాకును, కవరణావరకును తెచ్చి ఈరీతిగనున్న గోడింగూడజెడగొట్టిరి కదా. దేవాదాయధర్మాదాయముల బిల్లు దేవదాసీబిల్లు వగైరాలచే దేవాదాయ ధర్మాదాయములను దేవోత్సవములను యేస్థితికిం దెచ్చిరో చివరకు వర్ణాశ్రమ ధర్మముల నీ శారదాబిల్లుచే నెట్లునిర్మూలించి మనల జాతిమత భ్రష్టులంజేయ సాహసించిరో కనులదెరచి యిపుడైనను జూడుడు.

స్వరాజ్యవాదులగు దేశోద్ధారకులు స్వాతంత్ర్య సంపాదకులు నిర్బంధవిధానమును పశుబలమని నిరసించుచున్న నాయకశేఖరులు శారదాబిల్లు నామోదింపజేయుటలో నెంత వారిశక్తి నుపయోగించిరో యెన్ని వేల పల్లెగ్రామముల నొప్పించిరో స్వాభిప్రాయముల నెట్టులవెలిబుచ్చినారో విమర్శించుకొనుడు. ఇట్టివారే ముందు స్వరాజ్యమును సంపాదించి యజ్ఞోపవీతమును ధరించినవారికి జైలును విధించు ప్రభువులయ్యెదరు. సంఘసంస్కరణమారకద్రవ్య మెవనితలకెక్కెనో వాని సంబంధమును విడుచుకొని మీకుగల రాజభక్తిని శ్రీవారికి వెల్లడించుకొని మీరొక ప్రత్యేకసంఘముగ జేరి, రాజకీయమునగూడ నెట్టిసంస్కరణములతోను నిమిత్తములేకుండ శ్రీ శ్రీ శ్రీ విక్టోరియా మహారాజ్ఞి ప్రభుత్వ పద్ధతినే గోరి ధర్మమార్గమున బాలింపబడుచు బూర్వసుఖమునొందుటయే శ్రేయస్కరము. కాని యన్యమార్గము శ్రేయస్కరముకాదని మాయభిప్రాయము. ఈసంఘసంస్కర్తలు ధర్మశాస్త్రవిరుద్ధములగు నార్స్వత్వపుబిల్లుల ననేకముల బ్రవేశపెట్టుచున్నారు. ప్రస్తుతము స్టేటుకౌన్సిలువారిచేగూడ నామోదింపబడిన శారదాబిల్లు హిందూమతస్థులగు బ్రాహ్మణాది జాతీయులకు పైనవివరించిన ప్రకారము శాస్త్రవిరుద్ధమగుటచే పూర్వాచార పరాయణులగు వారికిది గరళప్రాయము. ఆబిల్లుప్రకారము రజస్వలా వివాహములం జేసినచో మనజాతి మతధర్మములకు మరణము తప్పదు. అట్లుచేయనిచో మనభౌతిక శరీరములకు కారాగృహవాసశిక్షణము తప్పదు. ఇందులోనెద్దియైననూ మన కసహ్యమే. కాని శ్రీ శ్రీ శ్రీ గవర్నరుజనరలు గారు దీనివీటో చేయనిచో యేదియో యొకటి తప్పదు. లేదా—సంతాననిరోధ కౌషధమును సేకరించి సృష్టి నాపివేయవలసివచ్చును. ఇప్పుడున్నవారిని విడచి యరణ్యములకు బోయి తపంబొనర్చి యీ సంతతివలన బరలోకమును నాశించక ప్రకృతముననున్నవారు తరించవచ్చును. ముందు దేశమంతయు గానీనులచే వ్యాపింపబడి యభివృద్ధి చెందును. ఇందులకు కర్తవ్యమును నాయకులాలోచించి వెంటనే నిరూపింతురుగాక... ఏవిధముచేతనైనను హిందూమతమునకిపుడు పరీ

ప్రాకాల మే తెంచినది. న్యాయమును హిందూమతము నవలంబించిన వారు కలరో లేరో తెలియవలసియున్నది.— అట్టివారెందరు కలరో శాసనోల్లంఘన విధిచే లోకమునకు జాటుదురుగాక. అసువులు మేన నున్నంతవరకును జాతిమతధర్మముల విడువకుందురుగాక.— బ్రహ్మాదండ మును స్థాపింతురుగాక. సత్యాగ్రహు లగుదురుగాక —

:0:

“ కర్నూలు మండల వర్ణాశ్రమ ధర్మరక్షక మహాసభా ”

శ్లో॥ రాక్షసాః కలి మాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు
బ్రాహ్మణానేవ బాధంతే తత్రాపి శ్రోత్రియాన్కృశాన్ ॥

సనాతనధర్మావలంబినః! ఆస్తికమహాశయాః ?
సావధానా భవంత్వస్మదీయవిజ్ఞాపనాసమాకర్ణనే.

సాంప్రతం॥ కలిబలాపాదేషన హీనసర్వవర్ణాః స్వస్వవర్ణోచితధర్మా నతిలంఘ్య ప్రవర్తంతే. తత్రాపి కేచన శ్రౌతస్మార్తధర్మవిరుద్ధం ప్రౌఢావివాహాదికం లోకకల్యాణ సంధాయకమితి మన్యమానాః తదేవ శాసనరూపేణ పర్యవసన్నం చేత్ లోకస్య మహా నుపకారో భవేదితి సామ్రాజ్యశాసనసదసి శాసనరూపతయా పరిణమయితుం ప్రావేశయన్. అంగీకృతంచ తత్రత్యాపార్షదై శ్శాసనితం. తదేతత్సనాతనధర్మావలంబినాం శ్రోత్రియాణా మన్యేషాం చాతీవ స్వధర్మహానిర్మాలక మభూత్. తస్మా దేతాదృశానర్థక పరిహారాయ శాస్త్రసమ్మత స్వస్వధర్మరక్షణార్థం కర్నూలునగరవాస్తవ్యై రాస్తిక మహాజనై రేకా “మండల వర్ణాశ్రమ ధర్మరక్షకమహాసభా ” నిర్మితా. తత్ర ప్రతిభానువాసరం సనాతనధర్మరక్షణోపాయాః సమ్యగ్వివిత్య పండితై ర్నిర్ణీయంతే. లోకోపకారార్థం ప్రకటీక్రియంతే చ. ఏతత్సభామేళన పత్రికాదివిలేఖన పత్రికాముద్రణార్థ మత్రత్యాః ధార్మికాః పరోపకారధురీణాః యథాశక్తి ద్రవ్యసహాయ మకార్షన్ ॥ ...

ఏవం. పుల్లాపంతుల రామచంద్రః
కార్యదర్శీ.

శా॥ అంబా? నీదయ కంతులేదుగద? ప్రత్యక్షంబుగా రాత్రి స్వ
ప్నంబందుఁ బొడకట్టి, తేదియు శుభావాప్తిఁ భవన్మూర్తి దృ
ష్టంబై తెల్పుట నిక్క, మయ్యది సుతజ్వాసామయోచ్ఛిత్తి క
న్యంబై యుండదు, నాదునిశ్చయము తథ్యంబౌతఁ గామేశ్వరీ॥

మ॥ పడుగుఁ జేయఁగవీలులే దనినమూవానిఁ భవత్సత్కృపా
జడధిస్నానము నేఁడు పెండ్లికొడుకుఁ జల్పించి యుత్సాహ సం
క్షుడుగా నా కొడఁగూర్చె, నీదునడుగుల్ గొల్వఁ మొదల్ వెట్టి యె
వ్వఁడుగానీ చెడిపోఁడు భద్రములు సంపాదించుఁ గామేశ్వరీ॥

మ॥ పరమాదృష్టము పెట్టిపుట్టినటు లే భావించి గర్వింతు దు
స్తర మీహూణశకమ్మునం దితరభాషఁ బొట్టకై నేర్వ కే
సురభాషఁ బఠియించి యక్కతన సంస్తుత్యుండనై మించితిఁ
సిరియుఁ సంపదగూడ నీకరుణచేఁ జేకొంటిఁ గామేశ్వరీ॥ ౧౯౧

మ॥ కలిగెఁ "లే" దనుకొన్నసంతతియు, భాగ్యం బబ్బె, నానందసం
కుల మయ్యెఁ జని, షష్టిపూర్తియును నాకుఁ దాపుగావచ్చె నో
లలితాంబా? యిఁక నొక్కకోర్కి, యది వాలాయమ్ము మద్విద్య ల
ర్మిలి మత్పుత్రిలయం దమర్చుటయె సుమ్మీ తల్లి? కామేశ్వరీ॥

మ॥ కల రీకాలమునం దనేకులు ధనాకాంక్షాపరిధానమ్ములా
పలువిద్దెల్ పఠియించి యక్కతన సంపన్నత్వముఁ గాంచి పు
త్రులఁ దద్విద్యలయందుఁ జొన్పెడియిహార్థుల్; నాకుఁ బ్రాచీనవి
ద్యలయం దెక్కుడునాదరం బగుట నిట్లర్థింతుఁ గామేశ్వరీ॥ ౧౯౩

శా॥ "విద్దెల్ ద్రవ్యముకోస" మన్ననుడికిన్ విజ్ఞుల్ పరీమోదింప రే
పొద్దో దేననో పొట్ట నింపికొని రేపుఁ మాపు సద్వ్యాపృతిఁ
దద్దఁ గాలముపుచ్చుచే ద్విజులకుఁ ధర్మమ్ముగాఁ బూర్వపుం

మ॥ ఒకసిద్ధాంతి లిఖించె ‘ షష్టి ’ యని వేఱొక్కం డశీత్యబ్దముల్
ప్రకటించెన్ మఱి నాకు నాయు వెది సంభావ్యంబు? పక్షద్వయా
నకుఁగూడన్ గ్రహవృత్తి సాధకముగా నాబుద్ధికిన్ దోఁచు దే
నికిఁ బ్రామాణ్యమొ నాకెఱుంగఁదరమే ? నిక్కంబు కామేశ్వరీ॥

మ॥ అరయన్ షష్టియె యైనచోఁ బ్రకృతదేహస్వాస్థ్యమే చాలుఁ,ద్వ
త్కరుణోద్రేక మశీతిదాఁకఁ జనుచో దార్ఢ్యమ్ము సంపాద్య మే
వెరవో దానికి నీవ చూడవలెఁ ద్వద్వీక్షామృతం బబ్బుచో
నొరుమున్ దేహబల, మ్మనామయత నాయు స్సొందుఁ గామేశ్వరీ॥

శా॥ “ఆయు స్సెక్కుడుగా నొసంగు” మని నిన్ యాచింప నోతల్లి? యే
యూయాసమ్మును లేసిజీవితము నే యాచింతుఁ గేల్మోడ్చి; యో
శ్రేయోదాయిని ? నాదుతప్పిదము లార్తిన్ బోలెఁ బోకార్చు,మా
మ్నాయధ్యేయము త్వత్పదద్వయ మెదం బాటింతుఁ గామేశ్వరీ ॥

శా॥ అంతో యింతయొ విద్య నిచ్చితివి, లోకారాధ్యుఁ గావించి, తా
శాంతశ్రాంతయశం బొసంగితి, వపత్యైశ్వర్యముల్ గూర్చి, తే
మంతుల్ సేసిన నన్నుఁ బుత్రునిబలెన్ మన్నించి రక్షించి, తే
చింతల్లేనిత్వదంఘ్రిసేవన మిఁకన్ జేకూర్పు కామేశ్వరీ॥ ౧౯౮

శా॥ కళ్యాణంబు లొనర్చు టొప్పుఁగద ? శోకం బిచ్చియున్నప్పుడో
కళ్యాణీ ? యిది నీ వెఱింగినదియే కాఁబట్టి సుంతేని వై
కల్యం బేర్పడకుండ నాదుప్రకృతిన్ గాపాడు మోయమ్మ ? నా
ఫల్యం బప్పుడు నాదుసంస్మృతికి సంప్రాప్తించుఁ గామేశ్వరీ॥ ౧౯౯

శా॥ ఏమో నీదయ యెట్లువచ్చిన సరే, యీనన్ను నీభక్తుఁగా
సామాన్యప్రజలున్ మహామహులు నిచ్చల్ మెచ్చికొంచుంద్రు, నా
సేమంబెల్ల భవద్వశంబ, యెటు వాసిన్ గూర్చి రక్షించెదో ?
ప్రేమింపం దగువాఁడ నేనిఁ దఱిలోఁ బ్రేమింపు కామేశ్వరీ॥ ౨౦౦

శా॥ ఆశ్వాసాంతముదాఁక శ్రావ్య మగుకావ్యంబట్టులే జీవితం
బాశ్వాసాంతముదాఁక రమ్యమగుచో నాశాస్యమై సవ్యమై
శశ్వన్మంగళసంగతంబునయి విశ్వశ్రేయమై పొల్చు నో
విశ్వేశీ ? యటులౌట సారె కిటు నావిజ్ఞప్తి కామేశ్వరీ॥ ౨౦౧

మ॥ ఇహసౌఖ్యం బనుభూత మాయె, సగ మాయెన్ భుక్త, [మోయమ్మరో ?
గ్రహవర్గాయువునందు, నాకు నిఁక భోగ్యం బెంతకాల మ్మను
గ్రహపూర్వంబుగ నీ వొసంగెదవొ ? తత్కాలంబు జ్ఞానోదయ
స్పృహణీయం బగునట్లొనర్చుటయె నాసేమంబు కామేశ్వరీ॥ ౨౦౨

మ॥ ఇల దీనిన్ బఠియించువారికి సుఖ మ్మెక్కాలమున్ గల్గు వా
రల సంతాన మనామయమ్మగుచు దీర్ఘంబైనయాయుస్సుతోఁ
జెలఁగున్, వాంఛకు విద్యయు న్విభవమున్ జెన్నారు,నాకల్పమున్
గలిసంహారకమంత్రమై యలరు నీకబ్బంబు కామేశ్వరీ॥ ౨౦౩

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇది శ్రీతిరుపతి వేంకటీయ మగు

నారోగ్యకామేశ్వరి

సమాప్తము.

సర్వే జనా స్సుఖినో భవంతు.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

# ప్రాతస్స్మరణపంచకము

శ్లో॥ ప్రాత ర్వదామి తవ వేంకటనాథనామ
శేషాద్రివాస ఇతి భక్తజనార్తిహేతి
శార్ఙ్గీతి చక్రధర ఇత్యఘదైత్యహంతే
తీంద్రానుజాత ఇతి సర్వజగత్ప్రతేతి॥

శ్లో॥ ప్రాత ర్భజామి రఘునాయకకల్పకద్రుం
సౌమిత్రిముఖ్యప్రియసోదరశాఖ మాఢ్యం
సీతాలతం కుశలవాభిధపుష్పయుక్తం
భక్తాళిసేవిత మనంతఫలం మనోజ్ఞం॥

శ్లో॥ ప్రాత స్స్మరామి రఘునాథముఖారవిందం
సంపూర్ణచంద్రసదృశం సతతప్రసన్నం
కర్ణాంతగామినయనం ఘనకుండలాఢ్యం
సస్మేరగండఫలకం రచితోర్ధ్వపుండ్రం॥

శ్లో॥ ప్రాత ర్నమామి హృది వేంకటనాయకాంఘ్రిం
సంసృత్యరణ్యదవవహ్నిమహాఘనాశం
బ్రహ్మాదినిర్జరవరైః పరిపూజ్యమానం
చక్రాంబుజధ్వజముఖాఖిలభాగ్యరేఖం॥

శ్లో॥ ప్రాత స్తువే రఘుపతిం మహిజాసనాథం
వేదాంతవేద్య మనఘం కరుణాసముద్రం
రక్షస్సమూహవిలయస్య ధృతావతారం
రాజీవనేత్ర మరుణాన్వయసింధుచంద్రం॥

శ్లో॥ యో వృత్తపంచక మిదం రఘునాయకస్య
పట్టాభిరామరచితం పఠతి ప్రభాతే
స శ్రీపతేః కరుణయేహ సుఖాని భుక్త్వా
నిశ్శంక మేతి తదనంతర మూర్ధ్వలోకం॥

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, కందూరు.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, కమలాపురం.
౩ వాక రాజా పరాంకుశరావు దేశాయిగారు. యాదవరం.
౪ రాజసింగుగారు – నెల్లుట్ల.
౫ ఇనిగాల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు – ఆత్మకూరు.
౬ తంగెడ నరసింహారావుగారు, కరణం, పెద్దగంపాడు.

పోషకులు.

౧ రాజా వెంకటాద్రి అప్పారావు, బహద్దరు జమీందారుగారు–నూజివీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, నారంపేట
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్తారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౦ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౧౧ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, దుగ్గందూరు.
౧౩ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, అనుమూరు.
౧౪ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౫ లింగాల గంగారెడ్డి దేశముఖుగారు, గణపురం.
౧౬ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు–దేవిడి.
౧౭ సాకుంట కిషన్‌రావు దేశముఖ్ గారు, జగితాల.
౧౮ పరికాల వెంకటేశ్వరరావుగారు, పరకాల.
౧౯ మండవ చినవెంకయ్యగారు, దండమూడి.

సహాయులు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహాస్వామివారు, యాదగిరి
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, హాపురం.
౬ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౭ వెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౮ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

# అభినవ సరస్వతి.

| సంపుటము | జ్ఞానపాదు | సంచిక |
| --- | --- | --- |
| ౨౧ | శుక్ల సం॥ పుష్యమాసము | ౧౦ |


# అఖిలభారత సనాతనధర్మ మహాసభ

## చెన్నపురి

[కార్తిక బ. చతుర్దశి, అమావాస్య, మార్గశిర శు. పాడ్యమి].

ఈసభ పైతిథులందు వంగదేశీయులగు బాబూ శ్యామసుందర చక్రవర్తిగారి యధ్యక్షతక్రింద చెన్నపురి వాల్టాక్సురోడ్డునందుఁగల వాల్టాక్సు నాటకశాలయందు సమావేశమగునట్లు ప్రకటింపఁబడినది. సభాప్రారంభమునకుఁ బోలినాడే యస్సాము వంగరాష్ట్ర ప్రతినిధుల తోను, సనాతన ధర్మపండిత పరిషదధ్యక్షులగు కాశీ కృష్ణాచార్యులుగారితోను బలుగురాంధ్రప్రతినిధులతోను గలిసి యధ్యక్షు లుదయము 7 గంటలకుఁగలకత్తా మెయిలునుండి దిగిరి. వారి నెదుర్కొని తోడి తెచ్చుటకొఱకుఁగాను జెన్నపురిలోని పలువురు సనాతన ధర్మపరాయణులగు బ్రాహ్మణులు వైశ్యులు శూద్రులుఁ బండితులు, నుద్యోగస్థులుఁ జిన్నలుఁబెద్దలు నుత్సాహముతో మంగళ వాద్యములతో స్టేషను కడకేగి యధ్యక్షులు రైలుదిగుటతోడనే వారిని మోటారులో నెక్కించుకొని యుత్సవముతో వాల్టాక్సు రోడ్డుమీఁదు గాఁబోయి గోవిందప్పనాయుని వీథిలోఁ బరమానందదాసు ఛోటాదాసు సత్రమునం దధ్యక్షులను బ్రవేశపెట్టి యట్టివారికి సత్కారమొనర్చి తక్కిన ప్రతినిధులను గూడ వేఱువేఱు సత్రములందు విడియఁజేసిరి. సాయంకాలము టి. ఆర్. రామచంద్రయ్యరు గారిచేఁ డ్రిప్లికేను గంగయికొండ మండపముకడ హనుమద్ధ్వజము జాతీయ పతాకముగఁ బ్రతిష్ఠింపఁబడెను.

మఱునాటి యుదయము వాల్టాక్సు నాటకశాలయందుఁ బు ణ్యాహవాచనమును జండీ యాగమును గావింపఁబడియె. సాయంకా లము సుమారు 2 గంటలకు సభాప్రారంభ మయ్యెను.

సభ ప్రారంభింపఁబడఁబోవునపుడు కొందఱు రౌడీలు కాంగ్రె సువారి దుష్ప్రేరేపణముచేఁ గోబోలుఁ బ్రేక్షకుల టిక్కెట్లుగొని సుమారు 200 మంది దౌర్జన్యముచే లోనఁబ్రవేశించి గాంధిమహాత్ము నకు జైయని తా మఱచుటయేగాక సభికులనుగూడ నట్లే యఱువవల సినదని కోరి యల్లరి చేయసాగిరి. అందుపై సభికులకుఁ జాలవఱ కాగ్రహము కలుగుటయు రౌడీలను సభనుండి వెడలించవలెనని కల్లోలము కలిగెను. ఇంతలో నధ్యక్షులు లేచి తమ సహజగంభీర గంభీరవాక్కులచే సభికులను శాంతపఱచిరి. రౌడీలును సిగ్గువడి నెమ్మది కొనిరి.

అంతట సభ్యుల కరతాళధ్వనిసూచితహర్షోత్కర్ష దీపితులై యధ్యక్షులు లేచి తమ మృదుమధుర వాగ్ధోరణితో నచ్చొత్తింపఁబడిన తమ యుపన్యాసమును జదువుచు మూడుగంటల కాలము సభ్యులఁ బరమానందాబ్ధి నోలలాడించిరి. నాఁటి కంతటితో సభ చాలింపఁబడియె. ప్రతినిధులు తమ తమ విడుదులకుఁబోయిరి.

రెండవరో జుదయమున మరల సభ సమావేశ మయ్యెను. అధ్యక్షుల రాకకుఁ గించిదాలస్యమగుటచేఁ బండితులు కొందఱు రజస్వలావివాహదూష్యతనుగూర్చి యుపన్యసించిరి. అందు ముఖ్యులు మల్లాది రామకృష్ణ విద్వచ్ఛ్యయనులుగారు రాజేశ్వరశాస్త్రిగారు పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు మొదలగువారు. అధ్యక్షు లంతలో విచ్చేసినందునఁ దీర్మానముల ప్రారంభమయ్యెను. మొట్టమొదట సనా తనధర్మరక్షణమునకై తమ జీవితసర్వస్వముల నర్పించి కీర్తిశేషులైన దర్భాంగామహారాజా, కాసింబజారు మహారాజా నేపాలు ప్రధాన మంత్రిగార్ల మరణమునకై సానుభూతి తీర్మానము గావింపఁబడియె. అటుపై వి. వి. శ్రీనివాసయ్యంగా రీకింది తీర్మాన మువపాదించిరి.

## శారదా శాసనఖండనము.

“శారదాగా రుపపాదించిన బాలికా వివాహనిరోధ శాసనము ప్రభుత్వమువారి మతతాటస్థ్య వాగ్దానమునకు భిన్నమైనందున రజస్వలావివాహము మహాపాతకమని విశ్వసించెడి హిందువులపై నీ శాసనము రజస్వలా వివాహములను నిర్బంధముగా విధించుచు నిరంకుశమగు నిరోధమును గలిగించుచున్నందున సదరు శాసనము నీసభవారు తీవ్రముగా ఖండించుచున్నారు.

మఱియుఁ బైశాసనమును రద్దుచేయించుటకుఁగాను సర్వవిధములను దీర్ఘాందోళనము గావింపవలసినదనియుఁ దుదకు రజస్వలా వివాహము పాతకమని తలంచెడి సంఘముల వారికైనను నీచట్టము వర్తింపకుండఁ జేయవలెననియుఁ గోరుచున్నారు.

పైశాసనముతీర్మానింపఁబడినప్పటికిని పూర్వమువలెనే యీరజస్వలా వివాహములే జరుపవలసినదిగాఁ బ్రజలను హెచ్చరించుచున్నారు.

పైశాసనము రద్దుచేయించుటకును మతాచార సాంప్రదాయములందు జోక్యము కలుగఁజేసికొనెడి శాసనములను వేనినైనను నెల్లప్పుడును నిరోధించుటకును వాగ్దానములు గావించినవారినే శాసనసభలకెన్నుకొనవలెనని యీసభవారు కోరుచున్నారు”.

తీర్మానము యమ్. కే. ఆచార్యగారు గానాల రామమూర్తి సోమదేవ శర్మ దువ్వూరి సుబ్బమ్మగార్లచే యుక్తియుక్తముగ నుపన్యాస పూర్వకముగ బలపఱుపఁబడిన మీఁదట సభవా రందఱిచే నేకగ్రీవముగ నామోదింపఁబడియె.

అటుపై జయంతి రామయ్య పంతులుగారు క్రింది తీర్మానము నుపపాదించిరి. “ఏప్రిల్ 1వ తేదీలోఁగాఁ ద్వరపడి వివాహములను బ్రిటీషిండియాలోఁగాని స్వతంత్రసంస్థానములయందుఁగాని కావించి భీతచేతస్కులమని తెలియఁజేయక సనాతన ధర్మపరులెల్లరును నేప్రియల్ 1వ తేదీ పిమ్మటనే తమబాలికలకు వివాహముగావించి సనాతనధర్మావలంబులు శారదాచట్టమునకు లోఁబడువారు గారని ప్రపంచమున కంతకును బ్రకటింపవలెనని కోరుచున్నారు”.

యు. పి. కృష్ణమాచారిగారు తీర్మానమును బలపఱచుచు నీ తీర్మానమును జగద్గురు శ్రీశంకరాచార్యస్వామి వారును గామకోటి పీఠాధిపతులును నాశీర్వదించిరని తెలిపిరి. పిదపఁ దీర్మాన మామోదింపఁబడ సభయుఁ జాలింపఁబడియె.

ఆ మధ్యాహ్నము తిరిగి కన్యకాపరమేశ్వరీసత్రమునందుఁ బ్రతినిధులకుమాత్ర మవకాశముతో విషయనిర్ధారణసభ సమకూర్పఁబడియె. అందు మొదటఁ దిరుచునాపల్లిలో జరుపఁబడిన తీర్మానములను టి. ఆర్. రామచంద్రయ్యరుగారు చదివి వినిపింప మొదలుపెట్టిరి. వానిలో దినపత్రికయొక్క విధానమునుగుఱించిన తీర్మానముఁ జదువునప్పు డది తిరుచునాపల్లి తీర్మానమునుమాట మఱచిపోయి యస్. సత్యమూర్తిగారు దండులోనుండి కాంగ్రెసనుమాటను దీసివేసి మతవిషయములోఁ దాటస్థ్యమునకుఁ బ్రమాణముచేయని మేపక్ష[illegible]ను సంబంధముండఁగూడదను సవరణపెట్టిరి. ఈసవరణ యు. పి. కృష్ణమాచారి యన్. యల్. దొరైగార్లచే నదిఱింపఁబడినను యమ్. కె. ఆచార్య సుబ్రహ్మణ్యయ్యరు వి. వి. శ్రీనివాసయ్యంగారు కాళీచరణసేను జయంతి రామయ్య, పరిభల లక్ష్మీనరసింహముపంతులుగారు మొదలగువారిచేఁ బ్రబోధింపఁబడినమీఁదట సభవారందఱిచే సవరణతోఁ దీర్మాన మామోదింపఁబడియె. అంతటఁ గ్రోధావేశపరవశులై యు. పి. కృష్ణమాచార్యులుగారు తమ కార్యదర్శిపదవికి రాజీనామా దాఖలుచేసి కొంతమందిసభ్యులతో లేచిపోయిరి. సభ్యులు విచారించిరి. పిమ్మట రామచంద్రయ్యరుగారు సదరు తీర్మానముగాని సవరణగాని యీసభ కెట్టిసంబంధముఁగలది గాదనియు నయ్యది తిరుచునాపల్లిలో జరిగినదనియుఁ బ్రకటించిరి. అటుపై యు. పి. కృష్ణమాచార్యులుగారు సంతసముతో మరలివచ్చి తమరాజీనామా యుపసంహరించుకొంటిమని ప్రకటించిరి. తదుపరి గారుబిల్లుపై నీక్రిందితీర్మానము శ్రీయుత నరేంద్రనాథసేనుగారిచే నుపపాదించి గంభీరోపన్యాసము చేయఁబడియె.

" డాక్టరు గౌరుగారి యంతర్వర్ణవివాహపుబిల్లనావశ్యకము గావునను బవిత్రమైనట్టి గార్హాస్థ్యధర్మమునకును గృహస్థాశ్రమరహస్యజీవితమునకును భంగకరమగునట్టి యవినీతికరములగు నుద్దేశములచె బ్రేరేపించునది గావునను నట్టిబిల్లు కేవల మనవసరమని తలంచుచు నీసభవారు తీవ్రముగా ఖండించుచున్నారు. మఱియు, గర్భాధానవయోనిర్ణయవిచారణ సంఘమునందలి సభ్యులలోఁ బెక్కండ్రు దంతకుచుండే సాంఘుసంస్కరణభావములకు బద్ధులైయుండినందునను బ్రజలందఱియొక్క యభిప్రాయములను దెలిసికొనుటకుఁ బ్రజలధనముపై నియమింపఁబడినప్పటికిని దమ విచారణసమయమునఁ దమ యభిప్రాయముల కనుకూలమగు ప్రచారముగావించి, పాక్షికమగు సాక్ష్యమును సేకరించి పాక్షికమగు నివేదికను బ్రచురించి నందువలనను దాని కెట్టివిలువగాని లేదని తలంచుచున్నారు.

(బి) సదరుసంఘము వైవాహిక శాసనమును దీర్మానింపఁజేయుటకుఁగాను దమ కధికారము లేనట్టి వైవాహికవయోనిర్ణయ విషయముపైఁ దమ దృష్టినంతను కేంద్రీకరింపఁజేసి ప్రభుత్వమును శాసనసంస్థలను దప్పుత్రోవలఁద్రోసి ప్రజలకు మహాపకారము కావించెనని తలంచుచున్నారు". ఈతీర్మానము గోపురామచంద్రరావుగారిచే నామోదింపఁబడి సభవారందఱి యంగీకారముఁబడసెను. సభ కాలాతీతమైనందున నాఁటికిఁజాలింపఁబడియె.

మూఁడవదినమున సభ తిరిగి సమావేశమై యీక్రిందితీర్మానములను గావించెను. అందు మొదలు బెంగుళూరు నాగరత్నమమ్మాళ్ గారీతీర్మానము ప్రతిపాదించిరి.

"మద్రాసులోఁజరిగిన స్త్రీలసభ యామోదించిన వివాహవిచ్ఛేదపుఁదీర్మానము హిందూజాతి కన్వయించునెడల శాస్త్రోక్తములైన యుత్కృష్ట పాతివ్రత్యధర్మములకు విరుద్ధముగాన దాని నీసభవారు ఖండించుచున్నారు." ఈతీర్మానమును సభవారైకకంఠ్యముగ నంగీకరించిరి.

అంతట యన్. సుబ్రహ్మణ్యయ్యరుగారీదిగువతీర్మానము ప్రతిపాదించిరి. "ఘనతవహించిన రాజప్రతినిధికడకు రాయబారులఁబంపి

శారదాశాసనమును రద్దుచేయించుటకుఁగాని, యరజస్వలా వివాహ మేజాతులందువిధిగా శాస్త్రములందుఁజెప్పఁబడినదో యాజాతులనైనఁ దప్పింపఁజేయు నట్లుకాని రాజప్రతినిధిగారిని గోరుటకీసభవారు దీర్మానించుచున్నారు." తీర్మాన మామోదింపఁబడియె.

రాజబహద్దరు జి. కృష్ణమాచార్యులుగారీ క్రిందితీర్మానము ప్రతిపాదించిరి. "హిందూజాతిలో నెక్కువసంఖ్యలవారు తమ మతము నందును సాంప్రదాయసిద్ధములైన శాస్త్రములందును నాచారములందును గట్టినమ్మకము గలవారగుటచే వారి యభిప్రాయములు తమ మతధర్మములందు విశ్వాసముగాని సహనముగాని లేని రాజకీయనాయకులవలన సరిగాఁబ్రకటింపఁబడఁజాలవనియు నందుచే రాఁబోవు రౌండు టేబిల్ సమావేశమునందు సనాతనహిందూజాతికి సరియైన ప్రాతినిధ్య మీయవలెననియుఁ, బ్రభుత్వమువారి నీసభవారు గోరుచున్నారు" జయంతి రామయ్యపంతులుగారిచే నామోదింపఁబడి తీర్మానము సభవారిచే నంగీకృతమయ్యెను.

యమ్. కె. ఆచార్యగారీతీర్మానముపపాదించిరి. "జాతీయమహాసభ యనేక మతములకుఁ జెందిన పలువురు సభ్యులతోఁ గూడినదగుటచే నది కేవలము రాజకీయవిషయిక సభగామాత్ర ముండఁదగినది. అందుచే నొకసంఘమునకుఁగాని యొకమతమునకుఁగాని సంబంధించిన యెట్టితీర్మానమును జేయుటకుఁ గాంగ్రెసునకుఁగాని దానికార్యనిర్వాహకసభకుఁగాని యెంతమాత్రమును హక్కులేదు. ఆకారణముచే శారదా శాసనమును బలపఱచుచు డిల్లీలోఁ గాంగ్రెసువర్కింగు కమిటీవారుచేసిన తీర్మానము నీసభవారు గర్హించుచున్నారు. మఱియు నెహ్రూకమిటీవారి రిపోర్టునందలి మత సాంఘికములకు సంబంధించిన సంఘసంస్కరణములని చెప్పఁబడు భాగములను వయస్సువచ్చిన యందఱిప్రాతినిధ్యపుహక్కు కొఱకుఁజేసిన యాశయము నీసభవారు నిరసించుచున్నారు. మఱియు లాహోరుకాంగ్రెసువా రన్ని సంఘములయొక్క మతసాంఘికాచారములను రక్షింతుమని ప్రకటింపవలెనని యీసభవారు కోరుచున్నారు."

గానాల రామమూర్తిగారును ద్రావిడ లక్ష్మణశాస్త్రిగారును నీతీర్మానమును బలపఱచినమీఁదట సభవారిచే నంగీకరింపఁబడియె. అంతట వేదిక్ వరల్డ్ పత్రికాధిపతులగు కె. వి. సుబ్బనామాత్యులుగా రీతీర్మాన ముపపాదించి సభ్యుల యామోదమును బడసిరి.

ఈ కలియుగమున సంఘశక్తి ప్రతివిషయమున నవసరమైనం దునఁబండితులను లౌకికులను దగినవిధమున శాసనసభలుఁ గాంగ్రెసు సభ్యులుఁజేయుచున్న విపరీత కార్యక్రమమును బ్రతిఘటించి ధర్మర క్షణ స్వాతంత్ర్యమును దిరిగి సంపాదించుటకు సిద్ధముచేయవలెనని యీసభవారు జగద్గురు పీఠములవారిని బ్రార్థించుచున్నారు.

తరువాత నీక్రింది తీర్మానములు సభవారిచే నేకగ్రీవముగ నామోదింపఁబడినవి:—

[ఎ] మన మతసాంఘికాచారములను నశింపఁజేయుట కన్ని చోట్ల గొప్ప ప్రయత్నములు జరుగుచుండుటచే వానినరికట్టుటకై దేశ మంతటను గొప్ప యేర్పాట్లు చేయుట యవసరమైనందునఁ జెన్నపురి రాష్ట్రీయ వర్ణాశ్రమ ధర్మ సభవారిచే మార్చినెలలో జరుపఁబడిన సభ రాష్ట్రీయ సభగానుండి యిపుడు జరుగుచున్న యఖిల భారత సనాతన ధర్మసభకు శాఖగానుండవలెననియు

[బి] బెజవాడలో స్థాపింపఁబడిన ఆంధ్రదేశవర్ణాశ్రమ ధర్మసభ యీ చెన్నపురిరాష్ట్రీయ వర్ణాశ్రమ ధర్మసభ కాంధ్రశాఖగా నుం డవలెననియు

[సి] తిరుచునాపల్లియం దరవజిల్లాలచే జరుపఁబడిన హిందూ ధర్మసభ పై రాష్ట్రీయ సభకు ద్రావిడశాఖగా నుండవలయుననియు

[డి] దేశమునందంతటను గ్రామసభలును జిల్లా సభలును స్థాపిం పఁబడి యాయా రాష్ట్రీయసభలకుఁ జేరియుండవలెననియు

దేశమందలి యువకులందఱిని శత్రువర్గమువారు లోఁబఱచు కొని మనశాస్త్రములకు విరుద్ధములగు మార్గములందుఁ బ్రివర్తింపఁ జేయుచుండుటచే భావికాలమున విద్యాభ్యాసమొనర్చవలసిన యువకు

లను కేవలము సనాతన ధర్మమార్గమున ప్రవర్తింపఁజేయుటకు సనాతన ధర్మసంస్థలన్ని ముఖ్యస్థలములందును నెలకొల్పఁబడవలెననియు

ఈ సభయొక్క విషయనిర్ణయసభ్యులను జేర్చి యొక కార్య నిర్వాహక సభ నేర్పాటు సేసి యఖిల భారత సనాతనధర్మసభ నొక దాని నెలకొల్పి దానిని దగిన మార్గమున సదరు కార్యనిర్వాహక సభవారు నడిపింపవలెననియు నీ సభవారు తీర్మానించుచున్నారు.

'సనాతన ధర్మరక్షణమునకై సనాతన ధర్మపరాయణులంద ఱును దైవసాహాయ్యమును వ్యష్టిరూపమునను సమష్టి రూపమునను సంపాదింపవలెనని యీ సభవారు హెచ్చరించుచున్నారు.

వరశుల్క కన్యాశుల్కము లశాస్త్రీయములును సామాన్య గృహస్థులకుఁ గష్టదాయకములును నగుటచే వానిని గర్హించుచు నవి తొలఁగింపఁ బడవలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు.

రాజ బహదరు జి. కృష్ణమాచార్యులుగా రీతీర్మానమును బ్రతిపాదించిరి. అవిచారపూర్వక దేవాలయప్రవేశము దేవతా సాన్నిధ్యమును దొలఁగించును గావున నట్టి యశాస్త్రీయ ప్రయత్న మును సర్వవిధములఁ బ్రతిఘటింపవలెనని యీ సభవారు సనాతన ధర్మ పరాయణులను గోరుచున్నారు. అవిచార పూర్వక చండాలా స్పృశ్యతా నివారణము నీసభవారు దృఢముగా నిరసించుచున్నారు.

గోపు రామచంద్రరావుగారు పైతీర్మానమును బలపఱచిరి. ఈవిషయమునే బలపఱచుచుఁ గాశీపండిత లక్ష్మణశాస్త్రిగారును యన్. శ్రీనివాసాచార్యులుగారును నుపన్యసించిరి. తీర్మాన మేకగ్రీవముగ నామోదింపఁబడియెను.

మన్నార్గుడి మునిసిపల్ చైర్మన్ గారగు టి. సి. గురుస్వామయ్యరుగారీక్రింది తీర్మాన ముపపాదించిరి."అన్ని సంఘముల యొక్కయు మతసాంఘికాచారములను సంరక్షించుటకును నట్టివిషయము లందు ప్రభుత్వము వారుగాని శాసనసభలుగాని జోక్యము కలిగించు కొనకుండునట్లు చేయుటకును రాష్ట్రమునం దన్ని యెడలను నింగ్లీషు

నందుచు దేశభాషలందును వార్తాపత్రికలు ప్రకటించుటకుఁదగిన వ్యాపారసంఘములను నెలకొలుపవలెననియును స్త్రీ సంఘములకు సనాతనధర్మపరాయణు లందఱును దగినసహాయము నొసఁగవలెననియు నీసభవారు కోరుచున్నారు.”

పై తీర్మానముల నాచరణమునందుఁ బెట్టుట కఖిలభారతసనాతన ధర్మసంఘమొకదానిని స్థాపించి దానికి బాబూశ్యామసుందర చక్రవర్తి గారి నధ్యక్షులుగ నియమింపవలెనని తీర్మానింపఁబడినది.

సనాతన ధర్మపరాయణుల రాజకీయ హక్కులను కొనసాగించుటకు సంస్థానపతులకడకొక రాయబారమంపి వారినిగాని వారి ప్రతినిధులను గాని లౌకికులతోఁ గలసి కాంఫరెంసు సమావేశపు నేర్పాటుచేయ వలసినదని తీర్మానింపఁబడినది.

హిందూశాసనములను బ్రచురించుటకుఁ దగిన దృష్టమగు ప్రచారమును రాష్ట్రము లన్నిటియందును గావించుటకు నొక్కొక్క సంఘ మేర్పాటు చేయవలెనని యీ సభవారు సిఫారసు చేయుచున్నారు.

అధ్యక్షులు తమ యుపన్యాసాంతమున నీ తీర్మానముల నాచరణలోఁ బెట్టుటకుఁ దగిన ధనసహాయమును కొఱకును మనుష్యుల సహాయముకొఱకును సభవారిని బ్రార్థించిరి.

రాజా బహద్దరు జి. కృష్ణమాచార్యులుగా రధ్యక్షులకు వందనము లర్పించుచు సభ జయప్రదముగా జరిగినదని ప్రకటించిరి. అధ్యక్షుల విశ్వేల దేశభక్తిని నిష్కల్మష చిత్తతను సనాతనధర్మ పరాయణత్వమును బ్రశంసించిరి. అంతట నధ్యక్షులను స్తుతించుచుఁ గొన్ని పద్యములు చదువుటతో సభ పరిసమాప్తి నొందెను.

బాల్యవివాహనిషేధపుఁజట్టమునకు సవరణరూపమున నొక బిల్లు నసెంబ్లీలోఁ బ్రతిపాదింపఁదలంచి యం. కే. ఆచార్యాగారు గవర్నరుజనరలుగారి యనుమతికై పంపిరి.

అసెంబ్లీ కార్యదర్శికిఁ గూడ నొక ప్రతినంపిరి. భారతదేశము నందుఁగల వివిధసంఘములలోను గర్భాధానమునకుఁ బూర్వము

బాలికలకు జరుగుపరిధానము వివాహముమున్నగు మతసంబంధములగు విధులను శాస్త్రయుక్తమగునట్లును శిష్టాచారానుకూలమగునట్లును నిర్ణయించుట కీబిల్లుద్దేశింపఁబడినది.

మైమెన్సింగు డక్కా పౌరులగు 3811 మంది హిందువులును మహమ్మదీయులును బల్లియాడి జమీందారగు ఖాన్ బ. కే ఏ. సిద్దిక్ గారి నాయకత్వమున శారదా శాసనము సవరించుటకు సిఫార్సు చేయుచుఁ దమ సంతకములతో నొక ప్రమాణపత్రమును వైస్రాయిగారి ప్రైవేటు కార్యదర్శికిని బెంగాలు గవర్నరుగారి ప్రైవేటు కార్యదర్శికిని బంపియున్నారు.

బొంబాయిని సమ్మర్ద హర్తాలు జయప్రదముగ సాగెను. నాఁడు బజారులలో మాంసవిక్రయముకూడ నిలిపివేసి ప్రజలు శారదాశాసనముపైఁగల విముఖతను వెల్లడించిరి. ఢిల్లీలో మహమ్మదీయ ప్రముఖులు శాసనము నమలునఁ బెట్టఁగూడదని యిండియా స్టేట్ సెక్రటరీగారిపై దావా దాఖలుగావింపఁ బోవుచున్నారు. మౌలానా మహమ్మదాలీ గారు కాన్పూరున మహమ్మదీయులలోఁ బ్రముఖుల నాహ్వానించి మఱొక గొప్పసభ గావింపఁ బ్రయత్నించుచున్నారు. హిందువులలో సనాతనధర్మపరాయణు లనేకులు శాసనమును ధిక్కరింప సంసిద్ధులగుచున్నారు. కొంతయాందోళనము సాగించినచో శాసనము రద్దగుననియే యనేకులు తలఁచుచున్నారు.

## పై సభ కధ్యక్షులగు శ్యామసుందర చక్రవర్తిగారి ప్రారంభోపన్యాసము.

[ ఆంగ్లోపన్యాస సంగ్రహము ]

మన దేశ మిప్పుడు గతిదప్పి యున్నది. నీటిలోనుండి యొడ్డునఁ బడిన చేపవలెఁ దెన్నుగానక తన్నుకొనుచున్నది. మన ప్రభుత్వము మనకు లేదు. మన బ్రతుకు దెరువులే మన కనిశ్చయములుగా నున్నవి. మనమందఱము హిందువులమనియు హిందూమతస్థులమనియుఁ జెప్పికొను

లాడుచున్నాము. కాని యిదంతయుఁ గేవలము పూతమెఱుఁగువలె నున్నది. మన సనాతనధర్మములను దిరిగి మనము శిరసావహించి యనుష్ఠించినఁగాని మనకు స్థిరత్వ మేర్పడదు.

ఎప్పటికప్పుడు సాంఘికధర్మములను గూర్చికాని పారమార్థిక ధర్మములను గూర్చికాని తర్కవాదములు చేయుచుఁ గ్రొత్తసిద్ధాంతములను గల్పనచేయుచు నూతన సాంప్రదాయములను బరీక్షార్థ మాచరణలోఁ బెట్టుచు నిత్యసంశయములతో నిత్యపరిశోధనలతోఁ గాలముపుచ్చుట సనాతనధర్మము కాదు.

జీవితధర్మములే మనకు మతధర్మములు. వేదములలో నీజీవితధర్మము లన్నియు స్థిరాక్షరములుగా శాసింపఁబడియున్నవి. ఈవేదముల యాదేశముల ననుసరించుటయే సనాతన ధర్మానుష్ఠానము. కనుక వేదములయందుఁ బరిపూర్ణవిశ్వాస మవసరమైయున్నది. వేదధర్మములు సహేతుకములగునా కాదా యని వాదింపవలసిన యవసరము సనాతన ధర్మగాముల కవసరములేదు. వేదములో నిరూపింపఁబడినవి నిర్దుష్టములు. అందులకు శంకింపఁబనిలేదు.

ఒకమనుస్మృతిని బరిశీలించినఁ జాలును. మనుస్మృతి వేదధర్మములనే ప్రమాణముగా గ్రహించి ధర్మము ననుశాసించెను. మనుస్మృతిలో సూచింపఁబడని సాంఘికధర్మముగాని జీవితధర్మముగాని మన కూహించుట కశక్యము. అదియొక విజ్ఞానసర్వస్వమని చెప్పఁదగును. మనువు విధించిన ధర్మములు శిరసావహించి యనుష్ఠించినచో మానవలోకము భూతల స్వర్గము కాకుండునా !

కాని నేడీశారదాశాసన మొకటివచ్చి తిరిగిమనకు మన సనాతనధర్మశాస్త్రమును జ్ఞాపకము చేయుచున్నది.

మన సనాతన ధర్మముప్రకారము లౌకికప్రపంచమనియుఁ బారమార్థిక ప్రపంచమనియు రెండు విభాగము లెప్పుడును లేవు. మనయొక్క ప్రతిజీవితధర్మమునందును నాత్మోపలబ్ధి కనువైన విధు లేర్పఱుపఁబడినవి. ఆత్మశ్రేయమే సంఘశ్రేయము. సంఘశ్రేయమే ఆత్మశ్రేయము, గనుక సాంఘికధర్మములనియు నాధ్యాత్మికధర్మము

లనియు రెండుగా విభాగింపఁబడి లేదు. మనుస్మృతిలో శాసింపఁబడిన సూత్రముల ననుసరించి భూపాలుఁడు పరిపాలనము చేయునెడల దేశము సుభిక్షమై సంఘము సకలసౌభాగ్యములలో నోలలాడును. కాని వేదప్రామాణ్యమే యంతరించినపిదప మనుస్మృతి ధర్మములెట్లమలు లోనికి రాఁగలవు ?

కాని శాశ్వతములగు సనాతన ధర్మములు వేదచోదితములైన సృష్టి నియమములుఁ దృణీకరింపఁబడినవి. సంఘ మనేకాపభ్రంశములకుఁ బాలైనది. ఇందులకుఁ గారణము సనాతన ధర్మాధికారమని గ్రహింపక చేసినతప్పును దిద్దుటకై వేఱొక క్రొత్తతప్పును జేయుచున్నారు. చెదలుపట్టిన దానికిఁ దారుపూసినట్లగుచున్నది.

సనాతనధర్మములు నిస్సారములని త్రోసివేయుచుఁ జిత్త సంస్కారశూన్యుఁడై తన యల్పబుద్ధికిఁ దోఁచిన క్రొత్తశాసనముల నాధునికధర్మకర్త శాసించుచున్నాఁడు. మనువు విధించిన మహాపథములను గాలిలోఁ దన్నివేయుచు శారదా శాసనముల నాహ్వానించుచున్నాఁడు. ఇప్పుడు సంఘములోనున్న యాదృష్టములన్నియు సనాతన ధర్మములయొక్క లోపములని భావించి తనయొక్క యహంభావము వల్ల స్వకపోలకల్పిత ధర్మములను విధించుచున్నాఁడు.

శాశ్వతమైన సృష్టినియమములకు మార్పులేదు. అట్టి శాశ్వత ధర్మముల ననుసరించియే సంఘసాంప్రదాయములకుఁ బునాదులు త్రొల్లి వేయఁబడియుండెను. కాని యాధునికసంఘసంస్కర్త మనలను జలనములేని యచేతనములని పిలుచుచున్నాఁడు. కాని భగవంతుఁడే యచంచలుఁడు. వస్త్రముల రూపములును దేశములయొక్క చరిత్రలును వేర్వేఱురీతులుగా మాఱుచుండవచ్చును. కాని మానవుని యాత్మోన్నతికి నాత్మవికాసమునకును నవసరమైన జీవితధర్మములు సదానొక్క-రీతిగనే యుండఁగలవు. ఆధునికుఁడు స్థిరమైన జీవిత సూత్రములను సిద్ధాంతములను ననుసరించుటలేదు. నేఁడు స్త్రీస్వాతంత్ర్యమే పరమావధియని వాదించును. రేపు సాంఘిక సమత్వము (కమ్యూనిజము) సాంఘికాదర్శమని భావించును. కాని యివి యమలులోనికి వచ్చిన

తోడనే విపరీత పరిస్థితులు పుట్టుచున్నవి. ఒకానొక స్త్రీస్వాతంత్ర్యవాది భవిష్యత్పరిస్థితుల నిట్లు సూచించెను:— వేయిమంది స్త్రీలకు ౫ గురు మగవాండ్రు దేశములో నున్నంజాలుననెడి ప్రమాణమే మున్ముందు సిద్ధాంతము కాంగలదు. స్త్రీలు సర్వస్వతంత్రలై పురుషులతోం దమకుం బని లేదని భావింపవచ్చును. కనుకం బురుషులు కొంతవయస్సు మిగిలినతర్వాతం బనికిరానివారయి లేదా యౌవనములోం బురుషులు తమయౌవనమును సాఫల్యము చేసియుండక పోయినను నియమిత సంఖ్యకంటె నెక్కుడుగానున్న పురుషులను తుదముట్టింపవలసినదిగా నొక శాసనముకూడ నమలులోనికి రాంగలదేమో."

ఈ మహానుభావుండు వచించిన ప్రవచనము కొంతవఱకు ఋజువగుచునే యున్నది. స్విట్జర్లాండు దేశములో (ఇది ప్రజాస్వాతంత్ర్యమున కాదర్శప్రాయమైన దేశము సుండీ!) పురుషులయొక్క పుంస్త్వముతోం బని లేకపోవుటవల్ల వైద్యచికిత్సల వల్లం బురుషుల వీర్యమందలి సంతానోత్పాదకశక్తి నాశనము చేయంబడుచున్నది. పురుషులే యట్టి చికిత్సలను బొందవలసినవారగుచున్నారు. ఇట్టి పద్ధతి యిప్పుడే యమలులోనికివచ్చినది.

శారదాశాసన మవశ్యానుసరణీయమని సిఫార్సుచేసిన విచారణ సంఘ సభ్యులలోం గొందఱికట్టి విపరీతపరిస్థితులు మనదేశములోం గూడం దలయెత్తవలెనని తమ యంతరంగములలోం గలదేమో?

కాని యీ ప్రసక్తి మనకు వద్దు. అయితే నీతికిని నాత్మపరిపూర్ణత్వమునకును మార్గముం జూపెడి జీవితధర్మములు శాశ్వతములై యచంచలములై యుండునేకాని యుగమున కొకరీతిగా సాంఘిక సాంప్రదాయములను గల్పింప వీలులేదు.

ఎప్పటికప్పుడు క్రొత్తపద్ధతులతోడను గ్రొత్త విలాసములతోడను గ్రొత్తవింతలతోడను గాలము గడుపవలెననుట మంచిలక్షణము కాదు. ఆత్మశాంతి విహీనుండే యట్టి కోరికలు కోరుచుండును. అది ఎ పోవనియునికి యనంబడును. స్థిరచిత్తము లేనివాం డెప్పటికప్పుడు

క్రొత్తవింతలను గోరుచుండును. ఇది మనోదౌర్బల్యము. సంఘములో ప్రవేశించిన చంచల స్వభావమనెడి జాడ్యలక్షణము.

సూర్యచంద్రాదులు స్థిరముగా యుగాంతరములనుండియు దమ విధులను నిర్వర్తించుచున్నారు. వచ్చిన రాత్రులే మరల వచ్చుచున్నవి. ఎన్ని మాఱులో వచ్చిన వసంత ఋతువే తిరిగివచ్చుచున్నది, పండినపంటలే తిరిగిపండుచున్నవి. ఇట్టి శాశ్వతమైన యచంచల మైన కాలమానమును జూచి మనమేల విసువుజెందరాదు? విసువుజెందినచో మన మభాగ్యులమే. కాలమానము సరిగా స్థిరస్థాయిగ నడుచుచుండిననే మనకుబంటలు పండును. తినుటకు గూడు లభించును. కనుక బండుగనాడుకూడ ప్రాంతమగడేనాయని నిరసించుటవల్లను క్రొత్త విలాసములకును క్రొత్తరుచులకును బుద్ధిని బోనిచ్చుచు జపలత్వమే మంచిదనియు నది పురోభివృద్ధి యనియు మనము ప్రోత్సహించెడిచో మనసంఘ మధోగతి పాలగును. శాశ్వతమైన ధర్మమునే మనము సర్వదా యనుసరింపవలెను. మన విశ్వాసము మన ప్రేమానురాగములు నచంచలములై యుండవలెను. ఇదియే మానవకల్యాణమార్గము. ఇదియే సనాతనధర్మముయొక్క మూలసూత్రము. భూత సనాతన ధర్మములు, యుగములబట్టి మాఱినవికావు. వర్తమాన భవిష్యత్తులందును నొకటే రీతిగా సత్య సమన్వితములై యున్నవి.

అట్టి సనాతనధర్మములను దామనుష్ఠించి యితరుల ననుష్ఠింపజేయుటకు బ్రాహ్మణులు ధర్మాధికారులుగా నియమింపబడియుండిరి. తిరిగి యాబ్రాహ్మణుల ధర్మాధికారము రావలసియున్నది.

బ్రాహ్మణులందఱును నిజమయిన సనాతన ధర్మానుష్ఠానపరులు కావలసియున్నది. తమ యచంచల ధర్మవిశ్వాసమును సంఘమంతట వ్యాపింపజేయవలసి యున్నది. కాబట్టి సక్రమమయిన బ్రాహ్మణనాయకవర్గము ముందుగా నేర్పడవలసియున్నది. సనాతన ధర్మ ప్రతిష్ఠాపన వారివలన జరుగవలసియున్నది. ఇదిజరిగిన పిమ్మట నన్నిసాంఘికసమస్యలును జక్కబడును. అస్పృశ్యు లుద్ధరింపబడుదురు. కాని విప్రకోటియొక్క విశుద్ధత్వమునకై ప్రయత్నముచేయక

యస్పృశ్యులకు దేవాలయములలోని కనుజ్ఞయొసంగవలెనని యాందోళన చేయుట వెఱ్ఱితనము. విప్రసంఘము సనాతనధర్మజ్ఞాన వికాసము పొందవలెను మిగిలిన సాంఘికసమస్యల కన్నిటికిని వాయిదా వేసి యుంచవచ్చును.

ఆధునికయుగమందుం బ్రతివిషయమును సులభోపాయముతోం జక్కంజేయవలెనంట. ఓపిక వహించి శాశ్వతమైనపనిచేయుట నవనాగరకపద్ధతి కాదు. సంఘమును బునాదులనుండియు బాగుచేయుటకుం బూనువారు లేరు. ఎప్పటికప్పుడెక్కడికక్కడ మరమ్మతుచేసి సంఘములోం బుట్టిన వైపరీత్యములను నరిష్టములను దొలంగింపంజూచుచున్నారు. మూలకారణము గుర్తెఱింగి మందువేయుట వీరిపద్ధతి కాదు. శాశ్వతమైన పనులను సిద్ధాంతమైన పనులనుజేయుట కలవడిన చిత్తవృత్తి వీరికిలేదు. స్థిరచిత్తము లేకపోవుటకును బుద్ధిచాంచల్యమునకును గారణము కలదు. ఇది ప్రపంచమంతటను వ్యాపించియున్న దుర్గుణము. యంత్రములు లోకములోని కేనాండు వచ్చినవో, యానాండే యీమనోవేదనముగూడం గలిగినది. భౌతికశాస్త్ర పరిశోధనాఫలితమైన పెనుభూత మీయంత్రవ్యామోహోన్మాదమే. మొట్టమొదట నావిరియంత్రము కనిపెట్టంబడినపుడు మానవకోటికి లోకజీవయాత్రయంతయు సకలసౌఖ్యసౌభాగ్యయుతమైనదని లోక ముప్పొంగెను. అరచేతి వైకుంఠ మంతర్ధానమైనది. యంత్రాగారములు వెలసినవి. ధనాధికులు పెట్టుంబడిదారులై లాభములను దోంచుకొనిరి. కూలిజనుల కడగండ్లు హెచ్చెను. విరివిగా సిద్ధమైన సరకుల నమ్ముకొనుటకై విదేశములతో సముద్రప్రాంతములపై నధికారముల కొఱకు యుద్ధములు నడచినవి. ప్రజలలో నసంతుష్టి ప్రబలినది.

కాని మనుస్మృతిలో నీయంత్రనిర్మాణములు నిషేధింపంబడియుండెను. మహాయంత్ర ప్రతిష్ఠాపన మొకయుపచారమని నిషేధింపంబడెను. అట్టి సాంఘికాపచారములనడంచుటకై ప్రాయశ్చిత్త దండన విధింపంబడెను. కాంబట్టి యిట్టి సనాతనధర్మముల విడనాడి

వివాహమనియెడి సాంఘిక వ్యవహారములోఁ గూడ మనువు విధించిన నియమములు సనాతనసూత్రముల ననుసరించి యనుశాసింపఁ బడినవి. నిష్కళంకమైన దాంపత్యానురాగము నీచమైన కామేచ్ఛగా మాఱకుండుటకొఱ కెట్టి శిక్షణమును బాలబాలికల కొసంగవలసి యున్నదో కుటుంబికులగువారందఱెఱింగి యున్నారు. గురువులోఁ గూడ శిష్యుఁడు నియమగరిష్ఠుఁడై నిరతాగ్నిహోత్రపరుఁడగుటకు బాల్యమునందే గురుకులాశ్రమమెట్లు స్వీకరింపవలసియున్నాఁడో, యదేరీతిగా భార్యగూడఁ దనభర్తతో నిర్మలదాంపత్యధర్మముల ననుష్ఠించుటకును నిత్యాగ్నిసంస్కారనియమము లలవఱచుకొనుటకును లేతవయస్సుననే సహధర్మచర్యము ననుష్ఠింపవలసియున్నది.

ఋతురోధము మహాదోషమనికూడ మనువు వచించెను. యువతి గర్భవతియగుటకే ఋతుమతియైనది గదా ? అట్టి యువతి సంతానవతికాకుండ ఋతుస్నానము నిష్ఫలముఁ జేయుట సంతాననిరోధముకాదా? సంతాననిరోధము భ్రూణహత్యాపాతకమునకుఁ దుల్యము గాదా ? కాఁబట్టి యర్హుండయిన వరుఁడు లభించినప్పుడు బాలిక యొక్క వయస్సువిషయమై కుశంకలు కలిగియుండవలదని గృహాయజమానికి మను వాదేశించెను.

సావిత్రి మున్నగు యువతులు రజస్వలలైనపిదపనే వివాహిత లైరనియు నా వివాహములే ప్రమాణములనియు సంస్కర్తలు వాదించుచున్నారు. అవి రజస్వలా వివాహములేకాని యాయువతుల వివాహములకుఁ దండ్రు లెట్టి మనోవేదనల పాలైరో గ్రంథ పరిశోధన చేసినఁ దెలియఁగలదు. జనకుఁడు సీతవివాహమునకై పడిన యాతుర రజస్వలలైన బాలికలకు వివాహముచేయకయుంచినచోఁ దండ్రిపొందెడి యావేదన కాళిదాసెట్లు వర్ణించెనో చూడనగును.

కాఁబట్టి రజస్వలయైన స్త్రీయొక్క బీజము వ్యర్థముకాఁ గూడదు. నిష్ఫలమగుట కెవ్వఁడు సమ్మతింపఁగలఁడు.

## తండ్రిచేసినపెండ్లి దేశారిష్టము !
## చిన్నదిచేసికొన్న స్వయంవరము దేశసౌభాగ్యము ! !

శారదా శాసనమును శ్లాఘించెడి యాధునికుల హేతువాదము చాలవింతగా మాత్రమున్నది. వారాలోచించిన విషయములు కొంత దూరమే పోవును. వారి యాలోచనాధోరణి యిట్లుండును:—

"ఇదిగో యాఁడుపిల్ల - బాగుగానే యున్నది. ఇడుగో మగవాఁడు:— బాగుగానేయున్నాఁడు. పిల్ల తండ్రికోరికప్రకార మీ మగవాఁడాడుపిల్ల వద్దకు వెళ్ళి పాణిగ్రహణము చేసినయెడల నతఁడు తన వివాహమువల్ల బాలెంత మరణములకు శిశుమరణములకు బాల వైధవ్యమునకు స్వారాజ్యసంసిద్ధిప్రతిబంధములకుఁ గారణభూతుఁడగుచున్నాఁడు. కనుకనట్టి మగవానిని దిట్టముగా దండింపవలె. కానియిటు చూడుఁడు, ఆడపిల్ల తనంతఁ దాను మగవానివద్దకు వెళ్ళి వానిని వలపించి పెండ్లాడితేఁ దన తండ్రి యిదంతయుఁ జూచి బిక్కమొగము వేసితే నామె దేశమును రక్షించునఁట. వీరులు శూరులు నామె గర్భశుక్తి ముక్తాఫలాలవలెఁ బుట్టెదరఁట. మంచి చిత్త సంస్కారము యోగ్యత యామెయందుఁ గనఁబడునఁట. ఆమెద్వారమున వెనుకను వెళ్ళే స్వారాజ్యము దగ్గరకువచ్చునఁట. కాఁబట్టి సారాంశమేమంటే దండ్రి యంటఁగట్టిన సంబంధమునకామె బాధ్యురాలు కాదు. కనుకఁ దన యకాల మరణానకుఁగాని తనదుర్బలసంతానమునకుఁగాని యామె బాధ్యురాలు కాఁజాలదు."

ఇది యాధునికుని వాదసారాంశము. ఈకుర్కవాద మను గుద్దలితో హిందూసంఘమును బునాదులతోఁ బెకలించుచున్నాఁడు.

## ప్రతిక్రియ ఏమిటి ?

నాకుఁదోచిన ప్రతిక్రియ యొక్కటే - బ్రాహ్మణధర్మమును బునరుద్ధరించుట - సనాతనధర్మవిశ్వాసమును బునః ప్రతిష్ఠ చేయుట. బ్రాహ్మణులు నామమాత్రావశిష్టులై యుండుటచేతనే యితరులు దూషించుచున్నారు. కనుక నీయపవాదముఁ దొలగించుటకై సనా

తనధర్మమును బునరుద్ధరించుటకై శంకరరామానుజాది మహానుభావు లుద్భవించిన యీ దక్షిణాపథమునకు నే నేకాకినై విషణ్ణహృదయ ముతో మీయొద్దకు వచ్చినాను.

శారదా శాసనమును హిందూమతముపేరిట ననుశాసించుట కుం గారణమేమి ? హిందూమతమనగా నూరును బేరును లేనిదని వారి భావము. వివిధమతసిద్ధాంతములను సమన్వయము చేయుటవల్లనే హిందూమతమునకు రూపమేర్పడినదని వీరి భావము. ఇది యబద్ధము. సనాతనధర్మ సంయుతమైన దొకటి కలదు. ఆ సనాతనధర్మమే హిందూమతము. ఇప్పు డీహిందూమతమే దేశారిష్టముల కన్నింటికిని మూలకారణమని వీరు దూషించుచున్నారు. మన దేశదాస్య మిందువల్లనే కలిగినదంట. శిశుమరణములు పసిపిల్లలకు గుల్మములు పెరుగుట మొదలుకొని స్త్రీల క్షయవ్యాధులును మద్రాసులోని మం త్రివర్గపు కల్లోలములు మొదలుకొని వంగరాష్ట్రియపు గాంగ్రెసెన్ని కల తగాదాల వఱకును నీ యరిష్టములన్నియు నీ హిందూమతము మూలముననే కలిగినవంట. మన దేశములోని యైశ్వర్యము విదేశముల పాలగుచున్నదనియు దేశ సౌభాగ్యము నిర్వీర్యమగుచున్నదనియు దాదాభాయి నౌరోజీ మహానుభావుండు సిద్ధాంతముచేసి వెళ్ళిపోయెను. కాని యిపు డొక క్రొత్తసిద్ధాంతము పుట్టినది. ఈ సనాతనధర్మము యొక్క "రాక్షస పైశాచిక పీడాకర" సాంప్రదాయలమువల్ల స్త్రీలోక ముయొక్క జవము క్షీణించి పోవుచున్నదంట. సనాతనధర్మము నెన్ని రీతులం దూలనాడందగునో యన్ని రీతులం దూలనాడిరి. దూషించినకొలం దిని మనకదిమేలే. అసమ్మానమునలననే తపోవృద్ధి యగును. కాంబట్టి వాఁనమినుమడించిన పౌరుషముతో సనాతనధర్మవిశ్వాసమును సుస్థిర ముగా నొనర్చి బ్రాహ్మణధర్మములను వేదవిధులను దిగిగి ప్రతిష్ఠించె దముగాక.

కాని మనయాత్మీయ శక్తులను విజృంభింపం జేయుటకై ప్రభు వుల సహాయమును నేనుగోరను. రాజాధిరాజైనను మనమాశ్రయింప వలసిన పని లేదు. అట్లు రాజాశ్రయము వేడుట సనాతన ధర్మము

నకు ద్రోహము చేయుటయగును. మునిమిత్రులను శపించుటగాని యిత రులపై దండెత్తెద నని బెదరించుటగాని నామతముకాదు. ఆవిద్య నాచేతఁగాదు.

ఒక ప్రశ్న:—విధినిషేధములు లేని స్వైరవిహారమా? లేక శాశ్వతమైన స్థిరధర్మములా? ఏవి మనకుఁగావలయును? ఈప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగుటయే యీ సభాప్రయోజనము.

---

శ్రీ శ్రీ పుష్పగిరి సంస్థానము వారు చెన్నపురి సనాతనధర్మసభకు
ద్వాశతరూప్యసాహాయ్యముతోఁ బంపిన శ్రీముఖము.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య ... శ్రీపుష్పగిరి పీఠాధీశ్వర శ్రీమదభినవోద్దండవిద్యాశంకర భారతీకరకమల సంజాత శ్రీమదభినవోద్దండ విద్యానరసింహ భారతీ స్వాములవారు.

అస్మదత్యంత ప్రియశిష్యులును సనాతనధర్మబద్ధశ్రద్ధులును నగు నఖిలభారతసనాతనధర్మసభాకార్యదర్శిప్రభృత్యాస్తికాగ్రగణ్యుల కభీష్టసిద్ధ్యర్థము నారాయణస్మరణపూర్వకముగా వ్రాయించి పంపిం చిన పత్రిక:—

మేము నిజాముగారాష్ట్రమునకుఁ జేరిన పరకాలమండలమున శ్రీ......పూజాతత్పరతచే నానందాబ్ధి నిమగ్నస్వాంతులమై యున్న వారము. సాంప్రతము:—

పదునాలుగు సంవత్సరముల యనంతరమే బాలికలకు వివా హము చేయవలయునని సర్వసాధారణముగాఁ బ్రవర్తించిన రాజ శాసన మతిభయంకరమును నింద్యమును సనాతనధర్మవిధ్వంసకమును ననువిషయమై సందేహింప నవసరము లేదు.

పురాణేతిహాసాదిపూర్వచరిత్ర పరిశీలన చేసినను వేనుఁడు మొదలగు ధర్మవిధ్వంసక ప్రభుపులపరిపాలనసమయమందునను నిట్టి దుష్టశాసనము బయలువెడలినట్లు గనుపట్టదు.

స్వీయవిద్యాపరిశ్రమము లేనట్టియు విదేశీయశిక్షావ్యాముగ్ధమాన సులును ధర్మతత్త్వానభిజ్ఞులునగు కొందఱు భారతీయుల

ప్రోత్సాహముచేతనే యీశాసనము బయలువెడలినట్లూహింపఁ దగియున్నది. ఎట్లులైననేమి సర్వవిధముల నీశాసనము నిరోధింపఁదగినది. రాజశాసనము నుల్లంఘించిన ద్రవ్యవ్యయకారాగార ప్రాప్త్యాద్యనర్థపరంపరలు గలుగవచ్చునుగాని యీశ్వరాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులనుల్లంఘించితిమేని చాతుర్వర్ణ్యమునకు స్వరూపోచ్ఛేదమే కలుగును. తమపితృదేవతలకును దమవంశమువారలకును దురుత్తరమగు నరకపాతము గలుగును.

ఈ సంగతులనన్నిటిని దయాళువులును సమచిత్తులునగు రాజప్రతినిధి ప్రభృతుల యెదుట మరల సవినయముగను సనిర్బంధముగను మనవిసేయవలయును. ఒకవేళ వారలు ధర్మవిధ్వంసకులపక్షమునే యవలంబించి మనముచేయు ప్రార్థనను నిరాకరించిరేని యప్పుడు ప్రాణమానభంగప్రసంగమునకును వెనుదీయక నిర్భయులై స్వధర్మసంరక్షణబద్ధపరికరులు కండని యస్మచ్ఛిష్యులకు హృదయపూర్వకముగా నాజ్ఞాపించుచున్నవారము.

"ధర్మం చర. ధర్మాన్న ప్రమదితవ్య" మని శ్రుతికలదు. "స్వధర్మే నిధనం శ్రేయ" యని లోకగురుండగు శ్రీకృష్ణభగవానుఁడుపదేశించెను. "ధర్మో రక్షతి రక్షిత" యని జగజ్జనకుండగు మనువనెను. "న జాతు కామాన్న భయాన్న లోభా ద్ధర్మం జహ్యా జ్జీవితస్యాపిహేతోః," అని లోకాచార్యుండగు వ్యాసమహర్షి యుపదేశించెను. మేమును ధర్మరక్షణమునకై యనేకపర్యాయము లవతరించి యనర్థముల దొలఁగించిన యస్మదిష్టదేవులగు శ్రీశారదాచంద్రమౌళీశ్వరులను శిష్యుల యభీష్టసిద్ధికొఱకును సనాతన ధర్మరక్షణకొఱకును బ్రార్థించుచున్నవారము.

తమంతటనే సనాతన ధర్మసంరక్షణమునకయి పాటుపడెడి యాస్తికోత్తములును గురుదేవతాభక్తాగ్రగణ్యులును నగు మీాబోంట్లకుఁ బత్రికాద్వారమునఁ దెలియఁజేయునది యింతకన్న నేమున్నది.

స్వస్త్యస్తు లోకేభ్య ఇతిశివమ్.

ఈసభయందు శ్రీ మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులు
గారు చదివిన సంస్కృతోపన్యాసము:—

ఆర్యమహాశయాః! సనాతనధర్మప్రవణాః!

అహ మాంధ్రదేశీయైః గుంటూరుకృష్ణామండలస్థైః ప్రతినిధితయా ప్రేషితః. అతో మయుక్తం కించిత్సాధ్వసాధు వావశ్యం శ్రోతవ్యం.

దేవభాషాయాం తేషు తేషు శాస్త్రేషు కృతబహుపరిశ్రమాః బహుషు దేశేషు లబ్ధప్రతిష్ఠా అపి వయం రాజకీయేషు దేశక్షేమసంపాదకేషు విషయే ష్వేతావత్పర్యంత ముదాసీనా స్స్వీయయా వృత్త్యా జీవంతో యథాలాభసంతోషిణ స్స్వధర్మానుష్ఠానప్రవణా స్స్వాధ్యాయ ప్రవచనపరా స్సంతో నివసామః. తత్కస్య హేతోః? అస్మదీయా రాజభాషావిదోఽస్మాక మైహికాముష్మికకృత్యానా మప్రతిబంధేన దేశీయమహాజనసభా వ్యవస్థా (కాంగ్రెసు) ద్వారా పురపాలక సంఘ వ్యవస్థా ద్వారాచ క్షేమం విధాస్యంతీతి. ఏవ మస్మదుపేక్షయా ఇదం ఫలం సంవృత్తం: అణకచతుర్భాగమూల్యస్య పత్రస్యాణకార్ధమూల్యత్వం, చండాలైస్సహ బ్రాహ్మణానా మేకపంక్తిభోజనం, చండాలానాం దేవాలయాది ప్రవేశాభ్యనుజ్ఞానం, విధవోద్వాహః, ఇత్యాది. అస్మిన్నప్యంశే శమప్రధానై ర్బ్రాహ్మణమహాపండితై రుదాసితం. యేచాధర్మరుచయ స్తే యథావాసన మనుతిష్ఠంత్వధర్మం, నాపృష్టః కస్యచిద్బ్రూయాదితిహి న్యాయ ఇతి.

ఇదానీంతు చతుర్దశవర్షానంతర, మేవ బాలికానాం వివాహాః కార్యా ఇతి నిర్బంధశాసనేన నవనాగరకప్రేరణయా నిర్వృత్తేన సర్వేపి సనాతనధర్మానుష్ఠాతారో వయం వజ్రఘాతేనైవ సమూర్ఛితాః కథమపి లబ్ధసంజ్ఞాః దేశీయ మహాజనసభా

(కాంగ్రెసు) ముఖ్యప్రవర్తకేన గాంధి నామ్నాష్టాదశవర్షానంతర మేవ బాలికానాం వివాహాః కార్యఇతి యదా రాజనికటం ప్రతి పత్రం ప్రేషితం తదా సువిదిత మస్య ధర్మవిధ్వంసకత్వం. ఐహికసుఖస్య సంకోచకం శాస్త్ర మస్మాభి ర్నాద్రియతఇతి బహువార ముద్ఘోషితం కాంగ్రెసుసభ్యైః.

అత ఏతాదృశానా మభిప్రాయానురోధేన ప్రచాల్యమానా కాంగ్రెసుసభా నాస్మాభి రాద్రియతే. తద్విఘ్న కరణ ఏవ బద్ధ పరికరా వయం. సనాతనధర్మే ణాంశతోఽపి విరోధిన్యా యయాకయాపి సభయా నాస్మాకం సంబంధోఽభిమతః. అస్మాకం కేంద్రస్థానం కాశీస్థా బ్రాహ్మణమహాసమ్మేళనసభా. అస్మదీయ సనాతన ధర్మపక్షస్య నాయకౌ మాన్యతమౌ శ్రీపంచానన తర్కరత్నభట్టాచార్య ద్రావిడ లక్ష్మణ శాస్త్రిణౌ. తావనుయాయినో వయం. అస్మదనుయాయినో దేశీయా స్సనాతనధర్మనిరతాః పరిస్సహస్రాః పురుషధౌరేయా స్తాదృశ్య స్త్రియశ్చ. శ్లో॥ శమప్రధానేషు తపోధనేషు గూఢంహి దాహాత్మక మస్తి తేజః, స్పర్శానుకూలాఇవ సూర్యకాంతా స్తదన్యతేజోఽభిభవా ద్వమంతీతి ప్రశాంతానామపి జ్వలననిమిత్తం సర్వజ్ఞో మహాకవిః కాళిదాస ఉదాజహార.

అతః ధర్మవిధ్వంసకానాం గాంధి నెహ్రూప్రభృతీనాం పారిధాస్యేన ప్రచాల్యమానా కాంగ్రెసు సంస్థా నాస్మాకమభిమతా. తత్ప్రతికూలా ఏవ వయమి త్యస్యా మఖిలభారత వర్షీయమహాసభాయాం విజ్ఞాపయామః.

ఇ త్యాంధ్రదేశీయ సనాతనధర్మాభిమానీ
మల్లాది రామకృష్ణమహాగ్నిచిత్.

———:o:———

# సనాతన ధర్మావలంబులకొక మనవి.

సనాతనధర్మసంరక్షణతత్పరులగు సోదరులారా !

శారదాగారిధర్మమున హిందూసంఘమునఁ గలరా వ్యాపించినది. దాని నిర్మూలించుటకుఁ బురుషప్రయత్నితములైన తీర్మానములు ధర్మశాస్త్ర చర్చాపథములుఁ జాలినవికావు. ఈ భయంకరజ్వరము శాసన రూపమున నేప్రిలు 1 వ తేది ధర్మదేవతను బ్రతిఘటింప నున్నది. విషయవిమర్శనలు ప్రతివిమర్శనలు, వ్యక్తిదూషణలు మొదలగు వ్యాసంగములతోఁ గాలయాపన మొనర్చిన మనము ధర్మదేవత నీ శారదాగారికి బలియొసంగిన మహాపాతకమునకు లోనగుదుము. ఈ విషయమును ప్రభుత్వమువారితోఁగాని ప్రభుత్వోపజీవులతోఁగాని దేశభక్తులమనుకొను సంఘవిద్రోహులతోఁగాని సంప్రతించుటయు నిష్ఫలము. స్వీయోన్నతి వాంఛించుదేశదాసమ్మన్యులతో మనకు నిమిత్తములేదు. ఇంతవఱకే పవిత్రధర్మము లోకసూత్రమై సంఘమునకుఁ బునాదియై యున్నదో యామహా బీజమగు పవిత్రధర్మము సంరక్షించు తలంపుగలవారికి శాసనోల్లంఘనముకన్న గత్యంతరములేదు. పవిత్రభారతధర్మ దేవతనీశాసనరాక్షసుని కరాళవదనమునఁబడకుండ సంరక్షింపఁదలంతురా? మీయాడువారిని భయంకరవ్యభిచారదవానలమునుండి తప్పింపఁ దలంతురా ? సత్యాగ్రహమునుపూనుఁడు. ధర్మపరులగు సోదరులు ప్రతియూరసభలు గావించి కర్తవ్యము నచిర కాలమున నాచరణకుఁదెండు. ఇంతవఱకే పవిత్రపాతివ్రత్య తేజము లోకాదర్శకమై భారతీయోన్నతికిఁగారణమైయున్నదో యా సనాతనధర్మ మంతరించిన లోకము నిర్జీవమగుటకు సందేహము లేదు.

ఇప్పటికే పాశ్చాత్యనాగరకత మనలను స్వమత స్వకర్మ స్వధర్మ విదూరులుగా నొనర్చినది. మన వేషము మన భాష నాశనమొనర్చినది. కాని కొంతవఱకు సంఘము బలిష్ఠమైనదగుటచే భారతీయుల మనుకొనుటకుఁ దగుదుమనుకొనుచున్నాము. కావున నీశాసనమును గూర్చి త్వరలో సమాలోచించి సభలలోని తీర్మానములు సభలలోనే

యూటిపోవకుండ భారతసోదరవర్గము, అందు నాంధ్రసోదరులుఁ ద్వరలో నాచరణకుఁ దేవలసినదిగా నుద్బోధించుచున్నాను. ధర్మ ఏవ జయతి!

ఈరంకి వేంకట కృష్ణమూర్తి.

## "కర్నూల్ మణ్డల వర్ణాశ్రమధర్మరక్షకమహాసభ."

1929 సం॥ డిశంబర్ నెల 8 వ తేదీ భానువారము సాయం కాల మలుకూరివారి సీతారాములవారి యాలయములోఁ దల్లము గోవిందప్పసెట్టిగా రక్కయ్యగారి యారాధనాంగ బ్రాహ్మణ సమారాధనయయినపిదప నొకమహాసభ జరిగినది. ఇందులో ననేక స్త్రీ పురుషులు పాల్గొనిరి. వకీల్ కావేరిరావుగారికుమారులు, కే. నరసింహారావుగా రధ్యక్షత వహించిరి. సభకు వచ్చిన కొందఱి నామములు వ్రాయనైనది.

౧. గుడిపల్లి శేషయ్యగారు. వైసుప్రెసిడెంటుసభ కర్నూలు
౨. నారాయణశాస్త్రులు. మించెర్ బజారు కర్నూలు.
3. రావిప్రోలు సోమయ్యగారు. కర్నూల్.
౪. వాశాల శేషయ్యగారు. కర్నూలు.
౫. బొమ్మిడి శీతారామయ్యగారు. కర్నూలు.
౬. కే. నరసింహరావుగారు. కర్నూలు.
౭. తల్లము గోవిందప్ప శ్రేష్ఠిగారు. కర్నూలు.
౮. తల్లము వెంకటకృష్ణయ్య శ్రేష్ఠిగారు. కర్నూలు.

తీర్మానములు:—వైస్రాయిగారు శారదాశాసనమును సంపూర్ణముగ రద్దుచేయవలెనని యధ్యక్షులు తంతియిచ్చుట కీసభవారను మోదించుచున్నారు.

కర్నూలు, 9-12-29

కే. నరసింగరావు.
పుల్లాపంతుల రామచంద్రయ్యశర్మ
సెక్రటరీ.

———:o:———

"ఆరోగ్యకామేశ్వరి"

అను నామముచేతనే యియ్యది యారోగ్యార్థ మేర్పడిన కామేశ్వరీస్తుతియని స్ఫుటమగుచున్నది గదా! ఇఁక నిది యెవరియారోగ్యమునకై యెవరు రచించిరను నంశమును గబ్బమే వివరించెడిని. ఇందుఁగలపద్యములు రెండువందల కొకటిరెండుకన్న మించవు. ఇం దొకచో గ్రంథకర్తవయస్సు 50 వత్సరము లనియు వేఱొకట నఱువదికి దాదాపనియుఁ గన్పట్టుటంజేసి స్థూలదృష్టిగాఁ జదివికొనువారలకుఁ బరస్పరవిరోధము స్ఫురించెడిని. గ్రంథకర్త దీని నేఁబదివత్సరములప్రాయమున మొదలిడి యఱువదికిలోపునఁ బూర్తిచేసెనని గ్రహింపఁదగు. అగుచో నీస్వల్పగ్రంథమున కిన్నియేండ్లు పట్టెనా? యనుశంక కవకాశము కలిగెడిని. తత్త్వ మిది- రోగప్రకోపసమయములయందప్పుడప్పుడు వివశముగా దొరలిన కవిత్వమేగాని యియ్యది యిట్లు రచింపవలె నను నుద్దేశముతో దీక్షపట్టి రచించినది కాదని సమాధానము చెప్పికోఁదగు. సుమా రెనిమిది వత్సరములకాలములోని యీపద్యములనంశము జ్యోతిశ్శాస్త్రప్రవేశము కలవారలకు నిందలియంశములవలననే మిక్కిలి సుగమము. జననకాలమునకుఁ గొంత చంద్రమహాదశ భుక్తమైనది. శేషము సుమా రైదేండ్లు, పిదపఁ గుజమహాదశ యేడువత్సరములు. పిమ్మట రాహుమహాదశలో రాహ్వంతరము రెండువత్సరముల పైచిల్లర. వ్యాధిప్రారంభము చంద్రునిలోనే యైనను దానిప్రకోపావస్థ కుజదశాప్రారంభము మొదలుకొని కుజమహాదశ సర్వమును రాహువులో స్వల్పకాలమును ఈపద్యరచన కాస్పదమని విజ్ఞు లెఱుఁగఁగలరు- చంద్రదశలో సర్వసామాన్యముగా నున్నప్పుడు కేవలము మందులమీఁదనే యాధారపడి పిమ్మట నీయుపాయ ముపక్రమింపఁబడినది.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ"

అని భగవద్గీత. మొత్తముమీఁద విచారింపఁగా నీవ్యాధి జననమాదిగా సుమా రైదువత్సరములవఱ కొకరీతిగానుండి పిమ్మటఁ బదివత్సరములవఱకుఁ బ్రకోపావస్థలో నుండి పదపడి సుమారు రెండేం డ్లొకమాదిరిగానుండి యటుపైని రెండేండ్లు మిగుల నొగిలియుండి పదియేనవయేఁడు ప్రవేశించునప్పటికి నామమాత్రావశిష్టమైనదని చదువరులు గ్రహింపఁగలరు. ఇట్టిపెద్దవ్యాధులకు భగవదారాధనమే యౌషధసేవకన్న ముఖ్యమని నేను నిశ్చయించికొన్నాఁడను- మనపూర్వులుగూడ—

"తచ్ఛాంతిరౌషధైర్దానై ర్జపహోమసురార్చనైః"

అని లిఖించియున్నారు- ఔషధసేవయు జరిగినది. వైద్యుల సమ్మానములును జరిగినవి. ఎన్నియేని జరుగుఁగాక, అవియన్నియు నొకయెత్తు, ఇది యొకయెత్తు; ఇదియే యెక్కుడుపనిచేసినదేమో యనికూడ నే ననుకొనుచుంటిని- కొమరునివిషయముననే కాక స్వవిషయమునఁగూడ మున్నె నేనిట్లే ప్రయత్నించితిని. అయ్యది మాకామేశ్వరీ శతకమున నచ్చటచ్చట గోచరించెడిని- ఇందుఁగూడఁ బైసంగతి నొండొకపద్యము తెల్పెడిని- ఎవరో మహాదృష్టవంతులుతప్ప లోకములోని సంతానవంతులెల్ల నిట్లే శ్రమపడుదురుగాని కవులుపడిన పరిశ్రమ కావ్యరూపమును దాల్చుటచే నెల్లరకుఁ దెలిసెడిని- ఇతరుల [illegible]

చ॥ కొడుకులు గల్గరాదొక నొకకొన్నిదినమ్ములు చింత, నందనుల్
వాడమిన నాయువుఁ బలము బుద్ధియు విద్యయుఁ జాలఁగల్గఁగా
నడుగనిచింత, కల్గి తను నోలి భజింపనిచింత; తండ్రి కె
వ్వాఁడుఁ గడుఁ జింతసేయుదురు పుత్త్రులు శత్త్రులుగాక మిత్త్రులే.

అని యొకకవి చెప్పియున్నాఁడు.

నేను బందరులోనున్నకాలమున విశేషించి కవితాపరిశ్రమ సేయుటచే ననారోగ్యమేర్పడి స్వగ్రామము ప్రవేశించినపిమ్మట నీవ్యాసంగమునుండి పూర్తిగా విరమించితిని. అట్టిస్థితిలో నీరచన యనివార్యముగా ఘటించినది. ఇదియేకాక యనివార్యముగా—

"మల్లేశ్వర విజ్ఞప్తి"

అనుపేరున నొక యాఱువందలపద్యములుగూడ దొరలినవి. అవిగూడ నించుమించుగా నొకమాదిరి రోగాపనయనమునకే యుపకరించెడిని. కాని యీరోగమునకును దానికిని గొండొకభేదము కలదు. ఆభేదము నీక్రిందిపద్యము తెల్పఁగలదు—

మ॥ కొమరుఁ రోగవిముక్తుఁ జేయుమని మ్రొక్కుల్ మ్రొక్కితి న్నీదుపెం
డ్లము కామేశ్వరి, కాజగజ్జననియు న్నాకోర్కి పూరించె; గ్రా
మమహారోగము వాపుమం చిపుడు నిం బ్రార్థించితి, "నీదుచి
త్తము నాభాగ్యము" పిమ్మటఁ, దగదు మాంద్య మ్మిందు మల్లేశ్వరా ॥ ౧

ఆమహారోగస్వరూప మెట్టిదోయని శంక కలుగకమానదు—ఆశంక నీక్రింది పద్యము తొలఁగించెడిని—

మ॥ కలరాగాని మశూచిగాని మఱి రోగా లేవియేఁగాని యీ
ఖలచిత్తుల్ బలె గ్రామముఁ జెఱుప, వీశర్మశ్వపాకాయతిఁ
బల మేదింపఁగదయ్య! లోకులకు నాపత్కారు లీతుంటరుల్
నిలువెల్లఁ విషపుంజముల్ నిలుపుమీ నీచూపు మల్లేశ్వరా ॥ ౨

ఈరెండుకబ్బములును ననివార్యములగుటచే రచింపఁబడినవే కాని తదితరరచనకు బుద్ధి ప్రసరించుట లేదు. ప్రస్తుతము శ్రీ శ్రీ బొబ్బిలిరాజుగారి పట్టాభిషేకచరిత్రము రచింపవలసియున్నది. వాగ్దేవతానుగ్రహానుసారము తద్రచన నెఱవేరవలయును. ప్రస్తుతగ్రంథము తుట్టతుద నొకపద్య మీవిషయమున కంతగా సందర్భించునది కాకున్నను శ్రీ శ్రీ రావు రామయాంబా బహద్దరు జమీందారుగారినిగూర్చి రచింపఁబడినది. ఇటీవల ననఁగా, బందరునుండి స్వగ్రామము ప్రవేశించిన కొలఁదివత్సరముల నుండి యిందనుక నన్ను నాయింటనె యుంచి నెలకు నిరువదియైదురూపికలవంతున నుపకారవేతన మనుప్పేరున నేవిధమైనప్రత్యుపకారము నభిలషింపకయే యొసఁగుచున్న కృతయుగదాతృవతంసమునెడల నీమాత్రము కృతజ్ఞత చూపుటకు సంతసింపనివా రుండరని నానమ్మకము. ఇట్లుచూపుట గ్రంథకర్తల యాచారమే—

"శృంగబేరపురాధీశా చ్ఛ్రీమతో లబ్ధజీవికః"

అని నాగేశోపాధ్యాయులు కృతజ్ఞతం దెలిపెను. నేను స్వయముగాఁ బ్రూఫు చూడకున్నను జాల నిర్దుష్టముగా దీనిని ముద్రించిన చంద్రికాప్రెస్సువారి నెంతయు నభినందించుచున్నాను.

కం॥ వారల నారులు ముప్పదియాఱుగురు పినాకి యుత్తమాంగంబునయం
దేరుపడినవారలు-విను మారాగప్రియుల పేరు లభివర్ణింతుఁన్. [illegible]

కం॥ గౌరయుఁ గోలాహలియును గౌరియు ద్రావిడియు దేవగాంధారియు నిం
కారీతి మాళకౌశికి శ్రీరాగంబునకు నమఁగుఁజెలియలు శూద్రా! [illegible]

తే॥ చరమమంజరియును గండగిరియు రామగిరియు నాందోళియును గౌశికియును దేశ
శాఖయును నూర్మిసతులు వసంతునకును వైజవననామ సచ్ఛాద్రి! పరమభద్రి!

ఆ॥ స్తంభతీర్థ త్రిగుణ సచువేరి వైరాటి కుంకుమయు నహింస కూర్చునట్టి
భార్యలుగను జెప్పఁబడిరిచూ పంచమసంజ్ఞ రాగమునకు సచ్ఛతుగ్గ! [illegible]

ఆ॥ భావ రక్తహంస భైరవీ కర్నాటకులును వేలగులియు గుర్జరియును
భైరవాఖ్యరాగపత్నులునాఁ జేరుకొనఁగఁబడిరి వైజవనసమాఖ్య! [illegible]

తే॥ మధుర కామోద బంగాలి మఱియు నత్తినారికాఖ్యయు దేవాళి పేరిటిదియు
దేవగిరియును మేఘాఖ్యమై విలసిలు రాగమున కర్ధదేహ లోహహోగుణాఢ్య!

కం॥ వరయును దుంబియుఁ ద్రోటకి మఱియును మల్హారి సింధుమల్హారియునన్
వరసగ నటనారాయణు గరితలు మోడకియుఁ దోడుగా నాలుగురున్. [illegible]

కం॥ వీరందఱునుం బనివిని గౌరికి గౌరీశునకును వైమోడ్చి యటన్
నూరిమిమగలంగూడి సచాగుతనూవాహనముగ సంస్థితులగుదున్ [illegible]

సీ॥ మద్దెలవాయించి మఱి చతురశ్రవాద్యంబువాయించి వనజభవుఁడు
తాళంబుగొట్టి మాధవుఁడు పిల్లనగ్రోవి సుస్వరంబుగనూఁది సురవిభుండు
శూర్పరవంబును నేర్పుతోడనుసల్పి యగ్ని పణవమొత్తి యశ్వినులును
ఘటువాదనముచేసి గణము లుపాంగవాద్యంబొనరించి చంద్రముఁడు రవియు
శృంగనాదమున భుజంగమవసువులు కనకశృంగనాదమునను సిద్ధు
లట్టు లెవరిచేతనైన యయ్యయివాద్యములను సురలు వార్షి జలధిఁ దేల్ప!

సీ॥ జెడలన్నియును విప్పి యొడలంతటంగూడఁ బరిశుభ్రమైనట్టి భస్మమలఁది
పంచశీర్షములందు ఫణినిబద్ధంబులై డాలుడీల్కొను కిరీటములు పెట్టి
ఉరుహారములఁ గరం బొరయునట్లుగఁ దొడ్గి పదిచేతులం బది బాహుపురుల
భానుకోటిసమప్రభముఁ ద్రిలోకవ్యాపకమునౌ మహానటకాయమునను
భార్వతియును మునులభార్యలు మునులును నున్నతాసనముల నుండిచూడ
సప్తసుస్వరముల సకలగంధర్వులుం బాడ నాడెఁ గొండవైని శివుఁడు. [illegible]

కం॥ హరపాదతలాహతమై పురకాననసహితమైన భూచక్రముతో
గిరియును గిరగిరఁదిరిగెను మరునాదముచేసికొనుచు నో వైజవనా! [illegible]

క౦॥ ఎనుబదినాలుగుకరములు మనుస్పష్టములయ్యె నపుడు పురహరుచేతన్.
ఘనసూతవందిమాగధజన మానవఘర్మవారి జననము గాంచెన్. ౯౯౬

ఆ॥ విశ్వగాత్రులైన వివిధగంధర్వులు భవునెడందనుండి ప్రభవమంది
కౌతుకులకు ఋషుల కెంతయు నబ్రంబుగలుగఁజేసి. రేమిగలదు చెప్ప. ౯౯౭

క౦॥ కిన్నరు లత్యంతంబగు సన్నుల వర్ణంబుగురియ నటు నాల్గవెలల్
తన్నీలగ్రీవునిచేఁ జెన్నుగఁ దాండవము వరుసఁ జేయంబడుచున్ ౯౯౮

సీ॥ నిర్మలాకాశశోభిత నీరజాతపిహిత కాసారముఖ ఫలవృక్షముల ర
వంతపాండుముఖచ్ఛవియగు శరత్తు చనియెఁ- గార్తికసితచతుర్దశియు వచ్చె. ౯౯౯

క౦॥ అపుడు మహానటుఁ డెంతయు నిపుణతఁ జూపుచు సమాప్తనిజనటనుఁడు కాఁ
గృపఁజూచి వికచసుందరలపనాంబుజయై యపర్ణ లలి నిట్లనియెన్. ౧౦౦౦

ఆ॥ "త్రిప్పగానియట్టి ద్విజశాపమునఁ జేసి యెపుడు నీదులింగ మిలను బడునో
అపుడు నర్మదాపయఃపునర్జన్మమై విశ్వపూజ్యమగుచు వెలయు నద్ది. ౧౦౦౧

సీ॥ దేవదేవా! మహాదేవ! జగద్ధాత! శివశంకరా! నమస్కృతులు నీకు.
బ్రహ్మణ్యదేవ! కపర్ది! నీలగ్రీవ! బ్రహ్మగర్భ! శుభ్ర! ప్రణతి నీకు.
సితభూతిధర! పశుపతి! సవితా! సహస్రాక్ష! మహేశ! జోహారు నీకు.
కృత్తివాస! హిరణ్యరేత! హరా! భవ! మూర్తభావన! కేలుమోడ్పు నీకు.
కృష్ణ! శర్వ! పురుష! యీశాన! పంచాస్య! సూక్ష్మ! ధర్మ! భావ! జోత నీకు.
గణపతీ! కపాలి! గంగాధరా! గురూ! పూషదంతభంగ! మొగుపు నీకు! ౧౦౦౨

సీ॥ రూప! నీరూప! విరూపాక్ష! భగలోచన! నిపాతి! గుణి! వందనంబు నీకు.
భస్మజననకారి! బ్రహ్మరూప! మహాస్వరూప! యోగాచార్య! మ్రొక్కు నీకు.
వైరాగ్యరూప! భవానీప్రియంకర! కాలచక్ర! చెంగనాలు నీకు.
జగతీమహానందసంధాయకా! మహాపురుషపూజ్యా! చిన్నిపూవు నీకు.
వామదేవ! విప్రవహ్నిముఖాగ్ర! యుగ్రా! యఘోర! చక్రి! యంధకాసు
రాపవర్గదాయకా! గుణాతీత! యీశ్వర! మృడా! నమస్సులిడుదు నీకు. ౧౦౦౩

సీ॥ రచియింతు నతి యమూర్తబ్రహ్మరూప! నీ. కాచరింతుఁ బురాంతకా! ప్రణామ.
మొనరింతు నీకు సద్యోజాత! గిడిగిడి. చేతు మృగవ్యాధ! జేజె భక్తి.
కావింతుఁ జాగిలి ఘనయజ్ఞవిధ్వంస! మరలింతు శాపంబు మన్మథహర!
ప్రణుతింతు విశ్వేశ! బహువిధములను నిన్. క్షమియింపు మత్కృతాగంబు దేవ!"
అని స్తుతించుటయును నమరయుతంబుగా హర్షపూర్ణుఁడును సమాప్తతాండ
వవ్రతుండునగుచుఁ జైజవనా! భవుం డివమునుషలకొమార్తె కిట్టు లనియె. ౧౦౦౪

కం॥ "ఎవఁడేతత్త్వత్కృత మద్ స్తవనంబును భక్తితోడఁ దాఁ జదువునో యో
యవనీధరితనయ! వానికి భువి నిష్టవియోగ మెపుడు పొసఁగదుచుమ్మీ. ౧౦౦౮
తే॥ పుట్టుకలమాట వి త్తపరిపూర్ణుఁడగుచు నఖిలజాడ్యవివర్జితుండై యిహమున
నన్నివిధముల భోగంబు లనుభవించి పొందఁగలుగును దుదకు మత్పురము వాఁడు"
కం॥ అనియిట్లుపలికి యీశ్వరుఁ డనఘంబును వైష్ణవంబు నగు వామాంగం
బును గాత్యాయని కొసఁగిన మనమున నుప్పొంగి యాకె మఱి గ్రహియించెన్.
సీ॥ ధృతకపాలకరంబు సితవర్ణ మంతటుం గంఠార్ధమందున గరళయుతము
అభినవరుండమాలార్ధహారంబును బ్రహ్మాండకోటి కుత్పాదకంబు
ఊరుజటాభాసమానోత్తమాంగంబును గౌరశోభాకలాఖండరత్న
భాసావభాసితంబై సువర్ణాభరణాన్వితం బొకటు నవ్యాంగద మొక
టును సత్కృత్తివసనమును సదుకూలంబు నివల నవల నగుచు వృషభవాహ
నమును మత్స్యవాహనము నిరుప్రక్కలం గ్రాలఁ బొరిపదు లొకంటఁగలిగి
ఆ॥ ఒకటఁ బలులతోడనొప్పెడిరూపంబుఁ జూచి బ్రహ్మఁదొట్టిసురవరేణ్యు
లలఘుభక్తి నట్టి యర్ధనారీశ్వరు నెంతయును స్తుతించు చిట్టులనిరి. ౧౦౦౯
సీ॥ "ఈవొక్కఁడవె జగంబెల్లెడ న్వ్యాపించి యఖిలదేహములందు నధివసింతు
జనకునివలె జీవసంరక్షకుండవు. జననివి. మఱి జీవసంజ్ఞకుఁడవు.
విశ్వసాక్షివి. మఱి విశ్వబీజంబవు. బ్రహ్మాండముల వెళపఱచితొందు.
జలరాశి నూర్మిలచందంబునను మఱి పుష్కరంబులలోన బుగ్గలట్టు
లుద్భవించి నీదునొడల బ్రహ్మాండమ్ము లడఁగు నీదునంగమంద మరల.
నొకప్డు నీదు నేత్రంబునుండియు ఫాలమందొకప్డు ప్రభవమగుదు. ౧౦౧౦
ఆ॥ ఇంకొకప్డు నీవు హిమవత్కుమారియుం బొందు సేసినప్డు పుట్టి జగము
సృష్టిసేయుచుందు. శివ! నీదునాజ్ఞ యందుం దుందు మెపుడు సురల మందఱమును.
ఆ॥ అగు దనంతుఁడవు ననంతవైభవుఁడవు. నఖిలభంగమునకు నద్భుతంపు
రూపుదాల్తుదేవ! యోపరమేశ! నీ వశివమూలఁ బవిత్ర మాచరింతు. ౧౦౧౨
కం॥ శివములు నిచ్చుచునుందువు. భవానిరో! తపమ్ములకును ఫలమగుదువుని.
వెవఁడు శివుఁడో హరివాఁ డెవఁడో హరి వాఁడె శివుఁడు. నిది నిజమనుచున్
ఆ॥ ఇట్లభేదబుద్ధి యించుకగలిగె యుష్మత్ప్రసాదమునను మాకు జనని!
దృష్టమును శ్రుతమగు త్రిజగముల్ లోపల బయుల వ్యాప్తమగుచుఁ బరఁగెదీవు.
తే॥ భువనపూజ్యా! సురేశిని! భువనవంద్య! యంబ! దేవేశి! దేవ! సాష్టాంగముగను
మ్రొక్కుచున్నార మందఱమును నను గ్రహింపు" దనిపల్కి చనిరి యథేచ్ఛ సురలు
కం॥ భవసింధుపోత మతుల మ్మవు నేతద్దివ్యరూప మాత్మను జింతిం
ప విముక్తసంగమయి పైజవనా! బ్రహ్మమునఁగలయు జగ మేమందున్. ౧౦౧౬

## — లక్ష్మీనారాయణ మహిమము —

ఆ॥ ఈప్రకారముగను హిమవత్కుమారిక యిడిన శాపమునను నెల్లసురలు
సంతువడయలేక సంతతం బెంతయు వంత ననుభవింపవలసె నౌర! ౧౦౧౭
కం॥ సాలగ్రామము గండకి నాలీల మహేశలింగ మగు నర్మద. సు
శ్రీలలితములై స్వయముగఁ గ్రాలు నకృత్రిమములగుచు క్షమనవి రెండున్.
కం॥ ఇరువదినాలుగువిధముల వరసాలగ్రామశిలల వర్తిల్లెడి శ్రీ
ధరుని బరీక్షింపఁగనగు. హరలింగం బేకరూపమయియే యుండున్. ౧౦౧౯
కం॥ సాలగ్రామజనుస్థలమై లలివహియించునట్టి యాగండకి కీ
లాలము గ్రోలియు నాడియు నోలిం బ్రజ బ్రహ్మపదము నొందు ధ్రువముగన్.
తే॥ గండకీసంభవంబౌచుఁ గ్రాలునట్టి యాశిలను విధివత్తుగా నర్చితంబుఁ
జేసినట్టిఁడు యోగసంసిద్ధివడసి శుద్ధ మానసుఁడగును సచ్ఛాద్రివర్య! ౧౦౨౧
కం॥ ఎది నీవడిగినవాఁడవో యది యుదితమునీ. కిఁకన్ మహాదేవున కే
విధమున బ్రాహ్మణశాపం బొదవెనో వచియింతు వినుము మహో పైజవనా!
కం॥ హరతాండవసంబంధము ధరజా దేహార్ధ వర్ణితంబును వాణీ
వర నుతిపూతమును నగు నీవరకథ విని బరమగతిని బడసెదరు జనుల్. ౧౦౨౩
కం॥ శ్లోకమొ శ్లోకార్ధంబో శ్లోకచతుర్థాంశమో విలుప్తవిరోధం
బై కౌటిల్యము మానము లేక పఠింప సుగతి యవలీల లభించున్. ౧౦౨౪
కం॥ చాతుర్మాస్యంబుననే యేతత్కథ విన్నఁ జదువ నిల ధనపుత్రా
న్వితంబై జన మెంతయుఁ జేతశ్చింతితపదార్థసిద్ధిని బడయున్. ౧౦౨౫
తే॥ ఎట్లు బ్రహ్మాదిదేవత లెల్లఁ గూడి యర్ధనారీనటేశ్వరు నంతికమున
గీతవాద్యాభియోగంపుఁ గృతి నవాప్తసిద్ధులై రట్లు పైప్రజ సిద్ధిఁబొందు. ౧౦౨౬
ఆ॥ వానకాలులోన వాసుదేవమహేశ్వరాంబికల గుఱించి యధికమైన
భక్తియోగ మాత్మపరిశుద్ధిమైఁ జేయు నరుఁడు కాఁడిఁకన్ స్తనంధయుండు.
కం॥ గణపతిపూజ్యుఁడు. నారాయణుఁడు పరున్నప్వాడైన. నంతకుఁబూజ్యం
డణిమాదిసిద్ధులొదవెడు నణఁకువతోఁ జేయఁబడిన యాతనిపూజన్. ౧౦౨౮
ఆ॥ భాస్కరుం డొసంగు బహుళతరారోగ్య మర్చ్యమానుఁడగుచు నధికభక్తి.
అధికఫలదుఁడగును నతఁడు చాతుర్మాస్యఁ బూజ్యమానుఁడగుచు భూజనులకు.
కం॥ ఏతత్పంచాయతనము ప్రీతిం బూజ్యంబు గృహికిఁ బేర్మిమెయిం ద
చ్చాతుర్మాస్యం బూజ్యము చేతశ్చింతితము దాన సిద్ధించు వెసన్. ౧౦౩౦

సీ॥ అర్చితంబై యెది యఘములం బోకార్చి యర్పితంబుగఁజేయు నఖిలజగము
వినుతింపఁబడి యెది విలయితకలుషమై వినుతంబులం జల్పు విష్టపముల
చదువంగఁబడుచు యత్సంబంధిపద్యము ల్పంకంబు నవలఘుం బొఱదోలు
ధ్యానింపఁబడి యెది మానసంబుఁజబుట్టు వృజినంబులన్నింటి వెడలనడఁచు
అహరహమ్ముగూడ నట్టి సాలగ్రామ బరఁగు హరిం ద్వారవతిని గలిపి
కొలువ ముగితిగలుగు. నలఘుచాతుర్మాస్య దర్శనంబె మోక్షదాయకంబు.

కం॥ సాలగ్రామగహరికిం జాల నివేదింపఁబడిన శాల్యన్నంబుక్
మేలగు నభిషేకోదక మాలలి సేవింప నింక నఘగఁగవలెనే. ౧౦౩౨

ఆ॥ అగ్గలంపుభక్తి నల్ల సాలగ్రామశిలను నర్పణంబు సేయఁబడిన
తిలలు బహుపవిత్రము సలుపు-చాతుర్మాస్య సంతమును విశేష మవరజాగ్రి!

తే॥ వాఁడు లక్ష్మీసమేతుండు వసుధనెపుడు-వాఁడు ధనధాన్యసహితుండు-వాఁడు భాగ్య
వర్గృహంబుల జనియించు-వాని శ్రీసనాథవిష్ణునిగా నెఱుంగవలెఁజుమ్ము. ౧౦౩౪

కం॥ సాలగ్రామస్థిత వనమాలిం బూజించువాని మందిరమందుక్
శ్రీలక్ష్మి సుస్థిరంబుగ హాళిని వసియించు శూద్రిజా! యేమందుక్. ౧౦౩౫

తే॥ ఎంతనఱ కచ్యుతుఁడు యజింపఁబడఁడో యంతవఱకె దరిద్రత యవనిఁ బ్రజకు.
అంతదాఁక నె గర్జించు నఘచయంబు-నంతదాఁక నె క్లేశంబు లంగమందు. ౧౦౩౬

కం॥ ఆ గరుడధ్వజుఁ డెచ్చటు బాగుగఁ బూజింపఁబడునో పంచక్రోశం
బొఁ గడుఁ బావన-మచ్చటి కేగఁగలే వశుభము లేక నేమనవలయుక్. ౧౦౩౭

ఆ॥ అదె మహాతపంబు-నదియె మహాభాగ్య మదియె మోక్ష మెచట నాద్యుఁడగుచు
లలినహించునట్టి లక్ష్మీశుపూజనం బాచరింపఁబడునొ యాలఘుభక్తి. ౧౦౩౮

సీ॥ ఏయింటిలోపల నెంతయు రాణమై వర్తించు దక్షిణావర్తశంఖ
మేమందిరంబున నెపుడును సుస్థిరంబగు లక్ష్మీనారాయణాత్మకంబు
ఏయగారంబునఁ గృష్ణసారంబగు తులసీమహీజంబు లలివహించు
ఏభవనంబున శోభాయమానమై ద్వారవతీశిల గూరియుండు
అచటు శ్రీయును విజయంబు హరియు ముక్తి యుండుశ్రీలక్ష్మీనారాయణుండుతను య
జించువానికిఁ బుణ్యంబు నించు.వాఁడు క్షణంబున ముక్తుఁడౌఁ దప్పకుండ.

కం॥ చాతుర్మాస్యను లక్ష్మ్యన్వితముగ మతింత యర్చనీయుఁడు హరి-యా
పీతాంబరధరు ధ్యానము పాతకహారమగుఁ గరంబు వైజవన! వెసక్. ౧౦౪౦

క॥ తులసీమంజరులను హరి నలచాతుర్మాస్యమున సమర్పించెడివా
రలు మరలం బుట్టరు-శ్రీఫలదళములఁ బూజసేయఁ బాపము లడఁగున్. ౧౦౮౧

ఆ॥ జగదధీశుఁడగుచు జగమెల్ల వ్యాపించి యెవఁడు సృష్టిలయము లెపుడుఁ జేయు
యత్నపూర్వకముగ నవ్వాఁడె సేవ్యుండు. కుంద దింక వానిఁబొందు జనము.

—• రామనామమాత్రమంత్రమహిమము. •—

సీ॥ వీరబాహుండును వీరభద్రుండును వీరసేనుండును భృంగిరాజు
రుచి తుటి నందీశ్వరుఁడు పుష్పదంతుండు కంటుక విఘటు వికంటకులును
మాలాధరోత్కటుల్ మణి హార కేశులు పాశధరుండు విభద్రకుఁడును
నరసుండు శృంగియు నరక పుణ్యోత్కటుల్ కణప మహాభద్ర కాలపులును
కాల ధనప భద్రక ధనద రక్తలోచన విరోచనులు వృషవాసువుఁడును
పారద వికటాఖ్య పంచశీర్ష ధ్వాంక్షి సింహవక్త్ర దీర్ఘజిహ్వాముఖులు ౧౦౮౩

క॥ తుండియు హంసకిరియును బ్రచండుండు మహోద్భుతుండు కాలిగ్రాహా
ఖ్యుండు త్రిశీర్షుఁడు మొదలగు దండిగణములు తిగకోట్లు తన సవిధమునన్

ఆ॥ భద్రకాళిఁగూడి "రుద్ర! జయజయ" యంచుచ్చరవము సేయుచుండ నొక్క
కాలమందు శివుఁడు కైలాసశిఖరమం దగజతోడఁ బరమమైన శ్రీని ౧౦౮౪

క॥ భూతప్రేతపిశాచము లేతెంచి సమీపమునకు నెంతయు నుతి సం
ప్రీతుని జేయఁగ నుండుడుఁ దోతెంచె వసంతమటకు ద్రుపులు రహింపన్ ౧౦౮౫

సీ॥ క్రొత్త మొగ్గలతోడ నత్తఱిఁ జెట్లు కరంబు ప్రకాశమానంబులయ్యె.
మందమందంబుగా మలయానిలము వీచెఁ. గవిచయంబునకయ్యెఁ గడుసుఖంబు
పుష్పించి కింశుకభూమీరుహములు వియోగిమానసముల నూపఁ దొడఁగె.
కామవికారసంక్రాంతంబులై బిట్టు ద్వంద్వముల్ క్రీడింపఁ దారసిల్లె.
అట్టి గాఢసమయమందు మనంబు లున్మాదయుతములగుట మదిఁ దలంచి
దండధారియగుచు దండను వసియించు నందికిం బినాకి నయనసంజ్ఞ ౧౦౮౬

క॥ సలిపిన నపు డాతఁడు "చాపలదోషము చాలుఁ జాలుఁ, బనివిని యిఁకమీ
రలు తపముసలుపుఁడీ గణము లనుటయుఁ దపంబువారు మొదలిడి రంతన్.

ఆ॥ అపుడు విశ్వజననియైన భవాని "యీయక్షమాల నీదుహస్తమందు
సతముఁ గానఁబడెడు శంకరా! యేమిజపింతొ చెపుమ, కలిగె సంశయంబు.

సీ॥ నీవొకండవె కాదె నిఖిలభూతములకు నాదిమూఁడవు సకలాధిపతివి.
జననియు జనకుఁడుం గనబడఁ డెట నీకుఁ. జుట్టంబులేనియుఁ జూడఁబడరు.

జాతి యియ్యదియంచు సరిగ నేరు నెఱుంగ. రేసును నెఱుఁగ నీ కితరముం డ్రు.
టురుళక్తమున విద్య నుచ్ఛ్వాసనిశ్వాసములు జపించెదు నిత్య మలఘు భక్తి.
లేదు నీకంటె నన్యంబు లేశమేని. యేది మది నీవు ధ్యానింతో యేమొ నీకు
నేను బ్రాణప్రియనె యైనయెడల నాకు నుడువు మది దేవ! యని గౌరి యొడలు పుడికి.
ఆ॥ అడుగ శంభుఁ డిట్టులను. "హరినామసహస్రసార మెపుడు ధ్యాయమాన.
మవ్విధమున సప్తమహావతారంబగు రామ నామ మెపుడు రహిఁ జపింతు. ౧౯౧
ఆ॥ బ్రహ్మరూపమైన ద్వాదశాక్షరము సనాతనంబు నేను నగకుమారి!
అక్షమాలఁబూని యన్వహంబు జపింతుఁ బద్మనాభుకరుణఁ బడయుపొంటె.
క॥ ఇరువదినాలుగువిధముల ధరణిం బ్రాదుర్భవించి తనరారెడి శ్రీ
హరి సద్గుణములు నిరతముఁ గరమర్థిని మనన సేతుఁ గాంతామణిరో! ౧౯౩
తే॥ తద్గుణంబుల సారంబుఁ దత్ఫలంబుఁ ద్ర్యక్షరంబును గ్రామత్రయాన్వితము స
బిందువును నగు ప్రణవంబు డెందమందు సతము ధ్యానించుచుందు నోచపలనయన!
ఆ॥ వేదసారమిద్ది. విశ్వపాధారంబు. నిత్యమును. జడంబు నిర్మలంబు.
ద్వ్యక్షరంబు. శాంత. మమృతంబు. సదూప. మమృతతుల్యమును. నియామకంబు.
ఆ॥ దీనిఁ దెలిసికొనినఁ ద్రెళ్ళు సంసారబంధనము క్షణములోన జనములకును.
జనమునుండి కల్మషసహస్రములు వాయు. నిదియె పరమగుహ్య మేణనయన!
ఆ॥ ఇదే మహామహస్సు ముదితరో! లోకమం దిదియె దుర్లభార్థ మెంచిచూడ.
ఇదె త్రిలోకములకు నెంతయు భూషణం. బిదియె జన్మకోటి నొదవునదియు.
ఆ॥ ఇందుబింబముఖిరో! యీద్వాదశాక్షరచింతనంబె యతను శ్రేష్ఠమైన
జ్ఞాన. మందుఁగూడ సరిగఁ జాతుర్మాస్యఁ జేయ బ్రహ్మదం బు. చింతితదము.
క॥ ఈయక్షరజస్తోత్రముఁ బాయక యెల్లప్డు మదిని వాక్కునఁ గ్రియ నే
ధీయుక్తుఁ డాశ్రయించునొ యాయన యిఁకఁ బుట్టఁబోవఁ డవనీస్థలిలోన్.
తే॥ ద్వాదశాక్షరమహిమంబుఁ దప్పకుండ వర్ణనము సేయుటకుఁ జతుర్వదనునకును
కాదుశక్యము. వేనోళ్ళ కాద్రివేయుపతికిసహిత మశక్య మిప్పు తెలంప. ౨౦౦
ఆ॥ జప్యమైనయట్టి సన్మంత్రమియ్యది. స్తుతము ధ్యాతమగుచు క్షోణి సర్వ
మాసములను నఘము మాపుఁ. జాతుర్మాస్యమున విశేష మింక ననఘచరిత!
ఆ॥ శ్రుతుల స్మృతిపురాణతతుల ననుసార మీద్వాదశాక్షరంబు తథ్యముగను.
చింతితార్థసిద్ధి చింతనమునన యా. యామ్యపుణ్యదాన. మమృతదంబు.
ఆ॥ ప్రణవసహితమైన ద్వాదశాక్షరమును విప్రబాహుజాతవిశులు మువురు

ఆ॥ ప్రకృతులందఱికిని ద్వాదశాక్షరమంత్రజపము పనికిరాదు సత్యముగను.
విప్రభక్తి దాన విష్ణుకీర్తన కాయశోషణములె వారి సుగతిఁజేర్చు. ౧౦౬౪

ఉ॥ వారికి రామనామమె యవశ్యము జప్యము కోట్యతీతపా.
అరయ రామరామయను ద్వ్యక్షరమంత్రము సర్వపాప సం
హారకమౌను. నిల్వఁబడి యధ్వగుఁడౌచు శయానుఁడయ్యు నీ
శ్రీరఘురామకీర్తనము చేసిన విష్ణుగణత్వ మొందెడిన్. ౧౦౬౫

తే॥ రామయనియెడి రెండక్షరములమంత్ర మగుసుబో మంత్రకోటిశతాధికంబు
ప్రకృతులందఱికిని నది పాపనాశకముగఁ జెప్పంగఁబడియెడి హిమగిరిభవ!

క॥ చాతుర్మాస్యనె యగుచో నేతచ్ఛ్రీరామమంత్ర మెంతయు ఫలదం.
బీతీరు మంత్రరాజము చాతుర్మాస్యమున లభించు సద్భక్తులకున్ ౧౦౬౭

తే॥ రామనామముకంటె నీరసఁ బ్రశస్తమగుచుఁ బఠనీయమైనది యాగుపడ దెట
రామనామాశ్రయులకు నోరాజముఖిరో! యామ్యయాతన యుండ దేమనివచింతు.

తే॥ విగ్రహంబులు మృతకముల్ విఘ్నకరము లైన దోషంబు లన్నియు నగకుమారి!
రామనామంబుచేనె విరామమొందు. సల్ప కీవిషయంబునం దర్చయింక. ౧౦౬౯

ఉ॥ స్థావరజంగమాత్మమగు సర్వజగంబున నంతరాత్ముఁడై
యేయెడయున్ రమించుట మృగేక్షణ! రాముఁడునాఁ బ్రకీర్తితుం.
డా వరరామమంత్ర మఖిలార్థనుసాధక. మెల్లజాడ్యముల్
పోవును దజ్జపంబునను. బూర్ణజయంబు రణోర్విఁ గల్గెడిన్. ౧౦౭౦

ఆ॥ అఖిలతీర్థఫలద మారామమంత్రంబు. కామదంబు కరము క్ష్మామరులకు.
రామచంద్రయనుచు రామయటంచు నుదాహరింత్రు దానిఁ దద్జ్ఞులు ౧౦౭౧

ఉ॥ ద్వ్యక్షరరామమంత్రజపతత్పరు కార్యము సిద్ధిఁబొందు వా
మాక్షి! గుణాకరంబయిన యమ్మనురాజము రామ సత్కటా
క్షేక్షణగోర వేల్పులును నెంతయుభక్తి జపింత్రుగాన నీ
వీక్షణనాది తజ్జపము నెల్లపుడుం బొనరించుచుండుమా. ౧౦౭౨

ఆ॥ రామనామజపము రహిమైనొనర్చువాఁ డఖిలకల్మషములఁ ద్యక్తుఁడగును.
రామనామమునకె నామసహస్రజంబైనయట్టి పుణ్య మబ్బఁగలదు. ౧౦౭౩

క॥ చాతుర్మాస్యనుబదిరె క్లైతత్పుణ్యంబు మిగులు. హీనకులుల దౌ
పాతకమంతయు దగ్ధంబైతీరును దజ్జపమున నద్రీంద్రసుతా! ౧౦౭౪

ఆ॥ అంతరాత్మమైన యారాముఁ డివ్విశ్వ మెల్లనిండి తేజ మినుమడింత
క్షణములోనఁ బూర్వజన్మార్జిత స్థూలసూక్ష్మపాపములను నుగ్గుఁజేయు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, కందూరు.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, కమలాపురం.
౩ వాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాడవరం.
౪ రామసింగుగారు - నెల్లుట్ల.
౫ ఇనిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు - ఆత్మకూరు.
౬ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

పో ష కు లు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరు జమీందారుగారు-నూజవీడు
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకొండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౦ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి:
౧౧ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, దుగ్గందూరు.
౧౩ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఆరుమూరు.
౧౪ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౫ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,
౧౬ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు-దేవిడి.
౧౭ సాకుంట శివశంకరరావు దేశముఖ్ గారు, జగితాల.
౧౮ కురికాల వెంకటేశ్వరరావుగారు. పరకాల.
౧౯ నండ చినవెంకయ్యగారు, దండమూడి.

స హా యు లు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ శివశంకరరావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, షాపురం.
౬ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రులుగారు, చెన్నపట్టణము.
౭ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౮ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

## శారదాబిల్లు నాందోళనము.

( :o: )

౧. హరవిలాస శారదాగారు ప్యాసు చేయించిన బాల్యవివాహ నిషేధశాసనమునుగూర్చి ప్రస్తుతము మనదేశమందగు నాందోళనము పత్రికలద్వారమునను శాసన సభలునకు వచ్చునని యీలోపల భయపడి చేయు నతిబాల్యవివాహములం గనను వింకను ననేకమార్గములను సర్వజనప్రత్యక్షము. కాని చేయఁబడు నాందోళనమంతయు నింకను నందఱికిని దెలియుటలేదనియే చెప్పనొప్పును. పత్రికలద్వారమునఁగాని వార్తలు దేశదేశముల వ్యాప్తములు కాఁజాలవు. మనదేశపుఁ బత్రికలు నూటికి 99 రిఫార్మరులచేఁ బ్రకటింపఁబడునవి యగుట సత్యములైనను నసత్యములైనను నీ శాసనమును బోషించు సంగతులే యందుఁ గానఁబడుచుండును. ఎంతెంత మహాసభలు జరిగి యెంత తీవ్రాందోళనము చేయఁబడుచున్నను మన రిఫార్మరుల పత్రికలు వానిపే రెత్తుకొనవు. ఒకవేళ నెత్తుకొనినచో దాఱుమాఱు చేసి యధిక్షేపించుచు నసత్యములే వెల్లడించును. ఎంతవాఁడైనను పూర్వాచారపరాయణుఁడు పంపిన వ్యాసమును బ్రచురింపవు. ప్రకటించిన ప్రతిసంగ్రహము చేసి ప్రచురించును. అస్మద్దేశభాషాపత్రికలు పూర్వాచారపరాయణులకుఁ జేయుచున్న మహాపకార మియ్యది. ప్రభుత్వము వారు తమభాష మనదేశమున వ్యాపింపఁజేసి జనుల మనముల మార్చుచున్నట్లు పత్రికలును నాస్తికప్రకటన వ్యాజమున

దేశస్థుల మనంబుల మొదలు చూఱగొని క్రమముగా మన మత మునకు విరుద్ధమైన యాంగ్లేయాచారములయందు బద్ధశ్రద్ధు లగునట్లు చేయుచున్నవి. ప్రకృతము మనకు రాజవిద్యయైన యాంగ్లభాష వోలెఁ దదాచారములనే నెలకొలుపఁ దలఁచు నట్టిపత్రికలకే వ్యాప్తి యెక్కువ. అవి యెంతదుర్నీతిబోధకములైనను జనసామాన్యమునకు వానియందే యభిరుచి యెక్కువ. అట్టివానినే సర్వదా పఠించి పెక్కండ్రు నష్టపథమునఁ బడుచున్నవారు. తత్రత్యవిషయములకుఁ బూర్వపక్షకములైన కొలఁదిపత్రిక లున్నను వానికి వ్యాప్తి చాలఁ దక్కువ. అట్టిపత్రికలు పీదగిలి మాసమునకును వారమునకును వెలు వడుచుఁ బైపత్రికల జయింపలేక యుండుచున్నవి. భారతీయులకు శాస్త్రసిద్ధములైన యజ్ఞయాగాదు లాచరింపఁబడినను ధర్మబోధలు చేయఁబడినను వేయేల యెట్టిపుణ్యకృత్యము కావింపఁబడినను వాని పేరెత్తకపోఁగా మీఁదుమిక్కిలి యజ్ఞములు హింసాప్రధానములనియు యాత్ర లనావశ్యకములనియు నేమేమోయనియుఁ బూర్వపక్షము చేయు మనదేశభాషాపత్రికలు చాల నక్రమ మాచరించుచున్నవి. తత్పతు లెట్టినిరక్షరకుక్షులైనను నట్టివ్యాసములు వ్రాసియిచ్చినఁ దాము మఱి కొంతపెంచి వానిని బ్రచురింతురుకాని యెంతకొమ్ములు తిరిగిన పండితుఁడైనను బూర్వాచారపరాయణుఁడగుచో బుట్టదాఖలు చేయు దురు. ఏవిధవపెండ్లియో యేరజస్వలావివాహమో యేచండాలుని దేవాలయప్రవేశప్రయత్నమో శ్లాఘించి కొండంతలుచేసి ప్రక టింతురుకాని యిచట నీయజ్ఞమయినదనికాని పండితసభ నడచినదని కాని యీయాత్ర పుణ్యప్రదాత్రియనికాని మఱిచియైనను వేర్కొనరు. తత్ప్రతికూలపత్రికలలోఁ ద్రిలింగప్రస్తుత మంతగాకున్నను గొంత యైనను బ్రాగుక్తమహానర్థములఁ దొలఁగించుటకుఁ దోడుపడుచున్న దని యనవచ్చును.

భారతీయుల భాగ్యము పండుపండెడిచో దినపత్రికగాఁగూడఁ బోఁగలదు. తత్సంపాదకులు తండ్రితాతలనాఁటినుండియు సంస్కృ తాంధ్రభాషలలోని యత్యుత్తమగ్రంథముల నన్నిటిని ముద్రింపించి

యాంధ్రదేశీయులకు మహోపకార మాచరించుచున్నారు. కాని దినపత్రిక యన్న సామాన్యకార్యముకాదు. బహుధనసాధ్యము. అట్టి పత్రిక లనేకసహస్రజనులు చందాదారులుగా నున్నఁగాని నిరంతరాయముగా సాగనేరవు. అందులకు దినపత్రికగాఁ జేయుఁడనిప్రోత్సహించువారుమాత్రము వేనవేలు బయలుదేరిరికాని చందాదారులుగా నుండువారుమాత్ర మింతగా బయలువెడలినట్లు కనుపట్టను. ఎప్పుడో యొకవ్యాసము వ్రాసిపంపుచున్న మన కూరక పత్రికపంపరా యని యనుకొనువారి ప్రోత్సాహము దినపత్రిక చేయుట కంత బలిష్ఠము కాఁజాలదు. అయినను దత్సంపాదకులగు వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు తరువాత స్వాభివృద్ధిహేతువైనను నారంభముననే యనేకులు చందాదారులగుటకే యాశపెట్టుకొనక యాత్మీయపత్రిక యర్థాకారమునకో లేక ప్రత్యహమో ప్రకటింపఁ బ్రయత్నించుచున్నారు. అందులకుఁ గొంత మూలధనము సేకరించి కార్య ముపక్రమింతురు. కలియుగ దానకర్ణులైన పిఠాపురపురాజాగారు కొన్నివేలధన మప్పుడే యొసఁగియుండిరి. వారో లేక మఱియొక మహారాజో మఱికొన్నివేలు సమర్పించిన దినపత్రికయై త్రిలింగ దేశము నుద్ధరింపఁగలదు. ఈ శారదాబిల్లును గుఱించి మనదేశమం దగుచున్న యాందోళనమునకంటె నినుమిక్కిలి యుత్తరహిందూస్థానమున నగుచున్నది. కాంగ్రెసునేమి గాంధిగారినేమి కలవరపెట్టుచున్నారు. కుంభమేళనమున గొప్ప యాందోళనము చేయఁబోవుచున్నారు. అక్కడి సమాచారములన్నియు నక్కడిపత్రికలు ప్రచురించుచున్నవి. అన్యభాషయగుట నస్మద్దేశీయుల కవి యంతగాఁ దెలియవచ్చుటలేదు. అట్టివిగూడఁ ద్రిలింగ తెలియఁజేయుచున్నది. బనారసులోఁ బండితజనైకవేద్యమై బ్రాహ్మణసమ్మేళనపత్రిక ప్రచురింపఁబడుచున్నది. పండితపామరోభయపఠనీయమై యదియే పత్రిక హిందీభాషనుగూడ నిపుడు వెలువడుచున్నది. అట్టి పత్రిక లస్మదాదులచేఁ గొన్ని తెప్పింపఁబడుచున్నవి. అందలి ముఖ్యవ్యాసము లపుడపుడు ప్రకటించుచుండెదము.

—

# బ్రాహ్మణ మహాసమ్మేళనము.

## (హిందీ పత్రిక.)

ది 2-12-1929.

శ్రీకాశీక్షేత్రమునుండి పండిత కమలనయనాచార్య శాస్త్రిగా రిట్లు హెచ్చరించుచున్నారు.—

ఈదినమువఱకు నేను గాంగ్రెసును రాజనైతిక సంస్థయని యనుకొని యుంటిని. ఇది యెప్పటికిని ధార్మికవిషయములకు నష్టము కలిగింపదనియు నమ్మకము కలిగియుండెను. ఎప్పుడు కాంగ్రెసునందుఁ బ్రధాననాయకుఁడగు మోతీలాలు నెహ్రూయను నాతఁడసెంబ్లీలో బహిరంగస్థలమున "ధర్మశాస్త్రములను నమ్ముటకై నేను సిద్ధపడి యుండలేదు. వానియందు నాకు విశ్వాసములేదు" అని చెప్పెనో యిటులనే మఱికొందఱు కాంగ్రెస్సునాయకులు "భారతవర్షమందు వర్ణవ్యవస్థయుండఁగూడదు. భోజనప్రతిభోజనములు వివాహములు నన్ని వర్ణములవారలుఁ గలసి చేసికొనవలయును. అస్పృశ్యతయను మాట యుండఁగూడదు. అందఱును స్పర్శార్హులే. ఈపనులను నెఱవేర్చుట మాముఖ్యోద్దేశము" అని చెప్పిరో యప్పటినుండి కాంగ్రెసు సనాతనధర్మధ్వంసకము గాన దానిని నశింపఁజేసినఁగాని సనాతనధర్మమునకుఁ దావులేదని తోఁచినది. నెహ్రూరిపోర్టునందు ధర్మరక్షణవిషయమై ప్రస్తావమే చేయఁబడలేదు. ఇట్టిస్థితిలోఁ గాంగ్రెసునందు మనము విశ్వాసముంచుట యెట్లు ఘటించునో? మనధర్మమును ధ్వంసముచేసికొని మనము సంపాదించెడి స్వాతంత్ర్యమెట్టిది? అది యస్వాతంత్ర్యమే యగును. ఈనాయకులు మాటలు చెప్పుటయేగాక ధర్మధ్వంసకమైన శారదాబిల్లునుగూడఁ బ్యాసుచేయించిరి. ఇట్టిసమయములో సర్వవిధములచేతను సనాతనధర్మసంరక్షణమునకై పాటుపడుచు వీరిని నిరోధించుట మనకుఁ గర్తవ్యము. సనాతన ధర్మావలంబియగువాఁడు తన మాన మర్యాదలను గాపాడుకొన నుద్దేశించెనేని మనదేశాచారములను మనధర్మశాస్త్రములను రక్షించుకొనఁదలంచి

నేని యట్టివానికి ధర్మనాశకులును బిస్కట్ కోడిగుడ్డు మొదలగు నభక్ష్యములను భక్షించునట్టియు రిఫార్మరులగు నాయకుల యధ్యక్షతచేఁ గళంకితమగు కాంగ్రెసును బహిష్కరించి తీరవలయును. ఎందుకనఁగా, దీనికిఁ బ్రధాననాయకుఁడగు గాంధి ధర్మశాస్త్రిగులను గట్టిగట్టి యొకమూలఁ బాఱవేయవలెనని చెప్పెను. గోవ్రను జాపించెను. ఒకసభలోని యాంగ్లేయవిద్యార్థులకు దొరకినంతవరకువిధవలనే కాని కన్యకల వివాహమాడవద్దని బోధించెను. తన సబర్మతీ భవనమునఁ జండాలురచేఁ బాకము చేయించి బ్రాహ్మణుల భుజింపఁజేసెను. చండాలుల మలమూత్రములను బ్రాహ్మణులచేఁ బరిశుభ్రము చేయించెను. రాజప్రతినిధికి బాలికలకుఁ బదునెనిమిది సంవత్సరము లతిక్రమించిన వెనుక వివాహము చేయుట నాయభిప్రాయమని తంతివార్త నంపెను. ఇట్టిపనులన్నియు ధర్మశాస్త్రవిరుద్ధములు. మహాపాప కార్యములు. ఇట్టివాని నాచరింపఁజేయందలంచిన గాంధి హిందూధర్మశాస్త్రప్రకారము మహాపాపాత్ముఁడు. ఇట్టివాని ప్రధాననాయకత్వముచే జరుపఁబడుచున్న కాంగ్రెసుధర్మధ్వంసకము. దాని విధ్వంసన మేమనకుఁ గర్తవ్యము. వీరుస్వాతంత్ర్యమిప్పించెదమని యాశపెట్టి మనవలన వోట్లను సంపాదించి మన మతమునకుఁ గంతపాశ మనఁదగిన శారదాబిల్లును దెచ్చిపెట్టినారు. ఇంకను మన ముపేక్షించి కాంగ్రెసు విఘటనము సేయమేని నాయకులనెడి నరపిశాచము లింక నెన్నియో బిల్లులను మన తలపై మోపనున్నారు. కనుక నోసనాతన ధర్మాభిమానులారా! మీ యాత్మ గౌరవమును గాపాడఁదలంచితిరేని కాంగ్రెసుకుఁ దిలాంజలుల నీయుఁడు. నేనును స్వరాజ్యమును గోరువాఁడనే- స్వదేశీయ వస్త్రధారణము నంగీకరించువాఁడనే- కాని యీ నరపశువులు భారతవర్షప్రాచీన సభ్యతను రూపుమాపి యాంగ్లేయ సభ్యతను స్థాపింపఁబూనుటను సహింపను. వర్ణాశ్రమయుత స్వరాజ్యసంస్థ మనకుఁ గావలెను గనుక నేను భారతీయుఁడనను ప్రతిమనుజుఁడును ప్రాచీనాచారములనే రక్షింపఁగోరు ప్రతిమనుజుఁడును గాంగ్రెసును బహిష్కరింపవలెను. ఇదియే యిప్పటి మనకుంగ కర్తవ్యము. ఇస్సో ధర్మము నాశ

ంచవలెఁ బ్రతినిధిమహాసభయందును గాంగ్రెసును బహిష్కరింపవలెను. స్వధర్మరక్షణమునకై ప్రాణసమర్పణముఁ జేయ సమకట్టి గురునానక గురుగోవింద సింహానుయాయులగు సిక్కులును గాంగ్రెసు సంబంధమును వదలుకొనవలయును. వీరందరును ఢిల్లీలోఁ బ్రతిష్ఠితమైన వర్ణాశ్రమ స్వరాజ్యసంఘము నను వెంబడినై వర్ణాశ్రమ ధర్మరక్షణముఁ జేయుచు స్వరాజ్యాందోళనముఁ జేయవలయును. అట్లుచేయలేని భారతవర్షీయ మాన మర్యాదలు నశించును. ఆంగ్లేయ నాగరకతయే మిక్కిలిగ ఘటించును. దీనివలన ననేకానర్థములు పొసఁగును.

కాశీక్షేత్రమునకు గాంధి వచ్చినప్పుడు షుమారు 20000 వేల జనులు నల్ల జెండాలతో బయలుదేరి గాంధి ప్రభృతులను బహిష్కరించిరి. కలి రాక్షసులగు నీదేశనాయకాభాసుల కపజయము కలుగనియెడల సనాతన ధర్మమునకుఁ దావులేదు. కనుక జాగరూకులు కండు లెండు. ఉత్తిష్ఠత! జాగ్రత!!

---

# శ్రీ పుష్పగిరి పీఠాధిపతులఁగూర్చిన పద్యములు.

శా. శ్రీమచ్ఛర్వాణి దేవదేవుఁ జగత్క్షేమంకరున్ శంకరున్
భీమున్ దుర్జనభీమ నాశ్రితమనోభీష్టప్రదాతన్ సుర
స్తోమత్రాతను కృత్తివాసు నగవాసున్ జంద్రమౌళీశ్వర
స్వామిన్ గోపతిగామి నేఁ గొలుతు వాంఛాసిద్ధి కెల్లప్పుడున్

సీ. అఱువది నాల్గువిద్యలు పూర్తిగా నేర్చి
విద్వన్మణులను మెప్పించె నితఁడు
సర్వమతంబులు సమముగా నరసి జ
గద్గురుండనఁ గీర్తిగాంచె నితఁడు
మహి బౌద్ధచార్వాకమతముల నామావ
శేషంబుగాఁ జేసి చెలఁగె నితఁడు
ఈ భూమి భారతికి నుప్పదయింపఁగఁ బరకా
యపరివేష మొనర్చి యలరె నితఁడు.

గీ. శాంతశమదమసద్గుణస్వాంతుఁడగుచు
యతిశిరోమణినా భువి నలరె నెతఁడు.
అపరశంకరుఁడన నెతఁ డట్టి యాది
శంకరగురూత్తముని సదా సన్నుతింతు.

సీ. స్వీయ మహాత్తపస్తేజంబు వెలియయ్యె
ననఁగఁ గాషాయవసనము దవర
ప్రవిమలకీర్తిధావళ్యమో యనునట్లు
తనువునందు విభూతి దనరుచుండ
నారాయణస్మరణద్యోతకంబనఁ
గేలున జపమాల గ్రాలుచుండ
తనరు నోంకారమంత్రపఠనమనురీతి
నోష్ఠద్వయీవాద మొప్పుచుండ

గీ. అపరశంకరుఁడననొప్పునట్టి పుష్ప
గిరిమహాపీఠసామ్రాజ్యభర్తు యతివ
రంసు నభినవోద్దండవిద్యానృసింహ
భారతీస్వామికి ననేకవందనములు.

శా. ఘనపాపాంబుదవాయురూపము మహాజ్ఞానాంధదీపంబు పు
ణ్యానిదానంబు పవిత్రముల్ సుజనవారామోదసంధాయకం
బనఘా! తావకదర్శనంబు ఘటనం బయ్యెంగదా! నేఁడు నా
కని మోదించెద నిమ్మి ధన్యుఁడను విద్యానారసింహప్రభూ!

మ. స్వమతద్వేషుల ధర్మదూరులను సంసారార్ణవోద్భ్రాంత సం
తమసోద్విగ్నుల నీతిబాహ్యుల దయాతాత్పర్య యుక్తుండవై
విమలస్వాంతులఁ బుణ్యవంతులనుగా వేడ్కన్ బొనర్పన్ సము
న్నతమహీమండలమం దొనర్చెదవు సంచారంబు యోగీశ్వరా!

చ. స్ఫటికశిలావినిర్మిత శివాధవలింగము వజ్రిమౌక్తికా
ఘటితకిరీటహారములు కాంచనభూష లలంకరించి నీ
స్ఫుటముగ మంత్రముల్ చదువుచున్ నివసింపఁగ [illegible]
వటు నభిషేకపూజన లొనర్పఁ గనుంగొని [illegible]
[illegible] నా [illegible]!

సీ. లోకుల నొకసరిలుం డొకసరిలుఁడను
రక్షకభటరాజి రవము సెలఁగ
ఘనజటారూపంబుగా వేదపాఠం బొ
నర్చువిప్రాళి నినాద మెసఁగ
చిమపాలికయుండ సేవఁ జేయుచు నెప్డు
శిష్యావళి పరివేష్టించియుండ
ఇరుపార్శ్వములను జామరములు గైకొని
వారలు వీచుచుఁ జేరియుండ
గీ. వేత్రహస్తులు గొలువఁగా వివిధవాద్య
రవములొప్ప గజోష్ట్రసైంధవపదాతి
బలముతో నున్న నీవైభవంబుఁ జూడ
సమయము లభించె యతిలోకచక్రవర్తి!
ఉ. కన్నులపండువయ్యె మిముఁ గాంచఁగ. ధన్యుఁడనైతినయ్య. నా
పున్నెపుఁ జెట్టు పెద్దదయి పూచి ఫలించెను. మీదు దర్శనం
బెన్నటికబ్బునో తెలియు టెట్లు? లభించును గోరినప్పుడే
చెన్నటికో జగద్గురు! ప్రసిద్ధవిశుద్ధతపోధనాగ్రణీ!
గీ. రాక కుప్పొంగునట్టి సంద్రమునఁగఁ దమ
రాకకు ముదించినాఁడ సర్వసమమూర్తి!
ఆగమంబున కలరు బ్రాహ్మణుఁడన భవ
దాగమమున కుప్పొంగితినయ్య నేను.
గీ. తరణి నిందించు నా దివాంధంబులట్లు
కౌముదిని గేరునట్టి చక్రంబులట్లు
అవనిఁ గొందలు మూఢజనావళి తమ
రాక నిందింపఁ గలదొకో మీకు లోటు?
మా. అరవిందేక్షణ దివ్యపాదకమలధ్యానానురక్తుండ శ్రీ
ధరరాడ్భూసుఁడ విష్ణుదాసకుల శుద్ధక్షీరవారాశి శ్రీ
గిరిజానాథ శిరోవిభూషణుఁడ లక్ష్మీకాంతనామాంధ్ర భా
షాకవితారతుండ బుధదాసుండన్ జగద్దేశికా!

(A)

# సచ్ఛూద్ర సత్యచరిత

—:o:—

కమ్మ, రెడ్డి, తెలగ, వెలమ మహాశయులారా !

జగత్పితయగు పరమేశ్వరుని నాల్గుభాగములైన శరీరమందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లుద్భవించిరనియు సంస్కృతవాఙ్మయములో వారికి శర్మ వర్మగుప్త దాసులను నుపనామములు వ్యవహారములో నుండెననియు మీపెద్దలు సమ్మతించియుండఁగాఁ బాశ్చాత్యుల వ్రాఁతలు ప్రమాణములుగా నమ్మి బ్రాహ్మణేతరుల మనియు ద్రావిడులమనియు సూర్యదేవర రాఘవయ్యగారును త్రిపురనేని రామస్వామిచౌదరిగారును వెలగల సుబ్బారెడ్డి (మారుటేరు, పశ్చిమగోదావరి)గారును స్వజాత్యవమాన గ్రంథములు వ్రాయుచు బ్రాహ్మణనిందతోఁ బూర్తి చేసిరి. బ్రాహ్మణులలోఁ బంచద్రావిడులు (మచ్ఛభుక్కులు కానివారు) పంచగౌడులు(మచ్ఛభుక్కులు) గలరుగాని యాంధ్రశూద్రులలో ద్రావిడులు లేరు. ఇపుడిపుడే మాదిద్రావిడాదిమాంధ్రుల మని మాలమాదిగెలు బయలుదేరినారు- బ్రాహ్మణులుకానివారెల్ల బ్రాహ్మణేతరులే గాన నపుడు మాల భాగ్యరెడ్డివర్మగూడ బ్రాహ్మణేతరుఁడ ననును. అపుడు మీ బ్రాహ్మణేతరశబ్ద మపహాస్యముగాదా?

ఆంధ్రవాఙ్మయములోని—

౧॥ కమ్మ= దేశ్యపదము= కమ్మనాఁటి బ్రాహ్మణులు- కమ్మలు లేక కరణకమ్మలు—ఈ బ్రాహ్మణులైన కమ్మలలో బొబ్బూరి కమ్మలు బడగలనాఁటి కమ్మలని పలుభేదములు గలవు- వీరే శాసనములలోని. ప్రతిగ్రహీతలు- కమ్మనాఁటిలోని శూద్రులును గమ్మనారె-వీరే పలు కృతులందిన వాసిరెడ్డివారు యార్లగడ్డవారు మొదలగువారు.

౨॥ రెడ్డి= దేశ్యపదము= ఇందుఁబాకనాఁడు వెలనాఁడు మున్నగు పలుభేదములు గలవు- పాకనాఁటిలోని బ్రాహ్మణులు శ్రీనాథాదులు; పాకనాఁటిరెడ్లు శూద్రులు. వీరే యిప్పటి దోమకొండ ప్రభువులు— పలుకృతులందిన వారు-వీరిలో మల్లారెడ్డి విద్యావంతుఁడై శివధర్మోత్తరము వ్రాసెను. అందుఁదాను శూద్రుఁడ ననెను- వీరివంశీకు

లింగాకరు భద్రాయురభ్యుదయము కృతినందిరి- అందు సచ్ఛూద్రుల ముని కంఠోక్తిగా వ్రాయించుకొనిరి. ఇట్లె వెలనాటిరెడ్లు వెలనాటి బ్రాహ్మణు లాదిగాఁ గలరు.

3॥ తెలగ= దేశ్యపదము= తెలుఁగుదేశపు బ్రాహ్మణులు- తెలగాణ్యులు. తెలుఁగునాఁటిశూద్రులు, తెలగాలు. వీరికి దేశభేద ముల ననుసరించి బలిజె కాఁపు మున్నగు పట్టపుపేరులు గలవు. వీరిలో మధురమండలమేలిన చేవప్పనాయుఁడు వెంకటకృష్ణప్పనాయుఁడు మున్నగువారు ప్రఖ్యాతయశులు. ఇందు వెంకటకృష్ణప్పనాయుఁడు సారంగధర చరిత్రలోఁ దాను శూద్రుఁడనని వ్రాసికొనెను.

4॥ వెలమ= దేశ్యపదము= వీరికిఁ బద్మనాయకాదులగు పట్టపుపేరులు గలవు. ఇందు జటప్రోలు సంస్థానాధిపతి మాధవరాయ శింగారు చంద్రికాపరిణయము వ్రాసెను. అందు విష్ణుపదకమలమందుఁ దన పద్మనాయకకుల ముద్భవించెనని వ్రాసెను. ఇట్లు కొన్నిగ్రంథము లలో విష్ణుపదకమలమందుఁ బుట్టిరనియుఁ గొన్నిగ్రంథములయందు బ్రహ్మదేవుని పదకమలమందుఁ బుట్టిరనియు వీరు తుర్యతురీయజాతి నాలుగవజాతి యవరవర్ణము మున్నగు శూద్రశబ్దార్థసూచకపదంబు లనే వాడిరి.

ఆంధ్రదేశము నాఁడులుగా విభజింపఁబడిన కాలమున నాయా జాతులలో ముఖ్యముగా నాద్యంతజాతులయిన బ్రాహ్మణులు శూద్రులు నాయా నాఁడుపేరునే సంకేతముగా నిడుకొని యిటీవల జీవనార్థమై పలుదేశముల కేగినను మొదటి నాఁడుపేరు నిప్పటివఱ కాయా జాతియం దభిమాన మున్నవారు వాడుకొనుచున్నారు. విధ వావివాహము జాత్యంతరవివాహము వివాహబంధవిచ్ఛేదము గోరు సంస్కర్తల కొక జాతినిర్ణయము లేదు. ఆర్యసమాజ మతానుసా రము తండ్రిదియొకజాతి గుణకర్మములనుబట్టి పుత్రుని దొకజాతి యుద యస్నానజపాదులు చేసిన నొకజాతి మధ్యాహ్నము బేరముచేసిన మఱొ కజాతి యనంతరము రాజకీయోద్యోగముచేసిన నింకొకజాతి యప జి. యస్. బి. సరస్వతి శిష్యుఁడగు సూర్యదేవర రాఘవయ్యా వాని సతీ

ర్థ్యుఁడగు వెలగల సుబ్బారెడ్డి మున్నగువారి మతము. ఈ కలిలో నట్లు లేదు, జరుగదు. కూడదని మామతము. కావుననే, రాఘవయ్యయు వెలగల సుబ్బారెడ్డియు వారిశిష్య ప్రశిష్యులును మా చతురాననసంతతి బ్రాహ్మణులను, బ్రాహ్మణఋషులను నన్నుఁగూడఁ దిట్టనారంభించిరి. మా వైదికబ్రాహ్మణులలోఁ గూడ వేగినాఁడు వెలనాఁడు ములికినాఁడు తెలుఁగునాఁడు కోసలనాఁడు నని భేదములుగలవు. జీవనార్థమై పలుదేశముల కేగిరి. ఆయాదేశనామములతో వ్యవహరింపఁబడిరి.

---

{ కమ్మ రెడ్డి తెలగ వెలమలకుఁ బూర్వప్రభువులు శూద్రులమని సమ్మతించి వ్రాసి వ్రాయించుకొన్న ప్రబంధములు. }

౧. కమ్మవారందినకృతులు:- ద్రౌపదీపరిణయము-ఇయ్యది యమరవాది రామయనామధేయకవివరునిచే వ్రాయఁబడి ముక్త్యాల సంస్థానాధీశ్వరులగు రాజా వాసిరెడ్డి ముక్తీశ్వరప్రసాదు బహద్దరు జమీందారు మన్నెసుల్తాన్ గారికిఁ గృతియొసంగఁబడినది. ఇందుఁ గమ్మవారు శూద్రులని కంఠోక్తి;

మ॥ నిరతధ్యాన మునీంద్రహృద్భవనసందీప్తప్రదీపంబు శ్రీ
కరసంవాహనసంయుతంబు నతలేఖస్ఫారచూడావళీ
కరనీరాజనరాజితంబునగు శ్రీ కంజాక్షుపాదాబ్జమం
దు రహిన్ గంగకుఁ గూర్మితమ్ములయి శూద్రుల్పుట్టి రచ్చోకృతిన్.

ఉ॥ అమ్మధుజిత్పదోద్భవకులాఢ్యులలో నొకకొంద ఱాత్మభా
గ్యమ్మునఁ గల్మిఁ గమ్మదనమందుట దానమనీష నీప్సితా
ర్థమ్ములనిత్తు మర్థితతి రమ్మని కమ్మ లిఖించి సర్వదే
శమ్ముల కంపుటన్ ధరణి సన్నుతికెక్కిరి కమ్మవారనన్.

౨. కాంచీమాహాత్మ్యము. ఇది కొప్పరాజు సుబ్బరాయకవి విరచితమై శ్రీముక్త్యాలసంస్థానాధీశులందిన కృతియై.

చ॥ సరసిజనేత్రునాభి విధి సంభవమందెను. దత్పదంబులఁ
దురుతరశూద్రవంశము సముద్భవమయ్యెను. వారిలోపలన్
గరిమవహించి మించె ధరఁ గమ్మకులం బరయంగ. నందులో
వరమగు వాసిరెడ్డిఘనవంశము వాసికినెక్కె మిక్కిలిన్

3. కృష్ణామాహాత్మ్యము ఇది తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి గారిచే రచియింపఁబడి శ్రీముక్త్యాల సంస్థానాధీశులకే కృతి యీయఁబడినది.

సీ॥ నారాయణుని దివ్యనాభిపద్మమునందు
నలుమోముదమ్ములనలువ పుట్టె
అమ్మహాత్మునిముఖమందు విప్రులు భుజం
బుల రాజు లుదయించి రలఘుమతులు
వరయశస్సాంద్రులు వైశ్యకులోత్తము
లుత్సంగతలమున నుదితులైరి
పరమపవిత్రమౌ పాదాంబురుహమందు
శూద్రులు గలిగిరి సుభగమతులు

గీ. విధిముఖభుజోరుపాదారవిందములను
జనన మీరీతిఁగనె నాల్గుజాతు. లందుఁ
బాదసంభవకులములోఁ బ్రణుతిగాంచెఁ
వాసిరెడ్డ్యన్వయము చాల వన్నెకెక్కె.

౪. సరసహృదయానురంజనము. ఇది ములుగు పాపయారాధ్యులను మహాకవిచే రచియింపఁబడినది. శ్రీరాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడు బహద్దరు జమీందారు మన్నెసుల్తాన్ వారికడ మంత్రులుగా నుండిన పొత్తూరివారి కంకితమీయఁబడినను నందు శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రి నాయుఁడుగారి వంశ మిట్లభివర్ణింపఁబడినది.

క॥ అద్దేవుని ముఖకమలము
గద్దరి కమ్మదనమెల్ల గమ్మునఁ గ్రమ్మెన్
బెద్దయునది పెద్దలు గన
సద్దయగల కమ్మకులము సంభవమందెన్.

కం॥ ఈ మహిలో మహిమాస్పద
మై మహితులు మెచ్చ నర్థిమందారగుణో
ద్దామమగు కమ్మకులమున
శ్రీ మహితంబైన వాసిరెడ్డి కులంబున్.

౫. అహల్యా సంక్రందనవిలాసము. ఇదియు ములుగు పాప
యారాధ్యకవిప్రణీతమే. వాసిరెడ్డిప్రభువుల కంకితమీయఁబడినదియె.

ఉ॥ పావనమైన యా నలువ పాదసరోజమునందుఁ సంతతి
శ్రీ వెలయంగ సర్వగుణసేవితవైఖరిఁ గమ్మవంశ మూ
ర్త్యావనతత్పరంబగు నయాఢ్యతనొప్పెదదన్వవాయమం
దీవసుధాతలంబున నభీష్టమహావిభవానుభావముల్

౬. దేవీభాగవతము. ఇదియు ములుగు పాపయారాధ్యమహా
కవిప్రణీతమె. దీనిని శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడు
బహద్దరు మన్నెసుల్తాన్ గారి కంకితము గావించియున్న వారు.

చం॥ వదనమునన్ ధరాసురుల బాహువులన్నృపసంతతిన్ నయం
బొదవఁగ నూరుగర్భమున నూరుజులన్ జరణాంబుజంబులన్
బదపడి తుర్యవర్ణుల సమస్తగుణాభ్యుదయప్రపూర్ణులన్
విదిత మనస్కులన్ గనియె విశ్రుతి గాంచిరి వారు దిక్కులన్.

క॥ అక్కులమున రిపుతతులన్
జిక్కులు వెట్టుచు వెడంద సిరులం దోలన్
దిక్కుల మెచ్చంగ సొబగునఁ
జుక్కలదొరలనఁగఁ గమ్మశూరులు దొలున్.

౭. శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారి కంకితముగానే
కృతి యీయఁబడిన "వెంకటాద్రిగుణరత్నావళి" యను నలంకార
గ్రంథము సంస్కృతమున శ్రీ చర్ల వెంకటశాస్త్రిగారు రచించి
యున్న వారు.

తత్ర మహాకులీనతా నామ కులే మహతి సంభవః ॥యథా॥

శ్లో॥ యోభూద్బ్రహ్మాదిశేషామరమకుటమణిశ్రేణినీరాజితశ్రీ
నాథాంఘ్రేర్యస్య చైకా వహతి ధురమియం హ్యార్యరాఖర్వసర్వాం
సోదర్యాన్యా భవాన్యా రమయతి రమణం స్వర్ధునీపావనీశం
తత్ర శ్రీవాసిరెడ్డ్యన్వయ ఇహ జయతి శ్రీపతి ర్వేంకటాద్రిః ॥

౮. సుబ్బనృపాలీయము=ఇదియొక యలంకారగ్రంథము. దీనిని రచించినవారు గని శేషకవిగారు. కృతిపతులు బొమ్మలాపుర సంస్థానాధీశులును గమ్మకులావతంసులు నగు సుబ్బానాయుఁడుగారు. అం దిట్లున్నది.

గీ॥ గంగతోఁడుగ హరిపదకమలమందుఁ
బుట్టి యవరకులంబునఁ బూర్వగతిని
సార్థకంబని పూతమై యలరు నందు
వెలయఁ దాటంకకుల మిల విపులమగుచు.

౯. శ్రీకృష్ణభారతము. ఇది కవిరాజు శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచియింపఁ బడుచున్నది. ఈకృతినందుకొన్నవా రిప్పటికి సజీవులయి యున్న శ్రీమంతు రాజా నాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దర్ మన్నెసుల్తానుగారు.

సీ॥ సకలసురాసురశ్రేకరార్చితాచ్యుత
సదమల పదకంజసంభవంబు
పావనీకృతవిష్టపత్రయసురనిమ్న
గాకృపాకలిత జఘన్యజంబు
వేదవిద్యాభదేవ పాదపంకేజస
మారాధనాతి భక్త్యంచితంబు
న్యాయసమాసాదితాఖండ ధనసంచ
యాధరీకృత రాజశైలబిలము

గీ. శాసితఘంబు పరమార్థ సంయుతంబు
సన్నుతాచార నిరతంబు సదమలంబు
పరమవిభవంబు సత్కృతివర్ణితంబు
తుర్యవర్ణంబు కీర్తినొందును ధరిత్రి.

గీ॥ అల్లవర్ణంబునం దొగి నవతరించి
కమ్మవారన మిగుల విఖ్యాతిఁగాంచి
కొంజుప్పిడి వల్లుట్లగోత్రభవులు
భవసమారాధనాత్తవైభవులు కవులు.

## రెడ్డివారు - వారందుకొనిన కృతులు.

౧. భద్రాయురభ్యుదయము. ఈకృతికర్తలు రాపాక లక్ష్మీపతి కవివర్యులు. కృతిపతులు దోమకొండ సంస్థానాధీశులు, వీరు పాకనాటిరెడ్డికొలమువారు. వీరివంశావతారము__

సీ॥ శ్రీవిష్ణుదేవుని శ్రీముఖాబ్జమునందు
నతులాగ్రజన్మసంతతి జనించె
భాసురంబైన తద్బాహుదేశంబున
సదయపార్థివవంశ ముదయమయ్యె
దేవదేవునిసక్థి దివ్యస్థలంబున
వైశ్యాన్వయం బుద్భవంబునొందె
లక్ష్మీశపదకమలద్వంద్వమునఁ గీర్తి
సహితశూద్రకులంబు సంభవించె
గీ. నందు సచ్ఛూద్రనికర మింపొందుచుండ
నాఁడునాటికి శ్రీ పాకనాటిజనన
ముద్భవైశ్వర్యయుక్తమై యవనిఁ బరఁగె
రాజరాజేశ్వర కృపాభిరామ మగుచు॥

కం॥ ఆపాకనాటివంశో
ద్దీపకుఁడై కామినేఁడు దృఢతరబలసం
తాపితపరభూపాలకుఁ
డై పాలిచె సమస్తలోక మభినుతి సేయన్॥

౨. కాశీఖండము. ఇది శ్రీనాథమహాకవి రచితము. దీనిని గృతి నందినవారు రాజమహేంద్రిపురమును బాలించినవీరభద్రారెడ్డిగారు.

సీ॥ కలశాబ్ధికన్యకాకరపల్లవద్వయీ
సంవాహనక్రియాసంయుతంబు
నిఖిలవేదాంతవాణీవధూధమ్మిల్ల
బహుళపుష్పామోద భావితంబు
పరిణతనానాసుపర్వకిరీటసంఘాత
రత్నాంబునీరాజిరాజితంబు

సనకాది సన్మునీశ్వరమనోమండపా
భ్యంతరరత్నదీపాంకురంబు
గీ. పతగకేతను శ్రీపాదపంకజంబు
కారణంబుగ జన్మించె భూరిమహిమ
గంగ సైదోడు రిపుకోటిగళముత్రాడు
నాలుగవజాతి సమధికోన్నతవిభూతి॥

ఉ॥ రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస మష్టది
గ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర రాజరాజశ్రీ
రాజమహేంద్రభూభువనరాజ్యరమారమణీమనోహరుం
డాజిఁ గిరీటికీర్తినిధి యల్లయవీరనరేంద్రుఁ డున్నతిన్॥

3. భీమేశ్వరపురాణము. ఇది యనవేమారెడ్డి భూమీశ్వరున కంకితముగా శ్రీనాథమహాకవి రచించెను.

ఉ॥ కైటభదైత్యవైరిపదకంజమునం దుదయంబునొంది మి
న్నేటికి భూతధాత్రికిని నెంతయు నచ్చిన తోడఁబుట్టనై
హాటకగర్భముఖ్యనిఖిలామరమౌళి మహామణిప్రభా
పాటలవర్ణమైన యొకపావనవర్ణ మదీర్ణ సంపదన్॥

వ॥ అప్పూర్వవంశంబు కంసాసురధ్వంసి చరణపల్లవంబు తనకుఁ బుట్టినిల్లుగావునఁ గారణగుణసంక్రమంబునంబోలెఁ జామరత్రోమరచ్ఛత్రధనుఃఖడ్గాది మహోపశోభితంబై చదలేటి సీటివలని సోదరీయస్నేహలబ్ధంబులుం బోని పావనత్వ శుచిత్వ గాంభీర్యమాధుర్యంబులు చరితమనఃస్వభావచనంబుల ధరియించి సైదోడుంబోదివి విశ్వంభరాక్రీడనంబుదనకు దిక్కైన పరమక్షాంతి యాంతరంగంబున సంతరించి నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందుఁ బద్మనాయకులను వెలమలన, గవ్వలన, సరిసర్లన, వంటర్లన, బహుప్రకారశాఖోపశాఖాభిన్నంబులయిన మార్గంబులం ద్రిమార్గగంగాప్రవాహంబునుం బోలె గోత్రంబు లెన్నియేనియుఁ ద్రిజగత్పవిత్రంబులయి ప్రవహించుచుండఁ గల్పంబు లతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగయుగంబులు సరికడఁ సంవత్సరంబులు చని కాలచక్రంబు లతిక్రమించుచుండఁ

జతుర్ధకులమౌళిమండనంబై కీర్తివిహారఘంటాపథంబయిన పంటమహా
న్వయంబునఁ బాకనాఁటిదేశంబున భద్రపీఠంబున నధివసించి సింహ
విక్రమనగర దువ్వూరు గండవరాదిపట్టణంబులు నిజనివాసంబులుగా
భూరిలతాదష్టాష్టాదశ ద్వీపాంతరాళులగు భూపాగ్రిమణులం ద్రిలింగ
భూమండలాఖండలులను బోలయు వేమాన్నపోతాన్న వేమకుమార
గిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్యపీఠస్థులం గాంచె.

పైమూఁడుగ్రంథములు రెడ్లు కృతులందివి. ఇఁక రెడ్డివంశో
ద్భవుఁడును బండితాఖండలుఁడును గవిశిరోమణియు నగు దోమకొండ
సంస్థానప్రభువగు కామినేని మల్లారెడ్డి స్వయము రచించిన శివధర్మో
త్తరఖండమునం దిట్లున్నది. వ॥ అట్లంగీకరించి యదీయవంశావతార
వర్ణనాభిముఖుండనై యని చెప్పి యనంతరం బిట్లు చెప్పుకొన్నవారు.

సీ॥ అక్షుద్రరుచిసముద్యద్గ్రహనక్షత్ర
తారకల్ కుసుమసంతతులుగాఁగ
భూర్భువస్స్వర్ముఖ్యభూరిచతుర్దశ
భువనము ల్పత్త్రపలసివహంబుగ
పరిబలకూలంకషాంభఃపరిపూరితసము
ద్రంబులు మకరందరసఝరిగ
నబ్జజాది పిపీలికాంతనానాజీవ
గణములు విహగాదికములుగాఁగ

గీ॥ గరిమఁ గన్పట్టు నల విరాట్పురుషకల్ప
కంబు. తత్పాదమున నుర్వీ ఖ్యాతిసరణి
నుదయమై మించె విబుధసమ్మదవిభూతి
నాలుగవజాతి పూర్ణసంతానరీతి॥

మ॥ తెలివిన్ రంజిలునట్టి నాలుగవజాతిన్ గోత్రసంఘంబులో
పల గల్గం గమలాస్పదంబగుచు శుంభద్వాహినీమగ్న
జ్వాలమై తన్ ఘను లాశ్రయింపఁగను శేవన్ బాకనాన్వయం
బలఘుస్ఫూర్తి యశంబునొందె భువి శ్రీరాంభోధింబునన్॥

గీ॥ అట్టిపాకనాఁటియన్వయంబనెడు శ్రీ
రాబ్ధియందు నుదయమై తనర్చ

కల్పభూరుహాంబుకరణి రాచమళగోత్రి
మెలమి ద్విజులకెల్ల నిలయమగుచు॥
క॥ ఆరాచమళగోత్రిమునన్ ధీరవరేణ్యుండు కామినేఁ డుదయించెన్
భూరమణకటక తేజో రారాజన్మహిమఁ బురుషరత్నంబగుచున్॥
—* తెలగవారు. వారందినకృతులు *—
మారనయను మహాకవి శ్రీ ప్రతాపరుద్రుని కొలువునందు సేనానాయకత్వంబు సంపాదించిన మల్లయ్యనాయుఁడుగారి కాంధ్రి మార్కండేయపురాణము రచియించి కృతియిచ్చియున్నవాఁడు.
క॥ ఆరాజీవజముఖబాహూరుపదంబుల జనించి రొగి బ్రాహ్మణధా
త్రీరమణవైశ్యశూద్రిలు భూరిగుణోన్నతు లగణ్యపుణ్యచరిత్రిల్॥
ఆ॥ ఆ చతుర్థకులసుధాంబుధి నుదయించె
నమితకాంతిచంద్రిఁ డవనిభరణ
దిగ్గజేంద్రిమును వితీర్ణ మందారంబు
మల్లసైన్యవిభుఁడు మహితకీర్తి॥
౨. మధురమండలమేలిన తెలగనాయుళ్ళలో విజయరంగ చొక్కభూపాలుని మంత్రి సముఖము మీనాక్షినాయుని కొడుకు వెంకటకృష్ణప్పనాయుఁడు జైమిని భారతమను వచనప్రిబంధం బశ్వమేధపర్వము రచించినట్లు పాండ్యమండలచరిత్రిలోఁ గలదుకాని యందలికృతికర్త వంశావతారపద్యములు లభించలేదు. కాని వెంకటకృష్ణప్పనాయునికిఁ బూర్వుఁడో పరుఁడో యగు కేశవప్పనాయుఁడు సారంగధరచరిత్రిము కృతినందినట్లున్నది. అం దిట్లున్నది—
క॥ శరణంబులు జగముల కాభరణంబులు వేదములకుఁ బంకజలక్ష్మీ
కరణంబులు నారాయణచరణంబు లెసంగు శూద్రిజాతికి నిరవై॥
క॥ నాలవవర్ణంబనియెడు పాలసముద్రింబునందు భావుకలక్ష్మీ
లోలుఁడు లోకావనకరుణాళుఁడు శ్రీకేశవప్పనాయుఁడు వెలసెన్॥
—• వెలమవారందిన వ్రాసినకృతులు •—
౧. జటప్రోలు సంస్థానాధీశులు రేచర్లగోత్రిపవిత్రిలు సురభి మల్లక్షమాపాలపుత్రిలు పిల్లలమర్రి భేతాళనాయనింగారి వంశీయులు

మాధవరాయణింగారు "చంద్రికాపరిణయంబు పద్యకావ్య ప్రబంధంబు రచియించెను. అందుఁ దనవంశం బిట్లు వర్ణించెను.

సీ॥ పద్మాహితకరప్రభాభాసమానంబు
సురవాహినీభూతిశోభితంబు
కవిమండలగపీనికాయాదిగేయంబు
జగదేకపావనాచారయు
ముజ్జ్వలత్సదనీకయోగావలంబంబు
చారుపుష్కరపదసంగతంబు
ఘనసర్వమంగళాకాంతిరూపఖ్యాత
మనుగతానంతరత్నాంచితంబు
గీ॥ చెలఁగు నట్టి విష్ణుపదం బశేషభువన
మండనైకాభిపూర్ణతా మహితమగుచు
నింద్రియజ్ఞానవిషయతాతీతవృత్తి
యగుచు శ్రుతినివేద్య గుణాశ్రయంబగుచు॥

చ॥ వికసితపంకజాతనవవిభ్రమమై ఘనగోత్రతాభి
తకమరనాథమై యరుణధామవిభాసితమై ద్విజౌఘ
ప్రకటితహర్షయోగభరభావుకమై ధరయందుద్మనా
యకకుల ముద్భవించె నట నాత్మజనుప్పదతుఙ్ఖరిఙ్ ॥

క॥ ఆసంతతిఁ జాపకళావాసవి చెన్నొందె సింగవసుద్రుఁడు ఘో
రాసిమహోరాశి మహీహాద్భాసి హుతాశావతీరవంశజుఁడై॥

.౨ అలంకార చంద్రోదయము. ఇది యిపనేని శరభలింగకవివరునిచే రచియింపఁబడినట్లు శ్రీ కందుకూరి వీంగకవి కవుల చరిత్రలో వ్రాసెనుగాని వీరివంశావతారపద్యము దెక్కారణమునో వివరింపలేదు. కాని దీనికిఁ బీఠిక వ్రాసిన తిఁ వెంకటేశ్వరకవు లీయన నిమిత్తమాత్రపు శూద్రుఁడని వ్రాసియూరు. బందరు మున్నగుచోట్ల నీతెగలో నింతవఱకునున్న పెద్దలు ఛద్రులుగానే వాకొనుచున్నారు. సంస్కృత్త లెటులున్నను గాదస వారివారి పెద్దలే కాన విశేషించి వ్రాయునేల!

3. రంగారాయచరిత్ర. దీనిని గృతినందినవారు నర్సారావుపేటసంస్థానాధీశులగు రాజా మల్రాజు రామనృపాలమహాళిగారు. కృతికర్తలు దిట్టకవి నారాయణమహాకవిగారు. ఇందుఁ గృతిపతులు వెలమవారు. ఇందుఁ గవి యిట్లు వర్ణించెను.

వ॥ అని యనూనయుంచినఁ గౌతూహలంబు వొడమి కృతిపతి వంశావతారక్రమం బభివర్ణించెద ననె.

మ॥ సనకాదుల్భజియింతు రెవ్వని పదాబ్జాతంబు నేపుణ్యాళీ
లుని యుంఘ్రి జనియించి జాహ్నవి కడుం గొంకత్రియీజీవహా
వని యా సట్టి రమామనోహరుని దివ్య శ్రీపదాంభోరుహం
బున జన్మించిరి పద్మనాయకులు విస్ఫూర్తిఁ బ్రవర్తిల్లుచున్

క॥ ఆపద్మనాయకాగ్రణు
లేపలరెను వేడ్క డెబ్బదేడగుగోత్ర
వ్యాపాదితనియమస్థితి
దీపించిరి వెలమసంజ్ఞ దేజరిలంగన్

4. రంగారాయచరిత్రలోఁ గృతినాయకులగు రంగారాయుల వంశావతారం బి ట్లభివర్ణింపఁబడినది.

చ॥ పరమపవిత్రమా భువనపావని జాహ్నవి గల్గె నేమహా
పురుషుని పాదపద్మమునఁ బుణ్యాతమంబగు తన్మురద్విష
చ్చరణసరోరుహంబున నె సంభవమందిన కారణంబుచే
నరయఁగఁ బద్మనాయకులునా వెలమ ల్మతి గాంచి రిమ్మహిన్

ఇంతవఱకుఁజూపిన కమ్మ, కాపు, రెడ్డి, వెలమ శాఖీయుల ప్రభువుల వంశావతారఘట్టంబులందలి పద్యములలో నీశాఖీయులకు శూద్రపర్యాయంబులగు తుర్య తురీయ చతుర్థ నాల్గవ పాదసంభవేత్యాది పదంబులెగాని వర్మ క్షత్రియాది పదంబులు వాడఁబడలేదు. సరిగదా కొల్లూరుసభలో మన త్రిపురనేని రామస్వామికవిగారి శంకలగు 'బ్రహ్మవల్ల జనించలేదు, విష్ణుభక్తులగుటచే విష్ణుపాదమందుఁ బుట్టినట్లు వ్రాసి'రనుదానికిం బూర్వపక్షముగాఁ జూపిన యుదాహరణ పద్యభాగముల నిప్పటిపాతముగ గమనింపవలెను.

ఋషిగోత్రములున్నవారు బ్రాహ్మణులైనకమ్మలని ముందె తెల్పియుంటిని. అమరావతిశాసనములోని ఋషిగోత్రజులు బ్రాహ్మణులగుకమ్మలె. క్రీ. శ. 1000 సం॥ అమ్మరాజవిజయాదిత్యుని శాసనములోని ప్రతిగ్రహీతలును బ్రాహ్మణులగుకమ్మలే అందలి విశేష్య విశేషణము లేమాత్రపు సంస్కృతభాషాజ్ఞాన మున్నవానికిని దెలియఁగలవు. పూర్వకాలమునఁ గమ్మవారు బ్రాహ్మణులయి యుండిరని మన రాఘవయ్యచౌదరి వ్రాసెను. వారు బ్రాహ్మణులగు కమ్మలకుఁబుట్టిన కమ్మబ్రాహ్మణులేగాని శూద్రులగు కమ్మలకుఁ బుట్టిన బ్రాహ్మణులు గారు.

క్రీ. శ. 1011 సం॥ పు టయిదవ పశ్చిమచాళుక్య విజయాదిత్యుని యాలూరుశాసనమునఁ జేర్కొనిన విప్రకులకమలభాస్కర దిండి పండితపుత్రేత్యాది పదవాచ్యులు కమ్మబ్రాహ్మణులని కప్పగంతు వేసెను. శూద్రులగుకమ్మవారనుభావము మదినుంచుకొన్నట్లు పై పదిప్రశ్నలనుబట్టి తేలునుగాని విప్రచరిత్రలో విప్రుల విప్రజాతీయపురుషులఁ దిట్టుటచే నాతనిభావము గోడమీఁది పిల్లివాటముగానున్నది. అట్లే త్రిపురనేని రామస్వామిచౌదరిగారు తన సూతపురాణము ప్రథమభాగములో దేవతలను దేవఋషులను నిందించుచు విప్రుఁడా! బ్రాహ్మణేతరయువకులఁ గొండపల్లెకుం గొంపోయి పరాభవించఁదలఁచితివిగా! నీమాయ లెన్నాళ్లు సాగు ననుటకు బ్రాహ్మణేతరయువకులం గొంపోయి కాకతీయరాజ్యాంతమందుఁ గొండపల్లి కొండవీడు నమరావతి వెంకటగిరి మధురపత్తనదుర్గము లేలించి వారివద్ద విప్రులు మంత్రులుగానుండి కంటెని ఱెప్పవలెఁ గాపాడిరని కలకూరగంపలో మున్నె వ్రాసితినిగాన విప్రశబ్దము శూద్రులగుకమ్మలపరముగాదని తేలినదిగదా!

కొల్లూరుసభలోని వివాదలో వైశ్యులకన్న ముందు కమ్మరెడ్డి మున్నగు సచ్ఛూద్రులకుఁ దీర్థప్రసాదాదు లీయిలు లేదనిచెప్పిన పుష్పగిరిపీఠాస్థానపండితులగు మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులుగారికి వాదకాలమందుఁ బైనాల్గుజాతులవారి పూర్వచరిత్రలు లభింపక

మార్కండేయోత్తరపురాణోత్తరభాగము మాత్రమే లభించినందున నందలిశ్లోకములనుబట్టి పై నాల్గుజాతులవారు తల్లిజాతినిబట్టి సంకరులని వ్రాసిరికాని యది సత్యేతరము. ఈకలిలో గుణకర్మములనుబట్టి జాతులేర్పడినవను రాఘవయ్యచౌదరి సిద్ధాంతమును ద్రావిడులము మాపూర్వులు చెంచులని వ్రాసిన శ్రీ. రామస్వామిచౌదరిగారి సూతపురాణపు రెండవభాగసిద్ధాంతముగూడ నట్టివియె.

ఇందుఁ బైనాల్గుజాతుల ప్రభువులలోఁ గమ్మవారు రెడ్లంఁ గలసిమెలసియున్నట్లు ద్రౌపదీ పరిణయములోని యీక్రిందిపద్యముల వలనఁ గాననయ్యెడి [వసుధ రాజ

గీ॥ తిరుగఁబడినట్టి పశ్చిమాధిపుల స్వభుజపటిమ నరిగాపుల నొనర్చి
రాజనెడి వాసిరెడ్డికి నోజనిల్పె సారశాలి సదాశివవీరమౌళి॥

గీ॥ వాసి రెడ్డికి నిల్పుటవలన నాఁటఁ బట్టి ధాత్రి సదాశివప్రభుని కతని
వంశమునఁబుట్టువారికి వాసిరెడ్డి వారనెడి ధీరపౌరుషాహ్వయముగల్గె.

చ॥ తనహృదయంబునం దల సదాశివనాయని దోఃపరాక్రమం
బున కెద మెచ్చి రెడ్డి నృపపుంగవుఁ డాద్రవిడాభిధోపవ
ర్తనమునఁ గొంతిరాజ్యము గరమ్ము దిరమ్ముగ నేలుకొమ్మటం
చు నొసఁగె నా సమిజ్జయ యశోధనశాలికి శౌర్యహేళికిన్॥

ఇట్లు సప్తసంతానములలో నొకటియగు కృతులందితాము వ్రాసి మాచతురాననసంతతి బ్రాహ్మణభక్తిపరులై కృతికర్తలకుఁ దాంబూల జాంబూనదాంబరాభరణాగ్రహారాదు లొసంగి పుత్రపౌత్రపారంపర్యముగా మాకు జీవనోపాధు లొసంగిన ప్రభువంశీయులయిన మీర లీ కలిలోఁబుట్టినజాతి వదలి యింకొకజాతికిఁ జెందినట్లు వ్రాయు గుణకర్మ జాతిసిద్ధాంతము మాగొంతులోఁ బ్రాణము లున్నంతకాలము సహింపము. బ్రాహ్మణులు తమకు వేదముచెప్పలేదను క్రౌర్యముతో మన సూర్యదేవర రాఘవయ్య (కమసాలి) విశ్వబ్రాహ్మణుల పాదముఁబట్టి వేదము సదివి వారికి గురుదక్షిణగా మమ్ము మాజాతిని మాజాతి ఋషులగు వశిష్ఠాదులను బూతులుదిట్టుట కంతకన్న సహింపము.

వెలగల సుబ్బారెడ్డి సూర్యదేవర రాఘవయ్యలవలె వేమనపద్యముల లోని ప్రక్షిప్తముల నిరాధారముల నశాస్త్రీయములఁ బ్రమాణములు గాఁజూపి నిందింపఁదలఁచిన ననేక పద్యము లీపై నాల్గుజాతులవారిపై జాతిద్వేషముచేఁ గల్పించి వ్రాసినవి చూపఁగలను. పై నాల్గుజాతుల వారు పరిశుద్ధయోనిబీజసంభవులుగాని సంకరజాతులు గారని పై గ్రంథములే సాక్ష్య మిచ్చుచున్నవి. వలయుచో సభాముఖమునఁ జర్చింతము.

## ముగింపు

రెడ్డికులనిర్ణయచంద్రికకుఁ బీఠిక వ్రాసిన జి. యస్. బి. సరస్వతి రెడ్డివారికిఁ గాకతీయులకుఁ గమ్మవారికిఁ గాకతీయులకు సాగివారు మున్నగువారికి సంబంధము లున్నట్లు కల్పితగాథలు గనఁబఱచెను. కాలకర్మవశమునఁ గాకతీంద్రుని గొల్చి కాపులెల్ల వెలమకమ్మలైరి, యని పద్మనాయకచరిత్రలో నున్నట్లు మన సూర్యదేవర రాఘవయ్య జి. యస్. బి. సరస్వతినడిగిన 5 వ ప్రశ్నగా వ్రాసి గోదావరిపత్రిక 8-6-20 లోఁ బ్రచురించెను. ఇదిగాక కొందఱు కమ్మ, రెడ్డి, తెలగ, వెలమ ప్రముఖులు కాకతీయులవద్ద సేనాధిపతులైయుండి కాకతీయ రాజ్యాంతమందు వారిరాజ్యమును విభాగించి జమీందారులై ప్రభుత్వముచేసినట్లు చరిత్ర ప్రతీతిగలదు. సేనాధిపత్యము హైన్యమన్న చోఁ గొమ్మనదండనాథుఁడు ద్రోణాచార్యాదులు సేనాధిపతులేగదా. రెడ్డికుల నిర్ణయచంద్రిక నిర్మించిన శేషాద్రిరమణకవులు రెడ్లు క్షత్రియులనుటకుఁ గొందఱు క్షత్రియులతోను క్షత్రియాభాసులతోను బాంధవ్యము లున్నట్లు వ్రాసిరి. భద్రాయురభ్యుదయము కృతినందిన దోమకొండ ప్రభువులు దాము శూద్రులమని కంఠోక్తిగా వ్రాయించి కొనియుండ ఇంటివాఁడు పట్టిగేదెయనిన బయటివాఁడు పాడిగేదెయనె

ననుసామెతగా నిప్పటి రాజరాజేశ్వరరావుగారిని మెప్పించుటకై యతికినదిగాని వేఱొండుగాదు. ఇట్లే ముక్త్యాలప్రభువులు కృతినందినకృష్ణామాహాత్మ్యములోఁగూడ బ్రహ్మదేవుని పాదకమలమందు శూద్రులు పుట్టిరనియు నట్టిశూద్రులలో వాసిరెడ్డివారివంశము చాలవన్నెకెక్కిననియు వ్రాయించికొనియుండఁ గమ్మవారు క్షత్రియులని మోమోటమికై పొట్టకూటి సన్యాసులు పండితులు మున్నగువారు కల్పించిన యపార్థములు నమ్మి బొల్లిని మునిస్వామినాయుఁడుగారివంటి పాశ్చాత్య విజ్ఞానధురంధరులుసహితము దాము కాకతీయుల తెగలోనివారమనుట వింతగదా ! ఇట్టి దృష్టాంతముల నెన్నియో చూపితిఁగాన స్థాలీపులాక న్యాయముగా నీ ముగింపుమాటలేగాక పైనాలుగుజాతుల జమీం దారులందిన కృతులలోని వంశావతారఘట్టములు సవిమర్శగాఁ బరిశీలింపుఁడు.

గీ॥ "సప్తసంతానములలోఁ బ్రశస్తిగాంచి
ఖిలముగాకుండునది ధాత్రిఁగృతియొగానఁ
గృతి రచింపుము మా"...... కని కృష్ణదేవరాయలనెను.

అట్టికృతుల పైనాల్గుజాతులప్రభు లందిరి.

శ్లో॥ స్వగృహే పూజ్యతే మూర్ఖః, స్వగ్రామే పూజ్యతే ధనీ, స్వదేశే పూజ్యతే రాజా" యన్నట్లు పైనాల్గుతెగలలోని ప్రభువులు సామాన్యులా ? వారివంశచరిత్ర లారసి సత్కులీనతను బాటింపుఁడని మఱిమఱి హెచ్చరించు ప్రాక్టికల్ వాది, నుండ చినవెంకయ్య.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

## —* ద్వాదశాక్షరమాహాత్మ్యము. *—

ఆ॥ అని వచింప "ద్వాదశాక్షరమాహాత్మ్యమును సవిస్తరముగ వినుచు మనఘ!
ఊన్న వర్ణములను నొదవెడి ఫలయును నేను బానిఁజేయునైన విధము." ౧౦౬
క॥ అని గౌరి యడుగ శివుఁ డిట్లనుఁ "బ్రణవముతోడ ద్వాదశాక్షరమంత్రం
బును విప్రబాహుజోరుజులకుడినము జపింపవలయు నంబుజముఖిరో! ౧౦౭
తే॥ స్త్రీలు శూద్రులుఁ బ్రణవముజోలిపోక యది జపింపంగవలయుఁజూ సదమలాంగి!
ప్రణవమునువీడి ప్రకృతులకు గామనామమో షడక్షరమో జప మొనరుచునది.
చ॥ క్రమమిది సర్వవర్ణులకుఁ గంజదళాక్షి! జపంబునందునన్.
క్రమమునువీడిచేయ నరకప్రదుఁడౌవిభుఁ డల్కఁబూను" నా
నుమయను. "నేఁ దినరాత్రి మదినుంచి జపింతును శ్రీశుఁ. గాని వా
క్యములకుఁగూడ గోచరముగాని తదాకృతి యెట్టిదుండునన్" ౧౦౮
సీ॥ అనియిట్టు లడుగుటయును "నమోభగవతే వాసుదేవాయ" యన్ ద్వాదశాక్ష
రంబులు జపియింపు మంబుజముఖి! సదా. స్త్రీలకుఁ బ్రణవంబు చెల్ల" దనుచు
శివుఁడుత్తరంబిడె. శివ యంత "సప్రణవంబైనయప్పుడే ద్వాదశాక్ష
రంబగు, నాకుఁ దత్ప్రణవము దధికారమే యుండదంటివి యెట్టులింక
ప్రణవమందునేను బడయుదు నధికార" మనుడుఁ జంద్రచూడుఁ డఖిలదేవ
తలకు నాది ప్రణవ. మల త్రిమూర్తులు నందు సతులఁగూడి యుంద్రు సంప్రముగ
క॥ అం దఖిలభూతములు నింపొందఁగ భాగానుసార ముండును. మఱి యా
చందంబునఁ దీర్థంబులు నంద నసించెడిని. బ్రహ్మమది. మోక్షంబున్ ౧౧౦
ఆ॥ ఎపుడు నీవు దేవి! యెలమిఁ జాతుర్మాస్య హరినిగూర్చి తపము నాచరింతొ
అపుడు ప్రణవసహితజపమును గావింప యోగ్యయగుదు. వేమియున్న దింక. ౧౧౧
క॥ తపమునఁ గోరికిదీరును. దపమునన మహాఫలంబు దా ఘటియించున్.
తపమున సర్వము నగుఁ. దత్తపమే సులభంబుగాదు ధారుణిఁ బ్రజకున్. ౧౧౨
క॥ కీరితి సౌభాగ్యంబును నోరిమి నిజ మాదియైన యుచితగుణనికరం
బేరుపడుఁ దపమువలనను. జారుముఖీ! తత్తపం బశక్యముచేయన్. ౧౧౩
క॥ ఎపుడు తపము వర్ధిల్లునో యపుడే హరిమీఁదిభక్తి యభివృద్ధంబౌ.
ఎపుడది లేక కృతంబగు నపుడు తపంబునకు హాని యారంభమగున్. ౧౧౪
ఆ॥ ఎంతవఱకు విష్ణు నెద సంస్మరించి జిహ్వాంచలము పవిత్ర మాచరింతొ
అంతవఱకుఁ దపము లబల! గర్జిల్లెడి జనులదేహములను సంతతంబు. ౧౧౫

తే॥ ఎట్లు దీపము వెలిగింప నెంతగాఢమైన చీఁకటియైనను నాశమందఁగలదొ
అట్లు శ్రీహరికథనుండి యఘచయంబు పంచబంగాళమై పోవుఁ బద్మనయన !
ఆ॥ కాన హరిపరుండఁబూని చాతుర్మాస్య శుద్ధహృదయవగుచు శోభనాంగి !
ప్రణవసహితముగను బఠియింపు మంత్రరాజైనయట్టి ద్వాదశాక్షరంబు. ౧౦౮
ఆ॥ ద్వాదశాక్షరాధిదైవతంబయిన యా మాధవుండె ప్రీతమానసుఁడయి
బ్రహ్మరూపమగుచుఁ బరఁగు నఖండితజ్ఞానమొసఁగఁగలఁడు మానవతిరో !"

—* పార్వతి తపస్సు చేయుట. *—

క॥ అనియిటు వాక్ప్రచ్యుటయును విని చాతుర్మాస్యయందు వెడలి యుమ హిమా
వనిధరశిఖరంబునకును జనియెఁ దపంబును జరింప దానవరేఖా ! ౧౧౦
సీ॥ అష్టవిధంబైన యా బ్రహ్మచర్యంబు కడునిష్ఠమైఁ జక్కఁ నడపుకొనుచు
వసనత్రయంబు సుపవిత్రమంచు భావించి తనశరీరంబునం దాల్చికొనుచు
బాల్యమాదిగ నెట్టి బాసలైన వర్తించు మంచియాభులనొద్ద నుంచుకొనుచు
క్షమ లోనుగాఁగల సకల సద్గుణములు వీడిపోకుండఁ గాపాడుకొనుచు
శంకరునిగురించి సలిపినతపమునం బోలె మేలియొడలు తూలిపోవ
అల త్రికాలములను హరిశంకరుంగూర్చి సలిపెఁ దపము నియమములకొమార్తె.
సీ॥ ఏమె యోగీశ్వరధ్యేయమై వర్తిల్లు నేమె భువనవంద్యయై పరంగు
ఏమె యా జనయిత్రి యీ ప్రపంచమునకు నేమెయే ప్రకృతిస్వరూప తాను
ఏమె తటిత్కోటి కెన తనుకాంతియం దేమె గుణాతీత యేమె విరజ
యన్మయంబులు పృథివ్యప్తేజ ఆకాశగానంతముల్ యాద్వ్యాప్తి మఖిలజగము
ప్రకృతికంటెఁ గూడఁ బ్రాక్తనత యేమె స్పృహాదిరూపమునను ననుఁద్రుష్టి
దాత్రి యేమె యామె తపము చాతుర్మాస్యమునఁ బొనర్చి శుద్ధనైనమె నవుర !

—* మునులు శివుని శపించుట. *—

ఆ॥ అద్రిరాజతనుఁ యా ప్రకారంబుగా నుగ్రతపము సేయుచుండుటయును
హరుఁడు మరునిచేత నవమానితుండయి దేశదేశములను దిరుగఁదొడఁగె. ౧౧౩
సీ॥ కూరుచుండునుబోయి చారుధరాజము ల్పొడఁగాంచడ వానినీడలందు.
సుస్నాతుఁడగుఁబోయి శుద్ధజలంబులై తేజరిల్లెడి మేటితీర్థములను.
ఈఁదులాడునుబోయి యిద్దరి యద్దరిం దన్నిపాఱెడి యేళ్ళమిన్నలందు.
ఎగిరి దూఁకునుబోయి యెంపయేని యగాధజలములై విలసిలు కొలఁకులందు.
తాప మపనయింపఁ దత్ప్రకారంబుగా బలుశ్రమములు పడియు ఫలములేక
అలల లలిఁ జెలంగు యమునానదిం బడెఁ గడకుఁ బోయి గరళగళుఁడు శూద్రి !

వ॥ పడి యావగాహితుండగుడుఁ వై జవనా ! యిఁక నేమిచెప్పుదున్
మృడునిశరీరమందుఁగల మేటిస్మరాగ్ని దహ్యమానమై
వడి మతిబుద్ధిపోలె రహిఁబాసి కళంకము నల్లనై తనం
బడియెఁ దదాపగాజలము. పాదములంబడియాకె యంతటన్. ౧౯౫

తే॥ "కరుణ సేయుము దేవేశ ! ఏతమేను నీకు నత్తురాల" ననవృషు నీలకంఠుఁ
"డీసుతీర్థంబునకువచ్చి యేపుమాంసుఁ డాడుఁ దదఘసహస్రము లీడిపోవు. ౧౯౬

క॥ హారతీర్థమనఁగనియ్యది ధరణిని విఖ్యాతమగుచుఁ దా పుణ్యంబౌ
నరుగు" మటంచని యుచటనె హరుఁ డంతర్ధానమొందె యటుతరువాతన్ ౧౯౭

సీ॥ నలరాజు కడువేడ్క వచ్చి వసించెనా నంగంబు కడు మనోహరముచేసి
తుమ్మెదరెక్కలం దులఁదూఁగు నెఱులచేఁ గుదిరించి సొగసుగాఁ గొండసిగను
పాలమీఁగడఁబోలు భసితంబుచేఁ ద్రిపుండ్రములు లలాటమునం దమరదిద్ది
డమడమయనిమ్రోయు డమరుకంబును గేళ్ళ నెంతయు వింత వాయించుకొనుచు
మునులపల్లియలకుఁ జని యాడువాండ్రలో నాడి పాడి నవ్వి యాత్మచాప
లంబుఁ జూపుచుం దదంబుజముఖులను మోహసాగరమున ముంచివైచె. ౧౯౮

తే॥ పతులశుశ్రూషయును నింటిపనులు మాని యతఁడె పతియను భావన నగ్గలంబు
సరససల్లాపములు ప్రీతి సల్పుకొనుచు వెంటఁబడి రమ్మనీందుప్రిల వెలఁదులకట !

క॥ మును లా దుశ్శీలంబును గనుగొని కినుకనువహించి కరములఁ గఱ్ఱల్
గొని "యీ యనయుండెవ్వఁడొ చననీయక పట్టుకొనుఁడు చంపుఁ" డటంచున్.

క॥ వెనుదగులుటయుఁ బలాయనమొనరించెను విశ్వమంతయును జీవాంశం
బున నిండియుండు శంభుఁడు మునులకు భీతిల్లి యపుడు మ్రుచ్చువిధమునన్.

క॥ జ్ఞేయుండు గ్రాహ్యుఁడు భేద్యుం డాయన గాకుం గాటుయును నాగ్రహమున నా
పాయుధులందఱుఁ దోయిటఁ దోయములు గ్రహించి దృష్టి దోష్యవీధిని బోన్.

క॥ "యల్లింగముకొఱకై మునిపల్లియలం జొచ్చి మ్రుచ్చుపగిదిని దుష్టుం
డిల్లాండ్రను హరియించెనొ తల్లింగము ద్రెళ్ళి యిపుడ ధరఁ బడుఁగాతన్" ౨౦౩

మ॥ అని వాక్రుచ్చుడు వజ్రరూపధరమై నా శాపపున్నిష్పు చ
ప్పున నాధూర్జటి లింగము న్నఱకి యిబ్భూమిం బడన్ వైచె. నే
మనుదుం. దద్భగవానుఁ డంత రుధిరవ్యాప్తాంగుఁడై బిట్టు వే
దనకుం దాళఁగలేక మూర్ఛమునిఁగెం దా నేలపైఁ గూలుచున్. ౨౦౪

ఆ॥ అట్లు మూర్ఛవోయి యవనిపైఁ బడుటయు మునులు తత్సమీపమునకుఁ జనిరి.
అఖిలభూతములును నమరులున్ భీతిల్లి. రకట ! సంచలించె సకలజగము. ౨౦౫

చ॥ శివుఁడతఁ డంచెఱింగి ఋషిసింహులు మానసమందుఁ గుందుచున్
వివశత "దైవ మెట్లు మహనీయము. యెంతటిఘోరకార్యమున్
దవిలియొనర్చినాము సుమనఃపరిపూజ్యుఁడు సర్వసాక్షియౌ
భవు భగవాను మూఢులము పాపులమై గురితింపలేకహా! ౧౧౦౬

సీ॥ ఎవ్వనిదేహమం దీయెల్లలోకము ల్వర్తిల్లు నా జగత్స్వామి హరుఁడు
నిర్వికారుండును నిర్విషయుండును నిరుపద్రవుండును నిర్మముండు
నిస్పృహుండును మఱి నిరహంకృతియు నైన శంభుండు కరము నజ్ఞానదుష్ప
బులమైన మాచేతఁ దెలియంగఁ బడఁడాయె" నని యమ్మహేశ్వరు నంతికమున
కూరుచుండుటయును వారలఁగని పునశ్శాపభీతిచేత సరవి నతఁడ
దృశ్యుఁడగుచుఁ బఱచి దివికి గోలోక సంస్థితను సురభి సరగఁ జేరఁబోయి

సీ॥ "జగదుద్భవస్థితిసంహారములఁ జేయు నంబ! కైకొనుము నా యంజలులను.
జసభావముల నెల్లరం దృష్టిపెట్టెడి తల్లి పట్టుము నాదుదండములను
రసవిద్గణంబుచే వెస నెఱుంగఁగఁబడు మాత! గ్రహింపు మస్మన్నమస్సు.
బలమును స్నేహముం బ్రజకుఁ బ్రసాదించు నమ! తీసికొనుము నాయర్చనముల.
జననివీవు రుద్రసముదాయమంతకును. పుత్రివీవు వసుసమూహమునకు.
అనుజవీవు ద్వాదశాదిత్యులకు. వాంఛితార్థదాత్రివగుదు వందఱికిని ౧౧౦౮

సీ॥ తావకపదములం దావేదములు నాల్గు స్తనములలోనఁ దత్సాగరములు
రవియును శశియును భవదక్షియుగమున రోమంబులను సురస్తోమములును
శృంగద్వయంబున శిఖరిసమూహంబు శ్రవణద్వయంబున స్పర్శనములు
నాభిని బీయూష మాభీలఖురములం బాతాళములు మూపుపైని బ్రహ్మ
తల సదాశివుం డెదం గేశవుఁడు మలమునను బన్నగములు మూత్రమందు
సాధ్యలక్షులందు జన్నంబు లగ్రభాగమునఁ బితృగణంబు గ్రాలు నెపుడు.

ఆ॥ ఫాలమునను మఱి కపోలంబులను యక్షకిన్నరులును గలిగి యున్న నీవు
సర్వదేవమయివి సర్వభూతవివృద్ధికర్త్రివగుచు నుందు గాదె యెపుడు ౧౧౧౦

సీ॥ ధృతివి పుష్టివి నీవు బుద్ధివి స్వాహవు స్వధవును సిద్ధివి శ్రద్ధవగుదు.
లక్ష్మివి కీర్తివి లజ్జవు కాంతివి మతివియు మఱి మహామాయవగుదు.
సకలమహార్థసాధకవు. ముజ్జగములఁగూడఁ ద్వద్రహితంబు కొంచెముండ
దగ్నిభట్టారకుం డాదిగాఁగలయట్టి యమరాదులకుఁ దృప్తి యాచరింతు.
స్థావరంబును జంగమమై విలసిలు భువనమంతయు నీచేతఁ బూరితంబు.
అఖిలలోకంబులకు హితవయిననీవ యస్మదంగంబునకు హితవగుము తల్లి! ౧౧౧౧

# అభినవ సరస్వతి.

సంపుటము ౨౧ | జానపాదు శుక్ల సం॥ ఫాల్గునమాసము | సంచిక. ౧౨


## శ్రీయుత, యమ్ కే. ఆచార్య, యమ్. యల్. యే. గారి

## అసెంబ్లీ యుపన్యాసము.

—(౦)—

వయస్సు చెందిన పిమ్మట వివాహము చేసికొనుట ప్రకృతికి విరుద్ధమగు నపచారము—వివాహసంబంధ మైచ్ఛికమని పరిణమించుట మానవస్వభావము పట్ల నపచారముగావించుట-రజస్వలయైన కొలఁది కాలమున దంపతులకు సమాగమము జరుగుట శ్రేష్ఠమని యాధునిక శాస్త్రపరిశోధనమువల్లఁ దేలుచున్నది.-రజస్వలయగుటకుఁ బూర్వము వివాహము నిశ్చయించుకొనుట దంపతుల మనోభావముల యనుకూల పరిణామమునకుఁ దోడ్పడును.

భారతశాసనసభలో నీబిల్లుపై మాటలాడుటకు నాకవకాశము దొరకుననితలఁచి యమెరికా యూరోపు దేశములందు వివాహమును, సాధారణముగ స్త్రీపురుష సంబంధములను గుఱించియుఁ బరిశోధనలు సలుపుచున్న శాస్త్రజ్ఞుల యభిప్రాయములను నేను సేకరించితిని.

కాని యధ్యక్షుఁడు నాకవకాశమిడలేదు. అందుచే నేనీవ్యాస రూపమునఁ బ్రకటించుచున్నాను. స్త్రీపురుషసమస్యల విషయమై మనకుఁ బ్రామాణికుఁడగు డాక్టరు మెజెక్ బూత్ గారిట్లు వ్రాసిరి:-"ప్రపంచమున దురభిప్రాయములు విరివిగ వ్యాపించుచున్నవి. ఈదురభిప్రాయములే ప్రమాణములుగఁ బరిగణింపఁబడుచున్నవి. ఈనూతన యుగమునందు స్త్రీలకును సంఘమునకును గల సంబంధమును బరిష్కరించుట కీదురభిప్రాయములవల్లఁ గష్టమగుచున్నది." నిజముగనీ

మరభిప్రాయమే మన శాసనసభ్యుల నావరించినది. ఈబిల్లువల్ల నతిబాల్యవివాహములవల్లఁ గలుగునష్టము తొలఁగిపోవచ్చును; గాని యాదర్శప్రాయములగు వివాహపద్ధతులు నేరములుగఁ బరిగణింపఁబడినవి. మన వివాహాదర్శము లన్నివిధముల శ్రేష్ఠమైనవని యాధునికశాస్త్రజ్ఞు లభిప్రాయ పడుచున్నారు. కావున నీబిల్లును సవరించి సంస్కారములతో పాటు మన వివాహసాంప్రదాయములకు భంగముకలుగని విధమునఁ గ్రొత్తచట్టమును సిద్ధముచేయఁగల సభ్యులను కేంద్రశాసనసభకు మఱొక యెన్నికలో నెన్నుకొనుట ప్రజలధర్మమైయున్నది. శారదా గారి బిల్లునకు 67 మంది యనుకూలముగ సమ్మతులనొసంగిరి. వారిలో 27 మందిమాత్రమే యెన్నుకోఁబడిన సభ్యులు (హిందువులు 22 రు మహమ్మదీయులు 5 గురు) ఆనాఁడే యాసభలో బిల్లునకుఁ బ్రతికూలముగనున్న సభ్యులసంఖ్య 29 యని గుర్తెఱుంగవలెను. 14 మంది బిల్లునకుఁ బ్రతికూలముగ సభలోనుండి వోటిచ్చిరి. 15 మంది మహమ్మదీయులు సభను వదలిపోయిరి.

జంతువులకుఁ గామేచ్ఛ యాఁకలిదప్పులవలె సహజమైనది. మానవ జాతిలో నీకామేచ్ఛ తీవ్రరూపమును దాల్చుచున్నది. కావునఁ గొంత నిగ్రహము నిర్బంధము నవసరమగుచున్నది. వివాహమే యీ నిగ్రహమునకును నిర్బంధమునకును సాధనముగఁ బరిగణింపఁబడు చున్నది.

వివాహ మొక సాంఘికవ్యవహారము. వివాహముయొక్క ముద్దేశము లేవనఁగా:—

1. వ్యక్తులకుఁ బరస్పరసంఘర్షణము లేనివిధమున సంపూర్ణ మగు భౌతికసౌఖ్యమును గలుగఁజేయుట.
2. గృహస్థజీవితముతోపాటు వంశమును వృద్ధిచేయుట.
3. సంఘమును జాతిని వృద్ధిచేయుట.
4. మానవజాతిని వృద్ధిచేయుట,
5. ఆధ్యాత్మిక చింతనమును వృద్ధిచేయుట.

ఈపైయుద్దేశములు నెఱవేఱుటకుఁ గొన్ని నియమములు నిర్బంధములు ప్రతివివాహ సాంప్రదాయమునందును నిర్ణయింపఁబడినవి దంపతులవయస్సు రక్తసంబంధము జాతివిజ్ఞానభేదములు మున్నగువిషయములను గుఱించి కొన్ని నియమముల నందఱుఁ బాటించుచునే యున్నారు.

వివాహసంబంధము కేవల మీభౌతిక దేహమునకు సంబంధించినది మాత్రమేకాక నైతిక సాంఘిక వైజ్ఞానికాధ్యాత్మిక సంబంధములనుగూడ సూచించునది యగుటచే నీనియమములను నిర్ణయించునప్పుడాయా సంఘముల భౌతిక సాంఘిక విజ్ఞానాదర్శములను సాంప్రదాయములను దృష్టియందుంచుకొనవలయును.

వివాహమునకుఁ గామేచ్ఛ ప్రధానమగుటచే స్త్రీపురుషులలో నీయిచ్ఛ యెప్పుడు ప్రారంభమగునను విషయమై శాస్త్రజ్ఞుల యభిప్రాయము లీదిగువ నుదాహరించుచున్నాను:—

1. ఎన్నియోయుగములనుండి జరుగుచున్న యీమార్పులవల్ల దేహాంగ నిర్మాణమునందును మనస్తత్వమునందును బాలురకును బాలికలకును నెంతో భేదమున్నది. ఈభేదములు మిగులఁ బ్రధానములైనవి. పొడుగు లావు నిడుపు నెత్తురు కండలు జ్ఞానకోశము మున్నగువానియందు బాలురకును బాలికలకును భేదమున్నది.

2. తరతరములనుండి జరుగుచున్న యీమార్పువల్ల దేహదార్ఢ్యమునకు సంబంధించిన నరములు పురుషునియందు వృద్ధిచెందినవి. స్త్రీలయం దనురాగములను సూచించు నరములు వృద్ధిచెందినవి.

3. కావున స్త్రీలోకరి కఠినలై సహజకోమలస్వభావముగలవారై సూక్ష్మబుద్ధిగలవారై యున్నారు. పురుషులు కారకులుగను నాలోచనాపరులుగను విజ్ఞానముగలవారుగను నున్నారు. పురుషులు క్రియమీఁద దృష్టిగలవారైయున్నారు. స్త్రీలు ప్రకృతి కనుగుణముగఁ బ్రవర్తించుచుందురు. భారతసాంప్రదాయముల ననుసరించి పురుషుఁడు శివస్వరూపము. స్త్రీ శక్తిస్వరూపిణి. ఈశివశక్తిసంబంధ మావి

4. ఈవిధమున భిన్నపరివర్తనముగల స్త్రీపురుషుల సంగమమే సాంఘిక జీవితమున కాధారమైయున్నది. అందుచేతనే సృష్ట్యాది నుండి స్త్రీపురుషుని బురుషుఁడు స్త్రీని గోరుచుండిరి. ఈ రెంటికిని సంబంధము లేకున్న సంపూర్ణత్వము లేదు. కావున స్త్రీలు పురుషులు నొకరికొకరు తోడ్పడుచు సాంఘికబాధ్యతలను నిర్వహింపవలెను. సంఘమునకుఁ గావలసినధనమును నాహారమును సృష్టించుట వృద్ధి చేయుట పురుషుని ప్రధానధర్మమైయున్నది. సంఘాభివృద్ధి కవసరమగు సంతానమును గనుట పెంచుట స్త్రీలప్రధానధర్మమైయున్నది. కావున వివాహస్థితి స్త్రీలకు సహజమైనది. సంతానమునుగనుట స్త్రీదేహతత్త్వమున కనుగుణమైనకార్యము.

5. కావున స్త్రీలకు విద్యగఱపునప్పుడును భౌతికనైతికశిక్ష గఱపునప్పుడును పైనసూచింపఁబడిన స్త్రీయొక్క ప్రధానధర్మమును దృష్టియందుంచుకొనవలయును. దేహతత్త్వము ననుసరించి స్త్రీలు సంతానమును గనవలసినవారనియుఁ బురుషులు సంతానమును బోషింపవలసినవారనియు గుర్తెఱుఁగవలయును.

పాశ్చాత్యదేశములందు బాలికలకుఁగూడఁ బురుషోచితవిద్యనే నేర్పుటచేత వారు గృహకృత్యములకు సంబంధించిన వానియందు విముఖులయి యుద్యోగములందు బాలురకుఁ బోటీకివచ్చుచున్నారు. అందుచేతఁ బురుషులలో నిరుద్యోగసమస్య యధికమయినది. పురుషులలో నిరుద్యోగు లధికసంఖ్య గలిగియుండుటచేత స్త్రీలను వివాహమొనర్చుకొని వారిని సుఖపెట్టఁగల పురుషులు దొరకుటయే కష్టముగానున్నది. ఈవిధముగా స్త్రీ లేదో యొకపనిచేసి బ్రతుకుఁదెరువుచూచుకొనవలసిన దురవస్థ యేర్పడుచున్నది. ఈయన్యోన్యసంబంధమువలన స్త్రీపురుషుల గతి తారుమారైయున్నది.

లక్షలకొలఁది జనులు తమ జీవితమును వ్యర్థపఱుచుకొనుచు న్నారు. ప్రకృతిసిద్ధమయిన కామేచ్ఛను దీర్చుకొనుటకభిలషించుచున్నా రుగాని దానివలన నేర్పడెడి గార్హస్థ్యబాధ్యతలను వహింప నిష్టము

లేనివారై యున్నారు. డాక్టరు బూతుగారిట్లు వ్రాయుచున్నారు:—"ఆంగ్లోసాక్సన్ జాతియొక్క కుటుంబ జీవితమున కెట్టిదుర్గతిపట్టుచున్నది. ఇంగ్లీషుభాష యెచ్చటెచ్చట వ్యాపించియున్నదో యాయాచోట్లయందంతటఁ బరిస్థితులొకేవిధముగ నున్నవి. పూటకూలికొంప లెక్కువ. కాపురమొనర్చు కొంపలు తక్కువ. వివాహవిచ్ఛేదము లెక్కువ. సంతానము తక్కువ."

మిస్ మేయో కన్యగారి జన్మభూమియగు నమెరికాదేశమందుఁగల సాంఘిక హీనస్థితి చెప్పుటకే శక్యముకాదు. కొంతవఱకు బాతపద్ధతు లభిమానించునట్టి యింగ్లాండు దేశమునందుఁగూడ (ఈసృష్టివిద్యావిధానవ్యాప్తివలన) అక్రమ సంతానముల సంఖ్య హెచ్చుచున్నది. దీనిని జూచిన నాదేశమెంతనీతిమంతమైనది మనము గ్రహించవచ్చును. రసం. సంఖ్యల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

| సం. | జనసంఖ్య. | వివాహసంఖ్య | సంతానము. | అక్రమసంతానము. |
|---|---|---|---|---|
| 1922 | 381 లక్షలు | 299,521 | 780,1[illegible]4 | 34,138 |
| 1923 | 384 లక్షలు | 292 408 | 758,131 | 31,522 |
| 1927 | 393 లక్షలు | 308,370 | 684,172 | 28.454 |
| 1928 | 395 లక్షలు | 302,870 | 660,267 | 29,071 |

గడచిన 6 సంవత్సరములలో వివాహములసంఖ్య కొంచెముగ నధికమైనను జననములసంఖ్య 120000, అనఁగా నూటికి 16వంతునఁ దగ్గెను. ప్రతిసంవత్సరమునందుఁ బుట్టిన శిశువులలో 23 లేక 24 కొకరుచొప్పున నక్రమసంతానమని బహిరంగముగా లెక్కింపఁబడుట శోచనీయము.

దేహవ్యాయామములును విహారములును నధికమగుటచేత నాంగ్లోసాక్సనుజాతి బాలికలు మాతృత్వమునకే యనర్హులగుచున్నారు. ఈ విషయమై ప్రామాణికులగు డా. ప్రేసీ హార్ట్ గారు, డా. అరబెల్లా కెనీలీగారు తమ గ్రంథమునం దిట్లు వ్రాసిరి:—
"ఒక బాలిక హాకీ చక్కఁగా నాడుననంతమాత్రమున లేక కండరములు

బలమధికముగా నుండునంతమాత్రమునఁ జక్కని యారోగ్యము గలది యని చెప్పుటకు వీలులేదు. కండరముల పుష్టి విహారములయందు ప్రావీణ్యముఁగలవారే నరముల పటుత్వము లేనివారుగాఁగూడ నుండుటగలదు." అమెరికాదేశములో నూటికి 4వవంతు స్త్రీలే కుటుంబ జీవితమునకును మాతృత్వమునకును శారీరకముగ నర్హులయియున్నారని డాక్టరు గిల్లస్థామస్సుగారు వ్రాసియున్నారు. డా. స్టేన్లీహాలుగారీ విషయమై పరిశోధించి యాంగ్లోసాక్సను స్త్రీలు మాతృత్వమున కనర్హులగుచున్నారని లెక్కలతో నిరూపించి యున్నాఁడు. కండరములుగల స్త్రీలు ప్రసవసమయమున మిక్కిలి కష్టపడుదురని డాక్టరు ఎంగిల్‌మానుగారు వ్రాయుచున్నారు. వియన్నాలో వ్యాయామముల యందెక్కువకాలము గడుపుచున్న స్త్రీలితర స్త్రీలకంటె 9వ వంతు తక్కువగా సంతానమును గనుచున్నారని యిటీవలఁ బరిశోధనలవలనఁ దేలినది. వీనినన్నిటినాధారముగా గ్రహించి డాక్టరు బూతుగారిట్లు హెచ్చరించుచున్నారు:—

పురుషులవలెనే స్త్రీలుఁకూడ దేహపరిశ్రమ విహారాదు లొనర్చునెడల జాతిసౌష్ఠవము వృద్ధిచెందునని తలఁచువారీ లెక్కలనుజూచి నిజమును గ్రహించఁగలరు.

**1922** మొదలు **1928** వఱకు నింగ్లండులో జనసంఖ్య నూటికి 16 వంతునఁ దగ్గినదని గుర్తెఱుంగ వలయును.

పాశ్చాత్యదేశములందు వ్యాపించియున్న పై స్త్రీపురుష సమానత్వసిద్ధాంతమే యచ్చటి సాంఘికదుస్థితికిఁ బ్రధానకారణమని చెప్పవచ్చును. ఈసిద్ధాంతము జీవశాస్త్రమునకుఁ గూడ విరుద్ధమైనది. పాశ్చాత్యదేశమునందలి కృత్రిమవివాహములు నకాలవివాహములు నైచ్ఛికవివాహములుఁ బరీక్షావివాహములుఁ బైసిద్ధాంతముయొక్క దుష్పరిణామములే.

ఇట్టి వివాహములు సంఘమును అలకల్లోలమొనర్చి మాలిన్యైకమొన ర్చుచుం జెప్పుటకుంగూడ సిగ్గగు నతిశాహ్యాప్రవర్తనమునకుం గారణములగుచున్నవి. కావున మనసంఘపు దుస్థితిని పోలంగింపవలయునని ప్రయత్నించుచు నమెరికా యూరోపు దేశములందుంగల వికృతిపు సంఘదుస్థితులను మనదేశమునందుం గూడ వ్యాపింపంజేయుటకుం బ్రయత్నించుట తగనిపని.

స్త్రీలకు భార్యాత్వము మాతృత్వము శారీరకముగ సహజధర్మములు, స్త్రీపురుషులకు సమానముగ స్వాతంత్ర్యముగలదను నవసిద్ధాంతముపై నాధారపడిన పాశ్చాత్యదేశములందలి స్త్రీల యుద్యమములు శారీరకశాస్త్ర సిద్ధాంతమునకు విరుద్ధములైనవి. ఈ భారతదేశమునందుం గూడం బైయుపసిద్ధాంతము క్రమముగా వ్యాపించుచున్నది.

ఈ మాతృత్వ భార్యాత్వములు స్త్రీలకు సహజధర్మములగుటచేత స్త్రీలకుంగఱపుశిక్ష స్త్రీస్వభావానుగుణముగనే యుండవలయును.

3. స్త్రీపురుషభేదభావము బాలికలలో ౧౦వ యేటికిముందఱనే యంకురించును. సృష్ట్యాదినుండివచ్చుచున్న దేహమనస్తత్త్వముల సహజపరిణామమును పార్లమెంటువారు తమచట్టముల చేత నిరోధింపంజాలరని హక్సులేగారు వ్రాసిరి. బాలికలలోం గామేచ్ఛపుట్టకూడదని యేశాసన నిర్మాతలును నిషేధింపంజాలరు. అమెరికాదేశమునందలి పరిస్థితులను వివరించుచు నెటిటీహూకరను విద్యావతి యిట్లువ్రాసెను:- " నాగరదేశములందు శ్రీమంతులకుటుంబములందు ౭, ౮, సంవత్సరముల వయస్సుగల బాలికలు తమ యీడువారినే ప్రేమించుట యితరులయెదుటం గూడవారితో సంగమించుట సాధారణముగా జరుగుచున్నది "

౪. మనదేశమునందు బాలికలు 12 మొదలు 14 సం. లోపుగా రజస్వలలగుచున్నారు. అనంగా శారీరకముగ భార్యాత్వమునకు మాతృత్వమునకు సమర్థులగుచున్నారు. మనదేశమునందుం జిన్నవయసు

నం దున్న భార్యలతల్లుల దేహబలము క్షీణించుటకు విజ్ఞానము తగ్గుటకుఁగారణములు నాగరికతచేతవచ్చిపడిన దుర్వ్యసనములును దారిద్ర్యమును ననారోగ్యకరమగు పట్టణవాసమువలన సంభవించెడి జబ్బులు స్త్రీపురుషులని విషయములందు సమానులను పాశ్చాత్య సిద్ధాంతవ్యాప్తి మున్నగునవి. శారదాబిల్లు పైదుస్థితి నేవిధముగాఁ బోలఁగించునో తెలియుట లేదు.

౫. అనుకూలములగు సౌమ్యపరిస్థితులుఁ గ్రిమశిక్షణమునున్న మొదల వయసుచెల్లిన వివాహములకంటెఁ జిన్నవయసునందు జరుగు వివాహములే జాతియొక్క యారోగ్యమునకున్నూ సౌఖ్యమునకున్నూ ననుకూలములని శాస్త్రపరిశోధనమువలనఁ దేలుచున్నది.

సాంఘికనీతి ప్రవర్తనమునకును సంతానాభివృద్ధికి నైచ్ఛిక వివాహములుగాక యందఱును వివాహము లొనర్చుకొనుటయే అవసరమని పరిశోధకులు వ్రాసియున్నారు. స్త్రీలయుద్యమమను గ్రంథమునందు, ఎల్లన్. కే, అనునామె యిట్లు వ్రాసెను:—

" చిన్నవయసునందే వివాహములు జరుగకున్న మొదల సంఘమునందు నీతిప్రవర్తన మేర్పడదు. యువకుల నింద్రియనిగ్రహము గలిగి జితేంద్రియులయి యుండవలయునని కోరుట ప్రకృతి విరుద్ధమగుకార్యమగుటయేగాక జాతి కపచారమొనర్చుట కూడనగును. మానవశక్తిని దుర్వినియోగమొనర్చుట కూడనగును. భారతదేశమునం దింతవఱకుఁ జిన్నవయసునందు వివాహము చేసికొనవలయుననియు నందఱు వివాహము చేసికొనవలయుననియు, గల యాదర్శముల కీబిల్లాఘాతమునొనర్చును. "

ఈవిధమున శారీరమానస తత్త్వముల ననుసరించి భారతదేశీయ బాలికలకు రజోదర్శనానంతరము ౧-౨ సంవత్సరములు యుక్తవయస్సని చెప్పవచ్చును. అనఁగా ౧౫. సంవత్సరములు పునస్సంతానమునకుఁ దగినవయస్సు. స్త్రీలకుఁ గామేచ్ఛ పురుషులకంటె ముందుగాఁబుట్టును. అందుచేతఁ బురుషులకు 19 లేక 20 సం. పునస్సంధానమయస్సని నిర్ణయించవచ్చును.

౨. స్త్రీపురుషులు తమ జీవితమునం దొకరి నొక రేదినమునం జూచుకొనియెదరో యాదినముననే శారీరకముగం గలియుట యే దేశము నందును సంభవించుట లేదు. స్త్రీకిం బురుషునియం దనురాగ మేర్పడుటకు ముందుగాం గొంతపరిచయ మావశ్యకమని మానసిక శాస్త్ర సిద్ధాంతము. పాశ్చాత్యదేశములం దీపరిచయ మైచ్ఛిక పరీక్షావివాహ రూపమునం బరిణమించినది. రజస్వల యగుటకంటె ముందు నిశ్చితార్థము చేయు పవిత్రపద్ధతితో మనదేశమునం దీపరిచయమును జరుగుచున్నది. బాలిక జననమునకుం గారకులగు తల్లిదండ్రులకుం దమబిడ్డయొక్క యోగక్షేమములను వహించు భాగస్వామిని నిర్ణయించు నధికారము లేదని వాదించుట యజ్ఞానవిలసితము. వివాహసాంప్రదాయములన్నిటిలో రజస్వల యగుటకంటె ముందు, అనగా 10, 12 సం॥ లోపల నిశ్చితార్థమొనర్చుట రజస్వలయయిన తర్వాతం గొంతకాలమునకు గర్భాధానము జరుగుట వ్యక్తికిని సంఘమునకును, జాతికిని శ్రేయస్సు కలుగంజేయుపద్ధతి.

నిశ్చితార్థమునకును గర్భాధానమునకును మధ్యకాలమున జరుగంగల యకార్యములను సాంఘిక నిర్బంధములవల్లను ప్రజాభిప్రాయములవల్లను నవసరమయినచోం జట్టములవల్లను నిరోధించవచ్చును సంఘసహాయము లేక ప్రపంచమునందు జరుగునట్టి యకార్యముల నే చట్టమయినను నణంచివేయంజాలదు. సంఘముయొక్క మొత్తమునకు క్షేమము కలుగంజేయు విషయము నాలోచించునప్పు డొకానొక చోట నొకవ్యక్తికిం గలిగెడియిబ్బంది నంతగాం బాటింప నక్కఱలేదు.

3. ఆధునిక శాస్త్రపరిశోధనమువలన బాల్యవివాహములు గాక వయసు ముదిరిన తరువాత జరుగు వివాహము ప్రకృతికి విరుద్ధమయిన యపచారమనియు సర్వసామాన్యమయిన వివాహములుగాక యైచ్ఛిక వివాహములు మానవ స్వభావమున కపచార మొనర్చుట యనియు భారతీయ వివాహపద్ధతులుగాక పాశ్చాత్య వివాహపు పద్ధతులే శాస్త్రవిరుద్ధములనియు నీతిబాహ్యములనియుం దేలుచున్నది.

యూరోపమెరికా దేశములందలి వారిని మూఢులవలె ననుకరించుటకన్న మనము ప్రాచీనులగు మహర్షుల విజ్ఞానము విధానము శ్రేష్ఠమయినదని ప్రకటించవలయును. మన ప్రాచీనులు ౧౦ సంవత్సరముల లోపల వివాహముచేయుట యుత్తమ పక్షమనియు రజస్వల యగుటకంటె ముందుగా వివాహ మొనర్చుట మధ్యమపక్షమనియు రజస్వల యైనతరువాత ౩ సంవత్సరముల లోపల వివాహ మొనర్చుట యాపత్పక్షమనియుఁ జెప్పిరి.

౪. కనుక మనము ౧౪ సంవత్సరములలోపల గర్భాధానము జరుగఁగూడదని నిషేధింపవచ్చును; గాని యెట్టి వివాహకార్యము గాని జరుగఁగూడదని నిషేధించుట న్యాయముకాదు. ఉన్నతాదర్శము నేరమనియు నాయాదర్శము ననుసరించువారు నేరస్థులనియు నిర్ణయించుట ధర్మమా ?

౫. వివాహకార్యమునందు మతసంబంధములయిన కార్యములందు జోక్యము గలిగించుకొనుట కితరుల కధికార మున్నదా ?

వివాహములవలన నేర్పడు ప్రపంచసంబంధవ్యవహారముల నితరులు నిర్ణయింపవచ్చును. ప్రజాశాంతికి క్షేమము- భంగమేర్పడనంత కాలము శాస్త్రసమ్మతమైన వివాహకార్యము నేరమని ప్రభుత్వము వారుగాని శాసనసభవారుగాని చెప్పుట కధికారము లేదు. బలాత్కార సహగమనముచేసిన సతి సతి కాఁజాలదు. అది మతవిషయిక సమస్యకూడఁ గాఁజాలదు. ప్రజల శాంతికిని క్షేమమునకును భంగకరమగు విషయమగుటచేతఁ బ్రభుత్వమువారు దానిని నిషేధించిరి. అది న్యాయమే. ఈసామ్యము నీబిల్లు విషయమునఁ దెచ్చుట యవివేకము.

౬. కనుక వివాహకార్యము గర్భాధానము వేఱువేఱని తలంచి మతవిషయములందు జోక్యము కలుగఁజేసికొనఁగూడదనియు నున్నతాదర్శముల ననుసరింప నవకాశము నొసంగవలయుననియుఁ గేవల మిట్టి మతసంబంధమగు వివాహకార్యమును నేరముగాదని నిర్ణయించినఁగాని నే నీ బిల్లు నంగీకరింపఁజాలను.



## వర్ణాశ్రమ స్వరాజ్యసంఘ మహాసభ.

ఈ సభ 1930 సం॥ జనవరి 23-వ తేది మొదలు శ్రీప్రయాగ క్షేత్రమున మహా కుంభమేళన వేళ సమావేశమయ్యెను. ఆ సభకు నానాదేశస్థులగు సనాతన ధర్మపరులు బహుసంఖ్యాకులు దయచేసి సనాతనధర్మరక్షణమునకై పాటుబడిరి.

ధర్మప్రాణులైన సనాతనధర్మపరుల వివాహధర్మముపై నాఘాతముచే శారదాబిల్లు అధిక మనోవ్యథను గలిగించినది. నాయక నామధారులు కొందరు అసంబ్లీలోను కౌన్సిలులోను ప్రవేశించి ఇట్టి యనర్థము దెచ్చిపెట్టిరి. ఇకను మనము పేక్షించితిమేని ఇంక నెన్నియో యనర్థములు మనకు రానున్నవి. పూర్వకాలమున తురుష్కులు కత్తిచేత సనాతనధర్మనాశనమును జేయనెంచి విఫలమనోరథులైరి. ఇప్పుడు నవనాగరకుల నెడి కలిరాక్షసులు సనాతనధర్మముయొక్క పవిత్రశరీరమందు బిల్లుల నెడి సర్పదంశనములం జేయించుచున్నారు. ఇట్టి సమయమందు సనాతన ధర్మాభిమానులందఱు నేకహృదయముతో సంఘశక్తిచేత సకల భారతవర్ష వ్యాపియైన సంఘటనము గలుగ జేసికొని ధర్మధ్వంసకములగు బిల్లుల విధ్వంసనమునకై తీవ్రాందోళనము జేయవలయును. జిల్లాబోర్డులందును కౌన్సిలులందును నసెంబ్లీ కాంగ్రెస్సు మునిసిపాలిటీ మొదలగు రాజకీయ సంస్థలయందును సనాతన ధర్మరక్షక ప్రతినిధుల నంపవలయును. సనాతనధర్మరక్షణమునకై ప్రాణమానధనములనైన నర్పింపవలయును. అట్లు చేయలేని యతి ప్రాచీన కాలమునుండి వచ్చిన సనాతనధర్మము నశించును. శ్రీభారత ధర్మ మహామండల సహాయముచే వర్ణాశ్రమ స్వరాజ్య సంఘమను సంస్థ (శ్రీ) కాశీక్షేత్రమున స్థిరపఱుపఁబడినది. దాని యుపసభ 23-11-29 తేదీన ఢిల్లీలో జరుపఁబడినది. మహాకుంభమేళన సమయమున శ్రీ ప్రయాగ క్షేత్రమున వర్ణాశ్రమ స్వరాజ్యసంఘ విరాట్సమావేశము మహావైభవముతో జరుగఁబడెను. దానికొఱకుఁ పెద్దపెద్దపందిళ్లను వేయించిరి. 16000 శ్రోతలు కూర్చుండఁదగిన సభాభవనము నిర్మింపఁ బడెను. దేశాంతరస్థులకుఁ దగువసతులు

కల్పింపఁబడెను. ఈ సభయందు నానా దేశములందుఁ బ్రఖ్యాతులగు పండితులొక్కచోఁ జేరి కర్తవ్యము నిర్ణయించిరి. వర్ణాశ్రమ స్వరాజ్యసంఘమునకు సభ్యులు నిర్ణయింపఁబడిరి. ప్రసిద్ధులగు వక్తలు సారగర్భితము లగు నుపన్యాసముల నిచ్చిరి. భిన్నభిన్న స్థలములందు గీతామహాభారత పురాణ వేదోపనిషత్తులఁ గాలక్షేపము జరిగెను. దేవతానుగ్రహ లాభమునకై యొక మహాయజ్ఞము జరుపఁబడెను. సమాజరక్షణవిషయమై యనేక విషయములు కార్యరూపము దాల్చుటకుపాయము నిర్ధారింపఁబడెను. విశేష సంగతులు ముందు ప్రచురింపఁబడును. ఈసభ ననుసరించి యఖిలభారతవర్షీయ బ్రాహ్మణ మహాసమ్మేళనము మఠాధీశసమ్మేళనము తీర్థేశమహాసభ జరుపఁబడెను. ధర్మప్రాణులగు సమస్త హిందూసజ్జనులను బ్రార్థించునది యేమనఁగా నిట్టి యపూర్వ సుందరసమయమునఁ దగులాభము పొందక యుపేక్షించవలదు. ఈ ధర్మ కార్యమునకు యథాశక్తి తోడ్పడి విమల యశస్సును గడింపవలయును. ఈ విషయమై విశేష సంగతులఁ దెలియఁగోరువారు 'వర్ణాశ్రమ స్వరాజ్యసంఘ కార్యాలయ మహామండల భవనము, జగద్గంజు, బనారసు' అని ఇంగ్లీషులోఁగాని సంస్కృత భాషా నాగరాక్షరములలోఁగాని వ్రాసి ప్రత్యుత్తరము దెప్పించుకొనవలయును.

ఇట్లు నివేదకులు,

పంచాననతర్కరత్న భట్టాచార్యులు,
పండిత ద్రావిడ లక్ష్మణశాస్త్రి,
వామాచరణ న్యాయాచార్యులు,
కవీంద్ర నారాయణసింహము,
మధురా ప్రసాద పాండేయులు,
ద్వారకాప్రసాద చతుర్వేది,
ధూమావతీప్రసాద పాండేయులు,
ధర్మదత్త వేదశాస్త్రి,

( మొదలగువారు )



లాహోరు కాంగ్రెసునందు

ధర్మవీరదళము వారొనర్చిన కార్యములు.

హిందీభాషను వెలువడు బ్రాహ్మణసమ్మేళనపత్రిక. 6-1-30 సంచికనుండి

పరివర్తితము.

# వర్ణాశ్రమ స్వరాజ్యసంఘమువారు కాంగ్రెసు నాయకులకిచ్చిన యంత్యసందేశము.

———:o:———

కాంగ్రెసుయొక్కయుఁ దదధ్యక్షుల యొక్కయు ధర్మద్రోహాకరమయిన నీతివలన సంక్షోభము పొంది లాహోరు కాంగ్రెసుపైని సత్యాగ్రహముచేయు నుద్దేశముతోఁ గాశి మీరటు డిల్లీ బొంబాయి కలకత్తా మొదలయిన స్థలములనుండి బయలుదేరిన ధర్మవీర సంఘముయొక్క రాకసంగతి లాహోరులో నొక్కసారిగా మెఱపులాగు వ్యాపించినది. జనులలో నాతంకము నాందోళనము బయలుదేరినది. ధర్మమున కనుకూలమయిన స్వాతంత్ర్యమునకు సంబంధించినచర్చ నవలంబించి విచారణము ప్రారంభింపఁబడినది. డిసెంబరు 25 తేది నల్ల జెండాలతోఁ గాంగ్రెసుసభాధ్యక్షునిగుఱించి జరుపఁబడిన దృఢమైన బహిష్కారమువలనఁగాంగ్రెసుక్యాంపులోనున్న కార్యకర్తలకుఁ గూడ జెవులుగడియలుపడినవి. కాని యేప్రకారముగా సంస్కరణవాదులచే నడుపఁబడుచున్న పత్రికలు ధార్మికస్వతంత్రతావాదుల ప్రబలాందోళనమును దమపత్రికలయందు వార్తలరూపముగనైనఁ బ్రకటించుటకు జంకుచుండునో యాప్రకారము కలుషితములయిన మనోవృత్తులతోఁ గాంగ్రెసువారును మొదట నీసంగతిని నిర్లక్ష్యము చేయుటకుఁ బ్రయత్నించిరి. ఇవతల లాహోరునగరములోఁ బ్రబలమయిన ప్రచారము నుపన్యాసములు ప్రదర్శనములు కరపత్రములు పంచిపెట్టుట మొదలైన కార్యములద్వారమునఁ గాంగ్రెసునాయకులయొక్క వాస్తవికమ

అందువలనఁ గాంగ్రెసునాయకుల మనుకొనువారు తమ పొరపాటు తెలిసికొని సావధానులయి కాంగ్రెసు బహిష్కరణలతో సానుభూతిని ప్రకటించుచు వారుచేయుచున్న కార్యక్రమమునఁ గూడఁ బాలుగొని సమాధానము చెప్పవలసిన స్థితికి వచ్చుచుండిరి.

ఈలోగాఁ గాంగ్రెసువారు సహించిన మానభావ మనుమాన మునకు గుఱియైనది. వర్ణాశ్రమస్వరాజ్య సంఘమువారు భావికార్య క్రమము నిర్ణయించుట కొఱ కంతరంగసభను సమావేశపఱచిరి. 27-12-29 తేది రాత్రి లాలారామ శరణదాసుగారి బంగాళాలో సమావేశము జరిగినది. ఆసమావేశమునందుఁ గాంగ్రెసునకును బ్రిసు ఖులగు కొందఱు తన్నాయకులకును 24 గంటలలోఁగా ధార్మికప్ర పంచముయొక్క సంతుష్టికొఱకుఁ గాంగ్రెసువారు కమిటిగాఁ గూడి యీసభవారడుగు ప్రశ్నములకు సమాధానము లొసంగవలయును, లేనియెడలఁ గాంగ్రెసుపయిన సత్యాగ్రహము ప్రారంభింపఁబడునని యంత్య సందేశము పంపఁదీర్మానించిరి. కాంగ్రెసువారికిఁ బంపఁదలఁచిన తంతియొక్క మసాదాకూడ నేర్పాటుచేసిరి. అఖిలభారత వర్ణాశ్రమస్వరాజ్యసంఘము వారు టెలిగ్రాముద్వారమునఁ గాంగ్రెసువారికిఁ బంపిన యంత్యసందేశముయొక్క భాషాంతరీకరణ మీక్రిందఁగనఁదగు:-

కాంగ్రెసుసంస్థ తన్ను స్వరాజ్యముకొఱకును స్వాతంత్ర్యము కొఱకును బ్రియత్నించుచున్నదానిసిగాఁ జాటుకొనుచున్నది. వాస్తవ మాలోచించినయెడల దేశోద్ధరణము స్వాతంత్ర్యము స్వరాజ్యము స్వధర్మముఁ బాలించుకొనుటచేతనే సులభముగా లభింపఁగలవు. ప్రతి భారతీయుఁడును త్రికరణశుద్ధిగాఁ దనధర్మమును బాటించుకొనుచు దేశసేవ పేరుతో స్వాతంత్ర్యముకొఱకు ముందంజ వేసినపక్షమున స్వరాజ్యము స్వాతంత్ర్యముఁ జేరువయగును. అది ప్రాప్తించుటకు విలంబమేయుండదు. అట్లుచేయక యందులకు విరుద్ధముగాఁ దమతమ ధర్మమును విడిచి యెన్ని ప్రయత్నములు చేయుచుండిరో యవియన్నియు వ్యర్థములగుటయేగాక మఱింత హానిసతనమునకు లోను జేయకమానవు.

కాంగ్రెసునాయకులు కాంగ్రెసుద్వారమున నిటీవలఁ గొన్ని సంవత్సరములనుండి యన్ని పక్షములకంటెను నధికసంఖ్యాకులగు వర్ణాశ్రమధర్మావలంబులగు హైందవుల ధార్మికత్వముపైనను సిద్ధాంతపైనను నాఘాతములను నాక్షేపణములను జేయఁబూని యున్నారు. పాపము! వారార్ష పరంపరాగత ధర్మస్వరాజ్యమార్గము నాటంక పఱుపఁగల మనుభ్రాంతిలోఁబడి తదనుకూలములగు కార్యములు చేయుచున్నట్లగుపడుచున్నారు. శారదాబిల్లునుగుఱించి వారు వ్రాయుచున్న భావము మిక్కిలి యసహ్యమయినది. అది యీనాయకుల విశృంఖలత్వమును నజ్ఞానముఁగూడఁ దెలియఁజేయుచున్నది. దీనిచేత వీరిభావము లెంతచెడ్డగా విదేశీయభావములలో నిమిడియున్నదియు వీరియాత్మలు విచారములు మనోవృత్తులుఁ దత్ప్రభావమువలన నెంతగాఁ గలుషితములును దూషితములును నయిపోయినదియు వెల్లడి యగుచున్నది.

ఈప్రకారముగా నాత్మఘాతుకమయిన వారి పటాటోపము వలన స్వరాజ్యముగాని దానిలో నొకభాగముగాని లభింపదు సరిగదా మీఁదుమిక్కిలి దేశమునకు మఱింతదృఢమగు దాస్యబంధమే సిద్ధించును. ఇది నిశ్చయము.

మహాగౌరవపాత్రమును వంశపరంపరాగతమును నగు భారతీయుల వర్ణాశ్రమధర్మమునకు విరుద్ధముగాఁ గాంగ్రెసు నాయకులసహ్యమును విద్వేషజనకమును నగు భావమును వర్ణాశ్రమధర్మమును నశింపఁజేయుటకయి భిన్నభిన్నములగు యుక్తుల ద్వారమున దృఢముగాఁ బ్రకటించుచున్నారు. దీనివలన లోకులమనస్సునందు గొప్ప యనుమానము పుట్టుచున్నది. ఇంతేకాదు. ఈకాంగ్రెసువారి చేతులలో నేవిధమయిన యధికారము లేనప్పుడే సనాతనధర్మమునకు విరుద్ధముగా నిట్టి కుట్రలను పన్నుచున్నారే. ఒకవేళ నిజముగా నేదో యొకవిధముగా స్వరాజ్యము ద్వారమున నేమాత్రమేని యధికారము వీరిచేతికిఁ జిక్కినయెడల సనాతనధర్మమును సమూలముగ నాశనము చేయకుండ విడిచిపెట్టఁగలరా? అనికూడ సనాతనధర్మపరాయణులగు

హిందువు లాలోచించుకొనుచున్నారు. ఇట్టి స్థితి తటస్థించినప్పుడు వర్ణాశ్రమధర్మపరాయణులగు హిందువులు విధిలేక కాంగ్రెసునుండి విడిపోయి, కాంగ్రెసు హిందువుల కన్నిటికంటె గొప్పదైన శత్రువనియు దీనిని గుఱించిన బాధ్యతయంతయు నిప్పటి కాంగ్రెసు నాయకులమీఁద నున్నదనియు ఘోషింపవలసినవా రగుచున్నారు.

‘ కాంగ్రెసునాయకులు తమపొరపాటును దెలిసికొని ప్రకృతపు విశృంఖలగతినుండి సర్దుకొనుట కింకను సమయమున్నది. నిజముగా వారికి వికృతమయిన తమవిధానమునకు సంబంధించిన దానిలో నేదేని సందేహము కలిగినపక్షమున మేము కాంగ్రెసువారు నిశ్చయించిన నాయకులతో మాటలాడి వారి సంశయములను దొలగించుటకు సిద్ధముగానున్నాము. ఈసందేశమునుగుఱించి 24 గంటలలో విమర్శనపూర్వకమును సంతోషజనకమునగు ప్రత్యుత్తరమును మాకు పంపవలయును. అట్లు కానిపక్షమున ధర్మధ్వంసకమగు కాంగ్రెసుగతి నాటంకపఱచుటకును స్వధర్మ సంరక్షణముకొఱకును విధిలేక సనాతన ధర్మావలంబులమగు మేము సత్యాగ్రహము నవలంబించి పాటుఁబడవలసి వచ్చును. ధార్మికస్వాతంత్ర్య వ్యవహారమునకు భంగములేకుండ మాయందఱియొక్క సహానుభూతి కాంగ్రెసునకుఁ గలిగియుండుట స్వాభావికము. ఇట్లు,

అఖిలభారత వర్ణాశ్రమ స్వరాజ్యసంఘకార్యదర్శి.

ఇంతపెద్ద తంతిసమాచారమును ధనవ్యయమునకు లోపింపక కాంగ్రెసుప్రధాన కార్యదర్శికిని సభాధ్యక్షునకును మఱి యార్గురు నాయకులకును వేఱువేఱుగా 28-12-29 తేది పగలు 12 గంటలకుఁ బంపఁబడినవి. 29 తేది 12 గంటలకు గడువు పూర్తియయినది. ఏవిధమయిన సమాధానము రాలేదు. అందువలన ధర్మవీరదళమువారి యేర్పాటుతో పగలు 1 గంటకు ధర్మమును వదలకుండనే స్వరాజ్యమును గోరుచుండెడి హిందువుల సభ సమకూడినది. కాంగ్రెసువారికి సనాతన ధర్మవాదులిచ్చిన యంత్యసందేశమునకు సమాధాన మేమి వచ్చినదో యెఱుంగుటకుఁ గుతూహలముతో నున్నవారందఱు సభా

మంటపములోనికిఁ జేరిరి. "సనాతనధర్మమునకు జయము, ధర్మధ్వంసి యగు కాంగ్రెసు సర్వనాశమగుగాక, నాయకత్వమును నష్టపఱుపుఁడు" అని సింహనాదములు చేయుచుండఁగా సభాకార్యక్రమము ప్రారంభ మాయెను.

బెంగాలులో సుప్రసిద్ధులయిన యడ్వొకేటు మహేశచంద్ర ఛటర్జీగారు కాంగ్రెసువారికి సనాతనధర్మ పరాయణు లొసంగిన యంత్య సందేశము చదివి వినిపించుచు మిక్కిలి రోషోద్రేక పూర్ణములయిన మాటలతో ధర్మద్రోహులయిన కాంగ్రెసునాయకుల క్షుద్ర మనోవృత్తులను జనుల కెఱిఁగించుచు నిట్లుపన్యసించిరి:— బుద్ధిమాంద్యజనితోన్మాదులగు కాంగ్రెసునాయకులు దేశమునకే గర్భశత్రువులయి యగపడుచున్నారు. దేశమంతయు నేకమయి పనిచేయవలసిన వికటసమయములో వారు దూరదృష్టిలేక చేసెడిపనులవలన జనుల హృదయములలో సంక్షోభ మేర్పడినది.

మనమందఱమును మనధర్మమునందు నిశ్చలచిత్తులమై యుండి యే దేశసేవపేరిట నేకరూపమయిన సూత్రమునందు బద్ధులమయి మనతల్లియగు భారతభూదేవియొక్క దాస్యశృంఖలము త్రెంచు ప్రయత్నమునందు జాగరూకులమయి యుండవలయును. చేయవలసిన పని యిదియే యయినను విదేశధర్మభావానురక్తులగు నిప్పటి కాంగ్రెసునాయకులట్టి ప్రయత్నమును విడిచి తమతమ మనోవృత్తుల కనుకూలముగ జనసామాన్యముయొక్క ధార్మికత్వమును ముందుగాఁ దుదముట్టింపఁ బ్రయత్నించుచున్నారు. కనుక ధర్మప్రియులగు హిందువుల మనస్సులలో నాందోళనము ప్రారంభమయినది. మహమ్మదీయులుకూడ నీకాంగ్రెసువారికి విరోధు లయిపోయినారు. వారు కూడఁ గాంగ్రెసు సభ్యులద్వారమున శారదాబిల్లు ప్యాసుచేయించుట కాంగ్రెసుయొక్క తప్పుగా భావించుచున్నారు. ధర్మమనునది యిహపరలోకములందు శ్రేయము కలిగించునది. అధర్మమార్గము నాటంకపఱచితి మనుకొనుట నాయకుల ప్రగల్భవాక్కులేగాని వేఱుగాదు. ఆనాయకులబుద్ధి ధర్మభావహీనము కాఁబట్టియే వారికార్య మేదియు

సఫలముకాలేదు. ఇంకముందును సఫలము కాఁజాలదు. వారి ధర్మ ద్రోహమే వారిని మ్రింగివేయును. ధర్మబుద్ధికలిగి యెల్లజాతులవారు దేశసేవయం దెపుడేకసూత్రముతో బద్ధులయి యుందురో యప్పుడే స్వరాజ్యమును స్వాతంత్ర్యమును వారికిఁ బ్రాప్తించును. కాని మన వారీసత్యము నుపేక్షించి కాంగ్రెసుబలముతో ధర్మవిషయమునద్రోహము చేయుచున్నారు. ఇట్టినాయకుల దుశ్చేష్టల నణఁచుట దేశహితమునకు మిక్కిలి యావశ్యకము. వారి న ట్లణఁగఁద్రొక్కనిపక్షమున దేశస్వాతంత్ర్యమునకును మహాజనుల ధర్మమునకును గొప్పహాని కలుగకమానదు. భారతీయులారా! మీ రందఱును కాంగ్రెసునాయకులకు విరుద్ధముగ స్వదేశస్వధర్మములసంరక్షణకయి వలయునంత వేగముగ నడుముగట్టి గట్టిపట్టుదలను పట్టి పనిచేయుట యత్యావశ్యకము.

ఈనడుమనే చెఱసాలలోఁ బ్రాయోపవేశవ్రతమును బూని స్వర్గస్థుఁడయిన జతీంద్రనాథుఁడు నాకు శిష్యుఁడై యుండెను. అతని తండ్రి యగ్నికిఁ దనకుమారుని మృతదేహమును సమర్పించుచు "హిందూస్థానమునా రాంగ్లేయులచేతికి శాసనభారము నప్పగించి చేసిన పొరపాటునకుఁ బ్రాయశ్చిత్తముగా నేఁడు నాప్రియపుత్రు నగ్నిదేవునకుఁ గానుకగా సమర్పించుచున్నాను" అని యన్నాఁడు. సరిగా నదేసమయమున శారదాబిల్లు ప్యాసయినదన్న యానందము వలన శారదాబిలా ప్రభృతులయిన ధర్మఘాతుకులు సిమ్లాశృంగము పైని గవర్నరు జనరలుగారి విందులో ఫలాహారపుఁదట్టలను నమలి వేయుపనిలో లగ్నచిత్తులయి యున్నారు. నేను ప్రతిజ్ఞాపూర్వకముగాఁ జెప్పుచున్నాను. వినుఁడు. నేనును గాంగ్రెసునకును, దదధ్యక్షునకును నింతటితోఁ దద్గౌరవము పోఁగొట్టి వారు చేసినట్టియు చేయుచున్నట్టియు ధర్మద్రోహమునకు బదులు తీర్చుకొనితీరుదును. తరువాత మహామహోపాధ్యాయ గిరిధర్మశర్మ చతుర్వేదిగా రుపన్యసించిరి. పలువురు క్రొత్తసభ్యులు చేరిరి. చందాల వసూలు ప్రారంభించిరి. ఇంతలోఁ గాంగ్రెసు నాయకులనుండి యంత్యసందేశమునకుఁగా నాహ్వానము పంపిరి.

పండిత లక్ష్మణశాస్త్రి ద్రావిడులును రాజేశ్వరశాస్త్రిలును దేవనాయకాచార్యులును బొంబాయిలో సుప్రసిద్ధనాయకులగు నారాయణ పురుషోత్తమదాస సంఘాణిగారును గాంగ్రిసు క్యాంపులోనికి వెళ్ళిరి. వెళ్ళిన ప్రముఖులను గాంగ్రిసు సభాధ్యక్షుని క్యాంపులోఁ గూర్చుండఁబెట్టి 10 నిమిషములలోఁ గమిటీ సమావేశమును ముగించుకొని నెహ్రూగారు సుప్రసిద్ధులును గార్యకర్తలును నగునాయక నామధారులను గొందఱను వెంటఁబెట్టుకొని యచ్చటికివచ్చినారు. తదనంతరము 51 నిమిషములలోఁ గాంగ్రిసు నాయకులకును లక్ష్మణశాస్త్రి ప్రభృతులగు సనాతన ధర్మ పరాయణులకును జరిగిన సంభాషణయొక్క సారాంశము వ్రాయఁబడుచున్నది.

లక్ష్మణ:— తమరు వృద్ధులును దేశనాయకులును గనుక మీసంబంధమును బట్టి యీకాంగ్రిసెవరిది? అని తమ్మడుగుచున్నాను.

మోతీ:— దేశమంతటిదని.

లక్ష్మణ:— దేశమునం దంతటను జైనులు పార్శీలు సిక్కులు క్రైస్తవులు మహమ్మదీయులు సనాతన ధర్మావలంబులు నార్యసమాజికులు మొదలగువారందఱును గలిసియున్నారుగదా! అయితే నీకాంగ్రిసు వీరందఱిదియునా!

మోతీ:— నిస్సందేహముగా.

లక్ష్మణ:— కాని కాంగ్రెసులో సనాతన ధర్మావలంబులకుఁ బ్రవేశముండఁ గూడదని కాంగ్రెసు నియమమున్నప్పుడు తమలక్ష్యమెట్లు సిద్ధింపఁగలదు?

మోతీ:— సనాతన ధర్మావలంబులు కాంగ్రెసులోఁ బ్రవేశింపఁ గూడదన్న నియమమేమున్నది?

లక్ష్మణ:— అస్పృశ్యతానివారణము.

మోతీ:— ఈవిషయమున గాంధిగారి నడిగినచో బోధింపఁగలఁడు.

రాజేశ్వరశాస్త్రి:—గాంధి గోహత్య చేసినవాఁడు. మేమతనిని బహిష్కరించినాము. అతనితో మాటలాడనొల్లము. సభ్యులని యాలోచించి తమ్మునే ప్రశ్నించినాము. తమరే మాకు బదులు చెప్పుదురుగాక !

(ఇట్లు స్పష్టముగా నన్నతోడనే ప్రతిపక్షు లందఱును జిటపట లాడినారు. పరస్పరము మాటలాడుకొన్న తర్వాత) మోతీలాలుగా రిట్లన్నారు:— అట్లుకాదు. ఆసంగతి కాంగ్రెసులో నధికసంఖ్యాకులు ప్యాసుచేసియున్నారు. అధికసంఖ్యాకులు దేని నంగీకరింతురో యదియే పనికివచ్చును. తమరుకూడఁ గాంగ్రెసులోఁ బ్రవేశించి యధికసంఖ్యాకులయినచోఁ దమమాటలే ప్యాసుకాఁగలవు.

లక్ష్మణ:— అట్లయినచోఁ గాంగ్రెసు లక్ష్య మెన్నటికిని సిద్ధముకాఁజాలదు. ఏపక్షము కాంగ్రెసులోఁ బ్రబలమై ప్రవేశించునో యదియే రెండవపక్షము నణఁచి వేయునుగదా! అట్లయినచో నందులో నెల్లప్పుడును నాందోళనము జరుగుచునేయుండును. ఇదెక్కడి నియమ మండీ? ఏమీ కాంగ్రెసులో శాంతిని స్థాపింపఁజాలిన నియమమేదియును లేదా?

(ఈప్రశ్నకందఱును నిరుత్తరులయి యొకరిమొగమువై పొకరు చూడ మొదలిడినారు. అప్పటివారి భావవైచిత్ర్యము చూచియే తీరవలయును.)

లక్ష్మణ:—అస్పృశ్యతా నివారణమువలనఁ గాంగ్రెసున కేమి లాభమున్నదండీ?

మోతీ:—హైందవ సమాజములో సముచితమయిన యాదరణము పొందఁజాలక యస్పృశ్యులు మహమ్మదీయ మతములోఁగాని క్రైస్తవమతములోఁగాని చేరిపోవుదురు. కాఁబట్టి వారిని రక్షించుటకును వారిని సమానమయిన వ్యవహారస్థితిలోనికిఁ దెచ్చుటకును నిది యంగీకృతమైనది.

లక్ష్మణ:— వారు మహమ్మదీయులుగాని క్రైస్తవులుగాని

యయిపోయినయెడలఁ గాంగ్రెసుయొక్క రాష్ట్రీయ కార్యమున కేమి హానికలుగును ? వారు మహమ్మదీయులగుదురు. లేదా క్రైస్తవులగుదురు. ఏమయిన నగుదురు. కాంగ్రెసొక్క హైందవులదే కాదుగదా. ఈపక్షపాతమున కసలు రహస్యమేమి ? వర్గీయమయిన యొక ప్రశ్నకు రాష్ట్రీయమహత్వమేల యీయఁబడుచున్నది ? (ఈప్రశ్న వేయఁగానే యందఱకును దెబ్బ తగిలినట్లయినది. మొగములనుండి నిట్టూర్పులు బయలు దేరినవి. వారి బారిష్టరీయంతయు మాయమైపోయినది. అందఱును మౌనముద్ర నవలంబించిరి.)

మోతీ:— మంచిది. ఇప్పటికుండనిండు. గొప్పపనిలోఁ జిక్కుపడియున్నాను. ఇంతవఱకును నేను భోజనము చేసియుండలేదు. భోజనమునకుఁ బోఁగోరుచున్నాను.

సంఘూణీగారు:— తమరు మేమడిగిన యేప్రశ్నమునకును సదుత్తరమీయకుండ మౌనమునే యవలంబించియున్నారే. దయచేసి యింకను గొంచెముసేపు శ్రమపడుట కంగీకరింతురుగాక. ఇంకొక ప్రశ్నకు బదులు చెప్పుఁడు. తమరు కాంగ్రెసు సభాధ్యక్షులయియుండి యనారోగ్యావస్థలో శారదాబిల్లును సమర్థించుటకయి యసెంబ్లీలోని ప్రతికాంగ్రెసు సభ్యునిపేరను దంతీవార్త పంపించియున్నారుగదా. దీనివలనఁ గాంగ్రెసు పక్షమునుండి ధర్మముపైన హస్తాక్షేపము కలుగలేదని మీరు చెప్పఁగలరా ?

మోతీ:— లేదు. లేదు. అది నేను వ్యక్తిగతమయిన యధికారముతోఁ జేసియున్నాను.

సంఘూణి:— కానిండు. ఇదియేమో తమరు వ్యక్తిగతమయిన యధికారమువలనఁ జేసియున్నామని యనవచ్చును. కాని కాంగ్రెసు

టికెట్టుతో జనసముదాయము తరపున వెళ్ళిన తర్వాతను జనసముదాయముయొక్క సమ్మతికి విరుద్ధముగ వ్యక్తిగతాభిప్రాయమును బలాత్కారముగా జనసముదాయము నెత్తిపై రుద్దుటకు మీ కేమి యధికారమున్నది ? అని నే నడుగుచున్నాను. తమరు జనసముదాయము పక్షమున నేశనల్ యసెంబ్లీలోఁ బ్రవేశింపఁగలిగినారు. దీనినిబట్టి చూడఁగాఁ దమరు దేశసోదరులకు ఘోరమయిన విశ్వాసఘాతుకత్వము చేసినవారు కాకుందురా ?

(ఈప్రశ్న యడుగునప్పటికి నెహ్రూగారు నిలుచున్నపాటుననే భూమిలోనికి దిగఁబడిపోయినట్లయినారు. వారిబుద్ధి భ్రాంతి గ్రస్తమైనది. వారితోడినాయకులనతి వేడిదాట్లు ప్రారంభించినది. నెహ్రూగా రీసంకటమును విడిపించుకొనఁదలఁచి యిట్లన్నారు.)

నెహ్రూజీ:— తమ రెట్లాలోచించుకొన్నను సరియే. ప్రకృతము నేను భోజనార్థము పోఁగోరుచున్నాను, నన్ను క్షమింతురుగాక. నావిషయములో నేనిట్లు చెప్పఁదలఁచుకొన్నాను. నేను హిందువుఁడను గాను, మహమ్మదీయుఁడనుగాను, క్రైస్తవుఁడనుగాను, నాకేవిధమయిన ధర్మమును లేదు. నేను దేశసేవనే నాధర్మముగా నంగీకరించి నావలన నయినంతవఱకుఁ బనిచేయుచున్నాను.

దేవనాయక:— తమ దేశసేవనుగూర్చి చెప్పవలసిన దేమున్నది ? అదియేమో లెస్సగా శ్లాఘింపఁదగినదియే. ' భవిష్యత్తులోఁ గాంగ్రెసుద్వారమున ధర్మము విషయమున నేవిధమయిన హస్తాక్షేపమును గాఁబోదని చెప్పి మాకుఁగలిగిన యనుమానమును నివారణ చేయఁజాలక పోయినారు. కాంగ్రెసు రాజకీయసంస్థగానే యుండి పనిచేయఁబూనిన పక్షమున మేమందఱమును దానికిఁ దోడ్పడెదము.

మోతీ:— ప్రస్తుతము నన్నుఁ దమరు క్షమింపుఁడు. నేను భోజనము చేయుటకుఁ బోఁగోరుచున్నాను. కాంగ్రెసు ధర్మము విషయములఁ జేయిఁ జేసికొనదని నమ్మిక యుంచుకొనుఁడు.

దేవనాయక:— అట్లయినయెడల నస్పృశ్యతానివారణము సంగతి కాంగ్రెసు కార్యక్రమమునుండి యెత్తివేయఁబడునా ?

మోతీ:—అస్పృశ్యతను మేము ధర్మముక్రిందనే యాలోచించుకొనలేదు.

దేవనాయక:— తమ రాలోచింపకొన్న నేమి ? ఆలోచించుకొనక యుండిన నేమి ? తమ కేయొకధర్మము లేనప్పుడు తమరు దానిని ధర్మముక్రింద నాలోచింపకుండుట స్వాభావికమే గదా.

మోతీ:— కాని సనాతనధర్మానుయాయియగు మాలవీయ కూడ నస్పృశ్యతా నివారణము నంగీకరించుచునే యున్నాఁడు కాఁడా ?

దేవనాయక:— ధర్మవ్యవస్థ యొకవ్యక్తియంగీకారానంగీకారముల నవలంబించి యుండునది గాదు. మఱేమందురా ? ప్రతిధర్మమునకును నాధారము తన్మూల గ్రంథముల నవలంబించియుండును. క్రైస్తవులకు బైబిలువలెనే సనాతన ధర్మావలంబులకును నిట్టివిషయమున సనాతన ధర్మస్వరూపము వేదములు తదనుగతములయిన స్మృతులు. వీనివలననే నిశ్చితము కావలయును. వీనియందస్పృశ్యతా నివారణ మనర్థకమనియే విధింపఁబడియున్నది.

ఈమాటలతో నెహ్రూగారిది తనసామర్థ్యమునకు పైవిషయమని పాపము సమాధానము చెప్పఁజాలక క్షమింపుఁడని ప్రార్థించి వెళ్ళిపోవుటకే పూనుకొన్నారు. లక్ష్మణశాస్త్రి మోతీలాలు నెహ్రూ

గారి సమావేశమువలనఁ దత్త్వపుయుమయిన పరిణామమేమియుఁ దేల
లేదు. కాని జనసముదాయమునకు మాత్రము నాయకనామధారు
లెట్టి కలుషితములయిన మనోభావములతో దేశసేవ చేయుచున్నారో
వెల్లడియయినది. నెహ్రూగారి మాటలవలనను శాస్త్రులవారి
యొక్కయు, సంఘానీగారియొక్కయుఁ జాతుర్యపూర్ణప్రశ్నల ద్వార
మునను జనసముదాయమునకు నాయకనామధారుల యాంతరంగిక
మయిన ధర్మభ్రష్టతాభావవ్యాప్తి ప్రదర్శనము చక్కఁగాఁ దెలిసినది.
సనాతనధర్మపరులగు హిందువులందఱకుఁ గోరఁదగిన స్వరాజ్యవిషయ
మునం దంతఃకలహములు కలిగినప్పటికిని భ్రష్టాచారుల మోసము
నుండి జనులను దప్పింపఁజూచుచున్నారు. ఈసంగతి సందర్భముల
నాలోచింపఁగా ధర్మహీనమయిన యధ్యక్షతారూపమున బ్రాహ్మ దేశ
దాస్యశృంఖలమునందుఁ దగిలింపఁజూచు క్రిస్టియను మిషనరి ప్రచ్ఛ
న్నమును గఠినమయిన ప్రచారకసంఘమని తలంపఁబడుచున్నది. ఈ
ప్రచ్ఛన్నసంఘమగు కాంగ్రెసునుండి జాగరూకులయి యున్నఁగాని
దేశకల్యాణము సమకూరఁజాలదు. ధర్మభావపూరితులగు హిందూ
ముసల్మానులేకమయి నడుముగట్టి పనిచేసిననే దేశమునకు క్షేమ
మును గలిగింపఁజూతురు. ఇట్టిధర్మవీరులే మాతృభూమి బంధవిముక్తికి
సమర్థులు. ఇహపరలోకసుఖమును గలుగఁజేయు తమధర్మమునే
ద్వేషించి యెవ్వరు నిలుపుకొనఁజాలరో యట్టివారెన్నటికిని దేశము
నకుఁ గల్యాణము చేయఁజాలరని యే మానమ్మకము.



# సంస్కృతవిద్యాప్రాశస్త్యము

———(:o:)———

గుణగ్రాహకశీలురగు నో సహృదయులారా !

ఈభూతల మనేకభాషలం బెంపువడసియున్నది. ఆయావిద్యలు లేక మానవుల హృదయాభిప్రాయమును దెలిసికొనుట కష్టసాధ్యము. ఆవిద్యలలో నొకవిద్యయే శిరోమణిస్థానమును బొందఁదగియున్నది. ఏవిద్య సంస్కృతపదసహితముగాఁ జెప్పఁబడినదో, అన్నిభాషలును స్వోచితవ్యాకరణములచే సంస్కృతములేయని యనఁదగవు. సంస్కారమన మహనీయుల కృపావలోకనమే కాని వ్యాకరణసంస్కరణము గాఁజాలదు. ఏలయన ననేకసంస్కారములచే సంస్కృతమయినను నొకవస్తువును మహనీయులు పరిగ్రహింపనిచో నది మాన్యము కాఁజాలదు. మతస్థాపనాచార్య్యు లందఱును సంస్కృతభాషయందె సకలగ్రంథములను వ్రాసిరి. ఆగ్రంథములిప్పటికిని సర్వమాన్యములుగా నున్నవి. అందువలన సంస్కృతగ్రంథకర్తలే మహనీయులని చెప్పఁదగియున్నారు. సర్వేశ్వరుఁడగు నీశ్వరుఁడు సంస్కృతభాషచేతనే వేదమును జెప్పెననువిషయములోఁ బ్రమాణవిషయమగు (అస్య మహతోభూతస్య నిశ్శ్వసిత మేతత్)అనుశ్రుతియుఁ దదర్థప్రతిపాదకమగు(యస్య నిశ్శ్వసితం వేదాః) అను స్మృతియు జాగరూకములైయున్నవి. అందువలన నీభాషయందే గొప్పవారికి నాదరము. అదియే సంస్కారశబ్దవాచ్యము. ఆకారణమువలన సంస్కృతమైనదగుటచేత సంస్కృతభాషయని వ్యవహృతమగుచున్నది. మఱియు (నమ్లేచ్ఛితవై నాపభాషితవై)యనుశ్రుతియు, (న వదే ద్యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి) యను స్మృతియును మన యితరభాషాశ్రియణమును నివారించుచున్నవి. మఱియు (ఏక శ్శబ్ద స్సుప్రయుక్త స్సమ్యక్ జ్ఞాత

స్వర్గే లోకే కామధుగ్భవతి) ఇత్యాది శ్రుతులును సంస్కృతభాషా వ్యవహారమునే బోధించుచున్నవి. అనేకోదాహరణము లనవసరములు. ఈభాషయందే వేదములును శాస్త్రములును బురాణములును మంత్రగ్రంథములును గలవు. ఆకారణములవలన నీభాష ముఖ్యముగా నభ్యసింపఁదగినది. ఏభాషచేత మనము పరమేశ్వరుని దెలిసికొనఁ గల్గి తదనుగ్రహపాత్రు లగుచున్నామో యట్టిభాష యేకదా మాకుఁదల్లి. అందువలన సనాతన ధర్మాభిలాషులగు మనయందఱిచేతను దేవభాష సమాదర్తవ్యముగా నున్నది.

ఇట్లు,
సనాతనధర్మాభిలాషి,
ఇంద్రకంటి సుబ్రహ్మణ్యశర్మ,
కర్నూల్.



## కృతజ్ఞత

(౦)

అభినవసరస్వతి కీమాసముతో ౨౧ సం॥ లు నిండినవి. ప్రారంభమునుండికాని తరువాతఁగాని దీనిఁ గైకొనుచుఁ బోషకులుఁగను సహాయులుగను జందాదారులుగను నుండి యేతదభివృద్ధికి హేతుభూతులగు సుజనుల కందఱకుఁ గృతజ్ఞుండను. చాలకాలమునుండి ప్రధానపోషకులుగానుండిన పీఠాధీశప్రభృతులే కాక యీసం॥ ఆత్మకూరు నివాసులగు నిడిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారును దంగెడ నరసింహారావుగారును బ్రధానపోషకత్వము వహించిరని తెల్పుట

కెంతయు సంతసించుచున్నవాఁడను. అందు నరసింహారావుగారు మా పల్నాటివారును మా యూరి కైదుక్రోసులదూరమం దున్నవారును గవులును భాషాప్రియులును. వీరితండ్రిగారు పల్నాటికిఁ బ్రసిద్ధకవియై భాద్రపదమాసముననే పరలోకమున కరిగియుండిరి. ౧౨ వ దినముననే ప్రధానపోషకతను నరసింహారావుగారు స్వీకరించియుండిరి అట్టిపట్లు నందులకుఁగా నాయనను బ్రోత్సహించుచుఁ జదివిన పద్యము లీక్రిందఁ బొందుపఱుపఁ బడుచున్నయవి.

క॥ పితృయజ్ఞంబున సురలయు
మతిమద్భూమీసురులయు మదిఁగల కోర్కుల్
సుతులకుఁ దీర్చుట యుక్తము
పితరులు సద్గతులఁ బొంది ప్రీతి వహింపన్.

క॥ అభినవసరస్వతికి మీ
రభయంబిడి యిరువదొక్క యబ్దము లయ్యెన్.
విభవము గడు లేకున్నను
శుభముగఁ బ్రచురింపఁబడెడిఁ జూ యొకభంగిన్.

సీ॥ దానికి నీవు చందాధనంబును మాత్ర
మొసఁగి కైకొన్నాఁడ వొక్కయేఁడు.
పిదప సహాయుఁడై ప్రేమఁ జూపించితి
వొక కొన్ని యబ్దంబు లుచితగతిని.
ప్రకృతంబు పోషకభారంబు వహియించి
యాదరించుచునుంటి వగ్గలంబు
భవదీయగ్రంథము ల్ప్రచురింపఁ జేసి యిం
దిచ్చి యుండినవాఁడ వింతధనము.
వరుస నిట్టు లభినవసరస్వతిని. సాకు
నీకు శేష మొకటి నిలిచియుండె.

ఘన పరిధానపోషకత్వంబు పూనుటే
యది నృసింహారాయ ! అతితరాయ ! 3

ఉ॥ ఏఁబదియైదువత్సరము లిప్పుడు నాకుఁ, బదైదు వత్సరా
లే బ్రదుకంగలాఁడ నిఁక. నిన్నిసమ ల్బ్రిచరింపఁబోవ నీ
పేబరు. గాన నెంతయును బ్రేముడితోడఁ బరిధానపోషకుం
డై బుధలోకవర్ణితుఁడ వౌట సమంజస. మేమిచెప్పుదున్. ౪

క॥ అభినవసరస్వతికి నీ
వభయంబిడియున్నదాని కన్నితరగతుల్
విభజించి స్వీకరించుచు
నుభయులకును గీర్తి దేఁగదోయి నృసింహా ! ౫

మ॥ అల పల్నాటిదె పేపరంటు, నరసింహారావునా బ్రాహ్మణుం
డలఘుప్రీతిఁ బ్రధానపోషకుఁడుగా నద్దాని కున్నాఁడటం
చెలమిన్ నిన్ ననుఁ బేరుకొంద్రు జను లెంతేసిన్ భువిం గాన నా
తలఁపుం దీర్చి తిరుం బొనర్పఁదగు నీతండ్రిం దివంబందునన్ ౬

ఆ॥ నాకు నీకుఁ బల్లెనాఁటికి నీనాఁటఁ
గల మహీసురులకుఁ గరణములకు
మూలనుండినట్టి మోర్జమపాటికిన్
భూష నీ పరిధానపోషణంబు. ౭

మ॥ జనకున్ స్వర్గముఁ జేర్ప బ్రాహ్మణులకున్ సంభావన ల్భక్తిఁ బె
ల్చనఁ గావించెడి వేళ యిద్ది. యటులే తన్మాగోపరిదానంబులున్
బొనరింపంబడెఁ. బూజ్యమానులు బుధుల్. పుణ్యంబు నార్జించి.తిం
కనుమానింపక యస్మదీప్సితమునున్ సానందతం దీర్పుమా. ౮



—• శివుండు వృషభావతారమెత్తుట •—

క॥ దేవేశ! నమస్కారము గావింతును. నామపూజ నైకొను మనఘా!
ఈ విశ్వార్తి హరించెడి యావా! స్తుతియింతు వరదనగుమీ దయతోన్. ౧౧౧౪

తే॥ విప్రశాపాగ్నిదగ్ధమై విగతశోభమైన నామేను శోభనా! యమృతజాత!
తిరిగి నిల్పుము కరుణ నీతేజుచేత" యనుచు నాగోవు సెంతయు నభినుతించి. ౧౧౧౫

క॥ వలగొని భక్తియుతంబుగ లలిన్ మ్రొక్కెడి దాని మేన లయమగుటయు నం
దుల కెంతో సంతసిలి యది యలఘుతరాత్మీయ గర్భమందు ధరించెన్. ౧౧౧౬

సీ॥ తెఱగంటు లందఱుం దిరుగంగఁ జొచ్చిరి యగ్గలంబగునార్తి కగ్గమగుచు
అవనీతలంబెల్ల నాధారశూన్యమై కదంభయంపడ జను లక్కదలఁదొడఁగె
సూర్యచంద్రులు భూతశోభులై రెంతయుఁ జిమ్మచీకటి దెస లక్కుమ్మకొనఁగఁ
గాదు వుచ్చండమై కన్నులంవో వీచె వారిధుల్ క్షోభించె ఘోరముగను
ధావరము జంగమంబైన సర్వజగము వేనిలోఁ గాలమందున విలయమొందు
తిరిగి కలుగునో యవ్వాఁడు ధరణిసురుల శాపమునఁ జేవి దగ్ధుఁడౌ సమయమందు

తే॥ ఇటు హతప్రాయమగుటయు నఖిలజగము యోగనాయామవిస్మృతి నున్నయట్టి
పుడమిఁ బడియున్న లింగంబుకడకువచ్చి మునిసహస్రంబు లత్యంతమును బనవుచు

క॥ అటునిటు లవలోకించుచుఁ నెటుగూడను దృష్టిపథము నెనయఁడు శివుఁ డ
ప్పటులింగంబును వేయుం డ్లటఁ బదిలముచేసియుంచి రా ఋషివృషభుల్. ౧౧౧౮

ఆ॥ నెత్తురోడిసికొనుచు నీరక్తితంబయి యుండియున్నయట్టి యుగ్రలింగ
మును గుఱించి శంకయొనరె నమ్మునులకు. దహ్యమానమయ్యె ధరణియెల్ల. ౧౧౧౯

తే॥ తన్మహాలింగ మటు స్థాపితంబుఁ జేసి నర్మదం జేసి రద్దాని. నర్మదాను
కౌరి యవ్వారియయు. నమరకంటకంబు లింగమును. నంత నమ్మునిపుంగవాళి.

ఆ॥ "సేవ్యమానమైన శ్రీమదేతల్లింగ మపనయించు నరక మవనిప్రజకు.
భూతములను గ్రహము లేతన్మహాపూజనమున భూపలాయనమును జేయు.

క॥ ఇక్కడ సుస్నాతుండై దక్కినవుణ్ మొగమునఁ బితృతర్పణముం దా
నెక్కుడు శ్రద్ధం జేసినఁ జక్కఁగ ఫలియించు నరుని సకలేప్సితముల్. ౧౧౨౦

తే॥ నర్మదాలింగముల పూజనమునఁ జేసి రుద్రమయుదేహ మగుఁ బ్రజ రూఢముగను.
హరి పరుండిన తరుణమం దాచరించు లింగపూజ విశేష మొసంగు ఫలము. ౧౧౨౧

సీ॥ అగు జన్మరాహిత్య మలఘుచాతుర్మాస్య సల్పంగఁబడు రుద్రజపమువలన.
తలఁగును గర్భవేదనము చాతుర్మాస్యఁ బొనరింపఁబడు శివపూజనుండి.
పుట్టు రెన్నటికి నిబ్భువిని జాతుర్మాస్య భవుమీఁద నవ్యాజభక్తినుంచి.
అమృతంబు సేవింతు రల్లచాతుర్మాస్య శంభుఁ బంచామృతస్నాతుఁ జేసి.
భీముగుడిని దివ్వెఁ బెట్టి చాతుర్మాస్య స్వకులకోటితోడఁ జనును దివికి.
మధువుతోడ నీశు మస్తకమునఁ జేయు సేచనంబు దుఃఖమోచనంబు ౧౧౨౨

తే॥ చందనమలంది శ్వేతపుష్పములచేఁ గరంబు గైసేసి యగరుధూపంబు వేసి
నర్మదాజలలింగంబునన్ యజించు నరులు నరులనఁబడరింక నారలె కాని. ౧౧౨౪

క॥ ప్రాణప్రతిష్ఠచేసిన ప్రాణంబులులేని రాలె నారలగుచుండన్
ప్రాణములుగల శరీరులు రాణను నారలగుట యెంత రసఁ బరికింపన్. ౧౧౨౫

క॥ ఏతత్తీర్థంబున సంజాతంబయి పూతమగుచు జలధారణసం
పీతంబగు నీలింగము చాతుర్మాస్యము యజించు జనుఁడా శివుఁడౌ. ౧౧౨౬

ఆ॥ నరగణంబు మఱియు నర్మదామరకంటకాఖ్యతీర్థమునను సధికనియతి
గలిగి జలకమాడ నలఘుచాతుర్మాస్యఁ జని త్రివిష్టపమున మనెడి నెపుడు."

కం॥ అని విశ్వక్షోభమునకుఁ బనవుచుఁ బద్మాసనమునఁ బ్రాణాయామం
బునుబట్టి నిశ్చలంబుగ మనమున ధ్యానించి రయ్యుమామహ్రుదయేశున్- ౧౧౨౮

కం॥ పదపడి యిందాద్యమరులు కదలి ద్రుతం బమరకంటకమునకుఁ జని బి
ట్టాదవెడిభక్తిని నానతవదనులగుచు ఋషిగణంబువలను మొగంబై ౧౧౨౯

ఆ॥ "బ్రహ్మవిదులు గురులు బంధవిముక్తులు నవనిసురులు నైన యట్టిమీకు
ఎఱఁగుచున్నవార మేము మహేశ్వరులార యో ద్విజాతులార! భక్తి. ౧౧౩౦

కం॥ గుణరూపులుమీరలు. మఱి గుణాకరులు - త్రిగుణములకుఁగూడ నతీతుల్.
గుణమయభావములఁ బ్రతిక్షణమును నసుబుద్బుదములు క్ష్మాచక్రమునన్-౧౧౩౧

సీ॥ మీరు వాగ్జలధార వృజినుల శుచిచేతు. రప్పాపముల భస్మమాచరింతు.
మీవాకె చురకత్తి. మీ క్రోధ మాసము. లాగ్రహసమయమం దగ్నితుల్య.
లీరె సమర్థు లనేకంబులైనట్టి శక్తులఁ బడఁగొట్ట క్ష్మాతలమున.
త్రిదివాదిలోకము ల్చేర్ప మీరే గతి. యొక్కొర్య మేని మీకే సుసాధ్య.
మీరె సత్కర్మకారకు లెంచిచూడ. మీరె సత్కర్మనిరతులు. మీరె మోక్ష
కాంక్షులగు మనుజులకు సత్కర్మములను ఫలమునిచ్చెడివారలు పాఱులార! ౧౧౩౨

తే॥ వాగయోమయశస్త్రమ్మువట్టియుంకి యుష్మదీయబలంబు లోకోత్తరంబు.
మీరలు తరింతు. రితరుల నెంతయును దరింపఁజేతురు. మిమ్ము వర్ణింపఁదరమె-

కం॥ త్రేతాగ్నులు సతతము మీచేతం దర్పితములగు. విశేషించి తద
ర్చాతత్పరులై యుందురు చాతుర్మాస్యమున ఫలము సమధిక మొందన్. ౧౧౩౪

కం॥ సావిత్రీమంత్రజపము కావించుచునుందు రెపుడుఁగావున మీ క్రో
ధావిలులగుచో సకలాంగావళి నశియింపఁజేయురయ్య విలీలన్. ౧౧౩౫

ఆ॥ విప్రశాపమూర్వి వితథంబుగాకుండ వఱలుచుండునంతవఱకుఁగూడ
కులిశశూలదండములతోడఁ బనిలేదు హరిహరులకు హరున కంతకునకు. ౧౧౩౬

ఆ॥ అగ్ని కానఁబడెడి యఖిలపదార్థముం దగులబెట్టుఁగాని ధరణిసురుఁడు
శాపమునను జేసి జాత మజాతమ్ము నెల్ల బలిమిమై దహింపఁజేయు. ౧౧౩౭

తే॥ శస్త్రమునఁ గొట్టఁగాఁబడి చచ్చునట్టివాఁడు సహితము క్రిమ్మఱవచ్చుఁగాని
ధరణిసురశాపవహ్నిచే దగ్ధులైనవారు నారకమునుండి రారు మరల. ౧౧౩౯
కం॥ సురలకు మధుధాన్యంబుల సరిగఁ ఛేదించునట్టి సామర్థ్యములే.
దరసిన వాక్యస్త్రముసనె కఱకఱ గాఁగ మెల్లఁ దఱుఁగఁగలరు మహీసురుల్.
ఆ॥ అట్టిమీర లగుదు రస్మద్గురు ల్విశ్వకర్తలార! భువనకర్తలార!
ఈశ్వరుని వినాగ నేనును లోకము ల్పనవుచుంటి. మెఱుకపఱుపుఁ డతని" ౧౧౪౦
కం॥ అనివినుతించుటవోఁను మును లనఘుండగుహాలపాణి యాత్మభయముఁ
జని సురభీగర్భంబున నినియించుట యెఱిఁగి విబుధసంఘంబునకున్ ౧౧౪౧
క॥ స్వాగత మొసఁగి తదన్వితులై గోలోకమున కరిగి రమ రాధ్యమునన్.
వేగ నటులేగి యందఱు బాగుగఁ గనుగొనిరి యచటి భద్రములెల్లన్. ౧౧౪౨
క॥ పరమాన్నకర్దమంబుల సురుచిరఘృతనదులఁ దేనెసోనల దధిసుధా.
కరులగు పూర్వజగణముల మరీచిఘృతసోమపులను మఱిఁగాంచిరహో! ౧౧౪౩
సీ॥ నంద నందిని మేధ్య నర్మద సుమనస సకలప్రియ సుశీల శాంత నీల
కామిని ధర్మద వామన లంబిక ధనద తరేయిక శాంత కృష్ణ
దీర్ఘశృంగ సురూప దీర్ఘనాస సునాస చారుచంపక దుర్వివహ్వా వినత
అభినత సుదతి జయారుణ కుండోఘ్ని గౌర హిరణ్యద గౌరవదన
లోనుగాఁగల యావులలోననుండి యవల కివలకు నరికెడి యర్కతేజు
సౌరభేయుని గని నీలసంజ్ఞుఁ బ్రీతి నిందప్రముఖదేవతలును మునీశ్వరులును
సీ॥ "ఈ వెల్లగోప్తల కెంతయు దేవుండ వగుదు జగద్గోప్త. వాదిముఁడవు.
విఘ్నము లోప్పకొర్చి విజ్ఞానమిడెదవు. ధర్మరూపత నమృతంబునిడెదు,
హరియించెదవు నీవ యఖిలజాడ్యములను. ధనమును శ్రీనిచ్చి తనుపు, దీవ.
జగము సుఖింపఁజేయఁగఁ బ్రవృత్తుండవు. తేజంబులకు నీవ దివ్యధామ.
మతిబలా! సౌరభేయ! శృంగాగ్రమందుఁ దాల్తు వుమతోడి కైలాసధరమునీవు.
వేదమయుఁడవు వేదాత్మ వౌదు నీవు. వేదవేద్యుఁడవును వేదవిదుఁడ వీవు.
సీ॥ వేదయానుఁడవును. వేదరూపుఁడవును. దగ స్తుత్యుఁడవును వేదములచేత.
త్రిగుణంబులకుఁ బరుండ వగుదు గుణాకరుండవు. నీదు యాథాత్మ్య మెవఁడెఱుంగు
అగునీవు భగవంతుఁడవు దేవ! వృషభమున్. వృషలుండు నిన్ దూఱు నెకలి దెలఁప.
వీఁడును గాళ్ళచే వృషభమున్ స్పృశియించువాఁడును బడు రౌరవంబునందు.
అఁకటం దప్పి నాక్రాంతమగుచునుండ మిగుల భారంబువహియించి వగచుచుండ
గాంచి యెవ్వఁడు నిరయాక్రాంతుఁడగునో వానిమతి శాశ్వతంబయి వఱల దెంక.

ఆ॥ పితరులఁ గుఱించి ప్రీతియుతంబుగా మైలకోడె కెవరు మహిని బెండ్లి
యాచరింతురో వారియన్వయమునఁ బుట్టువాఁడు నరకమునకుఁ బోఁడు పోఁడు.
సీ॥ ఎల్లలోకంబుల కీవ యయ్యెదు గతి. యీవ తండ్రివి. పరమేశ్వరుఁడవు.
నినువినా జగమెల్ల నిర్వీర్యమైపోయి తత్క్షణముననె విధ్వస్తమగును.
బరయును బశ్యంతి వైఖరి మధ్యమ యను చతుర్విధ సువాక్యముల కీవ
ఈశ్వరుండవటంచు నెల్లభూతములకుం దృప్తి సేయుదువటంచుఁ దెలియు బుధుల.
కాత్మవని బ్రహ్మమని ధర్మమని జగంబుఁ బర్వియుండెదవనియు నిన్ బ్రజ యెఱుంగు
జీవరూపంబునను నిత్య మీవు మూఁడులోకముల నిండియుందువు వేకముగను.
తే॥ నాల్గుకొమ్ములు మఱియును నాల్గుకాళ్ళు రెండుతల లేడుహస్తంబు లుండి ముత్తె
ఱంగులం గట్టఁబడు ధర్మరాశియైన వృషభమునుగాఁగ నిను వేదవిదుఁ డెఱుంగు.
సీ॥ అచ్ఛేద్యుఁడు నభేద్యుఁ డప్రమేయుఁడు మహాయశుఁ డశోచ్యుఁ డదాహ్యుఁడనుచు
బౌరాణికాగ్రణుల్పలుకుచుందురు. త్వదాధారమంతయుఁ.త్వదాధారముర్వి.(నిన్నె.
యుష్మదాధారులై యున్నారు దేవత లగు యుష్మదాధార మమృత" మనుచు
స్తుతియించి సుప్రసన్నతఁ బ్రణతుండగు కఱకంఠునకుఁ గృతాగసులు విప్ర
"లెవని మృతదినమున కేకాదశాహమం దిల వృషోత్సర్జనంబు సలుపఁబడదొ
శ్రాద్ధశతము శ్రద్ధ సలుపంగఁబడినను వాని ప్రేతతనువు వదల" దనుచు ౧౧౪౦
ఆ॥ వర మొసంగ మఱియు స్వల్పరసాక్రాంతమయి చరించు నమ్మహావృషభము
ముద్రలు రెండు శూలమునఁ జక్రమున నంకితంబొనర్చిరప్పుడు ధరణిసురులు ౧౧౪౧
ఆ॥ దేవగుప్తమైన యావృషరాజంబు గోగణంబునడుమ వేగ విడిచి
ముక్తకోపులగుచు మునివరు లనిమిషుల్ స్వస్వధామములకుఁ జనిరి వేడ్క ౧౧౪౨
ఆ॥ ఇట్లు కామవశత ఋషిసతీలోలుఁడై శివుఁడుగూడ వారి ధవులచేత
బలిమిమై శపింపఁబడి నర్మదాజలంబున శిలామయత్వ మెనసె" ననుచు. ౧౧౪౩
గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్ష సంప్రాప్తోభయ భాషాపాండిత్య
రసవత్కవిత్వనిధాన హారీతసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాం
బికాగర్భశుక్తి ముక్తాయమాన విద్వత్సభావిష్కృతావధానవిధాన
జానపాటి పట్టాభిరామాభిధాన సమాంధ్రీకృతంబగు
శ్రీస్కాందమహాపురాణాంతర్గత
నాగరఖండంబునందు
నవమాశ్వాసము.

---

## చందాదారులు.

౧ మోతే నారాయణరావు బహద్దరు జమీందారుగారు - యేలూరు
౨ భువనగిరి బుచ్చిపరదేశి సోమయాజులుగారు - సబ్ కోర్టుప్లీడర్ - గుంటూరు
౩ శిష్ట్లా వెంకటకృష్ణయ్యగారు - వకీలు - బెజవాడ
౪ వేముగంటి రామకిషనరావుగారు - వకీలు - కంభంమెట్టు
౫ చల్లా సూర్యనారాయణరావుగారు-డివిజన్ ఫారెస్టు హెడ్క్లర్కు-కంభంమెట్టు
౬ విస్సా వెంకటప్పయ్యగారు - రఘునాధపాలెం
౭ ఇటికాల రాజేశ్వరరావుగారు - వకీలు - కంభంమెట్టు
౮ వెంకటరామయ్యగారు - గ్రంధిపిరి
౯ భువనగిరి కోదండపాణిగారు - సబ్రిజిస్ట్రారు - దుగ్గిరాల
౧౦ తూములూరు కోటయ్యగారు - పినపాడు
౧౧ గడియారం వెంకటశివశాస్త్రిగారు - సంగం జాగర్లమూడి
౧౨ దెందుకూరు బ్రహ్మం దీక్షితులుగారు - గుంటూరు
౧౩ పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు - గుంటూరు
౧౪ వ్యాకరణం వెంకటేశ్వరావధానులుగారు - తాళ్ళూరు
౧౫ గుండేపూడి నరసింహము విశ్వనాథముగార్లు - సత్తెనపల్లి
౧౬ వేలేటి రాఘవశాస్త్రిగారు - మిడిల్ స్కూలు పండితులు - హైదరాబాదు
౧౭ జింకా సుబ్బారావుగారు - వకీలు - గురిజాల
౧౮ లంకా అంబయ్యశాస్త్రిగారు - అంబాపురం
౧౯ కొండపల్లి జానకిరామయ్యగారు - రేగులగడ్డ
౨౦ ద్రోణా సోమయ్యగారు - సర్వకరం
౨౧ కంచిరాజు శంభయ్యగారు - కరణం - మల్లారెడ్డిగూడెం
౨౨ తంగెడ వెంకటనారాయణరావుగారు - కరణం - తంగెడ
౨౩ భమిడిపాటి సుబ్రహ్మణ్యంగారు - పెదపులివర్రు
౨౪ లంకా సుందరరామశాస్త్రిగారు - అంబాపురం
౨౫ వేమల వెంకటసత్యనారాయణశాస్త్రిగారు - కాకరపర్రు
౨౬ వెల్లాల శివరామశాస్త్రిగారు - అయ్యవారిపల్లె
౨౭ హస్తలపురం నరసింహశాస్త్రిగారు - చేకుమహాలు
౨౮ రాజరాజ నరేంద్రా. ధ్రిభాషానిలయము - హనుమకొండ
౨౯ చతుర్వేదుల ధర్మారావుగారు- అకౌంటెంట్ పోలీసుడైరెక్టరు జనరల్ ఆఫీసు హైదరాబాదు
౩౦ దేవరాజు లక్ష్మీకాంతరావుగారు - కరణం - ఆత్మకూరు

౩౧ గొల్లపూడి రామనాథయ్యగారు - వకీలు - ఒంగోలు
౩౨ కురుగంటి పున్నయ్యగారు - వకీలు - ఒంగోలు
౩౩ జిల్లా కాశయ్యగారు - అనపాలెం
౩౪ తంగెడ లక్ష్మీనారాయణగారు - దైద
౩౫ కొండ భోగిభూషణరావుగారు - చినకొండ్రుపాడు
౩౬ ఇంజనంపాటి అనంతయ్యగారు ఆ॥ కరణం - ఉప్పలపాడు
౩౭ బ్రహ్మభట్ల పట్టాభిరామశర్మగారు - గుడివాడ
౩౮ విద్వాన్ వెల్లాల శంకరశాస్త్రిగారు - కర్నూలు
౩౯ దివాన్‌బహదరు దురిసేటి శేషగిరిరావుగారు హైకోర్టువకీలు - కాకినాడ
౪౦ ఇంగువ శ్రీకృష్ణయ్యగారు - వకీలు - నెల్లూరు
౪౧ మల్లాది సోమసుందరముగారు - సబ్ మేజిస్ట్రేటు - తెనాలి
౪౨ మంచికంటి వెంకటరామయ్యగారు - కంట్రాక్టరు - నర్సారావుపేట
౪౩ తాడేపల్లి సంపూర్ణలక్ష్మీనారాయణగారు-జిల్లాకోర్టు వకీలు - నర్సారావుపేట
౪౪ జమలాపురం సూర్యనారాయణరావుగారు - ఎఱ్ఱుపాలెం
౪౫ పరసా రామనాథము దేశముఖుగారు - కారేపల్లి
౪౬ ముదిగొండ లింగయ్య శాస్త్రిగారు - సికింద్రాబాదు
౪౭ నారాయణరెడ్డి దేశముఖు గారు - మొలుగు
౪౮ వేమూరు చెంచుకృష్ణయ్యగారు - స్కూల్మేష్టరు - సికింద్రాబాదు
౪౯ జగర్లపూడి అమరనాథశాస్త్రిగారు - తెలుగుపండిట్ - సికింద్రాబాదు
౫౦ ఓదరు కృష్ణయ్యగారు - పరగణాసభాపతి - తూపరాణి
౫౧ చీమ నరసింహారెడ్డిగారు - తూపరాణి
౫౨ మొలుగు రామయ్యగారు - వసీనుపల్లె
౫౩ రామరాజు సుందరరామారావుగారు - తుమురుగోడు
౫౪ లంకా వెంకటనారాయణగారు - పంగిరిపాలెం
౫౫ చతుర్వేదుల నరసింహయ్యగారు - విప్రులపల్లెఅగ్రహారం
౫౬ పుచ్చా పట్టాభిరామయ్యగారు - తుమ్మలచెరువు
౫౭ పాటిబండ వెంకటరమణయ్యపంతులుగారు - బెజవాడ
౫౮ సోమవరపు బసవేశ్వరరావుగారు తాలూకాగుమాస్తా - మానుకోట
౫౯ రాపర్తి కృష్ణయ్యగారు - నవాబుపేట
౬౦ కాచరాజు రామచంద్రరావు దేశపాండ్యాగారు - సింగరాజుపల్లె
౬౧ నారాయణరెడ్డి దేశముఖుగారు - చినదూరు
౬౨ నెల్లుట్ల పాపయ్యదొరవారు - బమ్మెర
౬౩ పాలెం నరసయ్యగారు - నెల్లుట్ల

# అభినవ సరస్వతి.

| సంపుటము ౨౨ | జానవాను<br>ప్రమోదూత సం॥ చైత్రమాసము | సంచిక. ౧ |
| --- | --- | --- |

## కృతి విమర్శనము.

అర్థశాస్త్రచంద్రిక-ప్రథమభాగము:- ఇయ్యాది గోవిందరాజు హరిశ్చంద్రరావుగారిచే రచియింపఁబడినది. ఇం దాపధములను యంత్రములను బహార్థ వ్యయమును జీవనోపాధిలోపమును కుటుంబ శైథిల్యమును దౌర్బల్యమును శీలభ్రంశమును నతివృష్టిని ననావృష్టిని వ్యక్తిలోపమును సౌందర్యహాని రుచి మున్నగు గుణములను దారిద్ర్యమును బట్టుదలను శ్రమవిభాగమును నర్థమును సనాతన మతమును మనోబలమును గూర్చి శాస్త్రయుక్త్యనుభవహేతుప్రదర్శన పూర్వకముగా మిగులఁ జర్చింపఁబడియున్నది. యంత్రనిర్మాణమునకు లోహము లావశ్యకములు కావున నాగలి మున్నగు ముఖ్యవస్తువులకుఁ గూడ నవి దుర్లభములు బహుమూల్యములును నగుచున్నవనియుఁ దన్మూలమున నిర్మల వాయువును సూర్యకాంతియు లేని యగాధఖనులలో దిగి యనేకు లాత్మజీవితమును హ్రస్వము చేసికొనుచుండిరనియు యంత్రప్రవర్తనమున కావశ్యకములగు బొగ్గులకుఁగాఁ బెక్కు వృక్షములు కూల్చివేయఁబడుటచేతనే ప్రకృతము వర్షములు లేక క్షామములు మెండైననియుఁ బ్రజలకుఁ గట్టెపుల్లలు కఱవైనవనియు యంత్రము లిట్టి యనర్థదాయకములగుటనే పూర్వికు లవి విడిచిరి కాని వాని నెఱుఁగక కాదనియు మానవులు యంత్రములు లేకుండ స్వల్పకార్యమైనను నిర్వహింపఁజాలక దైన్యమనుభవించుచు వానికి బానిసలైరనియు యంత్రములవలని యనర్థములు కనఁబఱుపఁబడినవి. నిజమునకు స్థూల దృష్టిచేఁ జూచిన యంత్రములవలనఁ గొన్ని సౌకర్యములు మన కేర్పడినవి భూమిని దున్నుట కొక యంత్రము [illegible] బండిలాగుటకు [illegible]

టకు మఱొకటియు నన్నమువండుట కింకొకటియు దానిఁగలిపి ముద్దలు చేసి నోటఁబెట్టుటకు వేఱొకటియు నై సోమరితనమును హెచ్చించుచున్నవనుటకు సంశయము లేదు. కనుకనే ప్రతికార్యమునకును యంత్రసాహాయ్య మపేక్షింపక చేతిపను లభివృద్ధిచేయుటయే ముఖ్యకార్యమని యందు సిద్ధాంతితము. ఇట్లే పై నుదహరింపఁబడిన యెల్ల విషయములును జక్కఁగాఁ జర్చించి సిద్ధాంతీకరింపఁబడియున్నయవి. ఈ పుస్తకము వెల 0-4-0. వలయువారు కాకినాడకు గ్రంథకర్త పేర వ్రాసికొనవలయును. హరిశ్చంద్రరావుగా రిట్టి యర్థశాస్త్రము యొక్కొక్కటి భాగములును ద్వరితముగఁ బ్రచురించుదురుగాక.

---

# ఇల్లలుకఁగనే పండుగ యగునా?

:o:

(వైదికధర్మబోధిని)

కృత్యాద్యవస్థమీఁద శారదాగారి వివాహశాసనము భారతీయశాసన సభలోఁ బ్యాసుకాఁబడి ప్రభుత్వమువారిచేఁ గూడ నంగీకరింపఁబడినది. తుదకు వేదచోదితములయిన వర్ణాశ్రమ ధర్మాచారములను మంటఁగలుప నెంచిన సంఘసంస్కార సోదరుల ప్రబల ప్రయత్నములు సఫలములయినవి. తమకుఁ గలిగిన వైదికధర్మనిర్మూలన విజయమున కీ దేశోద్ధారకు లీ మహాత్ము లీశూరులు చంకలు గొట్టుచు గంతులువైచుచున్నారు. భరతఖండమునకు స్వరాజ్యము వచ్చినట్లే హర్షించుచున్నారు. తమయంతటివీరాధివీరు లీ సప్తసముద్రముద్రిత ధరణీచక్రంబున లేరని గర్వించుచున్నారు. రక్షకభటవర్గపులాటీసహాయముగల మేము శాసించినట్టుల మీ రికమీఁద బ్రవర్తింపక తప్పదని వైదికమతానలంబులను బెదరించుచున్నారు.

బాలుఁడు బాబాయకుఁ బెండ్లియయినదని మురియును. ఆ యానందమునఁ దరువాతఁ దనకుఁ గలుగఁ బోవున నర్థముల గుర్తెఱుంగఁజాలఁడు. రిఫార్మరులును దమమనోరథము సిద్ధించెనని సంబరపడిరి. అట్టిసమయమున బ్రాజ్ఞుల హితవాక్యములు బధిరశంఖారావము

లయ్యెను. శాసనసభలో యం. కె. ఆచార్యులుగారు శారదావివాహ శాసనము నెదిరించుచు దానివలన దేశమునకును హిందూసంఘము నకును గలుగఁగల యనర్థములను విస్పష్టముగను నిర్భయముగను నిష్పక్షపాతముగను బాలురుకూడ గ్రహించులాగునఁ దేటతెల్లముగ సోదాహరణముగ నుపన్యసించునపుడు పరిహాసాస్పదములయినవి. రోగికిఁ బథ్యము రుచింపనట్లీ శ్రీమదాచార్యులుగారి శాస్త్రవిహిత వాదము రిఫార్మరులకు శ్రవణకటువయ్యెను. మూర్ఖులయెడల సహేతుక శాస్త్రీ వాదము నిష్ప్రయోజనము. అనాదిసిద్ధములయి యత్యంతపవిత్రవంత ములయిన వేదవిహితశాస్త్రాచారధర్మముల నుల్లంఘించి పాశ్చాత్య పద్ధతుల ననుకరింపఁదలంచి తెచ్చిపెట్టిన వివాహవయోనిర్ణయ శాసనము వలన నెట్టి చెడుగులు నెట్టియిబ్బందులు గల్గుచున్నవో యీ సంస్కారపరాయణులు గ్రహింపఁ గలిగిరా? ఎట్లు గ్రహింపఁగలరు? ఆత్మానుభవమయినఁ గాని తత్త్వము బోధపడదు! ఈ పాపిష్ఠశాసన ఫలితముగ వేదభూమియై కర్మభూమియైన భరతఖండంబున హైందవ పుత్రులు కేవలము భోగపరాయణులై వర్ణసంకరులై స్వేచ్ఛావిహారులై పాశ్చాత్యాచార దాసానుదాసులై ఉభయ కిహాపరంబులకు రెటికిం జెడిన రేవడలయినప్పుడుగదా రిఫార్మరులు తమ దుశ్చేష్టితములకుఁ బశ్చాత్తాపము జెందునది! అప్పుడు గదా వీరికి వేదశాస్త్రాచార ధర్మ మాహాత్మ్యంబులు దెలియవచ్చునది!

నేడు సనాతన ధర్మపరాయణులగు భారతీయులలో గొప్ప సంచలనము గలుగుచున్నది. ఆర్యావర్తమునఁ గాశీ, పాటలీపుత్రము, హస్తినాపురి, యుజమీను, లాహోరు, ప్రయాగ మొదలగు పట్టణ ములందును, దక్షిణాపథమునఁ గాకినాడ, బెజవాడ, బందరు, నెల్లూ రు, మదరాసు, తిరుచునాపల్లి, కుంభఘోణము, మధుర, మాయ వరములోనుగాఁగల నగరములందును, మఱియు ననేక గ్రామముల యందును లెక్కకు మిక్కిలిగా శారదావివాహ శాసనధిక్కారసభలు జరిగినవి, ఇంకను జరుగుచున్నవి. హిందూ సంఘమునందలి వివిధ జాతులవారును నీ శాసనమును తృణీకరింపఁ జూచుచున్నారు. వేద

శాస్త్రాచార వివాహవిధులయం దేమాత్రము పరిజ్ఞానము లేక దేశో పద్రవకారక మగునీశాసనమునకుఁ జేయూత నొసంగియున్న గాంధీ నెహ్రూ ప్రభృతులు ప్రాజ్ఞలోకముచే గర్హింపఁబడి బహిష్కరింపఁ బడుచున్నారు. సంఘసంస్కార పత్రికలు బహిష్కారాయుధమునకు గురియగుకాల మాసన్నమైనది. సభలలో నెక్కడఁజూచినను శాసన సభలకుఁ బ్రజల మతధర్మముల కవిరోధముగఁ బ్రవర్తించెదమని ఖండితముగఁ బ్రమాణము చేయువారికేకాని తదితర నాయకులకు సమతమువోట్లు (సమ్మతులు) నియ్యఁగూడదను తీర్మానములు ప్యాసగు చున్నవి. వేయేల! మనసంస్కార సోదరులు విశ్వప్రయత్నముల నొనర్చి సంపాదింపఁజూచుచున్న ధర్మనిర్మూలన స్వరాజ్యము మాకు వలదువలదను ధ్వనులు దేశమందంతట మ్రోఁగుచున్నవి.

ఆర్థడాక్సుహిందువుల విజృంభణముంగాంచి సంఘసంస్కారులును తదనుయాయులును భీతావహులగుచున్నారు. పిచ్చుకవంటి శారదావివాహశాసనముపై బ్రహ్మాస్త్రతుల్యమగు నీప్రతిఘటన ప్రయోగ మేలయని యాంధ్రపత్రిక వాపోవుచున్నది. కొంచెముదూర దృష్టిగల సంస్కారనాయకు లీశారదాబిల్లు అనర్థదాయకమనియుఁ గేవలము లోపభూయిష్ఠమనియు వాకొనుచున్నారు. ఈబిల్లువలనఁ బ్రయోజనము లేకపోఁగా దేశమున నింకను గక్షలు ప్రబలి రాజకీయ రంగస్థలంబునం దైకమత్యమునకు భంగము వాటిల్లునని భయపడు చున్నారు. భారత దేశమునందలి యార్థడాక్సు హిందువుల పక్షమున రాజకీయసంస్థను స్థాపించుటకుఁ బ్రయత్నములు చురుకుగా జరుగు చున్నవి. ఆంగ్లభాషయందును దేశభాషలయందును సనాతనధర్మ పరాయణులగు భారతీయుల దృఢాభిప్రాయములను దెలియఁజేయు టకై దైనికపత్రికలను నెలకొల్ప నాయకులు గట్టి ప్రయత్నములను జేయుచున్నారు. సంఘసంస్కారుల యెడలను వారినాయకులగు గాంధీ నెహ్రూప్రభృతులయెడలను నేఁ డార్థడాక్సు హిందువుల కందఱకు విశ్వాసము సంపూర్ణముగ నశించినది. దేశమునందలి ప్రస్తుత పరిస్థితులను జూచినచో ని వివాహశాసన మంచికాలము

గానే ప్రభుత్వమువారిచే రద్దుచేయఁబడుటయో లేక యాశ్రదానంద కులమునకు శాఖాకరము గానట్లు సవరింపఁబడుటయో జరుగనై యున్నది. సంఘసంస్కారుల మురిపెము మూన్నాళ్ళ ముచ్చటయే కాఁగలదు. ఇల్లలుకఁగనే పండుగయగునా! సంస్కారులీవిషయమును జక్కఁగా గ్రహించెదరుగాక !

---

## శారదా వివాహ శాసన నివారక హరికథ.

12—1—1930 తేదిని షికింద్రాబాద్ కన్యకా పరమేశ్వరి చేపూరి వారి దేవాలయములో సనాతన ధర్మాభిమానులచే నొక మహాసభ సమకూర్పఁబడెను. దాదాపు 400 మంది చాతుర్వర్ణ్య పురజనులు వచ్చిరి. సంగీత సాహిత్య విశారదులును గద్వాల సంస్థాన పండితులును నగు బ్రహ్మశ్రీ అనంత శాస్త్రిలవారు శారదా వివాహశాసనానర్థములను బద్యగద్యకీర్తనాదులతోఁ బండితపామర హృద్యంబగునట్లు శాస్త్రీయంబుగాఁ దేటపఱచి వివాహసంస్కారము మతవిషయకంబనియు వేదశాస్త్రవిహితధర్మాచరణంబుల కాధారంబనియు నుపన్యసించి వర్ణాశ్రమధర్మసంరక్షణ మాచరింపవలెననియు శ్రీప్రభుత్వమువారీవివాహశాసనమును రద్దుచేసి తమ వాగ్దానమును నెరవేర్చుకొనెదరుగాకయనియు బహుగంభీరముగా హెచ్చరించుచు శ్రావ్యంబుగాఁ ద్యాగరాజుగారి కృతులతో దైవప్రార్థన మొనరించిరి. శ్రీ. జె. అమరనాథశాస్త్రిగారును, బ్ర. శ్రీ. నాగం కృష్ణారావుగారును, బి. యల్. నారాయణగారును పైతీర్మానమును బలపఱచినమీఁద సభ్యులందఱు నేకగ్రీవంబుగా శారదావివాహనిరాకరణమును తీర్మానించిరి.

పిమ్మట విద్వాన్ హరిదాసుగారికిని ధర్మాభిమానముతో వచ్చి హరికథాకార్యక్రమమును నెరవేర్చిన సంగీతవిద్వాన్ శ్రీ బుర్రా పూర్ణయ్య ఫిడ్లర్ గారికిని మార్దంగికశేఖర శ్రీకోటయ్యగారికిని సభాసదులకును ధన్యవాదముల నర్పించిరి.

రాత్రి 8 గంటలకు శారదావివాహశాసన నిరసనపూర్వక జయజయధ్వానంబులతో సభ సంపూర్ణము గావింపఁబడెను.

# "కర్నూలుమండల వర్ణాశ్రమ ధర్మరక్షక మహాసభ"

సర్వదో మాధవః పాయాత్

1930 వ సంవత్సరం మార్చినెల 23 వ తేది భానువారము కర్నూలుపేట శ్రీ సీతారాములవారి దేవాలయమున నీపై సభవారు శారదాశాసనముంగూర్చి సభ సలిపిరి. అందులో బ్రహ్మశ్రీ పిసుపాటి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు శారదాబిల్లును విమర్శించుచు దేశాంతరుల వివాహముల యందలి యనర్థముల నిరూపించుచు ననేక యుక్తులతో రిఫార్మరుల వాదముల ఖండించిరి. అనంతర మీక్రింది తీర్మాన మీ సభవారిచే నేకగ్రీవముగా నామోదింపఁబడెను.

1. ఇటీవల శ్రీ యమ్. కే. ఆచార్యులవారును శ్రీ వైస్రాయిగారి లా మెంబరుగారును, మిష్టర్ క్రెరార్ గారును శ్రీ వైస్రాయిగారును నూతన ఢిల్లీ పురమున సంప్రతించి ప్రజలయొక్క యాందోళనములబట్టి పూర్వాచార పరాయణు లింతగా నొక్కి చెప్పుటలో 14 సం॥ లు 12 గా మార్చుట యగునుగాని 8 గా మార్చుట కాఁజాలదని చెప్పుచు 12 గా మార్చినట్లు 17 తేది ప్రకటింపఁబడిన "హిందూ" పత్రికలో వ్రాయఁబడినందువ నీపై సభవారు కేవల మీచట్టమును శ్రుతి స్మృతిపూర్వాచారములకు నత్యంత విరుద్ధమనియు మతి స్వాతంత్ర్యమునకుఁ బ్రభుత్వమువారొక్కి జోక్యము కలిగించుకోఁ గూడదనియు నీ చట్టమును సంపూర్ణముగా రద్దుచేయవలెననియు శ్రీ వైస్రాయిగారును సీమలోనుండెడి శ్రీ రాజా సర్కారువారును తా మొసఁగిన వాగ్దానములఁ గాపాడవలెననియు గోరుచుఁ దీర్మానించుటయైనది.

23-3-'30,
కర్నూలు

ఇంద్రకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి,
అధ్యక్షులు,
పుల్లాపంతుల రామచంద్రయ్య,
సెక్రటరీ.

# శారదా శాసన నిరసనము.

---

శా॥ భార్యాపుత్రులతో నిశీథమునఁ గొంపం గేస్తు నిద్రింపఁగా
నిర్యత్నోద్రిధమునన్ దురాత్ముఁడొకఁ డగ్నిం గొంప కంటించిన
ట్లార్యాచారవిరుద్ధ శాసనము ధర్మారణ్యదావాగ్నిగాఁ
గార్యాకార్యవివేకశూన్యమతివై కల్పించితే? శారదా!

శా॥ చేడెల్ పూరుషు లంద ఱీపుడమి నీజీవంబుకై శారదా!
గోడుంగోడున నేడ్చుచుండిరి మహాక్రూరంపుదుశ్శాసనం
బేడం దెచ్చెను వీఁడటంచు, భువిలో నీరీతి ధర్మాగముల్
బాడుల్ జేయఁగ వేరుపుర్వగుచున్ బ్రఖ్యాతినిం జెందితే ?

శా॥ అంతంబొందని చింతనుండిరి కదా! యాసేతుశీతాద్రిప
ర్యంతంబుంగల ధార్మికప్రవరు లీయన్యాయ్యపున్ శాసనం
బంతంబొందఁగఁజేసి దేశమునకున్ హర్షంబువాటిల్లఁగా
శాంతంబున్ ఘటియింపఁగావలయు వైస్రాయాఖ్యధర్మప్రభూ!

శా॥ మీధర్మంబులజోలి కెన్నఁటికినిన్ మేమేగమంచున్ దయా
వీథీసంచరణైకశీలయగు శ్రీవిక్టోరియారాజ్ఞి మున్
బోధించెం బ్రజకుం దదీయవచనమ్మున్ నేఁడు పాలించి మా
బాధల్ వాయఁగ ధర్మమున్నిలుపుమో వైస్రాయధర్మప్రభూ!

శా॥ ధర్మంబేకద భారతీయులకు నాధారంబు – తద్ధర్మమే
నిర్మూలంబగుచో నింకెందులకు గాన్ధీనాయకత్వంబునన్
దుర్మార్గంబగునాస్వరాజ్య మది యింతో యింతో చేకూరినన్.
మర్మచ్ఛేదకమై నిరంతరము ధర్మధ్వంసముం జేయదే?

సీ॥ చండాలజనముచే వండిపెట్టినకూడు
విప్రబాలకులఁ దిన్పించినాఁడు.
చండాల మలమూత్రకుండముల్ దుడిపించి
బ్రాహ్మణులఁ భ్రష్టపఱచినాఁడు.
పదునన్మిదేండ్లపైఁ బడఁతిపెండ్లియటంచు
వైస్రాయికిఁ వార్తఁబంచినాఁడు.
ద్రోహంబుఁదలఁపక గోహత్యఁగావించి
కడలేనిపాపంబుఁ బడసినాఁడు.

గీ॥ బ్రహ్మహత్య యిఁకొక్కటి బాకియుండె
నదియు సంపూర్తియగుమీఁద నఖిలభార
తస్వారాజ్యము నిప్పించుఁ దప్పకుండఁ
బ్రిధితధార్మికజనపరిపంధి గాంధి.

మ॥ కనియుం బెంచియుఁ బెద్దఁజేసి తుదకుం గట్టా! కుమారీజనం
బునకుం బెండిలి యిచ్చువచ్చినతఱిఁ బొల్పారఁ గావింపఁగా
మనకుఁ బాధ్యతలేకయుండఁగ రిఫార్మర్ సంజ్ఞకుల్ సల్పి రో
య్యన వారల్ గొనితెచ్చియిచ్చిన స్వరాజ్యం బిద్దియే తద్దయుఁ.

మ॥ తనధర్మంబును బాయకుండ నెవఁ డత్యంతంబు వర్తించు నా
జనుఁ డొందుం దన జన్మ జన్మములకుఁ స్వారాజ్యభోగంబులం
చును శాస్త్రింబు వచించుఁ, దాదృశవచస్సుల్ వ్యర్థముంజేసి న
మ్మను వీడ్గాని స్వరాజ్యకాంక్ష నిజధర్మం బోవుటల్ న్యాయమే?

సీ॥ కపటావతారులౌ కాంగ్రెసువారి ప
ల్కులు నమ్మి మోసపో వలదు వలదు.
రావణసన్యాసి వేషముండెడివారిఁ
దెలియక వోట్ల నీవలదు వలదు.

మన కేమి పట్టినదని యుపేక్షాభావ
　　　　　　　ములు ధర్మమునఁజూప వలదు వలదు.
మనధర్మమది సనాతనధర్మమగుట నం
　　　　　　　దులకునై తలఁగి పోవలదు వలదు.

గీ॥ ధర్మమునకుఁ బ్రహారంబు దగులకుండఁ
గల స్వరాజ్యము నిప్పింపఁ గలిగి లేని
యప్పుడు స్వరాజ్యవాదులు చెప్పునట్టి
పలుకు లెల్లను మన మొప్పవలయువలయు.



# దేవదాసీ శాసనము.



నూతన శాసనములు సిద్ధమగుచున్నవి. ప్రాచీనపద్ధతులను రూపుమాపుటకై కొందఱు ప్రయత్నించుచున్నారు. ఇప్పుడొక్క విషయమును విచారింతము.

1. వేశ్యావృత్తివలనఁ బాపము కలుగునని కొందఱు వాదించుచున్నారు.

ఇది సరికాదు. ఏలయన నెంతమాత్రము వారికి బాపము లేదని శ్రీ విజ్ఞానేశ్వరులు—

శ్లో॥ "అవరుద్ధాసు దాసీషు భుజిష్యాసు తథైవచ
గమ్యాస్వపి పుమాన్దాప్యః, పఞ్చాశత్పణికందమమ్"
అను యాజ్ఞవల్క్యస్మృతి (వ్యవహారాధ్యాయము. శ్లో 290)

వ్యాఖ్యానమునం దిట్లు వాకు్రిచ్చియున్నారు:—

" వేశ్యాఖ్యా పఞ్చమ జాతిరితి. అత స్తాం నియతపురుషపరిణయనవిధి విధురతయా సమానోత్కృష్ట జాతి పురుషాభిగమనే నాదృష్ట దోషో నాపి దణ్డః "

( వేశ్యలనఁబడువార లయిదవజాతి యని స్కాందపురాణమునందుఁ జెప్పఁబడియున్నది. కావున వారికి నియతపురుష వివాహమును విధించు వచన మెద్దియును లేదు. కావున వారికిఁ దమతో సమానమయిన జాతియందలి పురుషునితోఁగాని యున్నతజాతియందలి పురుషునితోఁగాని సంభోగము గలిగిన యెడలఁ బ్రత్యవాయము కలుగదు. రాజదణ్డమును గూడదు.)

వేశ్యలకు బహుపురుషసంబంధమువలనఁ బాపము కలుగునని యే ప్రమాణమువలనఁ జెప్పబడుచున్నది? వారు వివాహముఁ జేసికొనవలెనని యెచ్చట విధింపఁబడియున్నది? విధిలేనియెడల దోషమెట్లు పొసఁగును? శరీర రోగాది దృష్టదోషము లెవ్వియైన సంభవించిన సంభవించుఁగాక; అదృష్టదోషముమాత్రము ఘటింపదనియు రాజశాసనముచేత నయినను వేశ్యలను బాధించుట యనుచితమనియు విజ్ఞానేశ్వరులచే నభిప్రేతమగుచున్నది.

2. వేశ్యాలంపటులయిన పురుషులకుఁ బాపము లేదాయనఁగలదనియే విజ్ఞానేశ్వరుల యుత్తరమైయున్నది:—

తాసు చానవరుద్ధాసు గచ్ఛతాం పురుషాణాం యద్యపి న దణ్డ స్తథా ప్యదృష్టదోషోఽస్త్యేవ; స్వదార నియతః సదా-ఇతి నియమాత్ ; పశువేశ్యాభిగమనే ప్రాజాపత్యం విధీయతే-ఇతి ప్రాయశ్చిత్త స్మరణాచ్చ ఇతి నిరవద్యం. "

(ప్రత్యేకముగా నొకపురుషునిచేఁ బోషింపఁబడిన వేశ్యతో విహరించువానికి వ్యవహారకాణ్డమునుబట్టి దోషములేనందున రాజశిక్ష లేకపోయినను నట్టికార్యము ధర్మశాస్త్రవిరుద్ధమయిన హేతువుచేత నతీంద్రియమగు ప్రత్యవాయాఖ్యదోషము సంభవించును.

కామము కలిగినపుడు స్వభార్యయందే సంతుష్టిఁ జెందవలెనని శాస్త్రనియమ ముండుటం బట్టియుఁ బహువేశ్యాభిగమనములందుఁ బ్రాజాపత్య మనునది ప్రాయశ్చిత్తముగాఁ జెప్పఁబడి యుండుట వల్లను వేశ్యా సంపర్కముగల బురుషునకుఁ బాపము ప్రాప్తించునని తెలియనగు)

కావునఁ బురుషునకును వేశ్యకును సామ్యము లేదు. అతనికిఁ బాపమున్నది. ఆమె కది ఎంతమాత్రమును లేదు.

పురుషునికయినను వేశ్యాసంపర్కజనితదోషము పరభార్యాభిగమన కృతదోషముతో సమానముకాదు. ఏలయన, "నపరదారాన్గచ్ఛేత్" (పరభార్యలఁ గూడవలదు) అను నిషేధ మెవ్వరికిని భార్యలు కానట్టి వేశ్యల విషయమునఁ బ్రవర్తింపదు.

మఱియు, గణికాసంభోగ ప్రత్యవాయము స్వదార నిరతత్వాది వచన కల్ప్యము. పరదారాభిగమన ప్రత్యవాయమన్ననో వచనాన్తరానపేక్షితమై "నపరదారాన్గచ్ఛేత్" అను స్వవాక్యముచేతనే క్లృప్తము. ఊహింపఁబడినది కంఠోక్తమయిన దానితో సమానముకాదు. కావునఁ బురుషునకుఁ బరభార్యా సంయోగమువలన నెంతపాప ముద్భవించునో యంతపాపమే వేశ్యసంబంధమువలనఁ గలుగనోపదు.

అదియుంగాక ధర్మపత్ని గలవాఁడు వేశ్యతో వ్యవహరించినచో దోషమొందును. భార్యావిహీనుం డట్లొనరించినయెడల నంత దోషము నొందఁడు.

3. వేశ్యాజాతి యనునది ప్రత్యేకము లేదనియు వ్యభిచార వృత్తి నవలంబించిన స్త్రీలే కొందఱు వేశ్యలుగాఁ బరిగణింపఁబడి రనియుఁ బ్రతిపక్షులవాదము.

ఇది సత్యముకాదని విజ్ఞానేశ్వరులు వ్రాసియున్నారు:—

" యత్పునర్వేశ్యానాం జాత్యన్తరాసంభవేన వర్ణాన్తఃపాతిత్వ మనుమానాదుక్తమ్-వేశ్యాః వర్ణానులోమా దన్తఃపాతిన్యో మనుష్య జాత్యాశ్రియత్వాత్ బ్రాహ్మణాదివత్-ఇతి. తన్న, తత్ర కుణ్డగోళ కాదిభి రనైకాన్తికత్వాత్ - అతో వేశ్యాఖ్యా కాచిజ్జాతి రనాది ర్వేశ్యాయా ముత్కృష్టజాతేః సమానజాతేర్వా పురుషా దుత్పన్నా పురుషసంభోగవృత్తి ర్వేశ్యేతి బ్రాహ్మణ్యాదివ ల్లోకప్రసిద్ధిబలా దభ్యుపగమనీయా ; నచ నిర్మూలేయం ప్రసిద్ధిః ; స్మర్యతే హి స్కాం దపురాణే - పఞ్చచూడానామ కాశ్చనాప్సరసః, తత్సన్తతి ర్వేశ్యా ఖ్యా పఞ్చమీ జాతి, రితి. "

(అధ్యాపనాది వృత్తులుగల బ్రాహ్మణాదిజాతులు కొన్ని కలవని లోకప్రసిద్ధివలనఁ దెలియఁబడుచున్నది. "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" మొదలయిన శాస్త్ర వచనములవలన జాతిభేదము స్థిరపడుచున్నది. అటులనే పురుషసంభోగమే వృత్తిగాఁగల్గిన వేశ్యా జాతియను నొకజాతి యనాదిగా విలసిల్లుచున్నదని లోకము తెల్పు చున్నది. పఞ్చచూడాఖ్యలయిన యప్సరసలు కొందఱుండెడివారనియు వారిసన్తతివారు వేశ్యలుగా నెన్నఁబడుచు వచ్చిరనియు స్కాన్దపురాణ మువలన నవగతమగుచున్నది. మఱియుఁ బ్రతిజాతియు బ్రాహ్మణాది వర్ణములందే యంతర్భావ మొందవలెనని వాదించు నెడలఁ గుండగో ళకాదులనుగూడ నటులనే భావింపవలసి వచ్చును. కాని యవి బ్రాహ్మ ణాది వ్యతిరిక్తములని ప్రసిద్ధిగలదు. కాఁబట్టి వేశ్యాజాతియుఁ దజ్జీవ నోపాధియు ననాదిగా సిద్ధించుచున్నవి.

అవి మధ్యవచ్చినవని చెప్పి వేశ్యాజాతినే నిర్మూలింప నెంచుట సాహసముగాఁ దోఁచుచున్నది.

4. వేశ్యలకుఁ బురుషసంయోగమును విధించు వచనము లెవ్వియు శాస్త్రమునఁ జూపట్టుటలేదనియు విధిలేనికతమున వేశ్యలు గణికావృత్తిని మానవలెననియుఁ గొందఱు వాదించుచున్నారు.

కాని మానవలెనని పల్కు వచనములెవ్వి ? తద్వచనాభావ మందు వేశ్యావృత్తి పరిత్యాగ మెట్లు విధేయము కాఁగలదు ?

అంతియకాదు, వేశ్యలకు వృత్తిని విధించువాక్యములు కలవు; కావున దానిని విసర్జింపవలెనని శాసించుట యనుపపన్నము. మత్స్య పురాణము (70 అధ్యాయము) నందు శాపవశమున వేశ్యాత్వము నొందిన ద్వారకాంతఃపురస్త్రీలు వేశ్యాధర్మంబు లుపదేశింపుమని దాల్భ్యమునీశ్వరుని బ్రార్థింప నాతఁడు దేవాసుర యుద్ధానంతరమున దేవేంద్రుఁ డాడిన మాటలతోడ వేశ్యాధర్మంబు లుపదేశించెనని వర్ణింపఁబడియున్నది. ఆ స్త్రీలప్రశ్న:—

"కస్మాదీశేన సంయోగం ప్రాప్య వేశ్యాత్వ మాగతాః
వేశ్యానామపి యో ధర్మ స్తం నో బ్రూహి తపోధన."

(భగవన్తుఁడగు శ్రీకృష్ణుని యంతఃపుర స్త్రీలమయిన మాకు ను నిట్టిగతి పట్టుటకుఁ గారణమేమి? మేము వేశ్యలుగా నెట్టుమాఱితిమి? మఱియు వేశ్యలధర్మంబు లెవ్వి ?)

దాల్భ్యుఁడు కారణమును దెల్పి యిట్లనియె:—

"వేశ్యాధర్మేణ వర్తధ్వ మధునా నృపమందిరే
భక్తిమత్యో వరారోహాః స్తథా దేవకులేషు చ.
రాజానః స్వామిన స్తుల్యాః సుతావాపి చ తత్సమాః

భవిష్యతి చ సౌభాగ్యం సర్వాసామపి శక్తితః
యః కశ్చిచ్ఛుల్కమాదాయ గృహమేష్యతి వస్సదా
నిధనే నోపచార్యో వః స తదాన్యత్ర దాంభికాత్. "

( రాజమందిరములందును దేవాలయములందును మీరు భక్తితో వేశ్యాధర్మమున మెలఁగవలయును. రాజాదులు భర్తలతో సమానులుగాఁ బరిగణింపఁబడుదురుగాక ; మీకు నందఱకు సౌభాగ్యమయ్యెడిని. మీ గృహములకు సొమ్మును దెచ్చి మీ పొందు నపేక్షించు పురుషులను సంతోషపెట్టుఁడు. మోసగాండ్రనుమాత్రము మీరు నిరాకరింపవచ్చును.)

మఱియు, దాల్భ్యుఁడొకవ్రతమునుగూడ వారి కుపదేశించెను. దానినే యనంగదాన వ్రతమని పెద్దలు పల్కుదురు. అందును బురుషసంయోగము కలదు. కావున వేశ్యలకుఁ బురుషాభిగమనంబు శాస్త్రచోదితంబై యొప్పుచున్నది ; కులాచారంబుచేతను నయ్యది సిద్ధించుచున్నది.

అది వ్యభిచార మనందగదు. ఏలయన, నియత పురుషత్వమున్నప్పుడు మాత్రమే యట్టి దోషము గలుగును. కాని వేశ్యలకుఁ బురుష నియమము లేదు; గావున వ్యభిచారపదము చెల్లదు.

5. దేవాలయములందు వారాంగనలు సేవలొనరించు నాచారము పూర్వమెన్నడును లేదు గావునఁ బణ్యాంగనలు పనికిరారని కొందఱును దేవదాసీగణము బ్రహ్మచర్యవ్రతము జరుపవలసియున్నది గావున గణికావృత్తి నవలంబించినవారికి సేవాధికారము లేదని కొందఱును వాదించుచున్నారు.

కాని కాళిదాసు తన మేఘసందేశకావ్యమున నుజ్జయినీ పురమందలి శ్రీమహాకాళనాథుని యాలయమును వర్ణించు సందర్భమున వేశ్యాంగనల నంగీకరించెను. ఎట్లన,

" పాదన్యాస క్వణితరశనా స్తత్ర లీలావధూతై
రత్నచ్ఛాయా ఖచితవలిభి శ్చామరైః క్లాన్తహస్తాః
వేశ్యా స్త్వత్తో నఖపదసుఖా న్ప్రాప్య వర్షాగ్రబిందూ
నామోక్ష్యన్తే త్వయి మధుకరశ్రేణిదీర్ఘా న్కటాక్షాన్.

(ఆ మహాకాళనాథుని యాలయమునందు సాయంకాలమున జరుగు సేవయందు నృత్యమునం జరణనిక్షేపముచే శబ్దించుచున్న కాంచీ దామములు కలవారును లీలాకంపితములుం గంకణరత్నకాంతి భూషితదండములునగు చామరములచేం గ్లాంతములయిన హస్తములు గలవారునయిన వేశ్యలు నఖక్షత సుఖావహములయిన వర్షాగ్రబిందువులను నీవలననొంది కృతజ్ఞతతో నీయందు మధుకరశ్రేణి దీర్ఘములయినకటాక్షములను బ్రయోగించెదరు.)

ఇట " వేశ్యాః " అనుటవలన వేశ్యాత్వజాతియు, " నఖపద సుఖాన్ " అనుటవలనం బురుషసంయోగమును, శ్రీమహాకాళనాథుని యాలయమునందుం జామరహస్తములతో నృత్యమొనరించు కాంతలకుం గలవని బోధపడుచున్నది.

మఱియు, శ్రీశంకరాచార్యులు చతుఃషష్ట్యుపచార మానసపూజాస్తోత్రమునందు వారాంగనల నాట్యమును బూజాంగముగా నిటుల వర్ణించియున్నారు.

శ్లో. " భ్రమదళికులతుల్యా లోలధమ్మిల్లభారా
స్మితముఖకమలోద్యద్దివ్యలావణ్యపూరా
అనుపమతనువేషా వారదోషా నటంతీ
పరభృతకలకంఠీ దేవి ధైర్యం తనోతు. "

6. దేవాలయములందలి శిలాశాసనములందును నృత్తాంగనలకు దానాదులేర్పడియున్నవి. గోదావరీమండలములోని పలివెల గ్రామమున వెలసిన శ్రీకొప్పేశ్వరుని యాలయమునందలి శాసన మొకటి (నెం. 105) మచ్చునకుఁ దీసికొనవచ్చును. అందు " నృత్తాంగనాభ్యశ్చ తతో దశభ్యః " అని పదినృత్తాంగనలు శ్రీస్వామిని సేవించుటకై యేర్పాటు కావింపఁబడిరనియున్నది. శాసనకాలము-శాకాబ్దే వేదరత్నాంబర శశిగణితే " అని యున్నది.

కాఁబట్టి దేవళములందు జరుగవలసిన సేవకు నాటంకము గలుగఁజేయుటయు నట్టిసేవకై యేర్పడియున్న భూములు మున్నగు వాని నపహరించుటయు ధర్మబుద్ధిగలవారి కృత్యములుకావు. ఇష్టము లేని వేశ్యలు మానవచ్చును; ఇష్టమున్నవారు నిర్వహింపవలెను; తత్కార్యమును మానినవారు తదర్థమై యొసఁగఁబడియున్న క్షేత్రాదులను విసర్జించి పోవుటయే న్యాయ్యము; అనుభవించుట కాదు.



# అవ్యక్తపు వ్రాఁతలు.

గోలకొండలో బాధగురువులను శీర్షికతో నొక పనికిమాలిన వాఁడసందర్భపు మాటలతో నవ్యక్తపు వ్రాఁత వ్రాసినాఁడు. అందలివిషయములు శుద్ధాబద్ధములు. వరంగలుపురమునకు మైలుదూరమునందున్న రంగశాయిపేటఁ గాఁపురముగా నుండు బ్రహ్మశ్రీ చేతనభట్ల రామచంద్రశాస్త్రిగారుతమకుగృహమీయవలసినదని యెవరినో కోరిరఁట. ఎవరో యొక వితంతువు గృహదానము చేయఁదలఁచెనఁట. అందులకా వితంతువు పుత్రుఁడు సమ్మతింపలేదఁట. ఇట్టియసత్యమును నామరూపములులేని శుద్ధావ్యక్తుఁడు వ్రాసినాఁడు. అందులకు గోలకొండపాలకులు సమ్మతించి ప్రచురించినారు. ఈ గోలకొండగోల యెప్పటికి నిట్లే యుండుచుండును. పూర్వాచార పరాయణులైన పెద్దమనుష్యులఁదిట్టుటయే యీబిడపని. ఎందఱెందఱినో వెక్కిరించుచున్నది. వెక్కిరించుఁగాక, వారికేమిలోటు. చేతనభట్ల రామచంద్రశాస్త్రిగారు భగవద్భక్తులు. వీరొక్కరేకాదు. వీరివంశమే యట్టిది. వీరితండ్రి నరసింహశాస్త్రిగారు పండితులును భగవద్భక్తులును నై యనేక సత్కార్యములాచరించి యశశ్శరీరులై యున్నవారు. రామచంద్రశాస్త్రిగారును చైత్రమున రామనవరాత్రములును, నాషాఢమునఁ బాండురంగ నవరాత్రములును, భాద్రపదమున గణపతి నవరాత్రములును నాశ్వయుజమున దేవీనవరాత్రములును, మార్గశిరమున దత్తా

శ్రీయ నవరాత్రిములను నిష్ఠేయొక్కొక్క మాసమున నొక్కొక్క విధమైన యీశ్వరారాధనము సేయుచు నన్వహము నన్నదానతత్పరతమై వర్తించు సత్యాంత కీర్తిమంతులు. అట్టివారి నల్పు లపహసించి యఘాలయులగుటయేకాని యన్యమేమియు నుండదు కాన నవ్యక్తపుభ్రాంతల నాఁగుదురుగాక.

ఇట్లు,
వెల్లంకి శేషాచలశర్మ
హైదరాబాదు





# పల్నాటి వీరచరిత్ర నాటకము



—* నాంది *—

చ॥ సిరియును భూమియుం గొలిచి సేవ లొనర్ప మునీంద్రబృందముల్
పరమముదం బొసంగ వటపత్రమునన్ శయనించి క్షీరసా
గరమున నుండు శ్రీకరుఁడు కౌతుక మొప్ప వసింపమాని భూ
భరమును మాన్పవచ్చిన శుభాకృతుఁ గొల్చెద బ్రహ్మనాయునిన్.

చ॥ పసులకు దేహమున్ మొసఁగి భద్రములొందెడు నీ నవీన నా
గరిమల మాన్పఁగాక బలగర్వితృణీకృతశత్రుకాండులై
భరతకులప్రసూతులగు పాండుకుమారులఁ బోలఁజాలు సం
భరిత మనస్థులం దలఁతు భక్తిమెయిం బలనాటి వీరులన్ —

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర— ఇఁకను నశేవిస్తరమేల? (సభను గలయఁజూచి) నేఁటి నాభాగ్యమునకు మేరయే లేదు.

చ॥ సరసులు పండితోత్తములు శాస్త్రవిచారణకర్తలార్యశే
ఖరులు కృపాతిరేకులు ప్రకాశ్యమహోత్తరకావ్యకర్తలున్
స్థిరతరధర్మమార్గరతచిత్తులు నిర్మలసద్గుణుల్ యశో
భరులు నలంకరించిన సభాస్థలి నేమును మొందఁ గాంచితిన్!

సకలమునిబృందారకసందోహాలంకృత దేవేంద్రసభా మందిరంబు చందంబున విబుధబృందాలంకృతంబగు నీసభాస్థలి నేఁ డొకనూతనరూపకం బభినయింప నామది నుత్సాహము గలుగుచున్నది. కాని వారి కానందమిడు గ్రంథంబుఁ గాంచనైతి. ఏమిసేయుదు? కానిమ్ము. నాయుద్యమమున కనువగుచారిత్ర మెఱింగిన నా ప్రేయసి నరసెదఁగాక ! ( తెఱవంకఁ జూచి ) సఖీ ! విముఖురాలవుగాక యొకమా ఱిందు వచ్చెదవా ?

నటి— (ప్రవేశించి) ఆర్యా ! దాసురాలి కేమియాజ్ఞ ?

సూత్రి- కాంతా ! కాంచుచుంటివిగదా యీ సభామందిరము. అభిమానధుర్యులును దేశభక్తి తత్పరులును శౌర్యబలదర్పయశోమహిమాభిరాములును నగు రసికవరులచే నలంకరింపఁబడి యున్నది. వీరిమెదుట నేఁ డేదియేని వీరరసప్రధానంబును జారిత్రాత్మకంబు నగు నొక యపూర్వరూపకం బభినయింప నుండి యనువగు చరిత్ర స్ఫురణకు రాక నీ సాయ మపేక్షించితి.

నటి— నాథా ! వృథా నన్నుఁ బెద్దఁజేసి నుతించెదరుగాని మీబోటి ప్రాజ్ఞులకు నాయట్టి ముద్దరా లుపదేశించునంతటి బుద్ధిగలది యగునే ! సంపూర్ణ శరచ్చంద్రచంద్రికవలె స్వచ్ఛమై సారవంతమైన మీహృదయంబున యోజించిన మీకే స్ఫురింపఁ గలదు.

సూత్ర- తరుణీ ! ఎంతయోజించినను స్ఫురణకురాని యంశమును త్వదీయముఖారవింద సందర్శనంబు జ్ఞప్తికి వచ్చునటులఁ జేసెఁగదా !

నటి— ఐన నేది నిశ్చయించుకొంటిరి ?

సూత్రి- వినుమా.

ఉ॥ శారదచంద్రచంద్రికలుఁ జల్లనిగాడ్పులు వియ్యమందఁగన్
ఘోరగిరిప్రదేశములఁ గూకలువెట్టుచు హేలమైని సం
చారముసేయు సింగమటు సంఖ్యఁ జరించిన కల్లినాటి మా
వీరుల సత్కథామృతము వీరలఁ గ్రోలఁగఁ జేయ నెంచెదన్ !

నటి—— (ఆశ్చర్యమున) ఏమేమీ! పల్నాటివీరుల కథయా? చాలుఁ
జాలు. ప్రసిద్ధికెక్కిన రసపుత్రమహారాష్ట్రదేశచారిత్రము లెన్ని
యో యుండఁ జివరకు విద్దెల నేర్వక సుద్దులరీతి నందందు
వాడుకొను కథయా వీరిని రంజింపఁజేయుట!

సూత్ర- ఇంతీ! ఎంతవెఱ్ఱిదానవు! అంతమాత్రంబున దానిమహిమ
కొఱంతవడునే! వినుము.

శా॥ ఆ చండాలురుగూడ రామవిభు దివ్యానందచారిత్ర మె
న్నో చందంబులఁ బాడుచుందురుగదా యుత్సాహభూయిష్ఠులై
నీచంబంచుఁదలంచి మానిరొకొ మానింద్రాళి; యింతేల కాం
తా! చంద్రాతప మెల్లవారి కొకచందంబై సుఖం బీయదే!

దాని కభిమానము భక్తి విశ్వాసములు ముఖ్యములు.
అం దీకథ యాంధ్రదేశసంబంధమైనదగుటచే మనమిత్రులకు
రసవంతముగానే యుండునని తలంచెద.

నటి—— అట్లే యనుకొనుఁడు. అది రూపకముగానుండి మనకు లభించి
నఁగదా ప్రస్తుతము పనికివచ్చుట!

సూత్రి- లేకేమి! నూతనముగా రచియింపఁబడినది. దానిని మనవారు
పఠించికూడ నున్నారు.

నటి—— కర్త యెవరు?

సూత్ర- ఎవరోగాదు, మన చిరపరిచితుఁడే, మనసామాజికుఁడే.

నటి— మనసామాజికులలో నట్టివా రెవరుండిరి ?

సూత్ర- ముద్దరాలా ! నీ కెంతయు వివేకము ! మనకుఁ జిరపరిచితుఁడగు వానిని మనసామాజికునే మఱచితివిగా ! ఎంతవైపరీత్యము ! ఔను. అది లోకసహజమేగదా ! చూడుము.

మ॥ కలకాలంబును వారిబాగుకొఱకే కాయంబు నర్పించి సం
కులదాస్యంబును జేయుచున్నఁ దుదలోకుల్ చెప్పుదుర్మంత్రితా
కలనన్ జిక్కి నిజం బెఱుంగక వృథా కార్పణ్యభావంబులో
నలసింగాఖ్యుఁడు బ్రహ్మనాయు హిత మెన్నంజాలరే కోమలీ!

(తెఱలో) నిజము వైతాళికా ! నిజము.

నటి— (ఆలకించి) నాథా ! ఆ స్వస్తివచన మెవ్వరిదై యుండును ?

సూత్ర- అంగనా ! అది యొక పారిపార్శ్వకునిది. అప్పుడే మనసామాజికులు నాటక ముపక్రమించినట్లున్నది. పోదము పద.

నటి— బలే ! ఎంతమోసగాఁడవు. గ్రంథకర్తనామ మెఱుంగఁజేయకయే పోనుంటివా !

సూత్ర- తన్వీ ! మఱచితి వినుము.

చ॥ అరయ ననేకగ్రంథరచనాద్భుతపండితపాదసేవకుం
డురుతరనాటకావళి మహోద్ధతి సాయమొనర్చు మేటి భా
స్వరవర మేళ్ళచెర్వుకుల జాతుఁడు నైన కుటుంబరాయుఁ డీ
చరితము నాటకంబుగఁ బ్రచారమొనర్చెను నూతనంబుగన్ !

అదే యాలకింపుము. ఎప్పుడు నలసింగుని వేషమున సభ నలంకరింతునాయని మన సుమిత్రుండును నాయకురాలు వేషంబున నెప్పుడు వాని మంత్రిణినై బ్రహ్మనాయుని వేషం

బునన్న మన విశారదుఁడీ జంపు యోజనలం జేయుదునాయని నీచెల్లెలును మిగుల నాతురపడుచున్నారు. గాన ... ...
(తెఱలో) ఓరోరి వృథాపరిలాపీ! శైలూషాధమా! పాపాత్మా! ఏమనుచుంటివిరా!

చ॥ కుటిలమతిప్రబోధనకుఁ గుటిలరాచు విషాక్షమొందు సం
ఘటితముఁ జేసి చాలకది కల్మషదంబగు కోడిపందెపుఁ
బటనఁ బ్రవేశపెట్టి మరు నాడికఁ బాయ విధించినట్టి చె
న్నటి నలసింగుఁ డాకుటిల నాయకురాజు మనంగ నేర్తురే!

నటి—(భయ మభినయించుచు) నాథా! పిడుగుచందంబునఁ గొఱలఱచుచు వచ్చు నావీరుఁ డెవ్వఁడైయుండును? అక్కటా! నాకు భయమగుచున్నది! చుమీ

సూత్ర—చెలీ! భయమువలదు. ఆతఁడు మనకొఱకు వచ్చుచుండుటలేదు. నే నింతకుముందు నుడివిన "నలసింగరాజు నాయకురా" లను నుడులు వినినంతనే సహజవైరము పెనఁగొన వారే యిచట నుండినట్లు తలపోయుచు వారియెడలఁగల క్రోధాతిరేకంబున రౌద్రమూర్తియై పేర్నిఁ డిటు వచ్చుచున్నాఁడు. కావున మన మిచటనుండరాదు. పోదముపద. (నిష్క్రమించుచున్నారు)

( ప్రస్తావన. )



# ప్రథమాంకము

## ప్రథమరంగము

(పేర్ని ప్రవేశము.)

పేర్ని - (సక్రోధుఁడై)

మ॥ కుటిలమతిప్రబోధనలకున్ ... ...

(అను పూర్వోక్తపద్యముఁ జదివి) ఓరోరి కుటిలకార్యాచరణపరాయణా! నలసింగస్వామివల్లభా! నీ వెందుఁ బోఁగలవురా! ఇదివఱకు నీవు గావించెడి దుర్నయనాటకాభినయ మంతయు నేఁడుత్తరరంగంబుగా నీపేర్నిచే బీభత్సమొనరింపఁబడి భయానకంబుగాఁ బరిణమింపకుండునురా! ఛీ పాతకమూర్తి!

శా॥ విశ్వాసం బొకయింత లేక తుదకా విశ్వస్త తంత్రింబుచే
నైశ్వర్యంబు లభింపఁగా భ్రమసి బ్రహ్మనాయు సద్వృత్తి నీ
వాశ్వాసింపఁగ లేక మమ్ము నలసింగాఖ్యా! నిరోధించి మా
శశ్వత్కోపదవాగ్నిలోనఁ బడి నీచా! కాలిపోకుండువా!

పౌరుషముగల భరతవర్షమందలి యాంధ్రదేశంబున కలంకారంబును వీరరససరిత్తుంగపరిశోభితంబును నగు పల్నాటిసీమలో వీరాంశజనితుండవై సకలలౌకికరాజనీతిజ్ఞుండవై రాజ్యపాలనం బొనరించుచుఁ దుట్టతుద కొక్కయాఁడుదాని మాయావాగురలం జిక్కి యెంతకూళవైతివిరా! నీపౌరుష మేమంటిపాలొనరించితివి? నీజ్ఞాన మేయేఁటఁ గల్పితివి? అక్కటా!

శా॥ దేశద్రోహ మొనర్ప నొక్క సతి యుద్దీడై యెదో చెప్పఁ బే
రాశ న్జిక్కి స్వకీయమైన తెలివిన్ వ్యర్థంబుగావించుచున్
దేశానర్థముఁ జేయఁజూచెదవె సందేహింప కో ద్రోహి! పా
పీ! కుంఠా! ఇఁక నెందుఁ బోఁగల విసీ! పేర్నిచేఁ జావకే!

చేసేత నీ పల్నాటిసీమ కెన్నిపాట్లు దెచ్చిపెట్టుచుంటివిరా! ఔరా! దేశమాతకు నీవొనర్చు దుండగములఁ గనియు వినియు సహింపఁగలనే! అవినీతుండవై భవదీయసోదర వైభవాపహారివి గానుంటివటరా! ఈ దేశసేవాతత్పరుఁ డీప్రతాపవంతుఁడీయుగంధరప్రతిమానశోభితపరాక్రముఁ డీ దుష్టజనశిక్షణబద్ధకంకణుఁ డీపేర్మిఁడు నీయట్టి దేశద్రోహిసంఘాటవికవహ్నికీలిప్రతిముఁడని యెఱుఁగవటరా! కావున. కాలము సమీపించుటచేఁ గాఁబోలు నీ కిట్టి దుర్బుద్ధులు పుట్టె యగ్నికణంబు నింటికప్పులో దాఁచుకొన్నవిధంబుగాఁ బాపినియగు నాయకురాలిసాంగత్య మొనరించి మంత్రిపదవిచ్చి సర్వవిదుండై సర్వశాస్త్ర సంపన్నుండై సర్వనీతి పారంగతుఁడై సర్వమయుండనఁదగు బ్రహ్మనాయుని ధిక్కరించి ముద్దుబిడ్డలగు నీసోదరుల బాలమత్తైవులపైఁ గినిసి మొన లేని దుష్కార్యము లాచరించి మామకు మా వారికిని గష్టంబులఁ దెచ్చిపెట్టి మ మ్మడవుల పాలుఁ జేసి నేఁటికి ధీరుండనై రాజ్యపాలనభాగ్యం బందఁగల్గితి నని విఱ్ఱవీగుచుంటివటరా!

గీ॥ పిరపల్నాటిరాజులు వేలలగుచు
నిన్నుఁబోలి కుమార్గులై యున్నవార
లంచుఁ దలఁచెదవే మొ నీ యంతరంగ
మందు? కాదుర! చూడు నీ చందమింక!

అందఱితోఁబనిలేదు. నీబోటి యధమాధముని రూపుమాపుటకు

మ॥ పరిశయస్పర్శనపక్షవేగసహశుంభ ద్బాహుభృన్నాథని
స్ఫలధైర్య ప్రమథాధినాథ సుయశస్సాయుక్తుఁ డీభూస్థలిన్
చెలసిన్ గా నిశితాసిధార బలి గావింపంగఁ బేర్మిఁడు తు
మ్ములఁ బేర్మాపఁడె పల్లెనాటిజనసంక్షోభంబుఁ దగ్గింపఁడే!

ఇఁక నీప్రాణంబులు పెక్కుదినంబు లుండవని యెఱుంగుము. నీకుఁ గాలము సమీపించినది.

ఉ॥ పండి భవత్కృతంబయిన పాపచయం బది యెప్పుడేని భూ
మండలి రాలకుండ దనుమాట నెఱుంగయుఁ జేతిమీఁదుగా
ఖండనఁ జేసి లోకులకు గాఁ దెలుపన్ సమకట్టి విక్రమో
ద్దండుఁడు వచ్చుచుండె నికఁ దప్పుకొనన్ దగుభంగిఁ జూడుమా!

ఇదివఱకే నాయకురాలితోఁగూడ నిన్ని భూమండలి లేకుండఁ జేసియుందునుగాని బ్రహ్మన్నజ్ఞాసియు ధర్మమూర్తియు భూతదయాపరతంత్రుఁడగు బ్రహ్మనాయుని సత్యసంధత కోడి కోడిపందెమప్పటి గడువుదినంబుకొఱకుఁ గాచుకొని యుండవలసివచ్చినది. ఇఁక సైఁపనోప.

సూర్యుఁడు-(ప్రవేశించుచు) నిజము. చిన్నియన్నా! నిజము. పల్లెనాటి వీరు లనుమత్తేభముల కుంభస్థలంబులం దెక్కి సత్యవాక్యాంకుశంబున నదిమియుంటచేతనే మన మెల్లర మూరకుండుట. లేకున్న నెవ్వఁ డుపేక్షించును!

శా॥ వీరావేశము చిందులాడ విలసద్బీభత్సమైనట్టి యా
కారంబుల్ ధరియించి క్రూరరిపువర్గంబెల్ల జన్యంబునన్
ఘోరాస్త్రంబుల పాలుఁజేయరొకొ సంకోచంబులేకుండఁగా
శూరాగ్ర్యుల్ పలనాటివెల్మలినతేజుల్తా ర్విజృంభించుచోన్॥

పేర్మి-(పరికించిచూచి) తమ్ముఁడు సూర్యుఁడా! తమ్ముఁడా! నీమాట సత్యమే. మన కన్నివిధముల బ్రహ్మనాయుని ధర్మపద్ధతియే ప్రతిబంధకమైనందులకు వగవవలసివచ్చినది. ఇప్పుడైనను మించినదేమి? ఆయనముదలమైనచో

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవోద్దండ విద్యారణ్య భారతీస్వాములవారు, హంపి.

౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వాములవారు, పుష్పగిరి.

౩ శ్రీ రాజా పరాంకుశరావు దేశాయిగారు. యాదవరం.

౪ రామసింగుగారు – నెల్లుట్ల.

౫ ఇనిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు – ఆత్మకూరు.

౬ తంగెడ నరసింహారావుగారు, కరణం, పొర్లంపాడు.

## పో ష కు లు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహాదరు జమీందారుగారు–నూజవీడు.

౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకొండూరు

౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు

౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం

౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము

౬ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.

౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల

౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.

౯ టి. లక్ష్మణసింగుగారు, జనగాం

౧౦ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.

౧౧ పిసుపాటి వెంకటరాయశర్మగారు, కరవది

౧౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, దుగ్గందూరు.

౧౩ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఆరుమూరు.

౧౪ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

౧౫ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,

౧౬ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు, జమీందారుగారు–దేవిడి.

౧౭ సాకంటు కిషన్‌రావు దేశముఖ్ గారు, జగితాల.

౧౮ కురికాల వెంకటేశ్వరరావుగారు. పరకాల.

## స హా యు లు

౧ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨ వీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు. రాయగిరి

౩ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి

౪ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, పాపురం.

౫ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.

౬ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ

౭ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగిరాల

# అభినవసరస్వతి.

| సంపుటము ౨౨ | జానపాదం<br>ప్రమోదూత సం॥ వైశాఖమాసము | సంచిక ౧ |
| --- | --- | --- |


## ఆంధ్రకర్ణాటక బ్రాహ్మణ సమ్మేళనము.

——(:o:)——

1930 వ సం॥ ఏప్రిలు 12, 13, 14 తేదీలలో నీ సమ్మేళనము జరిగియున్నది. ధర్మవిరుద్ధములగు ప్రస్తుతపరిస్థితులకును సంఘ మతసంక్షోభాందోళనమునకుఁ గారణమైన శారదాశాసనమునకును బ్రతిక్రియ సలుపుట సనాతనధర్మాభిమానులగు సకలజనులకును ముఖ్యకర్తవ్యమగుట యటుండ ధర్మాచార్యులకుఁ దప్పని పనియగుట శ్రీ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షపీఠాధిపతు లీసభ కధ్యక్షులై జయప్రదముగ సాగింపఁజేసినందుల కెంతయు వందనీయులు. అవ్విరూపాక్షపీఠమున కాదిమస్థానము హంపీక్షేత్రమగుటచే దత్క్షేత్ర దేవస్థాన ధర్మాధికారము తత్పీఠాధికారులే వహించుచున్నవారు. అయినను దత్కార్య నిర్వహణభార మాస్తికభూషణ బిరుదాంకితులగు జాజాల వెంకటేశ్వరశాస్త్రిగారిపైఁ బెట్టి యాపీఠాధిపతులు శిష్యులం బునీతులఁజేయ దేశసంచారమొనరించు చుండిరి. పంఢరిపురము వఱకునుగల విస్తృత కర్ణాట మహారాష్ట్రదేశములుఁగూడఁ దమ యాధిపత్యముక్రింది వగుటచేఁ దత్సంచారము చిరకాలమునుండియుఁ దత్ప్రాంతముల యందే సాగింపఁబడు చున్నది. విద్యారణ్య భారతీస్వాముల కాలముననే విద్యానగరమును వీడివెడలిన యాపీఠమునఁ బ్రకృతము సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు పట్టభద్రులై యున్నవారు. రాచూరి సుబ్బయ్యశాస్త్రిగారును వెంకటరామశాస్త్రిగారును దత్స్థానమున ముఖ్యమంత్రులు. అట్టి మంత్రిద్వయమును హంపీక్షేత్రస్థ దేవస్థాన కార్యనిర్వాహకులగు వెంకటేశ్వర శాస్త్రిగారును బ్రకృతపరిస్థితులఁ బరికించి పరిషన్ముఖమునఁ బ్రబోధించినఁగాని ప్రజలు భద్రములఁబడయఁ జాలరని పర్యాలోచించి బ్రాహ్మణమహాసమ్మేళనమునకుఁ బ్రయత్నించిరి. అభ్యర్థించి యాచార్యులను హంపీక్షేత్రమునకు రప్పించిరి. వెంకటేశ్వరశాస్త్రిగారి యాహ్వానమున నాంధ్రవిశ్వవిద్యాలయమునకు సెనెటు సభ్యు

ము, అదవాని తాలూకా బోర్డు ప్రెసిడెంటు అగు నగరాజాల శ్రీనివాస శాస్త్రి బియేగా రాహ్వానసంఘాధ్యక్షత కంగీకరించిరి. చెన్నపురి నెల్లూరు బెజవాడ బెంగుళూరు మున్నగు ముఖ్యపట్టణంబులనుండియుఁ బల్లెలనుండియు వేదశాస్త్రాదులగు విద్వద్బ్రాహ్మణులు విచ్చేసిరి. దినత్రయమును దివ్యముగా సభకూడెను. ంబడిపూడి విశ్వనాథసిద్ధాంతిగారు కైప సుబ్రహ్మణ్యశర్మగారు పుష్పగిరి సంస్థానమునకు సంబంధించిన వెంకటసుబ్బాశాస్త్రిగారు మున్నగు ననేకు లప్పట్టి ముపన్యసించిరి. శారదాశాసనమును రద్దుపఱచి రాఁబోవు రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో సనాతనధర్మమునకుఁ దగు కట్టుదిట్టము లొనర్పవలెననియుఁ బూర్వమొనర్చిన వాగ్దానము ప్రకారము మతవిషయములలోఁ దాటస్థ్యము వహింపవలెననియుఁ బ్రభుత్వము వారిని బ్రార్థించుచు సభ సమాప్తిఁజేసిరి.

—* ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము. *—

శ్లో॥ హేమకూట నిలయః పంపాలింగన కాముకః,
గంగాధరో విరూపాక్షో మంగళం దిశతా త్సదా.

వైదిక మతాభిమానులారా!

అనాదికాలమునుండి నేటివరకు పరమపావన ప్రదేశమని వాసిఁగాంచి కర్ణాటక సింహాసన స్థాపనాచార్యుఁడగు శ్రీవిద్యారణ్య యతిసార్వభౌముని యమానుష మహిమచే వన్నెకెక్కిన యీపంపాక్షేత్రమందు మీయందరి సమ్మేళనము గలిగించు భాగ్యము మామండలమువారి కొదవినందుకు మేమెంత ధన్యులమో చెప్ప వలవికాకున్నది. బహుశ్రమలకోర్చి యెండనక, గాలియనక, స్వకార్యములనెల్లఁ బోనాడి బహుదూరదేశములనుండి వైదికధర్మోద్ధరణమునకై యత్యుత్సాహముతో నేతెంచిన మహావిద్వాంసులును భూలోకదేవతోత్తములగు మీయెడ నేనెట్టి స్వాగతోపచారవాక్యము లాడవలెనో తోఁచకున్నది. ఇట్టితఱి నొకరితో నొకరు వర్తమాన వృత్తాంతములగూర్చి ముచ్చటించుకొని కర్తవ్యమునకుఁ గడంగుటయే భాగ్యమని భావింతు.

సభ్యమహాశయులారా!

కాలగతిని బట్టిచూడగా, ప్రాచీన సంప్రదాయములన్నియు మారుచున్నవి. ప్రతియొకరును కేవలము వాక్కుచేఁ బలుకువారేకాని, నిర్వ్యాజమగు ననుష్ఠానము కలవారు మిక్కిలి తక్కువగుచున్నారు. ఇందుచే వైదికధర్మములకును తదనుష్ఠాతలకును వ్యవహారప్రపంచములో లౌకిక సాంఘిక రాజకీయములందు పలుకుబడి బొత్తిగా

లేదు. లౌకికవ్యవహారదక్షులగు వారికి వైదికధర్మములన నెట్టివో తెలియకున్నవి. ఒక వేళ తెలిసినను నవ్వానియందు విశ్వాస మొకింతేనియుండుటలేదు. మతమున నత్యౌదాసీనతతో నుండక నాస్తికహేతువాదములచే కుతర్కములుజేసి వేదమతమును నిర్మూలముచేయుటకై కంకణము గట్టుకొనియున్నారు. ఇట్టికఠోరస్థితిలో [illegible] నొకేవిధముగా తాత్సారము వహించియున్నదో పిదప నేమితటస్థించునో ఆ విషయమును కంఠోక్తిగాఁ జెప్పఁజాలేము. మున్ముందు మన నాయకులీ ప్రశ్నముల నాలోచించుటయే యీసమ్మేళనముయొక్క ప్రాధాన్యమని భావించుచున్నాను.

ఇటీవల కొన్నినాళ్ళనుండి జాతి, మత, సాంఘిక, వైరవివాదములలో విరోధ లెక్కువగాఁ గన్పట్టుచున్నవి. దేశములో నెచటవెదకినను శాంతిలేదు. రాజకీయములలో పలుకుబడిగలవారిలో చాలమంది సంఘసంస్కర్తలైయున్నారు. వారిమాటలే ఎచటజూచినను ప్రాముఖ్యమును వహించుచున్నవి. ఇటీవల [illegible] వివాహనిర్ణయ సంఘమువారు బహుకాలము మనభారతదేశమును పూర్తిగా దిరిగి యచ్చటచ్చట సాక్ష్యముల గైకొని తుదకు ప్రచురించిన రిపోర్టును, దాని ఫలితములును మీకందరికిని గోచరమైనవే. ఇట్టివే మరికొన్ని కానున్నవి. దేశములో రాజ్యాంగమందు ధర్మనిర్ణయ సంఘములనగా నీరీతితో నున్నవని తెల్పుటకై దీని నుదాహరణముగాఁ జూపితిని. ఇట్టి సంఘముల యభిప్రాయముల పైననే ప్రభుత్వము వారిదృష్టి పూర్ణముగా ప్రసరించుచున్నది. వైదిక మతాభిమానులగు వారందరు లౌకిక రాజకీయవ్యవహారములలో బ్రవేశింపక తాత్సారము జూపుటయు, స్వమత యనుష్ఠానములలో నిర్వ్యాజశ్రద్ధ వహింపకుండుటయే యిన్నిటికి గారణమైయున్నది. తలఁచినంతమాత్రముననే భూదేవతను కనకవృష్టిచే నలంకృతఁగావించిన బ్రాహ్మతేజము డెందుబోయినది? తృణీకృత బ్రహ్మపురందరులై యోగస్థా సమాసక్తులగు ఋషిపుంగవుల దివ్యమహిమ లెందుదాగినవి? కేవలము భూతపూర్వవైభవముల శ్లాఘించుకొనుటతోఁ దృప్తినొందుట మనకు ప్రకృతము యుక్తముకాదు. జీవనోపాయముగా నెట్టివిద్యనభ్యసించినను సాధ్యమయినంతమట్టుకు నుచితమగు సమయములఁ గల్పించుకొని వేదశాస్త్రముల నభ్యసించుటయు, ఆచారానుష్ఠాన కాండములఁ బాటించుట మున్నగు నవశ్యవిధుల మనవారు ఖండితముగా నాచరింపవలసి యున్నది. లేనిచో నాస్తిక్యము మిక్కిలి వ్యాపించునను సూచన లగపడుచున్నవి.

మనబ్రాహ్మణులలో పైజెప్పినముఖ్యకార్యము లోపించియుండుటచేతనే సంఘసంస్కర్త లవలీలగా శాసనసభలో శారదాచట్టము విషయములో జయము పొందగలిగిరి. బ్రాహ్మణేతరులు, నిమ్నజాతులుమున్నగువారు మమ్ముసాహసించి తమల

నాశముకు గడఁగిరి. దేశములో వివిధలనకలుగుచున్న భల్లిలని చెప్పుట కలవిగాకున్నది. మహాశయులారా! స్వైరాచారశాసన మొకటియే. కాదు, ఇట్టి చండశాసనము లింకెన్నిగా నున్నవి. అందుకు తగిన యనుకూలావకాశములు కూడ దేశములో ప్రబలించుచున్నవి. మనమూరకున్నచో స్వారస్యము లేదు కార్యము చెడును. సంఘవించిన కష్టముల మాన్పుకొనుటకును, ఈ స్థితిని జాగరూకులై వర్తించుటకును తగిన వ్యవస్థ కావలసియున్నది. లేనిచో బ్రాహ్మణ్యమే క్షీణించు నను నిశ్చయసూచనలు గోచరించుచున్నవి. ప్రతిరాష్ట్రమందును తన యాందోళనము సల్పి పైవిషయములను గురించి తీవ్రచర్యల పుచ్చుకొనవలెను. ఇవన్నియును కేవల మొకరివల్ల నెరవేరునట్టివి కావు. "సంఘేశక్తిః కలౌయుగే" యను నార్యోక్తిచొప్పున, పరస్పర స్పర్థల విడిచి ఏకకుటుంబమువార మనుదృఢభావనతో మనమందరము కలసి యొక వ్యవస్థ నేర్పఱచుకొని కార్యరంగములోఁ బ్రవేశింపవలసియున్నది.

మహాశయులారా! ఇట్టిసాహాయ్యము గల్గజేసి కర్తవ్యము నిర్ణయించుటకే యాంధ్రకర్ణాటక రాష్ట్రనివాసులగు మిముబోటి బ్రాహ్మణమహాజనుల సమ్మేళనము గావించితిమి. ఇట్టి రాష్ట్రద్వయమువారి నాహ్వానించి సమ్మేళన మొదవించుట కితరమండలములకన్న ఆంధ్రకర్ణాటక రాజ్యలక్ష్ములకు సమప్రతిపత్తియున్నదాయి బళ్ళారిమండలమునకె యెక్కుడుబాధ్యత స్వయంసిద్ధమైనదని నొక్కి వక్కాణించుచున్నాను. అందువల్ల ఒకవంక నాంధ్రభోజమహీపాలుడును, మరొకప్రక్కన కర్ణాటకసింహాసనస్థాపనాచార్యుడును గలుగ, తుంగభద్రాస్రవంతీశీతలశీకరాసారముచే నతిపవిత్రమై వెలసి నాటికి నేటికిని శ్రీపంపా విరూపాక్షేశ్వర, శ్రీకోదండరామప్రభృతి దేవతాగణముల దివ్యవైభవములతో వెలయుచు దక్షిణకాశియని వాసిగాంచిన యీపంపామహాక్షేత్రమునకు మిమ్ముల నాహ్వానించి యీ సమ్మేళనమును సముచితముగ నిర్వహింపబూనితిమి. మిగుల జనసమ్మర్దముగల యీసమయములో విభిన్నాహారవ్యవహారములుగల మీకు మాచేయు నుపచారములెన్నటికిని నాతిములు గావేమో యను మనస్సులో సంకోచమున్నను, కార్యదృష్టిగల మిముబోంట్లు మము మన్నింతురను గట్టినమ్మకముతో ఇట్టిసాహసిక ప్రవృత్తి మునర్చితిమి. మాయందు విశ్వాసముంచి బ్రాహ్మణధర్మముల నుద్ధరించుటకొరకై వివిధశ్రమలకోర్చి యేతెంచిన మీకు సుస్వాగత మగుగాక. మీయందరి మహాసమ్మేళనము గాంచగా ఆయజ్ఞపురుషుడే మూర్తీభవించి ధర్మరక్షణమునకై వచ్చెనా యను నిశ్చయము గలుగుచున్నది ధర్మాచార్యులగువా రధ్యక్షపదవి సంగీకరించుటచే ప్రకృతపరిస్థితులగూర్చి విచారింపవలసిన యొక్కుడుబాధ్యత నాకు తొలగినందులకెంతయు సంతసించుచున్నాను.

## అధ్యక్షోపన్యాసము.

అనాద్యవిద్యావ్యామోహ తమస్స్తోమ రవిద్యుతిః,
స్తుమ స్తచ్ఛాంకరం ధామ కర్మ బ్రహ్మోభయాత్మకం.

ఆస్తిక శేఖరులారా!

బహుకాలమునుండి యితరరాష్ట్రములందు సంచరించుచున్నను మాయందవిచ్ఛిన్న విశ్వాసముగలిగి మీరందఱు నీమహాసభకు మాయధ్యక్షతఁ గోరుటయనునది మీభక్తిశ్రద్ధల ... చాటుచున్నది. ...పశ్చిమబుద్ధులైయుండు మన బ్రాహ్మణులకుఁ గాలప్రవాహ మెట్లు నడుచుచుండునది గోచరించుటయే లేదు. ఇట్టితఱి మీరందఱుఁ గూడి శ్రీపంపావిరూపాక్షేశ్వరుల సన్నిధానమున నీసంమేళనమును గావించి రాష్ట్రములలో వర్ణాశ్రమధర్మముల విషయమై ప్రబోధ మొనర్పఁ బూనుట యతి సమంజసమును నత్యావశ్యకమునైన కార్యమై యున్నది. మీప్రయత్నమునకు నిర్విఘ్నసిద్ధి కల్గుగాక. ...

ప్రకృతకాలపరిస్థితులు పూర్తిగా విషమించినవి. వైదికపద్ధతులకుఁ బలుకుబడి మిగులఁదగ్గినది. వర్ణాశ్రమ ధర్మములన్న నామమాత్రావశిష్టము లగుచున్నవి. లౌకిక రాజకీయములలో నెచటఁజూచినను ధర్మనిర్మూలనమునకే ముఖ్యముగాఁ బ్రయత్నములు సాగుచున్నవి. విజ్ఞులై ప్రాచీన సంప్రదాయముల నెఱింగిన పెద్దలపలుకులకుఁ బ్రాశస్త్యమే లేదు. ధర్మమందు విశ్వాసము, ఆస్తిక్యబుద్ధియు నస్తమించినవి. వర్ణాంతరవివాహములు వితంతూద్వాహములుఁ బ్రౌఢావివాహములుఁ గామచారవాదభక్షణము లెచ్చటఁ జూచినను స్వేచ్ఛగాఁ గన్పట్టుచున్నవి. అనాదినుండి కర్మభూమియని ప్రసిద్ధిఁగాంచి భక్తిజ్ఞాన వైరాగ్యములకుఁ బుట్టినిల్లైన యీభరతఖండమున కిట్టిదుర్దశ తట

స్థిరించుటఁజూడ వీతరాగుల మగు మాకుఁగూడ మిగులఁ బశ్చాత్తాపము గలుగుచున్నది. ... హిందూదేశము వర్ణాశ్రమాచారధర్మములకుఁ బుట్టినిల్లనియుఁ గర్మోపాసనాగులలో వన్నెకెక్కినదనియు ఖండాంతర వాసులందఱుఁ బొగడుచుండఁగా మనవారిలోనే కొందఱు (దయానంద రామమోహనప్రభృతులు) పాశ్చాత్యనాగరకతచే వ్యామోహితులై వేదముల కాభాసతాత్పర్యముఁ గల్పించి ... దుర్బోధల నొనర్చి ... సమాజముల నేర్పరచియున్నారు. ... స్వకపోల కల్పితములైన సిద్ధాంతములచే జనులను భ్రాంతిగ్రస్తులఁజేసి ... కొన్ని మతములఁ గల్పించిరి. ఇవియన్నియు ... వైదికధర్మనిర్మూలనమునకు ముఖ్యముగాఁ గంకణముఁ గట్టుకొని యున్నవి. కలిప్రాబల్యముచే నింక నెన్నిసమాజము లుద్భవింపఁబోవ నున్నవో! అయ్యో! ఇట్టి యవైదిక కుతార్కిక రాద్ధాంతములచే నతిపవిత్రమై ... మను యాజ్ఞవల్క్యాది మహనీయులచేఁ బ్రతిష్ఠింపఁబడి ... నేఁటివఱకు నవిచ్ఛిన్నమై వచ్చుచున్న వైదికధర్మములు నశించుటఁజూడ నీయుగాంతమందు దుష్టశిక్షణమునకై యవతరించెదనని ప్రతిజ్ఞనొనర్చిన యా మహావిష్ణు విపుడే కల్కిరూపమున నేలయవతరించి యీసమాజములఁ దుదముట్టింపఁగూడదో యని యాతురత పొడముచున్నది. ...

నిజము పరికించినచో జాతినియమములఁ బాటింపకున్న యెడల మతతత్త్వములందు నిశ్చయసిద్ధి యెన్నటికిని గలుగదని రూఢమగుచున్నది. శ్రీమద్బాదరాయణులుకూడ జ్ఞానసిద్ధికల్గినపిమ్మటఁ గూడ నగ్నిహోత్రాదికర్మల విడువఁగూడదనియు లోకసంగ్రహార్థమైనను జేయవలెననియు నిర్ధారించి యున్నాఁడు. కనుకనే మన మతము కేవల మితరమతములవంటిది కాదు. ఇతరమతములలో జాతి భ్రష్టుఁడైనను మతతత్త్వములో సంపూర్ణనిష్ఠనొందుట కవకాశ మున్నది. ఆమతస్థు

లలో జాతికిని మతమునకును సంబంధము లేదు. మనమతమన్న నట్లు కాదు. సహజమగు జాతినియమముల ననుసరించియే మతతత్త్వములలోఁ దారతమ్యముప్రకారము సిద్ధికలుగును. లేనిచో వాఁడుభయభ్రష్టుఁడగునని శాస్త్రములు చాటుచున్నవి. అందువలన జాతినియమముల మన మెంతమాత్ర ముపేక్షింపరాదు....

ఈవిషయములో మఱియొకముఖ్యాంశము సూచింపవలసి యున్నది. ... సర్వులకు సాధారణమగుజాతి నేవిధముగాఁ బాటింపవలెనో యటులనే యవాంతరజాతిభేదములఁగూడ నవశ్యముగా ననుసరింపవలెను. ఇయ్యవి సాంప్రదాయికములై యనువర్తించుటచే ధర్మమూలములైనవి. అవాంతరనియమములు లేకున్నచో వర్ణాశ్రమకాండము లెక్కడివి? రథకారనిషాదస్థపతీష్ట్యాదులకు జలాంజలు లివ్వవలసిన దేకదా? తనజాతి యుత్కృష్టమైనను హీనమైనను విడువరాదు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతాశాస్త్రమునందు

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

అని స్వధర్మానుష్ఠానమునకుఁ బ్రాశస్త్యమును నస్వధర్మాచరణమునకు భీతిహేతుత్వము నుపదేశించియున్నాఁడు.

మఱియొక లౌకికరహస్య మిందుఁగలదు. ...సృష్ట్యాదియందుఁ జతుర్ముఖుఁడు బ్రహ్మక్షత్రాదిచాతుర్వర్ణ్యములను నుపజాతులను గల్పించి తత్తదనుగుణములగువృత్తుల నేర్పఱచుటలో నతఁడొక గొప్ప సంకల్పముఁ జేసియే యిట్లొనర్చెనని ప్రమాణములచే నూహింపఁదగి యున్నది. నిఖిలమానవులకు నొకటేజాతి యైనచోఁ దత్ప్రయుక్త ధర్మములు నందఱిచే నొకటేవిధముగా ననుష్ఠింపఁబడవలసి వచ్చును.

అపుడు ప్రజలలోఁ బరస్పరవివాదములు జీవికావిషయములో గొప్ప క్షోభయుఁ గల్గును. అట్టియుత్పాత మొదవకుండుటకు వానివానికిఁ దగిన వృత్తివిభాగ మొనర్చి సర్వులకు సమానమై పరస్పరవిఘాతుకముగాని జీవనహేతువును గల్పించి వారిబుద్ధివృత్తుల కనుగుణముగాఁ గర్మోపాసనలచేఁ బుణ్యమార్జించుటకుఁ దగినట్లు వర్ణాశ్రమధర్మము లేర్పఱుపఁబడినవి. స్వస్వజాతిప్రయుక్త ధర్మములను వారువారనుష్ఠింపనిచో దైనందిన వ్యవహారములలో నెంతటి క్షోభ కల్గుననునది యించుక యోజింపుఁడు. గంభీరముగా నాలోచించినచో నివియున్నియుఁ దత్తత్ప్రాణి బుద్ధికర్మానుసారములై సహజముగాఁ గన్పట్టుచున్నవి గాని కృతకము లెన్నటికిని గావు. సహజపరిస్థితులకుఁ గాలవశమున విధిలేక మార్పులు గలిగింపఁబూనుట మహాపరాధము. ఇట్టి స్థితిలో జాతులను గాని వర్ణాశ్రమధర్మములనుగాని తిరస్కరించుట తప్పు. బ్రాహ్మణజాతి కెట్లు ధర్మ నియమములు కలవో యావిధముగా వన్యజాతులకుఁగూడ ననేక నియమములు గలవు. ప్రతివారును దమతమ నియమములఁ బాటించుచుండుచో సర్వశ్రేయములుఁ గల్గును.

ఇవన్నియునిట్లుండఁ బ్రకృతము దేశములో నొక గొప్పసమస్య కలదు. ఈసమస్యను గల్పించినవా రెవరైనను దత్ఫలము మాత్రము మనదేశమున కెక్కుడు నష్టమును గల్గించుచున్నది. ... కొందఱు బ్రహ్మద్వేషముతో మెలఁగుచున్నారు. అట్టివారియెడ శ్రీవిద్యాశంకరుఁడు తనదివ్యదృష్టి నెఱపి యాభేదబుద్ధులఁ బోఁగొట్టుఁగాకయని యాశించుచున్నాము.

బ్రాహ్మణు లెన్నటికిని బ్రాహ్మణేతరుల హక్కులఁ బోఁగొట్టలేదు. ప్రతిప్రాణియొక్క యభివృద్ధియుఁ దమతమ సహజములగు

శారీర మానస వ్యావహారిక వైజ్ఞానికాది శక్తులపై నాధారపడియుం డును. వానినెవ్వరుగాని యొకరికొక రడ్డగించుటకు వీలుండదు. బ్రాహ్మణులు తాత్త్వికమగు విజ్ఞానశక్తుల గ్రహించి, వ్యావహారిక మానస శారీరాది శక్తులను ప్రజాపాలన కృషి వాణిజ్యాదివృత్తులను బ్రాహ్మణేతరుల కొసంగిరి. పై శక్తులలోఁ బరస్పరసంబంధమే లేదు. ఇక విరోధమనుమాట మిక్కిలిదూరము. రెండుశక్తుల నొక్కఁడు సమ ర్థించుకొనుట శ్రమావహము. గాన సోదరభావముఁగల్గియున్న బ్రాహ్మణ బ్రాహ్మణేతరులు పైరీతిగ వృత్తిశక్తి విభాగముఁ జేసికొనిరి గాని వేఱుకాదు. ఇంతేఁ బక్షపాతమేమియుఁ గలదో తెలియకున్నది. అట్లు పక్షపాతముతో స్వార్థపరులై బ్రాహ్మణులు వర్తించియున్నచోఁ చాణక్యాది మహామేధాసంపన్నులు తమప్రతిజ్ఞలోఁగడతేరి పిమ్మట నేల చంద్రగుప్తాదులనే రాజ్యపరిపాలనలో నియమింతురు? మఱియు బ్రాహ్మణజాతికి విధించియుండు ధర్మములు నియమములు నొకక్షణ కాలమైన నీబ్రాహ్మణేతరులు పాటింపఁ జాలుదురా? వేయేల? బ్రాహ్మణుఁడు స్వార్థపరుఁడై యితరజాతులకన్న నెక్కుడు సుఖ వృత్తినే యపేక్షించుచో భిక్షాటన సన్న్యసన వనప్రస్థానాదుల నేల తనకువిధించుకొనును? క్షత్రియ వైశ్యులచేఁ బాలింపఁబడు ప్రజా పాలన వాణిజ్యాదులలో నైహికసౌఖ్యమధికముగా నున్నను బ్రాహ్మ ణుఁడుకోరుచున్నాఁడా? తత్త్వజ్ఞానశక్తి క్షీణించిన యీదినములలోఁ గూడ సాధ్యమగు నంతమట్టుకు విజ్ఞానముచేతనే యతఁడు తనజీవికను గడపుచున్నాఁడు కాని యన్యముగా లేదు. కనుక స్వతస్సిద్ధములగు జాతులలోఁ బరస్పర మసూయాదు లెన్నటికి నుంచుకొనరాదు. ఈవిష యమై బ్రాహ్మణులు మిక్కిలిశ్రద్ధవహించి దేశశాంతికై యత్నింప వలెను. మఱియు బ్రాహ్మణునికి విజ్ఞానశక్తి యెక్కువగానున్నదనుచో క్షత్రియజాతికిఁ బరాక్రమ పరిపాలనాశక్తు లధికములు కావా? వైశ్య

లకు ధనసంపత్తియు శూద్రులకు ధాన్యసంపత్తియు నెక్కుడుగా నుండలేదా ? కనుక నందఱును జేఁదోడు వాఁదోడుగాఁ గలిసిమెలిసి ధర్మనిర్వహణ మొనర్చుటయే ప్రకృతము హితమైనది. లేనిచో నన్య దేశీయులద్వారమున మన వైదికధర్మములు నిర్మూలితములై నామ మాత్రావశిష్టములగును. ...

బ్రాహ్మణ బ్రాహ్మణేతర సంక్షోభ మటుండ నంతకన్న నెక్కువయగు మఱొకసమస్య వ్యాపించియున్నది. అది .. యగ్ర నిమ్నజాతి తారతమ్య నిర్మూలనమే. ఈప్రచారముచే నెవరి కెట్టి కష్టము లంతగా సంభవింపకున్నను మహాప్రభావోపేతములగు దేవస్థానములకే పతనదశ వాటిల్లినది. పై సమస్యవిషయమై వివరించు టకుఁ బూర్వ మొక చిన్నయంశము బోధింపవలసి యున్నది.... ప్రపంచములోని చరాచరప్రాణికోటు లెల్ల నేకస్వభావముతో నెన్నటికి నుండఁజాలవనుట సుప్రసిద్ధము. ప్రతివస్తువునందు నుత్తమ మధ్య మాధమభేదము లుండియే తీరును. అట్లెందుకుండవలెనని యాక్షేపించినచో దానికి సమాధాన మీశ్వరుఁడే చెప్పఁదగు. ఇట్లుండ నిమ్నజాతులకు (చండాలాదులకు) హీనపరిస్థితి యెట్లువచ్చిన దన్నచో నది వారికర్మాధీన మనియే చెప్పనగునుగాని వేఱుకాదు. దేశములో ననేక సుఖదుఃఖతారతమ్యములతో నుండు ప్రజలు తమ ప్రభువును జూచి " ఇతని కింతయైశ్వర్య మెందుకువచ్చినది. ? మనకు మాత్ర మేల యిట్టిదుర్దశ తటస్థించిన " దని సత్యాగ్రహముఁబూ నుట యెట్టివెఱ్ఱితనమో యిదియు నట్టిదియగు. ఇట్లాక్షేపించువారు పిపీ లికాది బ్రహ్మపర్యన్తప్రాణులకుండు తారతమ్యమును గన్గొని యాకా రణరూపుఁడగు పరమాత్మకుఁగూడ వైషమ్య నైర్ఘృణ్యముల నారో పింపఁ గల్గుదురు. మనదేశము మాట యటుండనిండు. అన్యదేశములలో మాత్ర మిట్టి తారతమ్యములఁ బాటించుట లేదా ? ఇండియాలోఁ

బుట్టినంతమాత్రముననే యాంగ్లేయునకు హీనజాతిత్వము గల్పించుట మీరు వినుచుండుట లేదా? అన్నియు నిప్పటి దేశనాయకమనుష్యులకు గోచరించుట కష్టము. ఇట్లుపల్కుటచే నానిమ్నజాతులకుఁ బరమార్థదృష్టి జ్ఞానవృద్ధి యనవసరమని మేము భావింపము. ఉచితమగు విద్య నభ్యసింపఁజేసి వ్యవహారాభిముఖులఁ జేయుట యావశ్యకము. అంతియకాని యగ్రజాతులతోఁ జేతులు కల్పుకొని మెలఁగినమాత్రమునఁ దమకు స్వధర్మ భ్రష్టతయే కాని యెట్టిలాభ ముండదనియే ముఖ్యాంశము. ... మఱియు దేశములో పైఁజెప్పినవారిలోనే మఱొక యుత్పత్తికూడఁగలదు. ఏమనఁగా, "హిందూజాతిలో నగ్రవర్ణముల వారు మహమ్మదీయ క్రైస్తవాద్యన్యమతములకుఁ జేరినవారితోఁ గలసియుండుటకు సమ్మతింతురు. తమజాతికి మతమునకును జేరిన నిమ్న జాతులనుమాత్రము మిక్కిలి బహిష్కరింతురు. ఇదియొక మహాపరాధముగా నున్నద" నుటయే. ఇవ్విషయము కేవలము ధర్మసూక్ష్మము. నాగరిక... బుద్ధులకుఁ దోఁచునట్టిదికాదు. ఎవని కేమతనియమములందు విశ్వాసముండునో వాని కద్దాని నుండియే ఫలము కల్గును. జన్మాంతరమును గర్మసంస్కారములను నొప్పుకొనిన హిందూమతము ప్రకారము హీనకులజుఁ డగువాఁడు పూర్వజన్మమున నేదియో దుష్కర్మమాచరించియుండునని యూహింపవలసియుండును. అట్టివానిని బహిష్కరించుట వాని నధోగతికిఁ బాలొనర్చుటకుఁగాదు. పశ్చాత్తాపబుద్ధిగల్గి సత్కార్యములచే నున్నతదశకు రావలెననియే. ...

మఱియు వర్ణాశ్రమాది ధర్మములఁ బాటించుచుండు హిందూ మతమునం దుండువఱ కెట్టివానికైన నియమము లుండును. అద్దాని విడిచి యితరమతములలోఁ జేరినచో వానికిఁ గ్రొత్తమతముల విశ్వాస ప్రకారము ఫలము కల్గును ... అట్టివాని యెడ స్పృశ్యాస్పృశ్య వివక్షచేయ నవసరములేదు. హిందూమతధర్మ శాస్త్రములును విధి

షిషేధములును స్వకీయునకే కాని పరమతస్థుని శాసింపఁ జాలవు. హిందూమతాభిమానులకును దదభిమాన వర్జితులగు హిందూమత ప్రతిపక్ష మతస్థులకును విశేష వ్యత్యాసము కలదు. ...

అది యటుండనిండు. సభ్యులారా! ... కల్పాదినుంచి నేటివఱకుఁ బవిత్రతమములై వెలయుచుండు వేదశాస్త్రముల రక్షింపవలసిన బాధ్యత హిందూజాతి సామాన్యమున కున్నను నికాలమున నయ్యది బ్రాహ్మణజాతి మాత్రముననే విశ్రాన్తమయి యున్నది. అధ్యయన సంప్రదాయములు నేటికిని బ్రాహ్మణసంతతిలోనే యవిచ్ఛిన్నముగాఁ బ్రవర్తించుచున్నవి. ఇట్టితఱి నీబ్రాహ్మణులలోఁ గొందఱు విదేశీయనాగరకతకు వ్యాముగ్ధచిత్తులై వేదశాస్త్రములఁ దూలనాడుట విపరీతవాదములఁ జేయుచుండుట యుక్తముకాదు. వారి కుభయభ్రష్టత సిద్ధించునే యని చింతిలుచున్నాము. ఎట్లైన వేదశాస్త్రములరక్షించి, ధర్మదేవత కాశ్రయముకల్పించుట బ్రాహ్మణులచేతిలో నున్నది. ప్రకృతస్థితుల ననుసరించి యెట్టివ్యవహారవిద్యల నభ్యసించినను నుచితమగు పద్ధతితో వేదశాస్త్రాధ్యయనములఁ జేయుట తప్పనిసరియని మఱిమఱి హెచ్చరించుచున్నాము. ...

"ధర్మశాస్త్రములలో బ్రాహ్మణులు తమకు శ్రేష్ఠత్వము నిరూపించుకొని యితరజాతులకు హీనత్వముఁజూపిరి. ఇట్టిపక్షపాతము ధర్మప్రతిపాదకములగు శాస్త్రములలో నుండరాదు." అని కొందఱాక్షేపింతురు. ఇది యవిచారితరమణీయము. ధర్మశాస్త్రము లాయాజాతుల కుత్కర్షాపకర్షములను వ్యవహారములో నిరూపించినవి కాని పారమార్థికమునకుఁ గాదు. దానిచే వారికెట్టి న్యూనతయుఁ గలుగదు. "శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః" అను శ్రీకృష్ణపరమాత్మ గీతామృతమును గ్రోలిన మహనీయులకును శ్రీశంకరభగవ

త్యాగుల "మహాపాపపంచక" మును బహిరించిన మహాపురుషులకును నివిషయము మతివిశదముగాఁ దెలియఁగలదు. మేము వెనుకఁజెప్పినరీతిగా నుత్తములతో సంవ్యవహారమును నుత్తమస్థలములలోఁ బ్రవేశమును లేకపోయెఁగదా యను పశ్చాత్తాపమే వారి నుద్ధరింపఁజాలునను సదుద్దేశముతో ధర్మశాస్త్రములం దట్టివారియెడ విశేషించి నిందార్థవాదము లున్నవి కాని వేఱులేదు. ఇట్టి పవిత్రోద్దేశ ముండినపుడు వానిని నిరాకరించుట సరికాదు. ఈవిషయములోఁ బ్రకృతము కొంత మట్టుకుఁ గలహములు జరుగుచున్నవి. బ్రాహ్మణులందఱును బ్రాణమాన ధనముల ధారవోసియైన ధర్మశాస్త్ర నియమములఁ గాపాడుదురుగాక. ... మఱియుఁ బ్రకృతరాజకీయ పరిస్థితుల నాలోచింపఁగా బ్రాహ్మణజాతి కేమియు నాశ్రయ మగుపడుటలేదు. రాజ్యాంగము వారు కేవలము తమ తృతీయోపాయము నుపయోగించి మిగులఁ జమత్కారముతో రాజ్యభారమును నిర్వహించుచున్నారు. తమరాజనీతికి ఫలితరూపమగు మాయాజాలములోఁ జిక్కుపడువారిలో నీస్వజులే మొదటివారని వారియభిప్రాయము. మనవారియందుఁ జిత్తస్థైర్యముఁ గార్యదీక్షయు నానాటికి నశించిపోవుచున్నది. పరస్పరాసహనబుద్ధి మెండైనది. అందువల్లఁ బ్రభుత్వమువా రీ బ్రాహ్మణజాతిని లెక్కించుటయే లేదు. వీరిలో నైకమత్యము తక్కువ. ఒకఁడు వద్దనిన పనిని మఱొకఁడు శ్రద్ధతోఁ జేయఁబూనును. ఇట్లు భిన్నాభిప్రాయములతో వీరిని వర్తింపఁజేసి ప్రభుత్వము తటస్థభావము వహించియుండును. ఇది యుక్తముగఁదోచుట లేదు. వర్ణాశ్రమధర్మముల ననుసరించి జాతిమతసాంకర్యమున కెడమీక ప్రజలఁబరిపాలించుట యెట్టి ప్రభుత్వమున కైనఁదప్పనివిధియయియున్నాది నాథముగా జాతిమతాదుల వీలగుచో రక్షించుట లేనిచో వానియెడఁ దటస్థత వహించి యుండుటయు మిక్కిలి శ్రేయస్కరమని తలంచుచున్నాము....

నిజమును బరికించినచోఁ బ్రభుత్వము వారియెడ మిక్కిలితప్పు కానఁబడదు. ఎట్టికార్యములైన నడచుటకై కొన్ని రంగస్థలము లేర్పడి యున్నవి. అయిన నవి నిజముగా సదుద్దేశములతో నేర్పడినవి కాని రానురాను వానికి విపరీత పరిణామములు కల్గినవి. అవి యేవనఁగా శాసనసభలు, వీనిలో సభ్యుఁడగుటకు జాతికులగోత్ర విద్యావయస్సులుకాని మఱియే యితరగుణములుకాని ప్రకృతము సాధకములుగా లెక్కింపఁబడుటలేదు. పుష్కలధనముకాని లోకములో నొక విధమైన పలుకుబడిగాని యున్నఁజాలును. ఇట్టివా రేస్వల్పసంఖ్యాకులో (అనగా పదులుమాత్రమే) అనేక కోట్లసంఖ్యగల ప్రజలకుఁ బ్రాతినిధ్యము వహించుట! వీరిచర్యలలో వ్యావహారిక విషయములం దింతవఱ కెన్నిలోపములు జరుగుచున్నను గొంతమట్టు కుదాసీనత వహించినను బాధకము లేకుండెను. ఇపుడట్టిటుపొరలి ధార్మికములలోఁ బ్రవేశించి యీసభ లోట్లనిచ్చినవారియొక్కయు నీనివారియొక్కయు నింటికడపల వాఁటిలోనఁ బ్రవేశించినవి. అంత సంకోచించి చెప్పనేల? పడకటిండ్లలోని కేగి పట్టెమంచములపై నెక్కినవనియే చెప్పనగు. ఎట్టియన్యాయము! ఎంతటి దురంతము ! విరక్తులగు మేమీవిషయములలో జోక్యము కలుగఁజేసికొనుట యేలయని యుదాసీనతఁ జూపి యుండవలసి యున్నను ధర్మపీఠము నధిరోహించి యుండుటచే నింత పశ్చాత్తాపమొందవలసియున్నది. ఈశాసనసభలలోఁ గేవలము రాజ్యతంత్రములు తప్ప నితర విషయములలోఁ జర్చలు సల్పుట సర్వథాయసంగతము. హిందూమత సంప్రదాయముల నించుకైన నెఱుఁగని యీసభ్యులలో నధికసంఖ్యాకులు గలసి జాతిమత శాసనముల నొనర్చుట యెంతటి పాపహేతువో వీరికిఁ దెలియకున్నది. ఇటీవల నమలులోనికి వచ్చి దేశమంతటను మహాక్షోభలకాకరమై యుండునట్టి శారదా శాసనము

ట్టుపూర్వోత్తరముల విచారించినచో నింతటి క్రూరకార్యములు

జరుగుచున్నను ప్రభుత్వమువారు వీనినిమాన్పఁబ్రయత్నించుటకు బదు-లుగాఁ దాటస్థ్యమైన వహింపకుండ వీనికిఁ బ్రోద్బలముఁజూపుట నెంతయు విషాదకరముగా నున్నది. కనుక నీశాసనసభలు నేఁటికి దేశక్షోభకే యుపయోగించుచున్నవి. ఇఁకమీఁదనైన నిట్టి యవివేకములు కలుగ-కుండఁ జూచుకొనుచుఁ జేసిన యాభాసమును దిద్దికొని తమకిచ్చి యుండు పెత్తనమును మాత్రము దక్కించుకొనుదురుగాక యని మీరందఱు వారిని హెచ్చరింపవలసి యున్నది....

ఈ శాసనసభల నూఁతకఱ్ఱగా నుంచికొని యాధునిక సంస్క-ర్తలు విజృంభించు చున్నారు. వీరికోలాహలములు హెచ్చయినవి. వీరి మెడ గొంత్రైదాటుతప్ప మఱేమియుఁ గన్పింపకున్నది. ఇంగ్లీషువారి పోకడల ననుసరించి నడవవలెననుశ్రద్ధ భోగవాంఛ నియమరాహి-త్యము మున్నగు సాధనసంపత్తియే వీరికి ముందుకుఁ దెచ్చుచున్నది. వెనుకఁజెప్పిన యవైదిక సమాజములు వీరి వాదాభాసములు స్థిరపడు-టకు ముక్కాలిపీటలవలె నున్నవి. వీరుచెప్పు హేతువాదములుకూడఁ గేవలమాభాసములే కాని వేఱుకాదు. తుదకు వీరియత్నములన్నియు మహాప్రయత్నముచే మునుపు భట్టకుమారిల శ్రీశంకర ప్రభృతులచే నిర్మూలింపఁబడిన మాధ్యమిక మతమునకు మరల బీజవాపన మొన-ర్చుట కేమోయని తోఁచుచున్నది. స్వభావములు మిక్కిలి విష-మించినవి.

" అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితంమన్యమానాః
దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అంధేనైవ నీయమానా యథాంధాః "

అను శ్రుతివాక్యమునకు వీరు లక్ష్యభూతులగుచున్నారు. ఏమి చేయుదము ! మీరందఱునడికట్టు బిగించి కార్యరంగముఁబ్రవేశించిన

నేకాని వీరియుద్యమము లనుగంటఁజాలవు. వేదశాస్త్రములు రక్షింపఁ బడఁజాలవు. . .

పై వారి సిద్ధాంతములకు శాసనసభలుకాక స్వరాజ్యకక్షవారు ...ప్రోద్బలకులై యున్నారు. దేశక్షేమమునకయి వీరు చేయు నుద్యమము లన్నియు నతిపవిత్రములే యైనవి. విరక్తులై సర్వసామ్యదృష్టిని వహించియున్న మాబోంట్లకుఁ గూడ వీరు శ్లాఘాపాత్రులయి యున్నారు. అయిన నిటీవల వీరు తమకనావశ్యకములగు సాంఘికపరిస్థితులలో నిష్కారణముగా జోక్యము కలుగఁజేసికొని బహుజనులకు మనోవ్యథ కలిగించుచున్నారు. వీరిని దూషించుటకుఁగాని భూషించుటకుఁగాని వీలుకాకున్నది. వేదశాస్త్రవిధులను జాతిమత వర్ణాశ్రమధర్మ కర్మ నియమముల నుల్లంఘింప సమకట్టిన పిదప వీరిమహాసభకు దేశీయత యెట్లుఘటించునో వీరికే గోచరముకాకున్నది. అహింసావ్రతమని వీరందురుకాని జాతీయ సాంఘిక దైవిక విషయములలో ననేకులకు వ్యథలఁ గల్పించిన వీరియుద్యమమున కేల హింసయే ఫలముకాదు ? ఇప్పటికైనను సాంఘికదైవికములందు జోక్యముపుచ్చుకొనమని వీరు ప్రమాణము చేసిననే కాని సనాతన ధర్మాభిమానముగల యెల్లరును వారియుద్యమములోఁ గలియరాదని మీకు నేను హెచ్చరికఁ జేయుచున్నాను ...

ముఖ్యముగా బ్రిటీషువారి శాసనసభలు దేశీయసభలు నేవి యెట్లు విపరీతచర్యలఁ జేయుచున్నను స్వదేశసంస్థానములవారు మాత్రము హిందూవైదికధర్మ రక్షణమం దతిశ్రద్ధవహించియే తీరవలెను. లేనిచో వారి రాజ్యములకు స్వదేశీయతయే సార్థకముకాదు. పైవిషయములో నచటి ప్రజలందఱు మిక్కిలి శ్రద్ధవహించి యచ్చటనయిన ధర్మరక్షణమునకయి పాటుపడుదురుగాక. ఎవరెట్లు చరించినను వారికి మాత్రము వైదికధర్మరక్షణ బాధ్యత యెన్నటికిని దప్పదు ...

మఱొక విచిత్రవిషయము కలదు ఏమనఁగా - పైసంస్కర్తలు మొదలగు వారందఱును స్వాభిప్రాయములకుఁ దగినట్లు దేశమందంతటను నభిప్రాయమున్న దనుటకయి యమాయకురాండ్రగు కొందఱ స్త్రీలను బాశ్చాత్యవిద్యావతులుగా నొనర్చి వారిద్వారమునఁ గపట సంస్కరణ నాటకమును నలుదిక్కుల నాడించుచున్నారు. నిజముగాఁ బాపమీయాండ్రవారికి కర్తవ్యాకర్తవ్యములు దెలియవు. సంస్కర్తల మాటల విని తామువెలంగినచోఁ దుదకిహపరములకు రెంటికిఁ జెడుదురు. ప్రౌఢావివాహ వితంతూద్వాహ స్త్రీ స్వాతంత్ర్య జాతిసామ్యాదివాద ప్రతివాదము లన్నియుఁ దమ చెరుపునకే కాని వేఱు లేదు. అట్టి తఱి నెన్ని యవినీతులు జరుగునో దైవమునకే గోచరము - వీని విషయమై వివరింపఁబోవుచో నెక్కుడు కలదు. వైదికధర్మముల దూషించుట శిష్టులగు గృహిణులఁ దూలనాడుట సంస్కరణములపై శ్రద్ధఁబూనుట మున్నగునవి వీరికిఁదగవు. ఇకఁ మీఁదనయిన వీరీ భావమధురములగు నుద్యమముల మానుకొని సదాచారరతులై దేశమునకుఁ గీర్తిఁ దెత్తురుగాక. ముఖ్యముగా వీరు భగవద్గీతలోని అర్జున విషాదయోగాధ్యాయమందలి "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ!" మున్నగు వచనముల నొకతూరి విలోకింతురుగాక. మనమతము కేవలము హేతువాదములకు మాత్రము లోఁబడినదికాదు. కనుకనే యితరులవలె విచ్చలవిడిగాఁ జరించుటకు వీలుండదు ...

వీరందఱీరీతిగ స్వాభిప్రాయములను సంపూర్ణ దేశాభిప్రాయములని వెల్లడిచేయుటవల్లనే ధర్మవృత్తమునకు మూలతుల్యమగు బాల్యవివాహమునకే నిషేధశాసన మేతెంచెను. నిజముగా నిది యమలులోనికి వచ్చుటచేఁ గలిపురుషుని సంపూర్ణావతార మీయుగములో నయినదని చెప్పవచ్చును. వైదికవంశములకు నివి[illegible] యస

నేల భరతఖండమున కంతటికిని దుర్దశ వాటిల్లినది. ఈవిషయమై పిష్టపేషణతుల్యముగా నెక్కువ వివరించుటలో నుపయోగము లేదు. ఇటీవల నిద్దానికిఁ గొంత మట్టుకు సవరణమైనఁ గలిగి దేశశాంతికి హేతువగునని యనేకులు నిరీక్షించియుండఁగా నదియు గగనకుసుమ మాయెను. అందఱును గార్యదీక్ష వహించి ధర్మోద్ధరణమునకుఁ గడంగవలయును. శ్రీగవర్నమెంటువారిని నన్నివిధముల వేడుకొని శాసనము రద్దుపరచుకొను ప్రయత్నములు త్వరితగతితోఁ జేయవలయును. లేనిచో నతి శీఘ్రకాలములోనే ధర్మదేవత భారతభూమిలో నామ మాత్రావశిష్ట యగును. ...

పై కార్యభాగము లన్నియుఁ బ్రచురముచేతనే సాధ్యములు. మన కేమియును నుదాసీనత వహింపక ప్రతివారును దమ కిది తప్పని పని యనితలఁచి ధర్మప్రచారము గావించి జనులను బూర్వాచారములందు విశ్వాసము కల వారినిగాఁ జేయవలెను. ధర్మసభల స్థాపించి తన్మూలముగా రాజ్యాంగమువారిని మతవిషయములోఁ దాటస్థ్యము వహింపుఁ డనుసంగతిని మఱిమఱి తెల్పవలెను. ఇట్టితఱి శక్తికిమీఱిన పనికి మీరందఱు చేయవలెను. వైదికధర్మముల నిలుపుబాధ్యత కేవలము మీపైననే యున్నది. ... సభ్యులారా ! పైవిషయములకు సంబంధించిన యంశము లనేకములు కలవు. అవన్నియుఁ జాలమట్టుకు వ్యావహారికమార్గములలో నెక్కుడు ప్రవర్తించుమీకు మాకంటె నధికముగాఁ దెలిసియుండునని యే భావించెదము. విశేషించి వివరించుట కన్న కార్యరూపమున సద్దాని జూపుట యుక్తము. ఐకమత్యముతో మీరందఱుఁగలసి ధర్మమునకుఁ దటస్థించియుండు హీనదశలఁదొలఁగించి సంపూర్ణకళల నొందింతురుగాత

ఇట్టి మహాసమ్మేళనముద్వారమున ధర్మప్రచారము గావింపఁ దలఁచి మాయధ్యక్షతఁగోరినందున కీహితవచనముల నుడివి యీసదుద్యమము లెల్లప్పుడును నిర్విఘ్నముగా నెరవేరుగాకయని యాశీర్వదించుచు శ్రీవిద్యాశంకర శ్రీవిరూపాక్షమూర్తులఁ బ్రార్థించి నారాయణ స్మరణ మొనర్చుచున్నాము.

---

# శాసనోల్లంఘనోద్యమము

---

భారతధర్మాభివృద్ధికి భంగకరము.

ప్రభుత్వమువారి కొక హితోపదేశము.

కొన్నిచోట్ల నిరపరాధులను ఘోరముగఁ జంపుటకీరెఁ బరిణమించిన ప్రభుత్వమువారి కఠినచర్యల నొకవంక నిరసించుచు గాంధిగారి యిటీవలి శాసనోల్లంఘ నోద్యమమువలని యపాయములను గుఱించి దేశీయులకుఁ బ్రబోధించుట మావిధియని తలంచుచున్నాము. ప్రథమమున శాసనోల్లంఘన మనునది వ్యక్తులచేఁ జేయఁబడినను నయ్యది భయంకరనాశన సాధనము. అది యితరవిధముల నివారింపరాని యేదైన నొక ప్రత్యక్షముగు నన్యాయమును దొలఁగించుటకట్లు నుపయోగింపఁబడినపుడే నైతికముగ సమర్థనీయము. గాంధిగారి ప్రస్తుతోద్యమమిండియాలోని ప్రస్తుత ప్రభుత్వమును గూలఁద్రోయుటయను కార్యము కొఱకేగాని దానిస్థానమున నుంచుట కంతకంటె మంచిది సిద్ధముగా

నుండలేదు. అదిగాక యీ ప్రభుత్వవిధాన మిప్పుడు పరిణామ దశలో నున్నది. ఇంతకంటె మంచినేర్పఱచుటకుఁ గష్టతరమగు కార్యముకావలసియున్నది. రెండవది సమష్టిశాసనోల్లంఘన మెంత జాగ్రత్తగ నడుపఁబడినను గొన్నిచోట్ల నింతవఱకు జరిగినట్లే హింసాయుతము కాక మానదు. ఉద్యమము సాగినకొలదియు దుకాణములకడఁ బికెటింగును రాళ్ళురువ్వుట మొదలగు ప్రజాసామాన్య కార్యములకు స్వాధికార భంగభీరువులగు ప్రభుత్వమువారు లాటీలతోను దుపాకులతోను జవాబుచెప్పకమానరు. మదరాసులో నిదివఱకు జరిగియున్న విధమున రక్తపాతము సంభవించినచో నపరాధులతోపాటు నిరపరాధులును నిష్కారణముగ హింసలకును మరణములకును బాల్పడుట కుత్తరవాదులు తొలుదొలుత కలహకారణులైన సత్యాగ్రహనాయకులు కాకతప్పదు. వీరిటీవలఁజేసిన కార్యములలో నొకటియగు తాళవృక్షచ్ఛేదనము మహాపాపమని మేము ప్రత్యేకముగా నిరసించుచున్నాము. దురదృష్టవశమునఁ గొంతమందిచే దుర్వినియోగము చేయఁబడుచున్నను దాళవృక్షమార్థికముగ ననేక కష్టజీవుల నివాసములకుఁ బైకప్పులను సమకూర్చుచుండుటచే భారతదేశప్రజలకుఁ గామధేను వనఁదగియున్నది. మనుష్యభాషలో నెట్లుచూచినను సత్యాగ్రహ మనిపించుకొనఁజాలని తాళవృక్షచ్ఛేదనమను నీభయంకరాధర్మమునుగూర్చి యే హిందువు పరితపింపకుండ నుండును? మూడవది పాశ్చాత్య దేశములోఁ బ్రస్తుతము జరుగుచున్నట్లు ప్రజాసామాన్యముపైఁ గొద్దిమంది మధ్యతరగతి నాయకుల దౌర్జన్యమునకును నల్పసంఖ్య జాతులమీఁదను వారి యాశయములమీఁదను నధిక సంఖ్యాకుల దౌర్జన్యమునకును బూర్వాచారపరాయణులపయి నవీనాచారపరాయణుల దౌర్జన్యమునకు నెడమీయని ప్రజాప్రతినిధ్యపూర్వక ప్రభుత్వవిధానమును మన మేర్పాటు చేయవలసియున్నది. గాంధిగారికడ నటి విరాణ

విధానమేదయిన సిద్ధముగనున్నదా ? లేకదానిని సమష్టిశాసనోల్లంఘనము ద్వారమున సంపాదింపవచ్చునని యెవరయిన నమ్ముచున్నారా?

అట్లైన నింతమంది విద్యార్థులేల యీ యుద్యమములో దుముకుచున్నారని ప్రశ్నింపవచ్చును. దీనికి బ్రత్యుత్తరము సులభము. దేశమందంతటను బ్రిస్తుత ప్రభుత్వవిధానముపై విద్యార్థులగు భారతీయులకుఁగలిగిన యసంతృప్తియే దీనికిఁగారణము. అందుచే సమష్టిశాసనోల్లంఘనముయొక్క యుపాయములనుగూర్చి యొకవంక దేశీయులను బ్రబోధించుచు భారతీయులకుఁ గలిగిన న్యాయమైన కోరికలను దీర్చుపట్లఁ నొకక్షణమైన నాలసింపరాదని ప్రభుత్వమువారిని మందలించుచున్నాము.

జన్మభూమి యెడల భక్తిలోఁగాని సంఖ్యచేనయినను శక్తిచేనయినను బలహీనుఁడగువానిని బలవంతుని సౌజన్యమునకు లొంగునట్లుచేయుని స్వరాజ్యమును గాంక్షించుటలోఁగాని మేమెవరికిని దీసిపోము. కాని యట్టిభక్తికాంక్షలచేతనే మనపూర్వధర్మము నెడలను వర్ణాశ్రమవిధానము నెడలను ద్వేషాసహనములు విస్పష్టముగాఁ గలిగియుండువారిచే నేర్పాటుచేయఁబడిన యెట్టిశాసనోల్లంఘనోద్యమము వలనను నట్టిపక్షమగు స్వరాజ్యము సిద్ధింపఁజాలదని సూచింపవలసి వచ్చినది. మనపూర్వధర్మ విజ్ఞానమును నశింపఁజేయఁ గారణమగు స్వరాజ్యము కొఱకుఁగాని స్వాతంత్ర్యము కొఱకుఁగాని నడుపఁబడు నెట్టియుద్యమమునందును మేము పాల్గొనఁజాలము.

యమ్. కె. ఆచార్య, యమ్. యల్. ఏ. చెన్నపురి.
యన్. యల్. దొరై, తిరుచినాపల్లి.
టి. కె. బాలసుబ్రహ్మణ్య అయ్యరు. కుంభకోణము.
దివాన్ బహద్దర్. వి. కె. రామానుజాచారియార్,
కుంభకోణము.

---

# క్రొత్తసంవత్సరము 1930-1931

ప్రమోదూత సంవత్సరమునకు ... గ్రహములు ... దుర్బలములై యుండుటచేతను సకలశుభంబుల నందఁజేయు దేవగురువును శుక్రుఁడును ప్రముఖ నాయకత్వములను వహింపని కారణమును బట్టియు ... ద్వాదశ భావములును బలహీనత చెందియుండుటచేతను నెండవేడిమి యెక్కువగా నుండును; ఖండవృష్టి కలుగును. సస్యములు నష్టమగును. వ్యవసాయము చేయువారికిని, భూమికామందులకును నుత్సాహము తగ్గును. జనులు కష్టముల పాలగుదురు. జీవయాత్ర గడుపుకొనుట కష్టతరమై కానిపించును. దారిద్ర్యము వ్యాపించియుండును. పాఠశాలలకును శిశువులకును నుపద్రవములు కలుగును. అగ్ని ప్రమాదములు కలుగును. చెఱసాలలయందును నాసుపత్రులయందును గార్యాలయముల యందును మరణసంఖ్య యధికమగును. అన్యదేశములతోడి వ్యాపారమున కిబ్బందులు కలిగి మనస్పర్థలకుఁ గారణమగును. నాటకములును నుత్సాహ ప్రదర్శనములును వృద్ధి గాంచవు. ధరలు వృద్ధిక్షయములకు లోనగును; బ్యాంకులు నష్టముల పాలగును, న్యాయస్థానములయందుఁ గ్రొత్తవిధమైన నేరములు విచారణకువచ్చును. ఇనుపదారులు మోటారులు మొదలగువాని యజమానులకును బనివారలకును నతృప్తివాటిల్లును. పనులు నిలిచిపోవుటనుగుఱించి కొన్నియనుకూలతలును దటస్థపడును.

నౌకాసంబంధమును మత విషయముల సంబంధమును గల నవమభావమందుఁ గుజుఁడుండి శనిచేతఁజూడఁబడినందున నోడలకపాయము సంభవించును. మతవిషయములయం దుద్రేకములు కలుగును. వ్యయస్థానమును భూమినందనుఁడు చూచుటచేత చెఱసాలల

యం దవిధేయత ప్రారంభమగును గాని భావమందు గురు వుండుట వలన శుభత్వమును బట్టియున్నదిగావునఁగొన్ని యనుకూలమయిన మార్పులు చేయఁబడును. పంచమ స్థానమునఁ గేతువుండఁగా భావాధపతి శుక్రుండు పాపగ్రహ మధ్యగతుఁడయి యుండుట చేత రాజవంశములయందుఁగాని తత్సమానౌన్నత్యము వహించిన వారలయందుఁగాని యొకరిద్దఱు మరణమొందుదురు. ...వివాహ శాసనముల మీఁదఁ జర్చలు బైలువెడలును. శాస్త్ర విరోధమైన వివాహములు జరుగును. స్త్రీలు విజృంభించి స్వేచ్ఛానువర్తినులయి మెలంగుదురు. కుటుంబచ్ఛిద్రములు బట్టబయలగును. రాజ్యస్థానమును నందున్న శనియును కుజరాహువుల మధ్యనుండుటచేతను భావాధిపతియగు గురువు బలహీనుఁడయి వ్యయస్థానమునుండి యుద్ధకారకుఁడగు కుజునిచేతఁ జూడఁబడినందునను యుద్ధము సంభవించుటకుఁ జాలినంత యవకాశమున్నది. కన్యారాశిని రవి చంద్ర కుజ బుధ గురు శుక్ర శను లేడ్వురును జూచుట చేతను కుంభమేషరాసులలోఁ గుజుఁడుండుట చేతను లగ్నసప్తమ స్థానములగు మిథున ధనుస్సులకుఁ బాపగ్రహ దృగ్యోగాదులు గలిగి, శుభగ్రహదృగ్యోగాదులు పట్టకుండుటచేతను టర్కీ గ్రీసు మెసపటోమియా వెస్టిండీస్, అరేబియా పిట్రియా ప్రష్యా పోలెండు రష్యా యింగ్లండు ప్రాన్సు జర్మనీ మొదలుగాఁగల దేశములు యుద్ధమునందుఁ బాల్గొనును....

మకరరాశి కిరుప్రక్కలను గుజశనులు చేరియుండుటచేత నాఫగనిస్టాన్ పర్షియా యిటలీ మొదలుగాఁగల దేశము లుపద్రవరహితములయి యుండఁజాలవు. ఇండియా దేశము రాజతంత్ర వ్యవహారకష్టములకు లోనగును. ప్రజలకుఁ బ్రభుత్వము వారియం దతృప్తికలిగి యుండును. చతుర్థైకాదశ భావములు బలహీనములయి యుండుటచేత హావుస్ ఆఫ్ కామన్సులోను దేశీయసభలయందును నెదుఱు వాద

ను లు కలుగుచు. గొప్పవియు నందరానివియునైన స్వాతంత్ర్యములను బ్రజలు కోరుచుందురు.

ప్రభుత్వపువా రిండియాదేశపుఁబ్రజలయెడ దయారసమును వెదఁజల్లి కొన్ని స్వాతంత్ర్యముల నిత్తురు.

చి. సుందరరావు.

# యోగిని.

ఆర్యులారా !

కర్నూలునకుఁ బవిత్రురాలైన యొక యోగిని బదరికాశ్రమము నకుఁ బోవుచు బెంగుళూరునుంచి వచ్చియున్నది. ఈయమ యచ్చ టచ్చట నుపన్యసించి స్త్రీపురుషులకు వర్ణాశ్రమధర్మములను బోధిం చుటల్లోఁ దన వాగ్ఝరి నుపయోగింపఁ దలఁచియున్నది. పక్వపదార్థ ములు భుజింపదు. కర్నూలుపేట శ్రీరాములవారి యాలయములో 25-4-30 వ తేది జీవాత్మను గుఱించి యుపన్యసించెను. స్త్రీపురుషులు సుమారు 300 మంది సమావేశమైయుండిరి. పరమాత్మకును జీవా త్మకును భేదముఁజూపుచు మాయాప్రపంచమునకు మృదుమధుర శైలితో వ్యాక్యుచ్చెను.

పుల్లాపంతుల రామచంద్రయ్య.

వర్ణాశ్రమధర్మరక్షకసభాకార్యదర్శి.

:o:

మ॥ నిశితక్రూరతరాసి నస్మదరులన్ నీచాత్ములం జంపి వా
రి శిరశ్శ్రేణుల మెట్లు గట్టెదను గౌరీనాథు లోకానకున్
దశదిగ్వ్యాప్తముఁ జేసెదన్ మదమలోద్యత్కీర్తి. పల్నాటి దు
ర్దశ నేనె తొలఁగింపఁ జూచెదను మోదంబంద మీరెల్లరున్.

సూర్ని:- చిన్నియన్నా! నీవొక్కఁడవే యననేల నేనుమాత్ర మందులకుం దీసిపోవువాఁడనే? శీలాంబాగర్భజనితులకు శీలంబు ప్రధానంబగుటఁ బెద్దవాఁడగు నాయుని సచ్ఛీలంబునకు బద్ధులమై యిట్లు కుందవలసివచ్చినది. కుందుచుంటిమి. ఇంకెంత కాలమిటులఁ గుందవలెనో యెఱుంగరాదు. దుర్మదాంధుఁడగు నలసింగక్షమావల్లభుని దుశ్చేష్టలు క్షణక్షణంబునను జ్వాలలై మనల భస్మముసేయుచుండ నాజ్వాలల నార్పుటకు బాణవర్షము గురియ వీలుకలుగకున్నది. వారికాలము మంచిదగుటచే మనవారికిఁ జిక్కవలసిన వారయ్యు సింగంబులతో నాడుకొన సమకట్టు చిట్టెలుకల చందంబునఁ దిరుగుచున్నారు. ఏరికినేని యెల్లకాల మొక్కటేరీతి సాగివచ్చునా?

కం॥ ఏనాఁడు బ్రహ్మనాయుఁడు
పూని మనకు రిపులపైకిఁ బో సెల విడునో
ఆనాఁడె యా దురాత్ముల
ప్రాణంబులు నా కరాసిపా ల్గాకున్నే॥

పేర్ని:- తమ్ముఁడా! నీ మాటలఁబట్టి యింకను గొంతకాల మోపికతో నుండవలయునని తేలుచున్నది. అక్కటా! దుర్భరము దుర్భరము. ఆ పాపాత్ములు మన ధర్మపద్ధతి కనుగొనలేక మనలఁ బిరికివారలఁగాఁ బరిగణించి యెనలేని కష్టంబులు గలిగించుచుండినను ననాథలవలె ననుభవింపవలయునుగా! చాలుఁ జాలు. ఆమాట లిఁక మీరనఁగూడదు. నే వినఁగూడను.

ఉ॥ అన్నకుఁ గష్టమైన జను లారడిపెట్టిన బంధువర్గముల్
మన్ననఁ జూపకున్న నణుమాత్రము వీరులు నాకుఁ దోడుగా
క్రన్నన రాకయున్నను నొకండనె సంగరభూమిఁ జొచ్చి వి
చ్ఛిన్నముఁ జేయనే రిపుల శీర్షములన్ మదమంద మీరిటన్

నీవైనను నాయుద్యమమునకు వేఱువిధము దలపెట్టినవాఁడవైనచో శత్రువులకు జంకినవాఁడవైనచో నన్నను సరింపుము. లేకున్నఁ గాలమునకై వేచియుండుము. నేనొక్కరుండనే యీకరవాలము బాసటగా నాలమునం జొచ్చెద. వైరుల నోటుపుచ్చెద. క్షాత్రవంతులగు వీరులకుఁ జేతిఖడ్గముగాక వేఱు తో డేమికావలయును ?

సూర్నే॥ అగ్రజా ! కోపగించుకొనవేని యొక్కమనవి. క్షమించి వినవలయు. నేనుగాని మఱి యితరులుగాని యూరకుండుట శత్రులకు జంకియో ధర్మమునకు వెఱచియో మీ రెఱుంగనిది కాదు. మీయుద్యమము గాదని నిరసించువాఁ డీసీమలోనే లేఁడు. కాని దేశకాలపాత్రంబులెఱింగి యింతవరకు నెద్దానికి లోనై తాల్మివహించియుంటిమో యద్దానికే బద్ధులమై కొలఁదికాలముండవలయునని క్రుద్ధుండవైన నిన్నుఁ బ్రార్థింపవలసివచ్చినది.

పేర్మ-చేతఁగాని యీ యసమయాశ్వాసనలతోఁ బ్రయోజనమేమి ? పోనీ నిన్నుఁ గాదననేల, మీరు బుద్ధిమంతులరై యగ్రజాజ్ఞాపరిపాలకులని ఖ్యాతివహించిన వహించుచురుగాక. నాకు మాత్రము మాకీర్తితోఁ బనిలేదు. పగతుర మాయలకుఁ జిక్కి మానప్రాణము లరచేతఁబెట్టుకొని బలవంతులమయ్యు నబలలభాతి బ్రదుకుటకంటెఁ బగతురఁ జంపి వీరవిహారస్వర్గ మనుభవించుటో పగతుర జయింపలేకున్న వారిచేఁ జచ్చి వీరస్వర్గ

మనుభవించుటో చూచుకొనెద. అన్నా! ఎంతచిత్రము. విరోధివర్గముఁ బరిమార్చుటకుఁగూడ నింతశాంతియా? ఇట్టి ధర్మోపన్యాసములా? ఇన్ని నీతులకు లోనగుటచేతనే మన కీగతిపట్టినది.

సూర్స్న - నేను నందులకే దుఃఖించుచుంటిని. విధి మనపాల నన్యథా యుండ మన పౌరుషదర్పంబు లెందునకుఁబనికివచ్చును? కాలముచాలనప్పు డేదివచ్చిన నది యనుభవింపక తప్పదు. అందులకు నలహారిశ్చంద్రాదుల చరిత్రలే నిదర్శనము. పాండుకుమారుల యుదంతములే యుదాహరణము.

పేక్స్న - చాలుఁజాలు.

మ॥ విధినిఁ దూఱెద వేమివెఱ్ఱి? మనమే ప్రేమించి కైకొన్న ది
వ్యధ కాదేని యనారతంబు మన కన్యాయంబు గావించు నా
యధమాధ్యక్షు జగద్విపక్షు నలసింగాఖ్యుం దదీయప్రజా
బృధివిదూరులఁ జేయ కీగతి వృధా వేదాంతులై యుందుమే.

ఎప్పుడెప్పు డత్తులువల తలలు నఱికి పల్నాటిసీమ ప్రాకారంబు గోపురంబునకుఁ దోరణంబులఁ గట్టుదునాయని తొందరఁజెందుచుంటిని గాని సతతము మీ యొత్తిడులచే నా చిత్తం బుత్తలపడుచుఁ గత్తిని నాచేఁ గుదురుకొననీయక యన్యాయత్తంబుఁ గావించుచుంటచే నా తొత్తులమాఱి వాండ్రపని హెచ్చ మనయొత్తు నశించి పోవుచున్నది. కాని విధిచైదములుకావు. ఇఁక నావిధి యెట్లుద్దము వచ్చునో చూచెదఁగాక. అబ్బా! ఆ నలసింగాధముఁడుగాని జిత్తులమాఱియై లేనిపెత్తనము నెత్తినవేసికొని మనపాలిటి మిత్తియై చిత్తము వచ్చునట్లు వర్తించు నాయకురాలుగాని స్మరణకు వచ్చినప్పు

హెల్లి నాచిత్తం బున్మత్తం బగుచుండును. హా! ఆ పరమ పాతకిని నా లోకకంటకిని నాదేశద్రోహిని గఱకు కరవాలం బున ఖండ ఖండములుగా నఱకి కాకులకు గ్రద్దలకు బలి యిచ్చినఁగాని దాని రక్త ప్రవాహమునఁ బల్నాటి క్షోభా నలంబును జల్లార్చినఁగాని నా మదికి శాంతము గలుగదు. ఆ దుర్జాతి నేమి చేసినఁ బాపము? ఓసీ! మా కొఱకే నీ వీ భువిని మనుజాకృతిని బుట్టితివి కాఁబోలు! మా పల్నాటి నాశనమునకే నీ విందు దాపరించితివి కాఁబోలు! మావీరుల పౌరుషనామ విచ్ఛేదమునకే నీవు ప్రాప్తించితివి కాఁబోలు. అక్కటా! నీదెంతవ్యర్థపుజన్మమో నీ గుణము లంతకంటె వ్యర్థములు సుమీ! ఛీ కులటా! అఘటన ఘటనాసమర్థుం డగు నిటలాక్షుని కృపాకటాక్ష వీక్షణముచే నీ యాటలు కొంతవఱకు సాగివచ్చినప్పటికి ముందు సాగవుసుమీ! ఆ నిట లాక్షునే రూపుమాప సిద్ధపడెడు నాకు నీవొక లెక్కలోని దానవగుదువా? ఆఁకొన్న సింగంబునోట ననాయాసంబుగా మత్తేభంబు పడిన చందంబున నీవు నాభుజపంజరంబునఁ బడ నుంటివి. తమ్ముఁడా! మీరేమియు ననలేదు. నేనేదియు విన లేదు. ఎంతకాలంబునకుఁ బల్నాటి సామ్రాజ్య వినాశ హేతు భూతులగు దుర్మదాంధుల నిర్మూలించు సమయము సిక్కినది. ఇంక నీతో వాదమేల. ఇదే పోవుచుంటిని; గాన నీవు నన్ను వారింపవలదు. వారింపఁదగిన సమయమునుగాదు. వినుము.

శా॥ కాలాగ్నిప్రతిమానరూపమున లోకద్రోహులం జంపఁగా
వీరావేశోకమేనువ్రాని జనము ల్వీక్షింప రౌద్రింబులా
లీలఁబ్రాపెడి మేటిగాని యితఁ డశ్లీలంబు శంకించుచున్
వేశన్ వ్యర్థమొనర్చునట్టి తొలి యీ పేర్మిఁదుగాఁ డియ్యెడన్

కాన నాపేరును మఱచి నాయందాసవీడి నాపైఁ
బ్రేమను దొలఁగఁద్రోసి నామార్గమనుసరింపక మీఱియిచ్చ
వచ్చినట్లు పొందు. బ్రహ్మనాయుని శాంతవచనముల నిదివ
ఱకు గుప్తపఱచిన ఖడ్గము నిప్పుడు కేలంబట్టితి. మరల దాని
నొఱలోఁ దాఁచఁజాల. ఇఁక నాకు మాఱాడి నాయుద్యమము
నివారింపఁజూచిన నొట్టుఁబెట్టెదఁజుమీ! (క్రోధముతో నలసిం
గునుద్దేశించి) ఓరోరి పరమపాతకీ! నలసింగరాజా!

శా॥ నీకంటెం గడు దుష్టకష్టమతివై నీచాతినీచాత్మవై
ప్రాఁకంజూచెదు నొక్కకామినికి స్వప్రాణంబు లర్పించి యీ
లోకంబే మది విస్మరించు నినుఁ గాలుంజేర్చి భూభారముం
బీఁకన్ దింపుతలంపుతోడ నిదిగో పేర్మిఁడు వే వచ్చెదిన్.

సూర్మి:- అక్కటా! ఈవీరుని వారించువా రెవ్వరును లేరుగదా! దురా
గ్రహావేశుండై యెట్టి కానిత్రోవలం ద్రొక్కునో. ఏది యెట్లై
నను బ్రహ్మనాయుని యుద్యమ మింతవఱకుఁ దెలియరాదయ్యె.
ఈకోపకారణంబున మాకేమికుటుంబకలహము లంకురించునో.
దైవమా మాకేది దిక్కు?

కొమ్మరాజు॥ (తెఱనుండి వచ్చుచు)

ఉ॥ ఆఁగు మిఁకాఁగుమయ్య. సమయార్హము గానటువంటి యిట్టి దు
ర్యోగము మానుమయ్య. మన యాజ్ఞికకీర్తిని మాపుఁబట్టి దు
స్త్యాగముఁ బూనకయ్య. భవదగ్రజుఁడౌ నల బ్రహ్మనాయునిన్
ద్రోహము నాఁగకయ్య యుపయోగము లేదుః కిన్ గ్రహించు
(అని పట్టుకొనును)　[చున్.

పేర్మి- (వెనుకకుఁ దిరిగిచూడకయే) తమ్ముఁడా! నన్నేల వారించెదవు?
నేనెంతబోధించినను నీయజ్ఞానమును విడువవుకదా!

తే॥ తులువలంబట్టి యాజిలోఁ దునుమువఱకు
అగ్గలంబగు నాదు క్రోధాగ్నియాఱ.
దేల నామీఁది దుర్భ్రమ? యేగుఁ డింక
నాగసానిని బ్రార్థింప నాయుఁ గలసి.

సూర్ని.-అన్నా! నీవెంత పొరపడుచుంటివి. నీపరిభయకోపముపూజ్యుఁ
డైన బావగారి రాకఁగూడఁ గనుగొననీకయున్నదే.

పేర్ని:- (పరికించి) ఏమీ కొమ్మరాజా! (వినయుఁడై) బావా! వంద
నములు. కోపకారణంబున నీరాక యెఱుంగని నన్ను మన్నింపఁ
బ్రార్థించుచున్నవాఁడ.

కొమ్మ:-చిన్నిబావా! ఒకరు క్షమించుటయు మఱొకరు క్షమింపఁ
బడుటయునా? అందఱిని క్షమించుకర్తలు వేఱున్నారు. దాని
కేమిగాని బావా! నేఁటి నీచంద మరయ ముందటిచందంబున
నానందదాయిగాక భయభ్రాంతులఁ గలుగఁజేయుచున్నది.

సీ॥ సితసరోజాత సంతతుల కాంతులగేరు
మోముదామర బిట్టు మోటయయ్యె!
దంతదాడిమముల ధాళధళ్యంబును
వెదఁజల్లు నగవు మార్వేధముదోఁచె
కాంచనాభంబైన కమనీయగాత్రంబు
రోమాంచములను నిరుద్ధమయ్యె.
సచ్చింతనంబుతో సంతత మలరారు
మనమున రోషయోజనలు వొడమె
మృదులభాషలు కఠినంపుఁ బదములయ్యె
సరస మరసిన నత్యంతవిరసమయ్యె
అవయవంబుల నూత్నంపు ఛవి యెసంగె
ఆగ్రహస్ఫూర్తి నీమూర్తి యచ్చకీర్తి!

పేర్మి:- సహజవీర ప్రతాపుండవై లౌకిక వ్యవహారజ్ఞుండవై జ్ఞాన రూపుండవైన నీకు సామాన్యరసంబునకును వీరరసంబునకును భేదము తెలియకుండునా? అట్టి నీకు నాయందిప్పుడు నూతన తేజము కనంబడుట వింత. నిజమే. నే నిప్పు డొక్క వింతకార్య మాచరింపనుంటి. దానికి నీసాయ మత్యవసరమై యున్నది. కావున నీరాక నాకు సర్వదా మోదావహమైనట్లు నేఁడుకూడ సంతోషదాయకముగానే పరిగణింపఁ జేయుదువుగాక.

కొమ్మ:-నీ కన్యథా ముందెన్నఁడైనను బ్రవర్తించి యుంటినే? ఇప్పు డిట్టి నూతనోపోద్ఘాత మేల?

పేర్మి:-కాదనియే నీకొఱకై నేను రానుండునంతలో నీవే నాయం దనుగ్రహించితివి. మేలయ్యె. నేఁటి దేశస్థితి గుఱ్తెఱిఁగిన నీకు నేను వేఱుగాఁ జెప్పఁబనిలేదు. అయినను వినుము.

కం॥ గురిజాలపురిని నూతన
నరణిని యాగంబుసేయ సమకట్టితి. ధీ
వరులు నుతింపఁగఁ దొల్లిటి
స్థిరసంపద పల్లెనాఁటిసీమకుఁ గలుగన్.

కొమ్మ:-మంచిదే కాని యార్యా! దేశ మల్లకల్లోలముగానుండు నీసందిగ్ధ సమయమునం దిదేటి యజ్ఞము?

పేర్మి:- ఇట్టి వేళలయందే చేయఁదగినది మారణయజ్ఞము. దాని విధానముఁ జెప్పెద వినుము.

సీ॥ వీరులు పల్నాటి వెలమకులోద్భవుల్
ధీరులు తగిన ఋత్విజులుగాఁగ
సత్యమార్గవ్రతాచార సంపత్తిమైఁ
దనరారు నీ వుపద్రష్టగాఁగ

సాయక మా బ్రహ్మనాయఁడే యాజిత
త్తరుణి యైతమ సోమిదమ్మగాఁగ
పలనాడె యీయజ్ఞవాటిక గురిజాల
పంచిన హోమకుండంబుగాఁగ
నారసింగుండు మంత్రిణి నాగసాని
యజ్ఞపశువులుగాఁగ నత్యధికదీక్ష
శత్రుమారణయాగంబు సలుపనుంటి.
కోర్కె లిగురొత్త మనకెల్లఁగొమ్మరాజ !

కొమ్మ:-(తనలో) ఈతఁ డెంతఘోరకార్యమునకు సంకల్పించినాఁడో బ్రహ్మనాయుం డంతకుమించు శాంతితో నున్నాఁడు. ఒకరి దారి యొకరికి మిగుల విరుద్ధమై యున్నది. సర్వకార్యనిర్వాహకుండగు బ్రహ్మనాయుని కెదురాడ వీలులేదు. ఇతని కోపాగ్నిని జల్లార్చుట మిగులదుస్తరము. ఎందులకైనను నాయఁడే సమర్థుఁడుగాని తదన్యు లశక్తులు. ఇతని నిప్పట్టున నెట్టులేని బ్రహ్మనాయునికడకుఁ గొనిపోవుట మేలు. లేకున్నఁ గలవరము కలుగకమానదు. అపుడు సమర్థించుకొనుట మఱియుఁ గష్టసాధ్యము. [ప్ర.] బావా ! నీయుద్యమము సమంజసమే. నామనోభీష్టముగూడ నట్టిదియే. నీకు నా సంగతి వేఱుగాఁ జెప్పవలయునా ? నేనును రిపుమండలి రూపుమాపి దేశక్షేమ మొనరింప బద్ధకంకణుఁడఁగానా ? ఇంతయేల

ఉ॥ ఎప్పుడు పెట్టుకొన్నగడు వెంతయుఁ దీఱునో భూతతృప్తిగా
నెప్పుడు శత్రురక్తబలి నిత్తునొ వీరవిహారమూర్తినై
ఎప్పుడు యుద్ధభూమిఁ జరియింపఁగ నేర్తునొ యన్న చింతగా
కెప్పుడు వేఱుచింత గన. నేమివచింతును. నీవెఱుంగవే.

౮ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసర్కిలినస్పెక్టరు, నర్సారావుపేట

౯ నారాయణరావుగారు, దాతారుపల్లె

౧౦ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు-షాపురం.

౧౧ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు

౧౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ

౧౩ శేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట

౧౪ రామూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన పరిధానమంత్రి

౧౫ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౬ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౭ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబినస్పెక్టరు - కొత్తగూడెం.

౧౮ రంగావజ్ఝుల రంగయ్యగారు, నర్సారావుపేట

౧౯ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.

౨౦ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - [illegible]

౨౧ కన్నయ్యగారి సంగయ్యగారు-ముసలాపురం

౨౨ తాళ్ళవెలిమ లింగన్న వెంకటద్రిగారు-గడిసెద్దాపురం

౨౩ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి

౨౪ వెంకటరాజయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం

౨౫ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.

౨౬ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౨౭ రాయమూరి బందేరావుగారు, అయినాపురం.

౨౮ కొండంభట్లగారి వెంకన్న గారు. గుమ్మడిదల

౨౯ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-పెదవీడు.

౩౦ కందాళం కేశవాచార్యులుగారు-కిష్టన్నపల్లె.

౩౧ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాదు.

౩౨ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

౩౩ రాజా మంత్రిప్రెగడ హనుమంతరావుగారు - లింగగిరి

౩౪ చిక్కాల రాజు నట్టుపల్లి రావుగారు - చెలకుర్తి.

సంపాదకుడు — నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

## ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కలిజీవోద్ధారిణి [పూరి వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 4 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 5 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 6 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 7 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 10 | అస్పృశ్యతానివారణ ఖండనము (మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 11 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 12 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 13 | వైశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 14 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 15 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 16 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 17 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 18 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 19 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 20 | నూతనసంహిత—ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 21 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 22 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 23 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | 0 |
| 24 | భారతీయప్రబోధము (పిశుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 25 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 26 | భారతకథాతత్త్వనిర్ణయము (మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోస్టు,

గుంటూరు జిల్లా.

పరికిరాదు. భావి స్వరాజ్యమున నిట్టి శాసనము లేవిధమున సిద్ధము చేయఁగల్గ మచ్చు చూపవలెనుగదా? అదియే శారదాగారి వివాహశాసనము. స్వరాజ్యసిద్ధి యాయినను.

మన కాంగ్రెసు బహువత్సరములనుండి శ్రమపడుచున్నది. ఏల? మనకుం గల హక్కు లెక్కువకావలెనని. ప్రథమమున నియమము లేమి? కాంగ్రెస్సు [illegible] విభాగీయమతములవారి సమష్టి రూపమగుట రాజ్యాంగాధికములలోనెక్కే ముఖ్యముగాఁ బనిచేయుట కవసరమగుటచే సాంఘిక మతవిషయములలో జోక్యము కల్పించుకొనఁగూడదని. శాసనసభలనున్నవారి స్థితి విచారించెదము. అది కాంగ్రెసునకు నకలే. అంద్రార్యసామాజికులు బ్రహ్మసామాజికులు క్రైస్తవులు మహమ్మదీయులు [illegible]యిన లెక్కలేని మతములవా రున్నారు. వారివారి గోమాచారములకును భావములకును ప్రాముఖ్యము కావలెనని తలఁచెదరనుటలో సాహసము లేదు. అందుకును సమానప్రాధాన్యతయు నవసరమును గలిగినది యాధునిక సమస్య. చేతినున్న [illegible] స్వాతంత్ర్యము మున్నగు విషయములు సద్యఃస్వార్థకములయినవి [illegible] కలవు. వారి యభివృద్ధి వారి సామర్థ్యముచేఁ గలిగించిన సమస్తమతముల వారికి నానందము కలుగఁగలదు. అట్లుగాక బ్రహ్మసామాజికులు [illegible] స్త్రీలకు మనియు నార్యసామాజికు లందఱును గలిసి వివాహము చేసికొనవలెననియుఁ [illegible]ములు సేయింప యత్నించినచోఁ బ్రహ్మలలో వారు సాధింపఁదలఁచిన మైత్రి తప్పుటకేకాదు. రాజనీతి ననుసరించి చూచినను దేశసంఘమున భేదము పుట్టించుకొనుట కేవల మవివేకము — మన నాయకులకే నొకచెంప సంపూర్ణస్వాతంత్ర్యము కలుగ వలెనని కోరుచు నిదివఱకు బ్రిటిషుపాలకు లిచ్చినట్టియు నప్పుడప్పుడు జ్ఞాపకము సేయుచున్నట్టియు మతస్వాతంత్ర్యముకూడ [illegible] యాయుటకుఁగాను మతమునకుఁ బ్రాణాధారమయిన వివాహవిధిని విచ్ఛేదముసేయు శారదావివాహ శాసనము సిద్ధముచేయఁబడినది. కొండనాలుకకు మందువేయ నున్న నాలుక యూడి పోయినది. ఇందులకుఁ గారకులు చాల గొప్పవారే — మహాత్ముఁడు గాంధి; పండితుఁడు [illegible] ఏతాదృశులు మఱికొందఱును. వీరికి దూరపుచూపు పోదా! భగవంతుఁడు వివేకము ప్రసాదింపలేదా! అన్నియును గలవు. ఇట్టి విపత్తునకుఁ గారణము యుగాధిపతియొక్క మహిమ కావలె. శ్రీరాము నరణ్యమునకుఁ బంపుటకుఁ గైకనావేశించిన వారే మన పెద్దలఁ బట్టియుందురు. లేకున్న వారికిఁ దలలు లేవా? పాపము క్షమించును గాక — పరమేశ్వరుఁడు వారికిఁ బశ్చాత్తాపము ప్రసాదించునుగాక —

# సనాతనధర్మపరిబోధము.

——(:o:)——

(శ్రీపుత్తి రాఘవాచార్యులు - కోడంగలు - నైజాం)

హిందూమతము పవిత్రమును నీతిబోధకమును సకలచరాచర ప్రపంచ సృష్టి స్థితి లయకారణ సర్వేశ్వరునకుఁ ప్రీతిపాత్రమును నఖిలపురుషార్థసాధకమును నని మనపూర్వు లంగీకరించుటయే కాక ద్వీపాంతరవాసులలోఁగూడ మన యీ మతగ్రంథము లనేకము నిజానువాదముచేఁ బఠించువారు గలరు. ఇట్టి పరమోత్కృష్టమైన హిందూ (సనాతన) ధర్మకల్పవృక్షమును పంథసంస్కారపిశాచగ్రస్తులును నవనాగరికాభిమానులును పాశ్చాత్యభాషావేషభూషితులును నగు ప్రజ్ఞావంతులు మొదలంటఁ బెఱికి వివిధ నానా ప్రౌఢావివాహాస్పృశ్యతానివారణాదికముల బోధించుట స్వయ మాచరించుటయే కాక ప్రభుశాసనములఁ గూడఁ జేయింపఁ బ్రయత్నించుట యెంతయు నాశ్చర్యకరమో యెంతదౌర్భాగ్యసూచకమో యోజింపవలసియున్నది. మనలో నొండెరు కొన్ని సంవత్సరములనుండి వ్యర్థాత్మాభివృద్ధియే ముఖ్యకర్తవ్యముగ భావించి తదుద్దేశములైన పత్రికలను బుస్తకములను మహాప్రయాసచేఁ బ్రచురించుచు మహదాశక్తి ... విద్వాంసులఁ బ్రోత్సహించుచు వారణాసిలో నఖిలభారతవర్ష ... బ్రాహ్మణసమాజసమ్మేళనమును గలుగఁజేసి యమ్మహాసభలో సర్వసమ్మతములగు పూర్వాచారములును సగుతీర్మానములను విద్వద్వరేణ్యులచేఁ గావింపఁజేసి జయప్రదముగ సంఘమును గాపాడిరి. ఇట్టి యుత్తమోత్తమకార్యనిర్వాహకులగు నట్టివారిని విద్వాంసులును భక్తులును నగు నాబోటులు మాటిమాటికి నభినందించుటయే కాక నిత్యానుష్ఠానములో వారికందఱకికి సర్వేశ్వరుఁ డాయుశ్శ్రేయస్సులు ప్రసాదించుఁగాక యని ప్రార్థించుచున్నారనిన నతిశయోక్తి కాఁజాలదు. కాని యమ్మహనీయులింతవఱకుఁ జేసిన కృషి యంతయుఁ గలి ప్రాబల్యముచే నుద్యోగపర్వమువఱకే యగుట నిఁక యుద్ధపంచకమే మిగిలియున్నదని వ్రాయుట కెంతయుఁ జింతిల్లుచున్నాను. అందుఁ బ్రధానమగు భీష్మపర్వము వివాహవయోనిర్ణయశాసనమే యనవచ్చును. ఉపన్యాసకులు విద్వాంసులు వైదికులు పౌరాణికులు మొదలుగాఁగల విరక్తిమార్గావలంబి సనాతనధర్మరతులు యలక్ష్యభావముచేతనే చాలమట్టుకిది యిట్లయినదని నాయభిప్రాయము. ఏతద్విషయమంతయు వార్తాపత్రికల పాఠకుల కందఱకికిని గొత్తదిగాదు. విదితమే. దీనిని గుఱించి విచారించుట గతజలసేతుబంధనము వలె నిష్ప్రయోజనము. ప్యాసైన శాసనమును రద్దుచేయుట కిపుడు ప్రతిమనుజుఁడును బ్రయత్నింపవలయును.

నేనొక్కండనే యీకార్యమెట్లు నిర్వహింపఁగలనని సంశయింప నవసరము లేదు. ఎందులకందురా? విన్నవించెద. పూర్వమందు మనమతమునకుద్ధారకులగు శ్రీమచ్ఛంకరాచార్య విద్యారణ్య ప్రభృత్యనేక మహామహులు ప్రప్రథమమున నేకాంగులయియే యుండియు నాసేతుహిమాచలము తమ సదభిప్రాయాంకురములను నాటిరి. వారిచరిత్రములే దశదిశలయందుఁ జాటుచున్నవి. కనుక వారొక్కరే యుండిరి గదా! ఇట్లనేకోదాహరణములు గలవు. ఎవ్వ రారంభదశయందు సాహసింతురో వారు పూర్వోదాహృత మహనీయుల సత్కీర్తి పడయఁగలరని నమ్ముచున్నాను. కావున మనముగూడ నొక్కరమే యీ యారంభధర్మ సంగ్రామములో దిగి యథాశక్తి పోరాడిన పక్షమున మన మిత్రబాంధవులును ధర్మాభిమానులును నూరకుందురా! ఎన్నఁడును నట్లు కాఁజాలదు. అందఱును మనకు సహాయముఁ జేయ నడుముకట్టెదరు. ఇదియునుంగాక మనపూర్వీకులవలె మనము స్వబుద్ధిచేఁ బరాక్రమింపవలసిన క్లిష్ట సమస్య తటస్థింపలేదు. ఎందుకనఁగా నిదివఱకే మన భరతమాతకు సత్పుత్రులనేకులుదయించి సనాతన ధర్మోద్ధారమును సల్పుచున్నారు. వారల ననుసరించినఁ జాలును. మనయత్నము సఫలమౌను. అట్టి మహానుభావులు మన కండగా నున్నప్పుడు మనమేల నిద్రనుండి మేల్కాంచఁగూడదు? మఱియు నూతనముగా నుద్భవించిన బ్రహ్మార్య దివ్యజ్ఞానాది సమాజముల నేల నిర్మూలించఁగూడదు? అనఁగా మన సనాతన ధర్మముయొక్క రక్షణమే తద్విరుద్ధమతముల నిర్మూలనము. ఎట్లనఁగా సూర్యప్రకాశము కప్పించుటయే యంధకారము నశింపఁజేయుట. "ధర్మోరక్షతి రక్షిత" యను న్యాయానుసారము మనధర్మమును మనము రక్షించినఁగాని మనల ధర్మము రక్షింపదు. లెండు. ధర్మాగ్రహమును బూనుఁడు. కాశీక్షేత్రమునందు విశ్వనాథకరుణాపాంగసంగతిఁ బ్రశస్తతమంబగు వర్ణాశ్రమస్వరాజ్యసంఘమునందుఁ బ్రవేశింపుఁడు. ప్రవేశించి ధర్మకందళము వృద్ధిచేయుఁడు. తత్ప్రచారార్థమై మీధనము వినియోగింపుఁడు. మన వర్ణాశ్రమధర్మిష్ఠులఁ బ్రోత్సహించి శాసనసభల కెక్కింపుఁడు. సంఘసంస్కారులకు మీవోట్లు నీయకుఁడు. వారిని సమీపమునకు రానీకుఁడు. వారిమాటలు వినకుఁడు. వర్ణాశ్రమ ధర్మబోధక పత్రికలఁ బోషింపుఁడు. ధర్మవిరోధుల బహిష్కారింపుఁడు. గవర్నమెంటువారికి విన్నవించుకొని దుశ్శాసనములు రద్దుచేయింపుఁడు. యథాప్రకారము వేదవిహితవివాహములఁ గావింపుఁడు. శారదాశాసనమును తిరస్కరింపుఁడు. ధర్మశాసనము పరిపాలింపుఁడు. ధర్మ ప్రబోధము గావింపుఁడు. మీ సామర్థ్యమంతయు ధర్మరక్షణకై వినియోగింపుఁడు. హఠాగ్రహమును బూనకుఁడు. వర్ణాశ్రమ ధర్మజ్ఞులఁబిలిచి యుపన్యాసములు చెప్పించి తదుక్తరీతి వర్తిల్లుఁడు.

# ఆంధ్రదేశ వర్ణాశ్రమ ధర్మసభ
# స్త్రీశాఖ, బెజవాడ.

---

మార్గాయుక్తుల విద్యాలయ స్థాపకురాలగు శ్రీయుతురాలు
శేషసోమిదేవమ్మగారిచే నీయఁబడిన
స్వాగతోపన్యాసము.

సతీమణులారా :

ఇచట మనసంఘము సమావేశమై విచారింపవలసిన విషయములు [illegible] మన యధ్యక్షురాలగు శ్రీమతి యిందుమతీదేవిగారు వారి యుపన్యాసమునందుఁ జెప్పెదరు. నేను విశేషించి చెప్పనవసరము లేదు. వారు మనసభ కధ్యక్షపదవి నంగీకరించినందులకు మనకృతజ్ఞతను దెలుపుచుఁ గొన్ని విషయములనుగూర్చి మాత్రమే నేను ముచ్చటించెదను. సావధానముగ నాలింపుడు. అనాదికాలమునుండియు ధర్మబద్ధులైయున్న భారతీయులు సర్వవిధములగు శ్రేయస్సులను సమకూర్చుకొనుటకు బాలికా వివాహములే యనుష్ఠేయములని ధర్మశాస్త్రములయందు దీర్ఘదర్శులగు మహర్షులు పారమార్థికములగు హేతువుల ననుసరించి విధించియున్నారు. బాల్యవివాహముల ప్రాశస్త్యమునుగూర్చియు యువతీవివాహముల వలని యనర్థములనుగూర్చియు నాచేఁ బ్రకటింపఁబడిన బాల్యవివాహచంద్రికయను గ్రంథమును బఠింప మిమ్ముల వేఁడుచున్నాను. ఇంతవఱకు స్త్రీయొక్క ధర్మములను రక్షించుభారము పురుషులపై నుండుటచే స్త్రీలు సభలకెక్కి తమధర్మములఁ గూర్చి తాము చెప్పుకొనవలసిన యావశ్యకత లేకుండెను. కాని యీకాలమున స్త్రీల కత్యంతప్రాణప్రదమైన వైవాహిక ధర్మమునకు భంగము వచ్చునట్లు కొందఱు పురుషులు చేయుటచే ధర్మరక్షణమునకై నావంటి వారు సభలకు వచ్చి మొఱపెట్టుకొనవలసివచ్చినది. ఆపత్కాలమం దెట్టిమహాపతివ్రతలైనను రాణివాసస్త్రీలైనను దమయభిప్రాయములను వ్యక్తపఱచవలసినవారే. ద్రౌపది మహాపతివ్రత. వస్త్రాపహరణసమయమున భీష్మద్రోణాద్యాచార్యులతోను ధృతరాష్ట్రాది మహారాజులతోను నిండియున్న సభలో ధర్మవ్యతిక్రమమునుగూర్చి స్పష్టముగాఁ బ్రశ్నించియు ధర్మరక్షణముఁ జేయ వారసమర్థులై యుండిరని తెలిసికొని సర్వశరణ్యుఁడగు శ్రీకృష్ణపరమాత్మను వేడికొని మానసంరక్షణము గావించుకొనియెను.

ఆనాఁడు ద్రౌపదీరమణీమణికిఁ గలిగిన ధర్మభంగ మీనాఁడు భారతరమణీమణుల కందఱకుఁ గలిగినదనినమ్ముఁడు- ఆనాఁ డెవఁడు రక్షించెనో యీనాఁడు నతఁడె రక్షించితీరును. కాని ప్రతివ్యక్తియు- భగవంతుఁ డిచ్చిన శక్తినంతటిని వినియోగించి ప్రయత్నించి ధర్మరక్షణముం జేసికొనవలయును. ఫలమిచ్చుభారము భగవంతునిపైఁ బెట్టవలయును.

ధర్మములన్నిటిలో స్త్రీధర్మము నత్యంతశ్రద్ధతో గౌరవముతోఁ గాపాడుకొనఁ దగినది. అన్నిటికిమూలము స్త్రీయని వక్కాణింపఁబడియున్నది. అన్నియాశ్రమములకు గృహస్థాశ్రమ మాధారము. గృహస్థాశ్రమమునకు గృహిణి యాధారము. కావున స్త్రీధర్మము సర్వదా సంరక్షింపఁదగియున్నది. స్త్రీలు చెడినచో వర్ణసంకరమగు, వర్ణసంకరమైనచో భారతజాతి నశించును. కావున స్త్రీపురుషు లెవరేప్రయత్నముఁ జేసినను భారతజాతి నశింపక వర్ధిల్లుటకు వలెనన్న తత్త్వమునకునచ్చునట్లు చేయవలయును. ఇప్పుడు స్త్రీలు చెడుటకేమికారణమని యడుగవచ్చునేమో? వినుడు- ఇప్పుడువచ్చినది శారదావివాహ శాసనము. దానివలన నేమిలాభము యుండునో? 14 ఏండ్లకు లోపల బాలికలకు వివాహముచేయరాదట. చేసినచో శిక్షవిధింతురట. మనదేశములోఁ దఱుచుగా 12, 13, సంవత్సరములమధ్యమునఁ గన్యలు రజస్వలలగుదురు. రజస్వలా వివాహము లశాస్త్రీయములు ధర్మవిరుద్ధములు నరక కారణములు. ఆట్టివివాహములు ప్రబలియున్న దేశములయందు స్త్రీలు స్వేచ్ఛాప్రవర్తనలై సంఘమునంతటిని సంకటములలోఁ ద్రోయుచున్నారని గ్రంథకర్తలు వ్రాయుచున్నారు. అంతవయస్సువచ్చినవారు క్రమం తప్పఁ దామె యిచ్చవచ్చిన వరుని బెండ్లాడుటయో పెండ్లి వద్దని యథేచ్ఛగఁ దిరుగుటయో సంభవించును. ఇచ్చవచ్చినట్లు పెండ్లాడనిత్తుమేని కష్టసుఖము మంచిచెడు గుర్తెఱుఁగనిబిడ్డ పైవ్రాతలకు భ్రమిసి యేజాత్యంతరునో వివాహమాడును. లేదా వివాహమాడదు. ఎటులయినను వర్ణసంకరము జాతినాశముఁదప్పవు.

అవివాహితలుగనున్నచోఁ బడుపాట్లు సంఘమునకుఁగలుగు కీడు నట్టివారున్న దేశస్థులు వ్రాయువ్రాతల వలన మనము తెలిసికొనఁ గలము. ఆదేశములు చాలనుపద్రవ స్థితిలో నున్నవని తెలియుచున్నది. స్త్రీ లవివాహితలుగ నున్నందునను బురుష వృత్తుల నవలంబించుటచేతను బురుషులకు వృత్తులులేకయు సంసారములులేకయు సంఘమున కుపద్రవములు గలుగుచున్నవట- రజస్వలా వివాహములు చేయవలెనను వారు స్త్రీవిద్యాభివృద్ధిని స్త్రీస్వాతంత్ర్యమును బురుషులతో సమానాధికారమును గోరుచున్నారు, బాల్యవివాహములాచరించినను స్త్రీవిద్యాభివృద్ధికేమి యాటంకములు కలవో

జాతులయందును స్త్రీలు స్వతంత్రలై తమపతుల వరించుటలేదు. పూర్వకాలమున క్షత్రియులలో స్వయంవరమున్నమాట వాస్తవమే. కాని యచట నొకరహస్యము మనము గమనింపదగియున్నది. ఉదాహరణముగ సీతాకళ్యాణమును దీనికొందము. అచట సీతకు వరునినిర్ణయించుటలో జనకమహారాజు శివధనుస్సు నెక్కుపెట్టువానికి సీతనిత్తుననిరి. చూచితిరా? శివధనుస్సును క్షత్రియాంశసంభూతుఁడును, సత్క్షత్రియకుల ప్రసూతుఁడును నగువాఁడుతప్ప నితరులెవ్వరునద్దానిని ముట్టనుగూడ సమర్థులు కారని తెలిసియే యట్లుచేసిరి. అట్లే ద్రౌపదీస్వయంవరమునను మత్స్యయంత్రమును గొట్టఁగలవాఁడుసత్క్షత్రియకులసంజాతుఁడు తప్ప నన్యుఁడుండఁబోఁడని తెలిసియే ద్రుపదమహారాజట్లుచేసెను. ప్రతిష్ఠలుచేయని స్వయంవరములలోను క్షత్రియులు తమ పిల్లలకు స్వయంవరములు ప్రకటించుటలోఁగూడఁదమతో సమానకుల గౌరవములు కల వారినే పిలుచుచుండెడివారు. కానియిప్పుడన్ననో తనయిచ్చవచ్చినవరుని వరింపును స్నచో సర్వసామాన్యమైన లక్షణములఁజూచియే వరింపఁగల్గునుగాని యంతకన్న నెక్కువ పరిశీలన బాలిక చేయఁజాలదు. ఏ పాత్రుఁడైనను రూపమో వయస్సో ధనమో విద్యయో యున్నదని కులగౌరవములఁ బాటింపక వరించును. దాన వర్ణసంకరమగును. కావున నీవిషయములన్నియుఁ బరిశీలించి రజస్వలా వివాహము లనర్థదాయకములనియు ద్విజాలలోన నవి నిషిద్ధములనియు నట్టివివాహములేచేసి తీరవలయుననుట ధర్మవిరుద్ధమనియు మనదృఢాభిప్రాయమును బురుషులద్వారముఁ బ్రిపవిత్రమువారికిఁ దెలుపవలయునని విన్నవించుచున్నాను. స్త్రీధర్మములఁ గూర్చి విశేషముగఁ దెలిసికొనఁగోరువారు నాచే రచింపఁబడిన సతీధర్మసంగ్రహమును బఠింపవేఁడుచున్నాను.



9

# శారదాబిల్లు నిరసనము



(తంగిరాల జగన్నాథశాస్త్రి)

శా॥ ఆశీతాచల సేతుమధ్యగత దేశావిస్థలం బాది స
ర్వాశామండలమండనాయిత యశశ్శ్రీప్రాగ్భవంబుం గాంచి యా
కాశంబంటి వెలింగె హైందవుల ప్రజ్ఞాజ్యోత్స్న. యద్దానికిన్
నాశోత్పాతము లెన్ని యోగలిగె నన్నన్ నేటికాలంబునన్॥

మ॥ స్వకులాచారమతంబులన్ విడిచిపుచ్చన్ జేయ నాంగ్లేయవి
ద్యకు దాసత్వమునంగి వారలిసుమంతైనన్ సదయంబాదరిం
తకు నవ్వారికి నడ్డమై నిలచి యీధర్మమ్ము రక్షించు నా
రకలంకాత్ములె రామ నాటికి సర్వంజేయు కాంతాళియే॥

మ॥ తమిలో నెంతయు నాంగ్లనాగరకతా దాస్యంబుగైకొన్న వా
రు మహాత్ముల్ గృహమందుఁ బూర్వమునకున్ ద్రోహంబు మాలన్న గో
పము చేఁ గుందెడు కాంతలంగలకదా పాలించుచున్నారు నే
మములన్ గొన్నిటినైనఁ గష్టమువహింపన్ బోక చిత్తంబునన్॥

మ॥ రమణీరత్నమె కాదె జాతికిని మూలంబామె శుద్ధాత్మయై
యమరన్ జాతియు శుద్ధమై తనరు నన్యాయంబుగాకున్నె యీ
రమణీలోకముఁ గూడఁ బాడుగుట కోరా యత్నముల్ సేయు నీ
చమతుల్ గొందఱు కల్గిరన్న యెడలన్ సైరింప మానమ్మునన్॥

మ॥ అకటా వారలుగూడ నెంతయును విద్యాయుక్తులై యుండి జా
తికి క్షేమంబునుగోరు వారలయినన్ దేశంబు నాశంబు త
ప్పక కాంచుంగద వారియత్నముల దౌర్భాగ్యంబు గాదే. వినా
యకునిం జేయఁగఁ గోతియయ్యెననుసామ్యం బిద్ది చర్చింపఁగన్॥

శా॥ స్వాతంత్ర్యంబది లేకయున్నదఁట! నిచ్చల్ దానిచే నొంతయుం
జాతుర్యంబు నొసంగువిద్యలను బ్రజ్ఞన్ గాంచరాదంట యు
ష్ప్రాతిత్యంబున సాగుచున్నదఁట యుద్వాహంబు బాల్యంబునన్
జేశో వీథిఁ గలంచుచుండెనఁట యిస్సీ యద్ది మా వారికిన్॥

మ॥ బలహీనంబగు సంతతింగనుచు దార్ఢ్యంబు దేశమ్మునన్
బలయం జేసెను నీవివాహము లిఁకం బ్రౌఢావివాహమ్ములన్
సలుపంగావలె నల్పకున్నయెడ శిక్షాపాత్రులన్ జేయఁగా
వలెనంచున్ స్మృతి నల్పువారలఁట సంభావింపఁగా శక్యమే॥

మ॥ చనునే? భారతకామినీమణులకున్ స్వాతంత్ర్యభావమ్ము లే
దని మూర్ఖ్యంబునఁబల్కఁ? వారలకు నన్యాయంబు గావించిరే
ఘనులౌ పూర్వులు? మీ రెఱుంగనివొకో గార్హస్థ్యధర్మంబుల
దున నవ్వారికొసంగినట్టి తగు నుద్యోగంబు లేపాటివో॥

మ॥ జలజాతేక్షణ దేకదా! గృహమునన్ సర్వాధికారంబు? వా
రల కేలోపముగల్గె స్వేచ్ఛకిఁక వీరల్గోరు స్వాతంత్ర్య మెం
దుల వర్తించునొ? గేహలక్ష్ములయి యొందున్ గౌరవంబందుచు
నలఁతం బొందఁగనేల వీరలిటు లత్యంతంబు చిత్తమ్ములన్॥

మ॥ చదువంగావలెనంచుఁ బల్కెదరు హెచ్చౌ పేర్మి నాంగ్లేయను
సుదతీలోకము నేర్చుచో ఫలము కాసున్ వీసమున్ గల్గునే
చదువం జెల్లును మోక్షమార్గముల విజ్ఞానంబు నార్జింప న
భ్యుదయప్రాప్తికి విద్యలో నకట! బాల్యోద్వాహ మాటంకమే

మ॥ తలఁపన్ శైశవమందుఁ బెండిలులు సేఁతం బుట్టుచున్నారె దు
ర్బలసంతానము? దేనికైనను బ్రభుత్వం బన్యమైయుంటయే
బలమౌ కారణ మేమి చేసిరనఁగా భావ్యంబె? యీసోదె మీ
కెలమిం దెల్పఁగనేల యిచ్చట ఫలం బిట్లయ్యెఁగాదే తుదిన్॥

మ॥ తరలింపంబడె సర్వసంపదలు స్వాతంత్ర్యంబు లేదయ్యెఁ బె
దరికంబబ్బెను జాతికంతకు యథార్థం బిద్ది కాదొక్కొ? యె
వ్వరికిం బూర్తిగఁ దిండిలేనితఱి దౌర్భాగ్యంపుసంతానము
ర్వరయందున్ బలవత్తరంబగునె? సంభావింపుఁ డీరెల్లరున్ ॥

సీ॥ మోముగడుగుట తడవుగాఁ బోయిఁ త్రాఁగు
నట్టికాఫియు నవలఁ దేయాకునీళ్ళు
ఫ్యాక్టరీ బియ్యముంగాక బలములేమి
కేమివలయు? బాల్యోద్వాహ మేమిచేసె॥

మ॥ ఎలప్రాయంబునఁ బెండ్లిసేయునెడ నొక్కింతైనఁ బ్రేమమ్ము వా
రలకుం దప్పకకల్గు నొండొరులపై రంజిల్లెదుంగూర్మి ని
శ్చలమై కాలవశంబునం దుదకు నాశ్చర్యంబుగానట్టి ని
ర్మలమౌ ధర్మము మార్చనేమిటికి దుర్మార్గంబు కాకుండినన్?

మ॥ వయసుంగాంచినకాంత తానయి వరింపంగోరు. నక్లాటచే
నియమం బింతయులేక భిన్నకులునేనిన్ నచ్చుచోఁ బొందు సం
శయమే? పొల్పుఱుఁ బూర్వపద్ధతులు వర్ణైక్యంబు సిద్ధింపఁబోఁ
దయరెయో! సంకరవర్ణము ల్పెరుఁగు నత్యంతమ్ము లోకమ్మునన్

శా॥ ఐనం బొంగెదరేమొ ప్రేమభరితంబైనట్టి యుద్వాహముల్
గాన న్వచ్చెదునంచుఁ బశ్చిమమువంకంజూచుచో నూత వి
జ్ఞానంబబ్బఁగవచ్చు వారలకు నెంచం బెక్కు డైవోర్సు ల
న్యూనప్రేమవివాహసత్ఫలములే యోజింపుఁడయ్యా బుధుల్

మ॥ బలవంతంబగు శాసనంబు తగునే ప్రౌఢావివాహంబులన్
గలదోషమ్ములు పెక్కులున్నయవి లెక్కింబెట్టఁగా నేల కే
వల మేసంఘముయొక్కసేమము మదిన్ వాంఛించిరో వారికిన్
గలతాత్పర్య మెఱుంగఁగావలదె యొక్కండైన నిప్పట్టునన్

శా॥ దారిద్ర్యంబునమున్ను దేశమున సంతాపమ్ము హెచ్చెనఁ బెం
పారుఁ గష్టము లొక్కనింగనిన దాంపత్యంపు ధర్మమ్ములన్
గారక్ రాదని కూడఁ బుణ్యమతులాలోకింపఁ డేదో శిశూస్మృతిన్
ధీరత్వమ్మున నల్ప న్యాయ్యా మని సందేశింతు నవ్వారికిన్॥

మ॥ కలకష్టంబుల మాన్ప నొక్కసికి శక్యంబౌనె యింకేల యీ
ఖలవేషంబులు? మద్యపానము మొదల్గాఁగల్గు నభ్యాసముల్
వలదంచున్ స్మృతి నల్పరాదె? బయలౌ బండార మప్రిజ్ఞకే
సులభంబంచుఁగడంగి రీకృతికి నిచ్చో ధైర్యముం దాల్చుచున్॥

సీ॥ మద్యపాన మహాగ్రిమనుజాశనపిశాచిఁ
బారఁద్రోలుఁడు తూరుపారఁగొట్టి
నల్లమందు బిగింప నుల్లసిల్లెడు ఁదరి
వెగురఁగొట్టుండు దుమ్మెత్తిపోసి
స్వాతంత్ర్య మరికట్టిచంపు విద్యాఃభావ
ములను మార్పుఁడు మూలముం బెకల్చి
మోదమ్ముతో గ్రామముల్ పునరుద్ధార
ణమ్మొనర్పుఁడు కంకణమ్ముదాల్చి

గీ॥ అన్నమో రామచంద్రా? యం చవయుచున్న
వారికెల్లను వృత్తు లేర్పఱచికొనుఁడు
మఱలిరం డటుమీఁదట మతమునందు
వ్రేలుఁబెట్టంగ నోపుణ్యశీలులార!॥

మ॥ మతసంస్కారముపట్ల జోక్యము వహింపంబోము మేమన్న త
త్ప్రితినం బూర్తియొనర్పఁజూచెడిఁ బ్రభుత్వం బల్లుకాదేని మే
ము తిరస్కారముసేయనా నసుభయమ్మున్ వీడి యెల్లైనదు
ర్గతికిన్ దావగుదీని మాన్పుమనుచుం బ్రార్థింతు సర్వేశ్వరా!

# ఇప్పటి హరికథలఁగూర్చిన యుపన్యాసము



(వాతాపి)

"కలిదూపమును ధిక్కరించు తనదేహ కాంతుల నొకింత మరుఁగుపఱ నెఱ్ఱపట్టుచొక్కాయి నొకదానిని దొడుగుకొని సభామధ్యమున నున్న యుచితాసనమున నిలచిన కథకుఁడు "వాతాపి గణపతిమ్ భజేహం. వాతాపి గణపతిమ్ భజే" యని పాడుచు మెడనుండు పూలహారమల్లలలాడ శిరముపై ముందుండు జుట్టుపిలక చిందులుత్రొక్కహస్తమునఁగల కంచుతాళము టక్కుటక్కుమనఁ బాదములనుండెడు గజ్జియలు ఘల్లుఘల్లురన కొంచెమోరగా వంగుచు నెగురుచుఁ జిందులుత్రొక్కుచు నేత్రహస్త పాదాభినయము లవలీలఁ జేయుచుండెను. ఉసిళ్ళ తెరలవలె శ్రోతలరుదెంచుచుండిరి. స్త్రీలకొఱకుఁ బ్రత్యేకస్థల మమర్పబడక పోవుటచే స్త్రీపురుష భేదము లేర్పడకుండ నేల యీనినటులెచ్చటఁ జూచినను జనులచేఁ గిక్కిఱిసి యుండెను. తమపయ్యెదలపై యువకుల దృష్టులతి దీక్షణముగాఁ బ్రసరించుచుండెనని వాలుఁగన్నులతోఁ గనుంగొనిన యువతులు తమ తమపైటలను సవరించుకొనుచుండిరి. సమయమునకే వచ్చితినిగదాయని సంతోషించి చూడవలసిన ముచ్చటలన్నియుఁ జూచుతావు లభించెనుగదా యని వెఱ్ఱిమొఱ్ఱి యాలోచనలతో నాద్యంతములు లేని యభిప్రాయములతోఁ గొనసాగని కోర్కెలతోఁ దులఁదూగుచుంటిని, నేనచ్చటికి వచ్చినతరువాతఁ గూడననేకులు వచ్చుటచే సభాసదుల కొకింతయొత్తిడి జిలిబిలినలుగుఁడు బుడిబుడితొట్రుపాటుఁ గలిగెనని వేఱుగా జెప్ప నవసరము లేకయే మీరు గ్రహింపఁగలరని తలంచుచున్నాడను. పాపమొకశ్లేమ లేవఁబోయి లేచుటకేద్దో

యాటంకముండుటచేఁ గాబోలుఁ బక్కునవ్వెను. ఎందుచేతనవ్వెనని బహువిధాభిప్రాయముల నొందెదరేమో! యామెపైటచెఱఁగు పైనొకయువకుఁడు కూర్చుండుటచే నామె లేవలేకపోయెను. ఒకానొక యువకుఁడు లేచి మెచ్చుటకో పోఁబోవుచుఁ దూలిపడిక్రిందనున్న యొక పైఁదలిభుజముపైఁ జేయి వైచి తనస్థూలకాయము మిత్రునిపైఁ బడకుండ నాఁపుకొనెను. గణపతిప్రార్థనాయత్తచిత్తయగుటచేఁ గాబోలు నామె వానిపైదయను బరిగణింపదాయెను. ఇగిలింపులు సకిలింపులతో నిండి యుండిన యామహాసభయందు బ్రక్కపోటులు సవరింతలుఁ గొంగుములుఁ ద్రోపులు లెక్కింపఁదగినవా? పాటింపఁదగినవా? —

నాయనలారా! సభామధ్యమునఁ గథకుఁడుపదిందములు ద్రొక్కుచు గణపతి ప్రార్థన ముగించెను. కొంచె మించుమించుగా ఫిడేలూరకుండెను గాని మద్దెలమాత్రము మ్రోఁగి మ్రోఁగి మూఁడు ముక్తాయింపులతోఁ గాని ముగింపదాయెను. తదనంతరమా కథకుఁడు "నేను జెప్పంబూనిన నలచరిత్రకుఁ గథాక్రమంబెట్టిదనిన" నని సభాసదులకొకింత తన సంగీతమును జవిచూపి మరల నీక్రింద వ్రాయఁబడిన సీసమాలికను బాడఁజొచ్చెను.

సీ॥ ధర్మమార్గంబు వదలి నీచ కార్యంబులాచరించెడి విప్రులచటలేరు! గౌరవంబిడక యగౌరవ ప్రాప్తులౌ నవనీధనాధములచటలేరు! చేర సారములదావేళ నబద్ధంబులాడెడు కోమటులచట లేరు! మద్యపానమునఁ బ్రమత్తులై దుశ్చేష్టలాచరించెడి శూద్రులచట లేరు! సత్కథారస మానఁజాలక పరులమాటాడించు మానవులచటలేరు! నీరుకావులఁగట్టి నీరజాక్షులఁబట్ట నాసించు దొంగ్రిందులచటలేరు! వేశ్యలగతినీతివిడిచి లంచంబుల నాసించునుద్యోగులచట లేరు! మంచిమాటలచేత మాయమందులపోసి యార్జించు వైద్యులు

బడసిన తల్లులై కచ్చలు బిగియించి వచ్చువారు। ముఖకాంతి వోరగిన ముసలమ్మలై జడల్గట్టి పాములగతిఁ జుట్టువారు। బిందెకేలునఁబూని సందెవేళల విటుల్మొక్కవఁగను రీతిఁదక్కువారు। నగలు పెట్టనిభర్త తగఁబిల్వఁగేల్సిమ్మి ముసుఁగిడి భువిఁబడి మూల్గువారు। రాగిడీల్పిరమున రాణింపవని చిన్ననాగరంబులనుంచి నడుచువారు। పతి బహుకష్ట ముల్వాడి గడించినసొమ్ము తెచ్చి చాటునఁ దల్లికిచ్చువారు। అగ్ని సాక్షిగఁ బెండ్లియాడిన పెనిమిటిన్విడిచి పుట్టింటికి నడుచువారు। భర్తరాకున్నను బరపురుషులఁగూడి తీర్థయాత్రలకంచుఁదిరుగువారు। అడ్డబాసలుగాజులందెలుఁబవడముల్ పూసలుమోటుగాఁబోల్చువారు।

గీ॥ తిండి మగనికి ముందుగాఁదినెడివారు।
అత్తమామల నెత్తిపై మొత్తువారు।
ముంగురులఁగత్తిరించుక మురియువారు।
గానరారెందు నిషధానగరమునందు॥

ఈ సీసమాలికల రెండింటిని బ్రతిపాదమును దనకీచుగొంతు కతోఁగొంచెము వెలితిగాఁ గాసంతయపస్వరమున రాగమును నతు త్రిమండలమునకు విసరుచు నచ్చటనే గుడుగుడుగుంచము లాడిం చుచు సంగతులపై సంగతులతో హుటాహుటి నెక్కుచుఁ దిక మకగా దిగుచుఁ దనసంగీతవిద్యాజ్ఞానమును సభాసదులకుఁ దెల్లం బగునటులఁ జాడుచుఁ బాడిన ప్రతిపాదమునకుఁ బ్రతిపదార్థవిశేషార్థ తాత్పర్యములతోఁ జెప్పుచుండెడి యాకథకుని జూచి సభలో రొసరొసలు ప్రారంభమైనవి. నలుగురైదుగురు యువకులు లేచి నిలువబడిరి. వెంటనే గుబగుబలాడుచుఁ గొందఱు లేచిరి. కూర్చుండుఁడని కేకలు వినఁబడుచున్నను శ్రోత లుద్రేకమున లేచు చుండిరి. చాలసందడిగా నుండెను. నిలువఁబడిన జనులందఱు

గథకునివైపుఁ జూచుచుండిరి. కథకునియొద్ద నిలువఁబడిన యువకు లలో నొకఁడు "అయ్యా! మీరు వ్రాయుచున్నది హరికథయా?" అనెను. అంతఁగథకుఁ డిట్లనెను. "నలచరిత్ర హరి కథయా? హరికథలన దైవమును గూర్చిన కథలు కావా? హరి యను శబ్దము సర్పమునకుఁ జెందును గాన నలుఁడు కర్కోటకుని వలన మాఱురూపముఁ జెంది మరల నిజరూపమును జెందుటచే నలచరిత్ర హరికథయనఁ జెల్లుననియందురా? నాగులను బూజించు వారు మాత్రము లేరా? యని మీయభిప్రాయమా? కారా! సింహము గుఱ్ఱము కోఁతి పాము కప్ప చిలుక మొదలగువాని కథలు కూడ హరికథలగు కాలము దాపరించెనా? హరికథలు సీతకొఱకేర్ప డినవికాని కప్పకూఁతలు హరికథ కాదని నా భావమని యందురా? అనేక విధములఁ బలికెడి యీకప్ప పలుకులకు మీ కర్థము దెలి యునా? మీపలుకులకన్నఁ గప్పకూఁతలే బాగుగనుండునని నాయభి ప్రాయము" అని తాను దెలివిగాఁ బలికితినని కాబోలుఁ బండ్లన్నియుఁ గనబడఁ బకపకనవ్వెను. "జూదకాండ్రిచట లేరని యంటిరికదా? నలుఁడు జూదరి కాఁడా? జూదమాడి సర్వస్వమును నోడిపోలేదా? ఓయీ! కథకుఁడా! తలలు బోడులుగాఁ జేసికొని తగుదుమని సభా మధ్యమునఁ దయితక్కలాడు నీయట్టినీచులు నిషధానగరమున మచ్చున కైనను గానరారని యేడువలేక పోయితివా? యన యింక నేమేమో యనఁబోవుచుండు సమయమున విఘ్నేశ్వరుని బొజ్జవలె బొజ్జగలిగి మసిబొగ్గునుబోలు శరీరచ్ఛాయ యొకవింత సోయగ మీనుచుండు మూఁడుగజముల పొడుగుగల యొక మనుజుఁడు తనకన్నఁ గొంచెము పొడుగుగానున్న సన్ననిచేతికఱ్ఱ నొకదానిని బట్టుకొని యచ్చటికివచ్చి "గొంతు బొంగురుపోవ శాంతింపుఁడు శాంతింపుఁడని నేనెంత యఱచినను యూరకుండరైతిరి. నాయిష్టమైన కథనేదియో చెప్పిం

చుచున్నాఁడను. ఆయనకుఁ దోఁచిన దేదియో యాయన చెప్పు చున్నాఁడు. వినదలఁచిన యెడల వినుఁడు. లేనియెడల వెడలిపోవుఁడు. అంతియేకాని వాగ్వివాదములను బెంచుకొనిన యెడల నిసుమంత యైనఁ బ్రయోజనము లేకపోవుటయేకాక పైపెచ్చు నాకఱ్ఱపోటులు కావలసివచ్చు" నని పెద్దగొంతుతోఁ బలికెను. పురుషుల యొత్తిడి కాగఁజాలకయో! కథకుఁడు స్త్రీ చర్యలను నిందించెననియో! వాగ్వివాదములుపోయి కఱ్ఱసాముల క్రిందకు దిగిన యెడలఁ దాము కూడ భాగస్వాములు కావలసివచ్చుననియో! మఱెందుచేతనో కాని సభాస్థలినుండు స్త్రీ లందఱు నొకరినెంట నొక రరుగుచుండిరి. వాగ్వివాదము లడఁగి యెడలు పెట్లునని భయపడియో! నిమధాపుర జనులనుబోల్చి తమ్మే వెక్కిరించెనను సీసుననో! ముద్దుమొగ ములుగల యాముద్దుగుమ్మ లరుగుచుండఁగా మా సభయందుండుట కిష్టములేకనో యేమో యువకులు సణుగుకొనుచు గొణుగుకొనుచు సంప్రతించుకొనుచు సంపుటించుచు స్త్రీల ననుగమించి ప్రక్కనున్న యొక హరికథాశాలయందుఁ జేరిరి. కాఱునలుపుగల యాకార్య నిర్వాహకుని పలుకులయం దసూయజనించి యచ్చటనుండు యువ తులును యువకులును జనుచుండ నా కచ్చటనుండుటకు మనస్క రింపక వారరిగెడి హరికథాశాలదగ్గఱకుఁ జేరితిని. ఆశాలకుఁ దూర్పు భాగమున విఘ్నేశ్వరప్రతిమ నొకదాని నలంకరించి యా విఘ్నేశ్వ రునకు దగ్గఱగా మూఁడుబల్లలుంచఁబడెనుగాని బల్లలపై మనుష్యు లను మాత్ర ముంచరైరి. శాలయంతయు జనులచేఁ గ్రిక్కిఱిసియుం డెను. శ్రోతల కాశాలయందు స్థలముచాలకపోవుటచేఁ బ్రక్కనున్న మార్గమునఁగూడఁ జాపలనుబఱచుచుండిరి. చాపలనుబఱచు టాలస్య ముగ జనులు చతికిలఁబడుచున్నారు. విఘ్నేశ్వరుని కెదుఱుగానమర్పఁ బడిన బల్లప్రక్కనున్న బల్లపై నొక మానిసి కూర్చుండి తన చేతనున్న

ఫిడేలును 'కుయ్ కుయ్' యనిపించుచుండెను. రెండవ ప్రక్కబల్లపై మృదంగముంచి యొకఁడు 'టంగ్ టంగ్' మనునటుల నా మృదంగమును దనచేతితో వాయించుచుండెను. గలగలలాడు కరకంకణములతో మిలమిలలాడు కంఠహారములతోఁ గలకలలాడు ముద్దుమొగముతోఁ దళతళలాడు మొగము మెఱుఁగుపొడి రాయఁబడిన చెక్కుటద్దములతోఁ గిరుగాఁదీసిన వలపలి పాపటతోఁ బాదములవఱకు వ్రేలాడు బనారసుచీర కుచ్చెళ్లతోఁ జామనచాయగల యొకలేమ తనకంఠహారములు సవరించుకొను నెపమునఁ బైఁటసవరించుకొనుచు హంసగమనమున మధ్యనున్న బల్లపై నధిష్ఠించెను. ఆమె వచ్చినవెంటనే ఫిడేలు స్వరముల నుద్ఘోషించుచుండెను. మృదంగము మిక్కిలిగా మొఱఁగుచుండెను.

బల్లపైఁగూర్చుండిన యామె నిలచి,

ఉ॥ క్రూరులు లెక్కకెక్కుడయి కుంభిని జెట్టలు సేయుచుండఁ ద
ద్భారముఁదీర్పనెంచి యదువంశమునం దుదయింపుడంచు బృం
దారక సంఘమున్గని ముదంబున నాజ్ఞయొసంగి తాను బో
ల్పారఁగ దేవకీతనయుఁడై జనియించిన కృష్ణుఁగొల్చెదన్॥

అని భగవంతుని బ్రార్థించుచుండఁ (గణపతి కభిముఖముగాఁ దిరుగుమని సభలోఁ బలుకులు) దైవప్రార్థనాయత్త చిత్తయగుటచేఁ గాఁబోలు! సభాసదుల పలుకులఁ బాటింపదాయెను. తరువాత నాలేమ యొకపద్యమును బాడెనుగాని యాపద్యము నాకు జ్ఞప్తి యందుండక భావముమాత్రము నాహృదయవీథిని బరుగిడఁజొచ్చెను. "ఆడుదానను. అనాథను. విద్యాగంధమెఱుంగని దానను. సకల విద్యానిధులగు మీరు నాతప్పులను నొప్పులుగా భావింపఁగలందులకిదే మీకు నమస్కరించుచున్నదానను." వింటిరా యామెయభిప్రా

యము. ఇప్పటికైనను యీమె హరికథను చెప్పునని తలంచితిరా ?
(తలంచితిమని సభలో కేకలు) అనంతర మాభామ——

' ఆపురంబు శ్రీదేవికిఁ గాఁపురంబురా ' అను కీర్తనఁ బాడు
చుండెను. సభలోనుండి 'ఆర్డర్', అనుపలుకులు వినవచ్చుచుండెను.
కీర్తనముగిసినవెంటనే మద్దెల మ్రోతయునాఁగెను; గాని ఫిడేలుమా
త్రము సరిగా సరిసరిగా మరిసరిగా యని పలికి మాత్రమాఁగెను.
ఆఫిడేలు యొక్క యభిప్రాయము కొంచెము హెచ్చుగాఁబోవుమని
కాఁబోలు ! బడిపిల్లవాఁడు పాఠముఁజదువునటుల రోకంటి పాటవలెఁ
బుస్తకమున నున్నటుల హెచ్చుతగ్గులులేక పదవిచ్ఛేదనమైన లేక
తగ్గుస్థాయిని పలుకఁజొచ్చెను. కార్యనిర్వాహకుఁడు కాఁబోలు ! ఒక
పూలహారముగొనివచ్చి యామెమెడలోవైచెను. "ఎవనిచేతనో పూల
హారము వేయించుకొనిన దేమిరా ? "యని యొకఁడు ప్రక్కనున్న
తనస్నేహితునడుగ " నీ కాయచ్చెరువెందులకు ! ఆ పెయాటవెలది"
యనియాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. స్పష్టముగా వినుపింపక పోవుట
చేతనో ! ఆకాశమున మేఘములావరించి యుఱుములు మెఱుపులుఁ
బ్రారంభించుటచే వర్షము వర్షించునని యో ! గడియకింపటఁజూచిన
కథకునివలె నీమె చిందులు ద్రొక్కుచుండుట లేదనియో ! నిద్రాసమ
యమగుటచేతనో ! స్త్రీలుఁ బురుషులుఁజాలమంది సభాస్థలినివదలి
తమ తమ తావులకుఁ జనుచుండిరి. అటులాసభాస్థలిని వదలి వెడలువా
రినిఁజూచి "శుద్ధమూర్ఖులకును వెఱ్ఱిగొల్లలకును బంబనాదములు రుచిం
చునుగాని, హరికథలు రుచింపవు " అనెడి భావమిచ్చునొకకీర్తన నా
కథకురాలు పాడెను. ఆహా ! ఈ గుణము హరికథలు వ్రాయువారికే
యుండఁగా నొకానొక యబల యాటవెలది పాడినదనినఁ బాటింపఁదగి
నదా ? కుట్రపువానికి గూనును గుఱ్ఱము నెక్కువానికి మూలశంకరో
గమును కాలఁ జెక్కువానికి క్షయరోగమును వణిజునకు గండవాత

మును నింకొకనికి నింకొకటియు మఱియొకనికి మఱియొకటియు వేఱొకనికి వేఱొకటియుఁ గలుగునటుల హరికథలఁ జెప్పువారు తామే మహావిద్వాంసులమనియుఁ దమకన్న నెక్కువవారు లేరనియుఁ దాముచెప్పెడి కథలు వినువారల్పజ్ఞులనియు శుద్ధమూర్ఖులనియుఁ దలచుట స్వభావసిద్ధమైన యాచారముగానున్నది. భక్తిరసమట్టె యంకురించి యట్టె విజృంభించి యట్టెఁతీగ ప్రాఁకి యట్టెపలువలువైచి యట్టెపుష్పించి యట్టెదానిపరిమళము భూమ్యాకాశములను వ్యాపించునటుల ద్రష్టల మానసంబు భక్తిరసంబున మునుఁగ నింద్రియములు మైదములఁదక్క హరికథలఁ జెప్పువారున్నచో నెవ్వఁడాసభాస్థలిని వదలివెళ్ళఁగలఁడు? తమ పలుకులను వినక వెడలెడివారందఱు మూర్ఖులని తలంచుట శుద్ధమూర్ఖులలక్షణము. నిద్రఁ బోనున్నవాఁడు కుక్క మొఱుఁగుటనువిని యెంతయసహ్యపడునో కుక్కకేమి తెలియును?

మెఱుఁగుఁ బెట్టిన బంగారునగలవలె నాపందిరియం దిప్పుడు యువకులును యువతులును మాత్రము మిగిలియుండిరి. యువకులు తమ మీసములను మెలివైచుకొనుచు నొకకంటఁ గథకురాలిని నొకకంట యువతుల ముద్దుమొగంబులను జూచుచున్నారు. బట్టతడుపు వానజల్లు మాత్రము కురిసెను. పాప మాకథకురాలి మొగముపైఁ బందిఱినుండి రెండుచినుకులుపడి దాపలిబుగ్గపైనుండు "ఫేసుపౌడరును" గొంచెము చెఱిపెను. పూర్వపరిచితులో స్థానపరిచితులో కాని యువకు లిద్దఱాగథకురాలి వెనుకవైపునకువచ్చి పలుకరింపఁ జిరునవ్వుగల మొగముతోఁ గ్రేఁగంటిచూపులనెడి పూలహారములను వారిమెడలయందుంచి కూర్చుండుఁడని కనుసన్నఁ జేసి తాఁ జెప్పుచున్న ద్రౌపదీ మానరక్షణమను కథాప్రసంగములోనికి దిగెను. ఆమెతో మాటలాడవలెననియో! ఆమె తమ మనంబు లాకర్షిం

చుటచేతనో, కాని పైదముల దక్కిన వారివలె యాపెయుండినబల్లపై విఘ్నేశ్వరుని కెదురుగా వారిరువురును గూర్చుండిరి. తనకొంప మున్గినటుల సమయమునకే వర్షమువచ్చెను. ద్రౌపదీమానరక్షణమును జెప్పుచున్న యామె తన వస్త్రరక్షణముఁ జేసికొనవలసినంత వర్షమువర్షించెను. గాలివానవచ్చుటచే కథమానెనను సామెత యాదినమునఁ బ్రత్యక్షముగాఁ జూచితిని.



కాని బ్రహ్మనాయుని ధర్మమార్గాచరణ మన కండలికి నాటుక దాయిరై మనతోడనేయుండక మనపల్నాటి కంతకుం బ్రాణోపద్రవకరమై వేధించుచుంట నీవెఱుంగనిదికాదు. దాని దాఁటలేక లోలోన మిడుకవలసివచ్చినది. అది నీవెఱింగియుండియు

చ॥ కినుక మెయిన్ క్షణక్షణము గెల్తును గూల్తును శత్రుకోటి నే
నని ప్రతిన ల్పొనర్చుచు మహోర్భటవృత్తిఁ బ్రయాణమైనచో
ననిశము బ్రహ్మనాయుఁడకటా! మదిఁబొందెడివంత నెంతయే
నినుమడి సేయురీతియగు. నింతయెఱుంగవె. బేలవైదువే.

సూర్న:- బావా! సత్యము సత్యము. అదియే యింతవఱకు నన్నగారికి విన్నవించుకొనుచుంటిని. వారు వీరాగ్రహావేశులై నామాటఁ బాటింపక పెద్దన్నగారి వంతకుఁ గారణభూతులగుచుండిరి.

పేర్న:-ఏమిబావా! మాయన్నగారు ఖేదముగూడ నెఱుంగుదురా? ఏమి చిత్రము!

సీ॥ బాలమర్త్యేవుల బాధింప శోధించి
నిలువున మెడఁబట్టి నెట్టినపుడు
కోడిపందెముఁబెట్టి యోడించి మాయచే
నన్యదేశంబుల కనిచినపుడు
ఘోరాటవులలోనఁ గ్రుమ్మఱఁగాఁజేసి
మొనలేనికష్టంబు లిడినయపుడు
మంజాదివలసలో మున్ముల బఱిమార్చు
పనికిఁ గిరాతులం బంపినపుడు
వంతయేయున్న వారల వైరబుద్ధిఁ
దలఁచి మన కాజ్ఞయొసఁగఁడే తాల్మివిడిచి
కఱకుకరవాలముల వారి నఱికివైచి
మనములం గల క్రోధంబు మాపివేయ.

మఱియు నాగసాని యానాఁ డల్లురాజుకడఁ గొండెములఁ జెప్పి తత్ప్రభువు మనస్సును మరలించి తన్మూలమున నతని కకాలమృత్యువు దెచ్చిపెట్టినపుడును నలసింగునకు ఘోరాటవులలో విందొనర్చి మాయలనుంచి వానిని వశవర్తిం జేసికొని పిదప మంత్రిపద మాక్రమించుకొని మనకును మనవారికి నింతటి విపత్తులఁ దెచ్చిపెట్టినపుడును దనకు విషాన్నమే పెట్టి చంపఁ బ్రయత్నించినపుడును గోడిపందెము వేళ మనకోడికిఁ గట్టుగట్టించి కపటంబునఁ జగిపించినపుడును శాంతించి యూరకుండఁబట్టికాదే కోటఁజిమ్మఁదగువనికి గొడ్డలినుపయోగింపవలసివచ్చుటయు నొక్కొకవేళ నాగొడ్డలిగూడ మొక్కవోవునే మోయని భయముగలుగుటయుఁ దటస్థించినది. వారి పైదము లను పంకిలములో నాపాదమస్తకము మునిఁగి ప్రాణములే పోవునేమో యను సంశయముకలిగినప్పుడుగూడ దయాదాక్షిణ్యము లెన్నుచు మనల సర్వవిధముల బంధించిన యీయనఘుని వెఱ్ఱితనమునకు వెక్కసపడవలయునా? కాలగతికి దుఃఖింపవలయునా?

బ్రహ్మ:-చిన్నబావా! ఎన్నడును జిన్నమెత్తు మీయన్నగారి కెదురాడియెఱుంగని నీవు హద్దుమీఱి ప్రవర్తించుచుంటివికదా! పెద్దలఁ దృణీకరించి క్రుద్ధతమై రద్దిపాలగుట బుద్ధిమంతుల లక్షణమా?

చం॥ మనవలెఁ బౌరుషంబు నభిమానము నాతఁడు లేనివాఁడె? చే
తను ధరియింపఁడే మఱియు దారుణభీకరఖడ్గరాజముం
గనుగొననేరఁడే రిపుల కార్యసమర్థత? నట్టిధీరుఁ డే
మని వెనుకాడుచుండెనో కటా! తలపోయ వదేమిపాపమో॥

ఆయనగారి మనం బతిగాఢమై నిరుపమానలౌకికజ్ఞానపరిపూర్ణమై రాజనీతిభరితమై నిర్మలవైరాగ్య విస్తరమై భూతదయాపరతంత్రమైనదిసుమీ. అటయుఁ వీరుఁడు కాదందమా. కాదు. అన

పిలుతేమి. ధర్మపద్ధతి జగము లెత్తివచ్చినను వెనుకంజవేయని ధైర్య శాలి-సంగరంబున గంగాధరుసైతము భంగపఱుపఁజాలు సమర్థుఁడు- సమయమువచ్చిన వీరభద్రుని తేజంబుగూడ భద్రపఱచునంతటి రౌద్రమూర్తి. అట్టివాఁ డేకారణంబున నింతవఱకు శాంతివహించి యుండెనో యూహింపఁజాలక యడుగడుగునకు నురుకులువెట్టుట వెకలితనముగా నుండదే. అన్నగారియాజ్ఞ కడుగుదాటనివారని మీ రిదివఱకు గడించినకీర్తిని నేఁటితో నశింపఁజేయనుంటివా ? చాలుఁ జాలు. ఇంతటనైనను శాంతించి నాయుని కార్యకరణ మేవిధిగానుం డునో కనుఁగొని యతని యిష్టానుసారము ప్రవర్తించుట సమంజసము.

పేర్ని:- బావా వారియుద్దేశ మిదివరకే తేటపడియుండ నింకను గను గొనునది యేమియున్నది ?

ఉ॥ ఏటికిబావ ! యుద్ధమున కియ్యకొనం డెటు బ్రహ్మనాయుఁడీ
పాటిగ శాంతిమూని వనవాసముసేయుచు నెల్లకాలముం
గూటికి గుడ్డకుం దొలఁగి కుందుఁడటంచు విధించుఁగాని తాఁ
బోటుదనంబుఁజూపఁ దలపోయఁడు. వ్యర్థపువాంఛ లేటికిం ?

కొమ్మ:- ఓయీ ! ఎల్లకాల మొక్కటేరీతి నుండునా ?

సూర్ని:- అన్నా ! ఈసంపన్నగృహస్థునిమాట మీ కుఁదగినదికాదు సుమీ ?

పేర్ని॥ తమ్ముఁడూ! మీరందఱు నొకబడిలోనివారకారే ? నన్ను విశ్వ సించువారెవరు? అయినను నేను గాదననేల. కొమ్మరాజా ! నీనియోగ మేమిరో త్వరగా నిర్వర్తింపుము. అమ్మా! భరత మాతా ! నీవిట్టిశాంతస్వరూపులఁగనుటచేతనే నీకుఁ గష్టంబుల మీఁదఁ గష్టంబులు కలుగుచున్నవి. పల్నాటిరాజ్యలక్ష్మి ! నీ కుమారుల పౌరుషానలం బిట్లు చల్లార్ప నీవే యత్నించి నచో నీకు సౌఖ్యము లలవడుననుమాట యుండునా ? వీర

కుమారులారా! మీపరాక్రమంబులం గనఁబఱచు సమయ మిఁక రాదు పొండు.

చ॥ విరివిగ శత్రురక్తమును వేడ్కను గ్రోల లభింపదాయె. నీ
పిరికిన రాధమాధముని పెంపునఁజేరుటచేత నంచు నీ
వరయఁగఁబోక నాపయి దయామతి నించుక దాఁగియుండుమీ
తరుణము వచ్చినంతనె యథావిధిఁ గోర్కెను దీర్తు ఖడ్గమా!
(కత్తి నొరలో నుంచి విసుగు చెందును.)

కొమ్మ:- నాయుఁడుగా రించుక నీతో మాటలాడనుండి నీ కొఱకై నన్నుఁబనుప వచ్చితి. ఇంతకే కాలహరణమైనది. మలిదేవ భూపతిసహితుఁడై నాయుఁడు మనకొఱకై వేచియుండును. రమ్ము పోదము.

పేర్ని:- బావా! నన్ను బాధింపకుము. నే వారిమొగముఁ జూడఁజాల. నీవేగి వారిసంకల్పమేదియో యెఱింగివచ్చి ... ...

కొమ్మ:- అయ్యో! మరలఁ బెడదారికిఁ బోవుచుంటివా? నీవు రాక తప్పదు. నిన్నుఁ బ్రత్యేకముగా రమ్మనికోరుటలో వేఱొక రహస్యము గూడఁ గలదు.

పేర్ని:- బావా! రాకతప్పదందువా? కానిమ్ము. నిండ మునింగినఁ జలి యుండదుకదా! నీ యిష్టమే కానిమ్ము పోదముపద.

(అందఱు నిష్క్రమింతురు)

## ద్వి తీ య రం గ ము.

ప్రదేశము - మండాదిలో మలిదేవునికొలువు.

[మలిదేవుఁడు బ్రహ్మనాయుఁడు పేర్నిఁడు కొమ్మరాజు ప్రవేశింతురు.]

పేర్ని:- (తనలో) వీరి యభిప్రాయము కనుగొనువఱకు నేనేమియు మాటలాడరాదు.

మలి:- ఆర్యా! ఏమనిమెదవు? సంధియా? రాయబారిని బంపెదనం దురా? ఇదెక్కడియోజన? అక్కటా! దుర్భరము.

ఉ॥ నిర్భయమా ప్రవృత్తి నవినీతుల ఘోరరణాంగణంబునం
దార్భటిఁ జంపి వేగ జయమందఁ దలంపక దీనవృత్తిపై
గర్భవనీపక ప్రజలకైవడి వేడుకొనంగఁ జెల్లునే?
దుర్భర మింతకుం గలదె? దోర్బలు లీపని మెత్తురే మదిన్.

పేర్ని:- (తనలో) పిల్లవాఁడైన సితఁడు చక్కనిమార్గ మరసినాఁడు.

బ్రహ్మ:-వీరవరులారా! మీ యందఱిమనంబులు నతిక్రోధరసపరిపూర్ణంబులగుట నామాటలు మీకు విరుద్ధంబుగాఁ దోఁచుననుటకు సందేహంబులేదు. కాని కష్టమైనను సుఖమైనను భరించి వినుదురను నమ్మకమున నుంటి. వైరు లెంతయుక్కుమిగిలి నిక్కపడుచుండినను సామంబున వారి నడవడిని జక్కఁజేయఁ జూచుట లోకసమ్మతము.

మలి॥ తండ్రీ? అది మంచివారిపట్ల నుపయోగ పరుపవలసిన మార్గము. దేశద్రోహులచెంత నీవిధానము సరిపడదు. ఇది వఱకు మీ రెన్నిప్రయత్నములఁ జేసియుంటిరి? ఫలముం డెనా? ఇప్పు డంతకుమించి యుండునా?

కొమ్మ:- బావా! అనరాదుకాని మీ యప్రస్తుతోద్యమము వీరజన సమాదరణీయము కాదు. ఆత్రిగాఁడని పేర్నిమాటల నింత వఱకుఁ దోసిపుచ్చుచుంటివి. ఆ పాపమతులు గావించుచున్న దేశద్రోహము సహింపఁదగినదియా? మఱవఁదగినదియా? ఆత్మ లాభంబునకై రాజును దనచేతి కీలుబొమ్మగతిఁ జేసియాటలాడించుచు నప్రతిహతానివార్యాధికారముఁ జూపఁదొడంగిన నీచాత్మురాలి నుపేక్షింపఁ దగునే? అయ్యో! ఇంత యోజింపఁజాల కుంటిరికదా! మీశాంతిగుణమే వారల యతిశయంబునకు

హేతువైనది. లేకున్న వారెంత. వారి యధికారమెంత. వారి బ్రతుకెంత. మీ రేమైన ననుఁడు కాని యీ దేశద్రోహుల పేరు దలంచినమాత్రంబున నెట్టివారికిఁగూడ నాడులు క్రోధాగ్నిదందహ్యమానము గాకమానదు. మేటిపల్నాటివైభవమును బూడిదెపా లొనరింప బద్ధకంకణులైయున్న ద్రోహులఁబట్టి సంహరించి వారి రుధిర మీపల్నాటిలో సెలయేఱులరీతిఁ బాఱునటులఁ జేసి దేశమాత సంక్షోభము మాన్పి చిత్తశాంతిఁజేసెదము. లేకున్న వీరులను భీరులఁగామార్చు టక్కరిముండను లొంగఁజేసితిరను దుష్కీర్తి మిమ్ముఁ జుట్టుకొనకమానదు.

బ్రహ్మ:- ధీరాగ్రణీ! చిన్నవారలకుం గలుగు విపరీతపుటూహాలే మీకును దోఁచినందుల కాశ్చర్యమయ్యెడిని. క్రోధము సర్వానర్థములకు మూలకారణమనియు మన ప్రస్తుతకార్యమునకు విఘ్నప్రదమ్మనియు భీకరజనమారణహేతువనియు దేశసంక్షోభమునకు మూలకందమనియు నెఱింగిన నీవుగూడఁ బెడదారులఁ ద్రొక్క మేలగునా ?

ఉ॥ పల్లెల నాఁడు నేఁడు పడుపాట్లు నెఱుంగకకాదు. దాన నా
యుల్లము పెల్లుదుఃఖమున నుయ్యెలలూఁగక యుండలేదు. భూ
వల్లభ! కాని దేశ మనివారితకష్టము బొందకుండఁగా
జల్లని మార్గ మారయుచు శాంతివహించుచు నున్నవాఁడఁజూ!

అందులకై మీ కింతగాఁ జెప్పవలసివచ్చినది. మనము త్వరపడి పోరితంబున కాయత్తపడిన మనకే జయము చేకూరునను నిశ్చయమెక్కడిది? మనక్రోధముకొలఁది ముందువెనుక లరయక ప్రవర్తించిన నెట్టియనర్థములొదవునో వేఱుగా నిరూపించి చెప్పవలయునా! మీరుమాత్రము యోజింపకుందురా? యోజింపలేనివారా? నామనోనిశ్చయమును మీ రింతవఱకు గ్రహించినట్లు కనఁబడదు.

పేర్ని-(అసహాయతతో) గ్రహింప కేమి? అంతయు గ్రహించియేయున్నాము.

మ॥ కలకాలం బొకతీరుగా నిటు మహాకష్టంబులం బొందుచుఁ
బలదర్పంబు లడంగ భీకరియశోముం బాధోధిపాల్చేసి తు
చ్ఛులకుఁ మొక్కుచు హేయపుం బ్రిదుకుచే శోకింపఁగం [జూచు మీ
తలఁ పెవ్వార లెఱుంగకుండి రనఘా! తర్కింప వేయేటికిఁ?

బ్రహ్మ:- తమ్ముఁడా! మీ కందఱికి నా దారి విరుద్ధముగాఁదోఁచునని కూడ నెఱుంగకపోలేదు. అందఱిలో నీవొక్కరుఁడవు ఖడ్గ వాదివగుట ముందు వెనుక లరయఁజాలవు. మన శౌర్యవిజృంభ ణంబున కిది యదనుగాదు. అందుచే

కం॥ నా దారి నీవు నిజముగ
మోదావహమంచుఁ జెప్పఁ బోవను గానీ

పేర్ని:- ఏదారి దలఁపనేటికి
గోదావరిఁ జూపుచుండఁ గోవిదముఖ్యా!

కొమ్మ:- బావా! నీ చిన్నతనపుఁ జేష్టలు మానవైతివికదా! నాయుఁడుగారి ముఖ్యోద్దేశ మేమియో వెలువడనిమ్ము. నీకింత లోఁ ద్వరయేల.

బ్రహ్మ:- అయ్యలారా! మన మింతవఱకెద్దానికి జంకి యీభూవతి కండగానుండి బహుకాలము ప్రవాసమొనరించుచుంటిమో యట్టిధర్మమునకే బద్ధులమై రాజలోకంబు మెచ్చునట్లు మన యుద్దేశ మెఱింగించి దాయభాగ మనాయాసముగాఁ గైకొన నుంటి. అందులకై సంధి ముందుగా నుత్తమరాజధర్మమగుట దానికై ప్రియత్నించుచుంటి. అట్లుచేయక మొదటినుండియు యుద్ధమే ప్రశస్తమార్గమనుట నామతముగాదు. సాధుజ నులందఱిమతముగూడఁ గాదనియే నాదృఢాభిప్రాయము. ఎంతటిధీరులైనను దేశకాలపాత్రంబు లెఱింగి నయభయములఁ

గార్యమును సాధించుకొనకున్న దేశంబునకు మేలొనరించు టకుమాటు కీడుఁ జేసినవార లగుదురు. అందులకనియే పెద్దలు సకలలోకజయానుకారియై సంతోషదాయకమై సర్వ సుఖప్రదమై యనన్యసామాన్యమైన శాంతిమార్గ ముపదేశిం చిరి. ఆమార్గ మనుసరించిరయే.

ఉ॥ మున్నల పాండుపుత్రకులు పూర్ణబలాధికులయ్యు శాంతులై వెన్నుని సర్వశాస్త్రచయవేత్తను సంధి యొనర్పఁ బంపరే. ఎన్నఁగ వారికీర్తి కొఱయించుక లోపము వచ్చెనే. రణం బన్నను వెన్నుఁజూపిరె. జయంబును గాంచరె సంగరస్థలిన్.

మలి:- ధీవిశాలా! మీ యాదేశములు శిరసావహింపవలసినవే కాని శ్రుతిమించి రాగమునఁబడినట్లు దేశానర్థము పూర్ణముగా సంభవించి యల్లకల్లోలమగుచుండు తరుణమున నిట్టి వేదాం తఘోరణి నిరుపయోగముగదా! సన్నిపాతరోగి వేఁడిమందు లచేఁ గాక శైత్యోపచారంబులఁ జక్కఁబడఁగలండె. కావు ను. మీయాశయములు మీరెఱింగించితిరి. ఇఁక మాయుద్దే శముగూడ వినుండు. పిదప మీచిత్తము.

చం॥ సైఁచితి మింతకాల మతిశాంతమనంబున. మూఢబుద్ధులా సైఁచినకారణం బరయఁజాలకపోయిరి. యింక నట్టులే చూచినలాభ మేమి. మనమౌడ్యమె యింతకుఁదెచ్చెఁగానఁ గై కో చిరగుప్తపౌరుషము. గోచికి మించుదరిద్ర ముండునే.

పేర్మి:- అధునికపితామహా! మీనిశ్చయ మొకరీతిని మాయాశయ మొకరీతిని నున్నయవి. ఇఁక లాభ మొకింతయు లేదు. వినుఁడు

క॥ హరిహరులతోడఁగూడుక
సుర లరిపక్షమున ననికిఁ జొచ్చిన మీ రా
తరుణమున వలదటన్నను
బోరిగొన కే విడువ రిపులఁ బూర్వజ! యింకన్.

# ధర్మరాజ్యము.

స్వధర్మమును విడువను గూడదు. స్వారాజ్యమును సంపాదింపను వలయును.

పండితమాన్యులగు సంస్కారప్రియులు స్వైరవిహారులై యెట్లు ప్రవర్తించినను స్వతంత్రంమన్యులై యేమి శాసింపఁజూచినను వర్ణాశ్రమ ధర్మములు అనాదిసిద్ధములుగాని యద్యతనములు కావు. ఒకవేళ సృష్టి స్థితి సంహారకరణ సమర్థులైన త్రిమూర్తులకుఁగూడఁ దిరుగఁ బడఁజాలు మహా మునులు కాలానుసారములగు కట్టుదిట్టములు కొన్ని చేసినను ధర్మము మాత్రము సనాతనముగాని తాత్కాలికముగాదు. అట్టిసనాతనధర్మమును త్యజించి యథేష్టాచరణమునకుఁ గడంగుట యనర్థహేతువును నఘవివృద్ధికరంబును నైయున్నయది. ఇట్టిదుష్కార్యమునకే యిప్పు డెందఱో సంసిద్ధులగుచున్నవారు. వీరందఱును గేవలాజ్ఞులనుటకు వీలు లేదు. అందుఁగొందఱు బుద్ధిబలముచే భూమ్యాకాశముల రెంటిని బట్టి తాళము వాయించుటకుఁగూడ దక్షులనఁదగియుండిరి. కాని వీరి కున్న జ్ఞానమంతయు సనాతనధర్మమునకు సహకారియైన స్వవిద్యయం దుఁగాక యన్యవిద్యయైన యాంగ్లభాషయందగుట నయ్యాంగ్లేయుల యాచారముతో యలవడుటయు నధునాతనాఖండభూమండలాఖండలు లగు నవ్వారితో వ్యవహరించుటకును నాగతమైనచో నవనీభరమును గూడ భరించుటకును ననుకూలించుచు నది యాచరితస్వధర్ములై యప వర్గాను లనుభవించుట కనుపయుక్తమగుచున్నది. నిజమునకు స్వధర్మ మును విడనాడి స్వచ్ఛందచారులగు జనులను ధర్మపాలుఁడు శాసింప వలసినట్లు శాస్త్రంబులు చాటుచున్నవి. పూర్వరాజు లట్లు పొనరించు

చును వచ్చిరి. భరతఖండవాసులును బంచవేదంబులను బరాశరాది స్మృతులను భాగవతాది పురాణములను బ్రమాణములనుగాఁ గైకొని తదుక్తవిధంబున మొదలువారును నైన క్షత్రియులు రాజ్యము చేయుచున్నంతకాల మావిధం బాచరణలో నుండుచుండెను. వర్తమానమున,

సీ॥ వర్ణాశ్రమాచారవర్తనల్ తెలియఁజా ద్విపాంతరస్థుల భావులైరి.
ధర్మసూక్ష్మంబుచు దగ్రగహింపఁగ లేని ధీయులు ధర్మాధికారులైరి.

శ్లో॥ యథా రాజా తథా ప్రజా, యన్నట్లు
పాశ్చాత్యనృపవేష భాషావలంబులై వర్తించువా రీదేశవాసులైరి.
వేయేల

శ్లో॥ రాజానోర్థపరాయణాః కపటినో విప్రా వికర్మస్థితాః
భార్యా భర్తృషు బద్ధవైరనిరతాః పుత్రాః పితృద్వేషిణః
నిస్సారా పృథివీ నిరౌషధలతా నీచా మహత్త్వంగతాః
ఇత్యేవం సముపస్థితే కలియుగే ధర్మో వనాంతంగతః

అను నభియుక్తోక్తి యంతయు నన్వర్థమగు కాల మాసన్నమైనది. కాలమహిమచేఁ గానున్నది కాకమానదని మన ముపేక్షింపక "జాతస్యహి ధ్రువో మృత్యుః" అను న్యాయంబునఁ బుట్టినవాని కెల్లను గిట్టుట సహజమైయున్నను బ్రహ్మకల్పపర్యంతము బ్రదుకువారమువలెఁ బాతరలాడెడిభంగి స్వధర్మమును సంరక్షించుకొనుటకు సకల ప్రయత్నములను సలుపవలయును. పురాణములు చెప్పియు నుపన్యాసములిచ్చియుఁ బ్రత్యేకించి బోధించియు నుపదేశములు చేసియు జనుల స్వధర్మరతులఁ గావింపవలయును.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

అను భగవదుక్తిప్రకారము కులముచేతను, గుణముచేతను, విద్యచేతను, బుద్ధిచేతను శ్రేష్ఠులైనవారు మంచిగాని చెడుగాని తా మాచరించినఁ దక్కటివారును నాచరింతురుగావున సనాతనధర్మమును స్వయ మాచరించి జనులచే నాచరింపఁజేయవలెను. గుణకర

ములచేతను విద్యాబుద్ధులచేతను శ్రేష్ఠులైయుండుట సామాన్యముగా బ్రాహ్మణులలోఁగాని సంభవింపదు. కనుక ధర్మమును దా నాచరించి తక్కినవారిచే నాచరింపఁజేయు బాధ్యత బ్రాహ్మణులమీఁదనే పడియున్నది. ఒక్క ధర్మము నెడలనే కాక తా ననుభవించినను ననుభవింపకున్నను జనుల నందఱిని సన్మార్గమునఁ బ్రవేశపెట్టి సకలసంపదలను ననుభవింపఁజేయుటకుఁగూడ బ్రాహ్మణులే బాధ్యులైయున్నవారు.

అట్టిబాధ్యతనహించి మొదటినుండియు బ్రాహ్మణులే జపతపస్స్వాధ్యాయ సత్కర్మానుష్ఠానాది సకలశ్రమములకును దాము లోనై భువలయాధిపత్య కృషి గోరక్షణ వాణిజ్యాద్యైశ్వర్యము లన్నియు నన్యుల కిచ్చివేసి "వర్ణానాం బ్రాహ్మణో గురుః" అను వచనమును రచియింపఁగలిగిరి. అట్టివారియెడలఁ గృతజ్ఞత చూపుటకు మాఱుగా బ్రాహ్మణులే ప్రజల కపకారము చేసిరని పెక్కు రిపుడు ప్రలపింతురుగాక. వర్తమానమున వారు వీరును వీరు వారును నగుచుందురుగాక. భూతమంతయు నీతీరుది. అగుఁగాక రోగికి బాగు చేయుటకుఁ బథ్యపానాదు లవారించి పరిచరింపక తప్పదు. పడిపడి బ్రిదుకువాఁడు బ్రిదుకును. చచ్చువాఁడు చచ్చును. అట్లు యంతయు సంకరమై యెంతయు నశక్యమగువఱకు సనాతనధర్మరతులు జనుల సన్మార్గమునకుఁ ద్రిప్ప యత్నించుట యావశ్యకము. అందుల కస్మదాదులమే కాక యతివర్యులగు మతగురువులును మఱింత పాటుపడవలయును. ధర్మదూరుల దండించి సత్పథమునకుఁ దెచ్చుటకుఁ జాలినంతయధికారము క్రైస్తవాది మతగురువులకుం బోలె వారికినినుండియున్నది. కాని వేదచోదితమతమునకు విరుద్ధమైన ప్రభుత్వమునకు భయపడుచుఁ బరివ్రాజకాచార్యులు ప్రవర్తించుచున్నారు. అట్లని పాపభూయిష్ఠతకుఁబశ్చాత్తాపపడక యూరకుండుచున్నారని యనఁజెల్లదు. శక్తివంచన లేకుండ సాధ్యమైనంతవఱకుఁ బాటుపడుచునే యున్నవారలు. కాని పీఠాధిపతు లింకను దుర్మత దూరీకరణమునకును ఖిలమయిపోవుచున్న సనాతనధర్మమును

లనేకులు చేకొనుచున్న పోరాటమట్టుకు వాస్తవము. ప్రస్తుతపరిస్థితులకుఁ బరితపించుచున్న ధర్మాచార్యులు తమపైఁబడియున్న దూఱును దొలఁగించుకొనలేనంత మనీషాబలరహితులు కారని మానిశ్చయము. విచారించినచో నెవరి ననిన లాభము నేమియుఁ గానుపింపదు. అద్యతనమైన యార్థికస్థితి యంతయు నస్మద్దేశనాయకులచేతులలోఁ జిక్కియున్నది. వీరు ప్రభుత్వమువారికే మొగము త్రిప్పి స్వరాజ్యమును సాధింప సకలప్రయత్నములను బన్నుచున్నారు. ఒకనిచేతిలోని సామ్రాజ్యవస్తువే నొకరు సాధింపఁజూచిన సామ్రాజ్యముగా లభింపనేరదు. అట్టిచో వాణిజ్యార్థమై వచ్చి యప్పటి వసుధాధిపుల పరస్పరద్వేషమును బెంపొందించి భేదశక్తిచే దేశమంతయు నాక్రమించిన యాంగ్లేయుల చేతిలోని రాజ్య మస్మదధీనమగుట యత్యంతకష్టము.

అన్యరాజ్యాలవలెఁ గాక యున్నార లాయుధశాసనము పెట్టి యస్మద్దేశీయుల నెల్లఁ గోఱలుపీకినపిల్లులఁ జేసియున్నారు. అట్టి దిట్టలగు బ్రిటీషువారికిక్రింద బానిసలై పడియున్న భారతీయులు స్వరాజ్యమును సాధించుచో శ్లాఘాపాత్రులే యగుదురు కాని యేది యెట్లుండునో యెఱుఁగరాదు. స్వరాజ్యము సంప్రాప్తించునో లేదో సర్వేశ్వరాధీనమది సరియే కాని తదర్థమై ధనకనకములను దారపుత్రాదులను, వేయేల, సర్వస్వమును త్యజించి ప్రత్యహమును బరశ్శతములుగా భారతీయులు బంధనాగారములకుఁ బయనమై పోవుచున్నారు. నిరాయుధులును నిర్వీర్యులును నగుట నుర్వీశ్వరులతో యుద్ధమొనరింప నోపమి బద్ధత్వమునకుఁ జాలుపడుచున్నారు. అసమానకష్టమేలయని యనుకొనక యవనీశుల కనిష్టములగు నన్నిపనులను నాచరించుచున్నారు. ఉప్పుచేయుచున్నారు. ఉపన్యాసము లిచ్చుచున్నారు. ఉద్యోగముల మానుచున్నారు. పరదేశవస్త్రముల బహిష్కరించుచున్నారు. రాట్నముల రచించుచున్నారు. నూలు వడకుచున్నారు. వస్త్రములు నేయుచున్నారు. కద్దరు కట్టుచున్నారు. లాంకుషైరులాభమును లాగివేయుచున్నారు. జాతీయపతాకముల స్థాపించుచున్నారు. మద్యమును నిషేధించుచున్నారు. శాసనముల ఖండించుచున్నారు.

తుదకుఁ బన్నులనుగూడ నెగవేయఁజూచుచున్నారు. ఇట్లు సర్వవిధముల శాసనోల్లంఘన మొనరించు వీరిని రాజద్రోహులగాఁ బరిగణించి ప్రభుత్వమువారు బందీకృతులం జేయుచున్నారు. నలుబదియేఁబది సం॥ ల నుండి నడచుచు జగత్ప్రఖ్యాతిగన్న జాతీయమహాసభనే యక్రమసంఘమని ప్రకటించినారు. దానితో సంబంధముగల జనులెల్ల నిందితులని నిరూపించినారు. గాంధీగారినే గ్రహించినారు. తద్భక్తుల దండించుచున్నారు. పతాకములు పాడుచేయుచున్నారు. స్వదేశవస్త్రధారులుసహితము సదోషులని చాటించుచున్నారు. ప్రజలు తిరుగఁబడిన కొలఁదిఁ బ్రభువులు బంధించుచున్నారు. ఇంతవఱకుఁ దిరుగఁబాటునకు నిర్బంధముగాని నిర్బంధమునకుఁ దిరుగఁబాటుగాని లొంగక యొకటిని మించి యొకటి పనిచేయుచున్నవి. వీరి యుద్యమమును జావలేదు. వారు నిర్బంధమును నాపలేదు. ఆజ్యముపోసిన యగ్నిజ్వాలలవలె రెండును నభివృద్ధియందే యున్నయవి. పదిమంది తోడిచావు పెండ్లితో సమానమన్నట్లు భారతీయులకుఁ బలువుర క్లిష్టమైన స్వరాజ్యోద్యమమునఁ బాల్గొనక తప్పదుకాని ప్రజాపరిపాలనమునకంటె రాజపరిపాలనమే రమ్యమై యుండవచ్చునని తోఁచెడిని. ప్రజాసామ్యమను మాట ప్రస్తుతమే వినుచుంటిమికాని భారత భాగవతాదీతిహాసపురాణములయం దెచ్చటను నీక్షించియుండము.

అసమంజసుఁడు వేనుఁడు మొదలగు దుష్టరాజు లేర్పడినపుడును బ్రజలు వారిని దొలఁగించి మఱియొక మంచిరాజు నేర్పఱచుకొనిరికాని స్వపరిపాలనమునకు సమ్మతింపలేదు. అయితే దొల్లింటి ప్రభువు లందఱును దుష్టశిక్షణశిష్టరక్షణదక్షులైన సుక్షత్రియులై జనుల వర్ణాశ్రమాచారభ్రష్టులు గాకుండఁ గాపాడుచు వచ్చిరి. ఆధునికు లన్యఖండవాసులగుట నాత్మమతవ్యాపనము యత్యంతము కావించుకొనుచు మన మతధర్మపరిపాలనము మతాధిపతులకును మనకునే వదలిపెట్టి తటస్థులై యుండుచుండిరి. అందువలన భారతస్వరాజ్య మఖిలజనులును నభిలషింపఁదగినదే యైయున్నయది. కాని ప్రకృతపు దేశనాయకం

మన్యు లందఱును స్వధర్మదూరులగుటవలన స్వరాజ్యము సంప్రాప్తించినను జనుల కంతగా సౌఖ్యము సంభవింపదని సంశయింపవలసి వచ్చినది. అస్పృశ్యతానివారణము విధవావివాహము రజస్వలావివాహము, పంక్తుల సర్వవర్ణసమ్మేళనము మున్నగు శాస్త్రనిషిద్ధ దురాచారముల ప్రచారమునకై పాటుపడుటయే వీరి స్వధర్మవిదూరతకుఁ జాలినంత సాక్ష్యమై యున్నయది. స్వరాజ్యము వచ్చినను నిట్టి నాయకుల పరిపాలనములోనికి వచ్చినతర్వాత స్వధర్మమున కింకఁ జోటెట నుండెను? అట్టిచో నన్యమతస్థులగు నాంగ్లేయుల పరిపాలనముకంటె స్వ ప రి పా ల న మం దు న్న సా ర మె య్యది? ఆదినుండియు నస్మన్మతవిషయమునఁ దాటస్థ్యము వహించియున్న యాంగ్లేయుల సహిత మగ్గముచేసికొని మన నాయకులు వర్ణాశ్రమధర్మముల నిర్మూలనం బొనరింపసమకట్టిరి. ప్రకృతము భరతఖండమంతయుఁ బరితపింపఁజేయుచున్న శారదాశాసనమే యందులకుఁ బ్రబలనిదర్శనము. సంస్కారప్రియులు స్వరాజ్యమునకే మార్పుగలిగింపనున్నపుడు సనాతనధర్మరతులు శారదాశాసనమునకు మార్పుగలిగింపకపోవరు. వారిలో నున్నంత రాజవిద్యాబలము వీరిలోను నుండియున్నది. యమ్. కే. ఆచార్యప్రభృతులు శారదాబిల్లునకు సవరణ ప్రతిపాదించియేయుండిరి. వారు రాజశాసనము నతిక్రమించిన వీరు శారదాశాసనము నతిక్రమింతురు. అతిక్రమించి వేలకువేల వివాహములు జరుపుచునే యున్నవారలు. బ్రాహ్మణులలోనే కాక యన్నిజాతులలోను నగుచున్నవి. తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా, ఊలపల్లెలో ౩ బ్రాహ్మణేతరులలోను ౫ పంచములలోను ౧౦, ౧౧ సం॥ బాలికల వివాహములు కావింపఁబడినవి. గుంటూరుజిల్లా తెనాలితాలూకా కూచిపూడిగ్రామమున నాల్గువర్ణముల వారిలోను ౧౦ సం॥ లోపలి బాలికల వివాహములు ౫౦ యును తెనాలి పెదరావూరు పెదపూడి యమృతలూరు గ్రామములలో ౨౦౦ లును జరిగినవి.

పాపనాశనము తాలూకా, ఉత్తమాధానపురపు బ్రాహ్మణకుటుంబములలోని ౧౨ సం॥ లలోపలి బాలికల వివాహములు ౨ ను బళ్ళారిజిల్లా, ఆదోనితాలూకా, ఎమ్మిగనూరిలోని బంగారయ్య రోసెయ్య యను పంచములయిండ్లలో నుఱికొన్నియును గర్నూలుజిల్లా నందికొటుకూరుతాలూకా భైరాపురములోని మోతుగుండము శాస్త్రిలుగారి యింట ౧ యును నాసాముదేశమున రాజధానియగు గౌహతీనగరమునందు ౧౦ యును శాహపురప్రాంతముల ౯౨౧ యును గయజిల్లాను ౧౦౦౦ ను మిధిలాదేశమున ౫౦౦ లును జలంధరుజిల్లా గుజ్జరపురమునందు ౯ యును నలహాబాదు ఫతేహాపురము మిర్జాపురము హామీరుపురము మున్నగు తావుల ౧౦౦౦ కెక్కువగను హాశంగాబాదు వైపుల వందలకొలదిగను లోహండా టిటిహార పునాహురు సికలోటీ కాంటీ కరవరియా తనాడీ చౌరా మున్నగు గ్రామముల మిక్కుటముగను ఫతేపూరుజిల్లా, ఆజు గ్రామమున హిందువులలోను ముసల్మానులలో ననేకములును జరిగినవి, జరుగుచున్నవి, జరుగనున్నవి. ఈబిల్లమలులోనికి వచ్చిన యేప్రియలు నెలదగ్గఱనుంచి యిట్లారి కయిదారువివాహము లగుచునేయున్నవి. స్వజాతీయులును విజాతీయులును నగు గ్రామస్థులు పౌరులు నందఱు నీవివాహములయందుఁ బాల్గొనుచున్నారు. సనాతన ధర్మద్రోహియగు శారదాగారిండియాశాసనసభలోఁ బ్యాసుచేయించిన యీ బాల్యవివాహనిరోధశాసనము సమర్థించుచున్నయుభయభ్రష్టులగు రిఫార్మరులును బలువురీవివాహములకు వచ్చుచున్నారు. ఆసాముదేశమందలి యాచార్యశ్రౌతభూషణ పండిత రామచంద్రమిశ్రజీ పండిత గోవిందరామజీ పండిత రామచంద్రప్రతాపజీతివారీ భవానీప్రసాదజీజోసీ సాగరమల్ జోసీ మొదలగువారును బాట్నా జిల్లాలోని పం॥ అనంతరామఓఝా పం॥ కినసపాఠక పం॥ రామావతార పాఠక జోగేశ్వరమహాతీ రామ్నకహార బహేరకహారు మున్నగువారును గర్ణపురమునందలి పం॥ విశుద్ధానందతి వా రీ పం॥ దే వ చ ర ణ తి వా రీ పం॥ వ్రి జ వి హా రీ తి వారీ పం॥ రామధరీతివారీ పం॥ భిసంగ తివారీ క్షిసాహాంలో నగువారును

సారంగపురములోని రామకృష్ణసింహ పం॥ దేవచరణతివారీ ప్రసిద్ధసింహ హారనందనసింహ శ్రీకృష్ణసింహ దేవదత్తమిశ్ర ప్రభృతులును నరసీ గ్రామమందలి దేవనారాయణమహతీ మున్నగువారును సేరపురగ్రామమందలి దశరథకహారు మొదలగువారును బిపరావ నహురావ గ్రామములయందలి పలువురును నీశారదా శాసనము నుల్లంఘించి వివాహములు చేయువారును జేయించువారును నైయున్నవారు. కాశీ క్షేత్రమునందు బిల్లును దలఁచుకొనువారే లేరు. వివాహములు యథాపూర్వకముగా నగుచునే యున్నయవి. అం దిట్టివివాహములయందు సంబంధముగలిగించుకొనువారు మణికర్ణికాఘాట్ తీర్థపురోహితులు బద్రీనాథుగారు సనాతనధర్మోపన్యాసకులలోఁ బ్రముఖులగు పం॥ నందకిశోరశుక్లగారు సాహిత్యాచార్య భారతభూషణ పం॥ అంబికాదత్తజీవ్యాసులవారి పౌత్రుండగు కృష్ణకుమారజీవ్యాసులు ధర్మప్రాణ లక్ష్మణశాస్త్రి ద్రావిడ మున్నగు మహామహులు. గుంటూరుజిల్లా కూచిపూడిగ్రామవాస్తవ్యులు నాదెండ్ల రామలింగయ్యగారు, ఆచార్యవర మునిగారు మిథిలాదేశాంతర్గతమగు సహసైలానగరములోని పం॥ ఉదితనారాయణజీ ఫతేపూరుజిల్లాలోని పం॥ రామదత్తజీ శుక్లగారు జలంధరుజిల్లాలోని స్వామివిశ్వేశ్వరానందజీ పార్వతేయులుగారు సారంజిల్లాలోని పం॥ రామచంద్రప్రసాద్ నారాయణశర్మగారు బాంద్రా జిల్లాలోని పం॥ రాజేశ్వరమిశ్రిగారు హోశంగాబాదునందలి సిద్ధేశ్వరజీ బరేలీజిల్లా సనాతన ధర్మసభాకార్యదర్శి మహంతు మహావీరదాసజీ ప్రభృతులు వైవాహిక సభవారి యాజమాన్యముతో శారదాబిల్లు నతిక్రమించి వివాహములు సవైభవముగ జరుపఁబడినవనియు సనాతనధర్మపరాయణులు తమకుఁగల ధర్మపరాక్రమమును లోకమునఁ బ్రకటించుచున్నారనియు ధర్మవినాశకమగు శారదాబిల్లు సమూలముగా నశించునంతదనుక నిట్టియుత్సాహమునే దేశీయులు చూపఁగలరనియు హిందువులును మహమ్మదీయులును బలువురీవివాహములందు జోక్యముకలుగఁజేసికొను చున్నారనియు నింకను వివాహములు జరుగఁగలవనియు జైలన్న భయ మెవ్వరికిని లేదనియు,

బిల్లు కావలయునని వాపోయినవా రెచ్చటను దాని రద్దుపఱుప
లేదనియుఁ బత్రికలకు వ్రాయుచున్నారు. త్రిలింగ మనము చేసిరని
యైంద్రావతి మొదలగు స్వదేశపత్రికలు ప్రచురించు
వాసి బ్రాహ్మణసమ్మేళనము మున్నగు హిందీపత్రికల
వారము ౨, ౩ కలశములయందే యీ వివాహముల వివరములు నానా
క్రియమాణములు. మనదేశవాసులకు లిది యొక్కటేకాక యింక
నిట్టి దుష్టశాసనము తెప్పింపయు చేయింపనున్నారు. కాన విధిమార
నుగు నిట్టి స్వారాజ్యమును మన మెన్నటికి నిచ్ఛయింప వలసినదికాదు.

శ్లో॥ యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిం.

అను గీతాశాస్త్రప్రకారము విధిమార్గముగం బ్రవర్తించినంత
వఱకు స్వారాజ్యమును రాదు, గిరాజ్యమును రాదు. భారతీయుల స్థితి
యంతయు విధివిహితముగాని విధిరహితముకాదు. కట్టు బొట్టు జుట్టు
దగ్గఱనుంచి విధిననుసరించియే మన కేర్పడియున్నవి. పలుమాట లేల?
కూర్చుండుటకు విధి. పరుండుటకును విధి. తినుటకును విధి. చనుట
కును విధి. పుట్టిన విధి. గిట్టిన విధి అన్నిటిని మనకు శాస్త్రమే విధించి
యున్నది: కాని స్వతంత్రులము కాము. మన బ్రదు కంతయు విధితో
డనే యున్నది. అట్టిశాస్త్రవిధి నతిక్రమించి యఖిలేశ్వరున కప
రాధ మాచరించినతర్వాత స్వరాజ్యము వచ్చినను సౌఖ్యదాయకము
కానేరదు. శ్రుతిస్మృతులే మనశాస్త్రములు. అవియే యీశ్వరశాస
నములు 'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే' యనునదియే భగవద్వాక్యము. భగ
వదాజ్ఞాతిక్రమణపురస్సరంబగు భారతస్వారాజ్యము మనకుఁ బనికి
రాదు. స్వధర్మమును విడువను గూడదు. స్వారాజ్యమును సంపాదిం
పను వలయు. ధర్మసహితమైనరాజ్యమే శర్మసంపాదకము. అట్టి ధర్మ
రాజ్య మార్జించుట కనువగుమార్గమంతయు నీనెల యభినవసరస్వతి
యందే యన్యత్రి ప్రకటితము. అది యవలోకించి యఖిలజనులును
నందులకు యత్నింతురుగాక.

## ధర్మపరతుల కిపుడు కర్తవ్య మెద్ది ?

సారంగపురములోని రా
హరనందనసింహ (మల్లాది రామకృష్ణవిద్వచ్చయనులుగారు)
గ్రామమందలి

మమందలి భారతవర్షమందు సృష్ట్యాదినుండియు శ్రుతిస్మృతిపురాణ గ్రథితములగు వర్ణాశ్రమధర్మములు బ్రాహ్మణాదివర్ణస్థులచే యథా శక్తిభక్తిశ్రద్ధాపూర్వకముగా నాచరింపఁబడుచుండెడివి. అప్పుడప్పుడు యుగాంతరములందు రాక్షసులవలనను గల్యారంభమున బౌద్ధజైన చార్వాకమతస్థులవలనను ననంతరము తురుష్కులవలనను నిట్టి ధర్మా చరణమునకుఁ గొన్ని యిక్కట్లు వాటిల్లినను శ్రద్ధాళువులును దీక్షా వంతులును నగు సనాతనధర్మపరు లట్టి కష్టముల సహించి ధర్మము నాచరించి కీర్తిసుకృతముల గడించిరి. వెనుకటివారివలెఁగాక యిప్పటి పరిపాలకులగు నాంగ్లేయులు పాఠశాలల నెలకొల్పి విద్యార్థులకు జీవి కాప్రత్యాశను గల్పించియు వైద్యశాలలఁ బ్రతిష్ఠించి ధర్మచికిత్సలం జేయించియుఁ బ్రచారకులం బంపి సనాతనధర్మముం దరుచియుఁ క్రైస్తవమతము దభిరుచియుఁ గలుగునట్లు చేయుచుఁ జాతుర్వర్ణ్యము లోని బుద్ధిశాలులగు బాలురను జాతుర్వర్ణ్యధర్మమునకుఁ బ్రతిపక్షులగు నట్లుగా మార్చిరి. "సంసర్గజా దోషగుణా భవంతి" యను నభియుక్తోక్తి గుణముగాని దోషముగాని యలవడుటకు సహవాసమే కారణమని చెప్పుచున్నది. శ్రుతిస్మృతిపురాణచోదితమగు ధర్మమున కాంగ్లే యులకంటె నాంగ్లేయభాషాధ్యయనము చేసి తద్వాసనావాసితులగు భారతీయులే ప్రబలశత్రువులుగాఁ గనుపట్టుచున్నారు. సూర్యకిరణ ముల వేడిమికంటె సూర్యకిరణతప్తమగు రజఃపుంజముయొక్క వేడిమి మిక్కుటము. ఇపుడు సకలసత్పురుషుల చిత్తములను గలవర పఱచుచున్న శారదాశాసనము హరవిలాసశారదా యను భారత వర్షీయుఁడగు నార్యమతస్థునిచేఁ బ్రవేశపెట్టఁబడినది. దొరతనమువారు తటస్థులుగానున్నట్లభినయించుచుఁ దత్పక్షీయ శాసనసభాసభ్యులతో నేకీభవించి శారదాబిల్లును ప్యాసుచేసిరి. ఎందఱెట్లు చెప్పినను మత ధర్మములందు జోక్యము కల్పించుకొనమని శ్రీ విక్టోరియారాణిగారు

చేసిన వాగ్దానముప్రకారము గవర్నరుజనరల్ గారు దాని రద్దుపఱుప నుండిరి. అట్లుచేయనందున వీరును రాజశాసనోల్లంఘనము చేసిరని యనవలసి వచ్చినది.

సంపూర్ణస్వరాజ్యము కోరుచు శ్రీ గాంధీప్రభృతులు నానా విధశ్రమలకు లోనై రాజశాసనోల్లంఘనము చేయుచున్నారు. "గతానుగతికో లోకః" యను న్యాయమున సామాన్యజనులందఱును దేశనాయకులతోపాటు శాసనోల్లంఘనము చేయుచున్నారు. మనము శ్రుతిస్మృతిపురాణములను ప్రమాణముగా నంగీకరించువార మైనను దేశస్వాతంత్ర్యము కోరువారలమే కాని విదేశీయుల క్రింద దాస్యము నభిలషించువారలము కాము. కనుక నీ గాంధీప్రభృతి కాంగ్రెసునాయకులతో నేకీభవించి దేశదాస్యవిముక్తికై శాసనోల్లంఘన మాచరింపవలయునా? గాంధిప్రభృతులు పాశ్చాత్యవిద్యావాసనావాసితులగుచు నస్పృశ్యస్పర్శనము మొదలగు శాస్త్రనిషిద్ధకృత్యము లాచరించువారలు గనుక వీరియుద్యమమందుఁ జొగ్గొనఁ గూడదని యుపేక్షింపవలయునా? యని విచారము వొడముచున్నది. ఈవిషయమునఁ గాశీస్థబ్రాహ్మణ మహాపండితపరిషత్తుతో మన మేకీభవించుట శ్రేయస్కరము. గాంధిప్రభృతి కాంగ్రెసుసభ్యులు శారదా శాసనము నభినందించిరి. అస్పృశ్యస్పర్శనమున కామోదించిరి. చండాల దేవాలయప్రవేశమును బ్రోత్సహించుచున్నారు. విధవావివాహముల కనుమతినొసంగిరి. ఇంక నెన్నియో నిర్బంధశాసనములఁ బ్రవేశపెట్టనున్నారు. ఇట్టి కృత్యములన్నియు శ్రుతిస్మృతినింద్యములు. జాతిమతముల నిర్మూలించునవి. సంపూర్ణమగు నెట్టియధికారమును లేనప్పుడే యిట్టి దుశ్శాసనములఁ దెచ్చిపెట్టి యిహపరసౌఖ్యదాయకమగు ధర్మము నిర్మూలముచేయ సమకట్టిన యీ ధర్మవిధ్వంసకులకు దైవవశమునఁ బూర్ణస్వాతంత్ర్యమే లభించినయెడల వారివలన సంభవింపఁబోయెడి యనర్థములవలన సనాతనధర్మమునకు నిలువ నీడయే దుర్లభము. మీరు సంపాదింపఁబోయెడి స్వరాజ్యమువలన స్వల్పనం

ఖ్యాకములగు సంఘముల మతస్వాతంత్ర్యమునకును రాజకీయ వ్యవహార స్వాతంత్ర్యమునకును భంగము గలుగునని మేము మీతో నేకీభవింపఁజాలమని మహమ్మదీయులు చెప్పుచుండఁగా వారికి గాంధీప్రభృతు లాగమిష్యత్స్వరాజ్యమున మీ కట్టి ప్రతిబంధకము గలుగఁజేయక సర్వవిధస్వాతంత్ర్యము నిచ్చెదమని పత్రికల ద్వారమునఁ బ్రకటించిరి.

సనాతనధర్మనిరతులు మాధర్మమునకు హాని కలుగఁజేయక సంరక్షించెదమని వాగ్దానము చేసిన మేమును మీతో నేకీభవింతుమని రాయబారమంపఁగా నిరాకరించి మీఁదుమిక్కిలి సర్వవర్ణసహభోజనము నస్పృశ్యస్పర్శనముఁ జండాలదేవాలయప్రవేశాభ్యనుజ్ఞయుఁదాము చేయుచు నొరులచేఁ జేయించుచున్నారలు - తదనుయాయుల యుచ్ఛృంఖలప్రవర్తనము చెప్పనలవికాదు. ఇట్టివారితో మన మేకీభవించినయెడలఁ బ్రస్తుతఫలము రాజదండనము. అనంతరఫలము జాతిమతభ్రంశము. పితరుల కథోలోకప్రాప్తియు. మానవంశములలో జనించెడివారి సకలధర్మాధికారములను మనము చేతులార నశింపఁజేసినందునఁ బాప మపారముగాఁ బ్రాప్తించును. స్వరాజ్యము వచ్చినయనంతరము మరల వర్ణాశ్రమధర్మములఁ గ్రమప్రికార మాచరింపవచ్చునని కొందఱందురు. అది సరికాదు. అధికసంఖ్యాకుల వోట్ల పైనిగదా మనపరిపాలనము జరుగును? శ్రుతిస్మృతి విశ్వాసరహితులగు పామరుల సంఖ్యయే యెల్లప్పుడు నధికము. తదనుసారముగా సాంఘికమతధర్మములు నడువవలసినప్పు డేక ధర్మము లుప్తమే యగును. కనుక వసిష్ఠాది మహర్షుల సంతతిలోనను దచ్ఛిష్యపరంపరలోనను జేరిన చాతుర్వర్ణ్యాంతర్భూతులమగు మన మైహికభోగమాత్రాసక్తిం జేసి చార్వాకులని యనఁదగిన గాంధిప్రభృతి స్వచ్ఛందచారులగు కాంగ్రెసునాయకుల యాదేశము ననువర్తింపఁగూడదు. అట్లు వారియాదేశము ననువర్తించుట ధర్మవిధ్వంసకమగుటంజేసి పాప

కాశీనగరమందు వర్ణాశ్రమస్వారాజ్య సంఘమని యొకటి మహాపండితులచేతను రాజకీయతత్త్వవేత్తలగు ప్రాజ్ఞులచేతను స్థాపింపఁబడినది. దానికి నర్మదోత్తరదేశవాసులగు సనాతనధర్మపరులు సభ్యులై సంఘశక్తిచే ధర్మమును నుద్ధరింప యత్నించుచున్నారు. మన రాజధాని యందుఁ బ్రముఖులగు సనాతనధర్మపరులు చేరి స్వధర్మస్వారాజ్యసంఘమని యొకటి స్థాపించి దానిని 26-4-30 తేదీని మదరాసులోఁ గంపెనీలచట్టముక్రింద రిజిష్టరు చేయించినారు. ఈ సంఘమునకు శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది బిరుదావళీవిరాజమాన శ్రీ జగద్గురు పుష్పగిరిపీఠాధ్యక్షులు ౫౦౦౦రూప్యము లనుగ్రహించి పోషక పదవి నంగీకరించి మార్గదర్శకులైరి.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యేత్యాది బిరుదావళీవిరాజమాన శ్రీజగద్గురు కామకోటిపీఠాధీశ్వరులును ౫౦౦౦ రూప్యముల ననుగ్రహించి యాశీర్వదించిరి. వేదసభాప్రవర్తకులగు మ॥ రా॥ రా॥ కొత్తా సూర్యనారాయణరావుపంతులుగారీసంఘమునకు ౨౦౦౦ రూప్యముల నిచ్చుటయే కాక నిష్ప్రతిఫలముగా మేనేజింగు డైరక్టరుద్యోగము నయిదు సం॥లు నెఱవేర్చుట కంగీకరించిరి. మ॥ రా॥ రా॥ సర్, సి, వి, రామస్వామియయ్యరుగారు (రిటైర్డు హైకోర్టుజడ్జి) వి, వి, శ్రీనివాసయ్యంగారు మధుర నటేశఅయ్యరుగారు (పబ్లికుప్రాసిక్యూటరు) మ॥ రా॥ రా॥ దుఱిసేటి శేషగిరిరావుపంతులుగారు బియే బియల్, కాకినాడ మ॥ రా॥ రా॥ అద్దేపల్లి వెంకటప్పయ్యగారు, వర్తకులు, బెజవాడ మ॥ రా॥ రా॥ కోవెలమూడి శ్రీరాములుగారు, వర్తకులు, బెజవాడ మొదలగు దేశప్రముఖులు వేయివేయిరూప్యముల నొసంగి డైరెక్టరులుగా నున్నారు. రు ౧౦౦ కొక్కొక షేరు. దీనిలో నొకనాల్గవవంతు ప్రథమమందును మఱియొకనాల్గవవంతు

రెండు మాసములకు ననీయవలయును. తక్కినసగము ద్రవ్యము వచ్చెడి సం॥ ఈయవచ్చును. జిల్లాకు వేయి పేర్ల చొప్పున మదరాసురాజధాని లోని ౨౮ జిల్లాల సత్పురుషులును ధనసాహాయ్యము చేసినయెడల సేమూలధనముతో నాంగ్లేయభాషలోను నాంధ్రద్రావిడభాషలయం దును దినపత్రికలం బ్రచురించి ధర్మప్రచారము చేయఁబడును. పండి తులకుఁ దగు వేతనములనిచ్చి ప్రతిగ్రామమందునను సంఘములను స్థాపించి యుద్బోధము చేయఁబడును. అక్కడక్కడ వేదశాస్త్రపాఠశా లలు స్థాపింపఁబడును. ఎసంబ్లీసభ్యులుగానుండుటకై సనాతనధర్మపరు లకు వోట్లను సంపాదించి వారిని బంపవలయును. రౌండుటేబిలుకా ఫరెన్సునకు సనాతనధర్మసంరక్షణకై ప్రతినిధులఁ బంపవలయును. ఇట్టి వెన్నియో రాజకార్యములు కలవు. రు ౧౦౦ ల షేరు గ్రహింప శక్తిలేనివార లనేకులు గలసి గ్రహింపవచ్చును. దీనివివరములఁ దెలి యఁగోరువారలు 95 బ్రాడ్వే, మద్రాసు - స్వధర్మస్వారాజ్యసంఘ మేనేజరుగారికి వ్రాసి తెప్పించుకొనవలసినది. మనమందఱమును స్వకా ర్యముగాఁ దిరిగి చందాలువేయించి వసూలుచేయించి పనిచేయవల యును. ఆరంభమున కవసరమైన ధన మెంతశీఘ్రముగా సమకూరిన నంతశీఘ్రముగాఁ గార్య ముపక్రమింపఁబడును. మోస మేమియు లేదు. ఇప్పు డిదియే ముఖ్యకర్తవ్యము. ధర్మబ్రహ్మస్వరూపుఁడగు యజ్ఞేశ్వరుఁడు మనకు సాహాయ్యము చేయుఁగాత.

---

# 15

## అడ్మినిష్టర్డ్ ఏరియా వర్ణాశ్రమ ధర్మ మహాసభ, శారదా ఆక్టు, సంపూర్ణ హరతాళము.

---

1-7-30 మంగళవారము, సికిందాబ్రాదు మొదలగు బ్రిటీషు సరిహద్దులందు శారదాఆక్టు మలులోనికి వచ్చు దుర్దినముకాబట్టి విచార సూచకముగా శికింద్రాబాదు మొదలగు గ్రామము లన్నిటియందును దుకాణము లన్నియు, మూయఁబడెను. ఆ దుశ్శాసనము రద్దగుటకై శ్రీ లాలాగుడిలో రుద్రాభిషేకమును విష్ణుసహస్రనామార్చనమును బ్రాహ్మణోత్తములచేఁ గావింపఁబడెను. పురప్రముఖులును, చాతుర్వర్ణ్యజనులును దీర్థప్రసాదస్వీకరణంబు గావించిరి. తిరిగి సాయంకాలము 4 గంటలనుండి శ్రీ శ్రీ పరమ హంసేత్యాది బిరుదాంచిత శ్రీ శంకరహరిహరతీర్థ దండిస్వాములవారి యగ్రాసనాధిపత్యముక్రింద నొక మహాసభ సమకూడెను. రెండువేలమందికిఁ బైగా జనులు విచ్చేసిరి. బ్ర॥ ముదిగొండ బుచ్చిలింగశాస్త్రిగారును నాగవు కృష్ణారావు గారును జివుకుల అప్పయ్యశాస్త్రిగారును వర్ణాశ్రమధర్మరక్షణమును గూర్చియు శారదాఆక్టుంగూర్చియు సకారణంబుగా నుపన్యసించిరి. ఆనరబుల్ రసిడెంటుగారీ శారదాఆక్టుకై యధికజనాభిప్రాయమును విజ్ఞాపనముగాఁబలుమారు పంపుకొనినను ద్రుణీకరించి యిచ్చటఁ గూడ నమలులోనికిఁ దెచ్చుట యన్యాయమనియు శ్రీనైజాముదొర తనమువా రార్యసమాజాధ్యక్షులగువారిచేఁ బ్రవేశపెట్టఁబడిన బాల్య వివాహనిషేధకపుబిల్లంగీకరింపక త్రోసివేసి యితర మతవిషయకశాసనంబులకుఁ దావీయకుండవలయుననియు శారదాఆక్టు అమెండుమెంటుబిల్లసెంబ్లీలోఁ దీర్మానమగువరకు నీఅడ్మినిష్టర్డ్ ఏరియాలోకి నీయా

క్రమలునకు రాకుండ (శ్రీ) వైస్రాయిగారికి సిఫారసు (శ్రీ) రసిడెంటు గారుచేయుటకుఁ బ్రార్థింపఁబడుచున్నారనియు, వర్ణాశ్రమధర్మసంరక్షణంబు హిందువులందఱును సర్వవిధములను బరిపూర్ణశ్రద్ధవహించి కావింపవలయుననియు, నేకగ్రీవంబుగాఁ దీర్మానించిరి. శ్రీ అగ్రాసనాధిపతిగారు సంపూర్ణోపన్యాసంబు గావించినమీఁద ధన్యవాదము లర్పింపఁబడెను. రాత్రి 8 గంటలకు సభ సంపూర్ణంబు జయజయధ్వానంబులతో నయ్యె. (స్వకీయవిలేఖరి)

---

# ప్రకటన

## —♦ కర్నూలు మండల వర్ణాశ్రమ ధర్మరక్షక సభ. ♦—

పై సభకు సెక్రటరియగు బ్రి॥ పుల్లాపంతుల రామచంద్రయ్యగారు 7—6—30 నుండి 14—6—30 వఱకు, ప్యాపలి తర్తూరు నందికొటుకూరు, ఆత్మకూరు భానుముక్కల మొదలగు గ్రామములలో వర్ణాశ్రమ ధర్మరక్షకసభలు చేసి వచ్చిరని తెలియుచున్నది. వీరిందు విషయమై చాల, పాటుపడుచున్నవారు.

# మహాజనుల కొక విజ్ఞాపనము.

శ్లో॥ యద్య దాచరతి శ్రేష్ఠః — తత్తదే వేతరో జనః
స యత్ప్రమాణం కురుతే — లోక స్తదనువర్తతే. } భగవద్గీత

బ్రహ్మవిదుఁ డేకర్మము నాచరించుచున్నాఁడో పామరుఁడైన జనుఁడును నా కర్మమునే యాచరించుచున్నాఁడు. ఆబ్రహ్మనిష్ఠుఁ డేప్రమాణమును జేయుచున్నాఁడో పామరజనుఁడును నాప్రమాణమునే యనుసరించుచున్నాఁడని బ్రహ్మాండనాయకుండగు శ్రీకృష్ణుం డుపదేశించి యున్నాఁడు. ప్రస్తుతమునందు నేను సంఘసంస్కారులనఁబడు పుణ్యజనులకు విన్నవించుకొనునది యేమన, కొందఱు సికింద్రాబాద్ భాగ్యనగరములందు విధవా వివాహములు [ముండలపెండ్లిండ్లు] చేయించుచున్నారు కాని యీ చేయించు పెద్దమనుష్యులు తమతమ యిండ్లలోని యక్కచెల్లెండ్లు పినతల్లి కూఁతుండ్రు కోడండ్రు వదినెలు మరదండ్రు మనుమరాండ్రు మొదలగు ముండలకు ముందు పెండ్లిండ్లు చేసిగదా యితరులకు బుద్ధిచెప్పి చేయించవలసినది? అట్లు చేయకుండ దిక్కులేని కూటికిపేదలగు నమాయికులకు దుర్బోధలు చేసి పిల్లకుఁగాని పిల్లవానికిఁగాని సంబంధించిన ముఖ్యులగు వారి కెంతమాత్రమును దెలియఁజేయక లేతవయస్సులోనున్న పిల్లలను పిల్లవాండ్రను దీసికొనివచ్చిరో లేక తెలియక వచ్చినవారిని జేర్చిరో రండా వివాహములఁజేసి ధన్యులమైతిమని సంతసించుచుఁ జంకలుకొట్టుట యెంతమాత్రమును ధర్మముగాక నీచమైనపనియని తలఁచుచున్నాను. బుద్ధి తెలియక యెవరి దుర్బోధలకో లొంగిన చిన్నపిల్లలు పెద్దవాండ్రైన తరువాత నయ్యో! ఈ దుర్మార్గుల బోధలకు మోసపోతిమే? కూటికిఁగాని బట్టకుఁగాని యెందులకుఁగాని కొఱగాని యీ పిల్లవాండ్రు సోషల్ రిఫార్మరు లనఁబడు వారి మాటలచేఁ బెండ్లియాడితిమే? పెంచిపెద్దఁజేసి క్షేమమును గోరు తండ్రి మొదలగు ముఖ్యబంధువుల నందఱను విడిచిపెట్టుకొంటిమే? మాకింక దిక్కెవ్వరు? దైవమా యని యేడ్చితీరుదురు. కొందరైనను నేడ్చి తీరుదురు, సందియము లేదు. కాన శాస్త్రాచార విరుద్ధమై కులకళంకమైన యీముండల పెండ్లిండ్లు చేయుట ధర్మముగాదని యీసంఘసంస్కార సభ్యులు తలంచి మిన్నకుందురుగాక ధర్మము జయించుగాక!

ఇట్లు,
చందా నారాయణ.

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా పిడుగురాళ్ల గ్రామనివాసి దండెమురాజు లక్ష్మీనరసింహముగారు తాలూకాబోర్డు మెంబరైనందుకు సంతసించి గ్రామస్థులు కావించిన టీపార్టీ సమయమునఁ జదువఁబడిన పద్యములు.

సీ॥ పురుషవరేణ్య! నీ పుట్టువుచేతనే ప్రఖ్యాతిచే మించె పల్లెనాఁడు
అసమానచతుర! నీ యావాసమునఁజేసి ప్రణుతి గాంచెను పిడుగురాలపురము
సదమలచరిత! నీ సంభవంబునఁజేసి పేరెన్నికను గాంచె విప్రజాతి.
పావనగుణ! నీదు ప్రాభవంబునఁజేసి వన్నె గాంచెఁ త్వదీయ వంశమెల్ల

గీ॥ కార్యచతురుని నిన్నిటఁ గాంచుకతన మాన్యతను గాంచె గుంటూరుమండలంబు
ఆంధ్రరాష్ట్రంపు దివ్యరత్నంబవీవు అమలవిజ్ఞాన! శ్రీనృసింహాభిధాన!

సీ॥ శాంతియు శీలముం జాఁటెదవనుటకు సల్పెడు వినయభాషణమె సాక్షి
గ్రామాభిమానంబు గాంచితివనుటకు పంచాయతీకోర్టు ప్రబలసాక్షి
సహకారము ప్రకటు సల్పితివనుటకు కో ఆపరేటివు గొప్పసాక్షి
పరిసరప్రజల మెప్పందితివనుటకు వచ్చిన బోర్డుసభ్యతయె సాక్షి

గీ॥ ఇట్టి నీకృత్యములమెచ్చి యీశ్వరుండు చిరతరాయుష్య సంపదల్ శ్రేయములను
ఇచ్చి సత్ప్రీతు నిరత మీక్షించుఁగాత శిష్టజనగేయ! లక్ష్మీనృసింహరాయ!

గీ॥ పురనివాసులు తాలూక బోర్డునందు సభ్యుఁడఁట ప్రసిడెంటు భాషాభిమాని
యంటు, యిఁక పెద్దితలఁచిన నగును గాదె యహహ యిది పిడుగురాల కేలాటిదశయొ॥

ఉ॥ మీదయకల్మిచేత నొక మేలొనఁగూడె నదేదియందురా?
మాదగు బాలికాపఠనమందిరమే; భవదీయయత్నతన్
గాదను కార్య మెందు ధరఁ గల్గునె యిచ్చటి బోర్డుసూపరిక్
మీఁదట మీరు ప్రెసిడెంటరిస్సూలుగఁ జేయుఁడీ వెసన్॥

ఇట్లు,
వారణాసి లక్ష్మీనారాయణ.

చ॥ నరులకు మేలుగూర్పఁగల నాయకుఁ డాశ్రితవత్సలుండు ధీ
వరుఁడు యశోవిధుండు నృపవంశపవిత్రుఁడు ధర్మవేది ఆ
దరముగలాడు సర్వగుణధాముడు శ్రీయుతుఁడైన వేంకటే
శ్వరు హితవున్ దలంచుచును వర్ధిలుమయ్య నృసింహధీమణీ.

మ॥ పరమార్థంబున దృష్టినిల్పి యశమున్ ప్రాకించి సర్వంసహా
సురవంశమ్ము పవిత్రమున్ సలిపి తేజోమూర్తివై బోర్డునెం
బరునా సంపద గాంచి వాహ్వారెయనన్ పల్నాటిరాజ్యాబ్జమం
దిర కానందముగూర్చినాడవు ధరిత్రిన్ శ్రీనృసింహక్ష్మాపా

ఉ॥ శ్రీవిగలాడవంచు ప్రెసిడెంటుగ వెంకటరెడ్డిగారు సం
భావనజేసి నేడిటుల వచ్చెననన్ సుదినంబుగాదె నీ
పావనమైన వర్తనము బాసిలజేయుము. దీనుల్ కృపా
భావముతోడ జూడుము శుభం బలరారఁ నృసింహధీమణీ.

సీ॥ స్వస్థానమున గౌరవము నీకు గలదన బహుజనుల్ జేయు టీపార్టీ సాక్షి
పదుగురకున్ హితులైనా పంచాయతీకోర్టు నందలి ఆధిపత్యంబె సాక్షి
గౌర్మెంటువారును నమ్మకంబనుచో పరపతిసంఘమునగల పదవి సాక్షి
గురుయశోండదవనంగ కోఆపరేటీవు ప్రెసిడెంటునాఁడను పదవి సాక్షి.
నేటికీవీరు మనపలునాటిలోన బోర్డుమెంబరుపదవిని బొందినాడ
వహావా దండెము రాజు కులాబ్ధిచంద్ర స్థిరగుణాలికాయ లక్ష్మీనృసింహారాయ

తే॥ గీ॥ ఒడుదుడుకులేక పదవుల బడసి సతము పరమగౌరవశీలలన్ బరగుచున్న
మన నృసింహయ్యగారె మెంబరుగవచ్చె నిప్పుడయ్య బుధజనుల్ జనములార.

చ॥ జనములు నీకు వోట్లు నతిసంతసమొంద నిచ్చిరయ్య ఆ
జనులకు జేయగాతగిన సాయములన్ బొనరింపుచుండుమయ్య. బో
ర్డున నిలువన్ సమర్థుడని రూఢిగ జెప్ప నటింపుమయ్య. కీ
ర్తిని గడియింపుమా నమునుతిన్ సతతంబు నృసింహధీమణీ.

సీ॥ పంటూరువంశపావనుడన నిర్ధాత్రి స్థిరయశోధనము నార్జింపగలిగి
హరాణాంధ్రభావల కుదధియంచును జనుల్ పచియింపదగు పేరు బడయగల్గి
కడుపేర్మి నర్థుల గావంగలాడను గౌరవసంపత్తి గాంచగల్గి
పలునాటుగల బోర్డుప్రెసిడెంటు పదవికి దగినవారన ఖ్యాతిదాల్చగలిగి
శ్రీయుతుండగు వెంకటరెడ్డిగారె అమలగుణులైన వీరు మిమ్మరయువచ్చి
నట్టి ప్రజలకు దేవు డత్యాదరమున సర్వసంపదలిడ బ్రోవజాలుగాక.

ఇట్లు,
కన్నెకంటి ప్రభులింగాచారి.

---

నిజాము రాష్ట్రమునకుఁ జేరిన మేడిచెలిమగ్రామనివాసి ధాత్రిక రాజలింగముగారు పరలోకగతులగుటయుఁ దద్ద్వాదశాహస్సున దండిస్వాములవారి యగ్రాసనాధిపత్యముతోఁ దత్పుత్రుఁడు వీరయ్యగారి కాశీర్వాద మిచ్చుటకుఁగాఁ గూడిన సభలోఁ జదువఁబడిన పద్యములు,

శ్లో॥ శ్రీరామలింగకృపయా హ్యాశీర్వాదాచ్చ దండిదండిపతేః
ధాత్రిక వీరయ్యాఖ్యో భూయా దత్యంతవైభవోపేతః

సీ॥ పితృయజ్ఞమునయందుఁ బ్రీతిఁ జేయఁగఁదగ్గ సకలసత్కృత్యము ల్సలిపినావు
భూగోహిరణ్యాది భూరిదానము లెల్ల నెంచి సద్విప్రుల కిచ్చినావు
సకలభూతములను సంతృప్తిఁ జెందంగఁ గర మన్నదానంబు జరిపినావు
ఎవరికి నేరీతి నెలమిఁగూర్పఁగనౌనో కోరి వారికి నవ్వి కూర్చినావు.
అవ్విధంబున సకలంబు నాచరించి జనకు స్వర్గంబునకుఁ జక్కఁ బనిచినావు
స్వర్గమందుండి నీతండ్రి సర్వవిధుల నిన్నుఁ గాపాడుఁగాక వీరన్న యింక

సీ॥ ధాత్రికాన్వయపద్మతరణియై నీతండ్రి శతవత్సరములును బ్రతికినాఁడు
లక్షలద్రవ్యంబు లలి గడించి జమీను దారుండటన్న పే ర్గాంచినాఁడు
అల నిజాంతోఁగూడఁ గలసితానప్డు సంభాషణము సేయఁ జాలినాఁడు
బలిమిఁ దృణీకృతబ్రహ్మపురందరు దండి సగ్గము చేసి యుండినాఁడు
అట్టి భూలోకవిఖ్యాతుఁడైన రాజలింగ మమరావతింగూడ లీలఁ గొంత
యశము నార్జింపఁదలఁచి తా నరిగినాఁడు అతనిపోకకు వీరయ్య హర్షపడుము.

సీ॥ శ్రీరామలింగని స్థిరతరప్రాకార గోపురమంటపా లొప్పించెనొక్కొ
అనువత్సరంబును నమ్మహాదేవున కయ్యెడి యుత్సవం బల్పమొక్కొ
త్వద్వంశంబందున్న తతహర్మ్యములును క్షేత్రారామముఖములు నలఁతియొక్కొ
త్వద్దత్త విత్తకృతవివాహులౌ బ్రాహ్మణులసంఖ్య తలపంగ నొలఁదియొక్కొ
పతితకాయుఁడైన భవదీయపిత యిన్ని కీర్తికాయములను వర్తిలంగ
నశ్వరంపు టొడలినష్టికై వీరయ్య! చింతనొందకీవు చిత్తమందు.

సీ॥ పెండ్లమౌ లచ్చమం బెడఁబాసి రెండేండ్లె మనెఁగాని చిరముండి మనవలేదు
శతవృద్ధుఁడయ్యుఁ ద్వత్కృతసపర్యండై చనెఁగాని లోపంబు నెనయలేదు
చచ్చుదాఁకను మీకు సముచితాలోచనల్ నుడువుచుండెనుగాని యుడుగలేదు
అన్నదానమ్ముల నగ్గలంబగు పేరు పడసెఁగాని కరంబు ముడువలేదు.
అట్టి శ్రీరాజలింగము నాత్మజుఁడవు; ఈవు నటులనె నార్జించి హెచ్చుకీర్తి
నీవు నీతండ్రివోలెను నీదుసుతుల కగుము సన్మార్గదర్శి వీరయ్య! యింక.

సీ॥ తన పౌత్రుఁడైన సీతారామబాలాజి పుత్రునకుంగూడ బుద్ధిగఱపి
మనుమరాండ్రకుఁగూడ మనుమ లుద్భవమంది యాడఁ బాడఁగఁ జూచి హర్షమంది
పెత్తనంబువహించి ప్రీతి నీచేసెడి దేవోత్సవాదులం దృప్తిఁజెంది
నీవును నీసుతు ల్కావించు విద్వన్మహీసురసత్కృతి కెదను మెచ్చి
తనకుటుంబంబునందింకఁ దానెయుండి దిద్దఁదగినది లేదంచు దివికిఁజన్న
నీదుతండ్రిని వీరయ్య! నిర్జరునిగ నెంచి పూజింపు శ్రేయంబు నెనయఁగలవు.

జా॥ షట్ప్రాభిరామశాస్త్రి.

——:౦:——

బ్రహ్మ॥ (స్వ) అక్కటా! ఇతని భాషణంబు లతిభీషణంబులై మదీయ హృన్మర్మనిర్మూలన మ్మొనరించుచున్నవి. చిత్తభ్రమనొందిన మత్తేభంబు నాలానమూలమునకుఁ జేర్ప రమారమణుండే గలండు (ప్ర)

చ॥ సరసగుణావలంబ! నిను శాంతునిఁ జేయఁగఁ జాలఁ గాని నా
గురుతరభక్తిఁ జూచి కడుఁగూరిమినుండెడివాఁడవౌటచే
పౌరిపౌరి నీవిధంబు హితబోధమొనర్చుచునుంటిఁ గాన స
న్నరమరసేయ కింకొకటి యాదృతినై శ్రవణింపఁగావలెన్.

మాటిమాటికి నీవు క్రోధపరీతచిత్తతం బరుగులెత్తుచుండుటయు మేము వారింపఁజూచుటయు సమంజసము కాకపోఁగా మీఁదుమిక్కిలి హాస్యాస్పదముకూడ నగుచున్నది. నీశక్తి నే నెఱుంగుదు. నేన కాదు, ముల్లోకములు నెఱుంగు.

చం॥ ఎఱుఁగక కాదు క్రూరరిపు లెందఱువచ్చిన నీ వొకండవే
దురమున నొంపఁజాలు ఘనదోర్బలశాలివటంచుఁ గాని సం
గరమున రక్తపూరిత మఖాతమహాంబుధి, యీవిధంబు నీ
వెఱుఁగవె దానిఁ గోరనగునే మతిమంతుఁడు మాటిమాటికిన్

మన కెంతధైర్యమున్నను రిపుల బలదర్పంబులుమాత్రము తలంపవలదా? త్వరపడి లోపలి క్రోధముకొలఁది మున్ముందు మనమే డీకొన నగునా?

ఉ॥ యుద్ధముయుద్ధమంచు మది నుబ్బుచునుందురు బిట్టు మీరయో!
క్రుద్ధులరౌచు. దాన నొనఁగూడెడిబాధల నెంచఁబోరు. మీ
పద్ధతి ధర్మసమ్మతమె? ప్రాజ్ఞులు మెత్తురె? యట్టిదానిలో
బుద్ధి చొరంగనీయఁ గని మూఢులటంచని నవ్వకుందురే.

పోనీ మనబలమే యధికమై మనకే విజయము చేకూరుట నిశ్చయమందము. ఎంత దేశక్షోభముగాకుండ నెంత బంధువా

శము గాకుండ నెంతవీరబలి జరుగకుండ నెంతర క్తప్రవాహము పాఱకుండ మన కట్టిజయము చేకూరునా ? చూడుము.

క॥ నాతనయా! నాయన్నా! నాతండ్రీ! నాదు ప్రాణనాథా! యనుదుః
ఖాతతరవములు నిండవె భూతావరణంబుగాదె భూతలమెల్లన్.

మఱియు,

సీ॥ కాంతులం గోల్పోవు కాంతలదైన దుః
ఖోద్ధూతరావంబు లొక్కవైపు
తనయులంగోల్పోవు తల్లిదండ్రులదైన
శోకించుచుండుటలు మఱొక్కవైపు
జనకులంగోల్పోవు తనయులదైన కు
య్యో మొఱో యను నార్పు లొక్కవైపు
అల్లుండ్రఁగోల్పోవు నత్తమామలదైన
యక్కటాయను నేడ్పు లొక్కవైపు
ప్రేతభూతపిశాచముల్ ప్రీతిపడుట
లొక్కవైపు పీనుఁగుపెంట లొక్కవైపు
కలుగ సింహాసనం బెక్కి యలఘుమోద
మెట్టివాఁడైనఁ గాంచ వాంఛించునొక్కొ !

అట్టి సంక్షోభమునకు మనతీవ్రకోపాగ్నియేకదా కారణమగును. అపుడు మొగమెదుట మనల నేమనఁజాలకున్నను జనంబులు వారివారి దీర్ఘశోకపరితప్తతచే నాడిపోసికొనకుందురా? మన మిపుడు కూడు గుడ్డ లేక విలపించుచుంటిమా? ధర్మము నకుఁగదా పూనుకొంటిమి ? దానికి బద్ధులమై ధర్మపద్ధతి నవలంబింప మేలగునా? కాసికార్యమునకుఁ గడంగుట మేలగునా? ఎందుల కింతగోల ?

ఉ॥ చిత్తము క్షోభఁజెందఁ బురసీమలఁ బాడొనరించి సైన్యసం
పత్తిని గోలుపోయి యనివారితశోకముతోడ యుక్తమా
నెత్తురుకూడు గుడ్చుటకె నేల జనించినవార మింక నీ
తత్తరమేల? కాల మదె తారసిలుం ద్వర యోగమున్న చోఁ

వా.లి॥ బలే! ఈ వేదాంత మెచ్చటిది? ఎంతబాగుగానున్నది ?

ఉ॥ రాజుల కెచ్చటేనియు దురంబున నెత్తురుకూడుగాక స
త్పూజనపూర్వకంబయిన భోజనమబ్బునె? కాకయున్న వి
భ్రాజితమైన రాజ్యరమ పాల్పడుటెట్టులు? పూర్వు లిట్టిచో
యోజన సేసిరన్ రణములుండునె? రాజుల మార్పులుండునే?

మన మిప్పటికైనను ధర్మయుద్ధమునకు డీకొనుచుంటిమా? అధర్మమునకుఁ బాల్పడుచుంటిమా? అని విచారింపనేల? మనల నిలుగులపాల్సేసి ధర్మవిదూరులై యిలువెడలఁగొట్టిన వైరుల నుక్కడంచుట యధర్మమగునా? లోకవిరుద్ధమగునా? ఇట్టియుద్ధములు మున్నెవ్వరుం జేసియుండరా? మనమొసటనే ప్రొద్దుపొడిచినదియా?

కొమ్మ:- బావా! ఈవిషయమై నేనుగూడ వీరలతో నేకీభవించుచున్నాను. మీరు నుడివినపద్ధతులు పూర్వయుగంబులనాటివి. ఆనాఁడైనను లోకద్రోహులై సాధుబాధాకలితస్వభావులై నరమాంసభక్షకులై పరద్రవ్యాపహరణ పరాయణులైన రక్కసుల నుక్కడంచుటకు శ్రీమన్నారాయణుఁడే యవతారముల నెత్తి సంహరింపఁడే? వైరినాశన మొనర్చుట పాపములోనిది కాదు. వారు మన కొనరించిన యపకృతులకు మేర యున్నదా? ఇంకను సందియ మేల.

బ్రహ్మ:- (చాటుగా) కొమ్మరాజా! శాంతించుచున్న వీరి కోపానలంబును మరలఁ బ్రజ్వరిల్లఁజేసెద వేల? (ప్ర) పాపమో పుణ్యమో విధికృత మెటులున్నదో యటుల జరుగకమానదు

కదా! ధర్మవర్తనులు ధర్మమార్గమే యనుసరింపవలయును. అప్పుడు ధర్మదేవత తనంతఁ దానే సర్వంబును సమకూర్చు.

పేర్మి:- అన్నయ్యా! నే నెంత మొత్తుకొన్నను మామొఱ లాలకించి యుద్ధమున కనుజ్ఞ యీయరుకదా! అక్కటా! ఎంత ఘోరము? ఎంత సైఁపరానిది?

కొమ్మ:- చిన్నిబావా! మతులెన్ని చెప్పినను మామవద్దఁగాని పండవను రీతి స్వభావమును మానవైతివి.

పేర్మి:- అయ్యలారా! మీరందఱు నేకాభిప్రాయులైన నేమిచేయువాఁడ? వైరిజనశిరశ్ఛేదన సాధనంబులగు నాయుధంబుల మృత్తికనొత్తించి సబలులెల్ల నబలలమాడ్కిఁ బ్రవర్తిల్లిరను నపయశంబు సంపాదించెదము కానిండు.

బ్రహ్మ:- తమ్ముఁడా! అంతవిసుగు వలదు. కొలఁదిదినములలో నీకోర్కెయే కొనసాగునేమో.

పేర్మి:- ఏమైనం గానిండు. బద్ధహస్తులమైతిమికదా!

మలిదే:- అయిన సంధియే సమాదరణీయమని తలంతురా?

బ్రహ్మ:- సందేహమేల జగత్కల్యాణార్థము విద్వేషము మానుటయే నాయాశయము. పూర్వజన్మసుకృతపరిపాకంబున లభించిన మానవజన్మము సార్థకపఱచుప్రయత్నమునకుదూరస్థుఁడై రక్తాన్నప్రియుఁడగువాని జన్మ మొకజన్మ మనంబడదు. అట్టివాని కీర్తిలత రక్తస్రవంతిలో నల్లలలాడుచుండును. వానికి మరల జ్ఞానబీజం బంకురింపదు. పిదప నట్టివాఁ డున్ననేమి చన్ననేమి?

మలిదే:- అయ్యా! మీయుపదేశ మెదుటాడనీయకున్నది. అందులకుఁ గారణము మీరు కావించిన యుపదేశపు మహిమము గాదు. మాకు మీయందుఁగల భక్తి. పాండవులు వెన్నుని రాయబారిగం బంపి యెంతలాభ మొందియుండిరో యంతియే

యొందఁగలము. అప్పుడైనను మామాటలు జ్ఞప్తికిరావా? అన్నట్టులింతలోఁ ద్వరపడనేల, మీమనసునకుఁ గష్టముతోఁచనేల, వినయవిధేయులను మాగౌరవము పాడుచేసికొననేల? మీతలంపే సాగనిండు. ఇపు డేమనెదరు?

బ్రహ్మ:- సంధికార్యము నిర్విఘ్నముఁగ నెఱవేర్చుకొనిరాఁగల చతురమూర్తిని యోజించి నియోగించి పంపవలయును. అట్టివాఁడు మనకందఱికి ననుకూలుఁడుగా నుండవలయు. కావునఁ దక్కిన వారందఱితో దీనిగుఱించి యోజింతము రండు.

కొమ్మ:- కాదన్న సాగనిత్తువా? వదలుదువా? ఏమిలాభము. సరే పోదము రండు.

మలిదే:- అయ్యలారా! ఇంత రాద్ధాంతమేల? ఆకలువలు సంధి కొడంబడువారు కారని నే గట్టిగ నొక్కి వక్కాణించెద. ఒడంబడకున్న యుద్ధము తప్పదుకదా! కానిం డీయనఘుని మనసు నిప్పుడే వ్యథపెట్టనేల. పోదమురండు (అందఱునిష్క్రమింతురు)

---

## తృతీయరంగము.

(ప్రవేశము. బ్రహ్మనాయఁడు, చెల్లమాంబ)

బ్రహ్మ:- తల్లీ! వీరగుణకల్పవల్లీ! నామన మెంతకష్టపడునట్లు చేయుచుంటివి?

తే॥ ఆడుబిడ్డల క్షేమంబు నరయుచుంట
జనులకు విధాయకంబౌట జగమునందు
కోరకుండనె వత్తురు. కోరిపిలువ
నేటికమ్మరో! యూరటమాట లేల?

కాని సందర్భాసందర్భములఁబట్టి త్వరలో రా వీలుచిక్కక

పోవచ్చును. అంతమాత్రమున భిన్నురాండ్రు గావచ్చునా? ఆడువారికి సదా పుట్టింటివారిపై నెక్కువ మక్కువయుంట లోకసహజమగుట భర్త లెంత ప్రేమ చూపుచున్నను సంతృప్తి నొందక సదా వారిని దలఁచుకొని విచారించుచుందురు. లేకున్న నీవిప్పుడు "బహుకాలదర్శనం బబ్బెఁగదా సోదరా" యని కన్నీరు నించెదవా? అయ్యో! నీ దెంతజాలిహృదయము.

ఆ॥ కాకికబురు విన్నఁ గదలివచ్చుచునుంటి
వెళ్ళుచుంటిఁ దగినవీలు గాంచి
ఎదియు లేక నేనె యేతెంచుచుంటిని
రాఁడురాఁ డటన్న రవ్వ లేల?

చెల్ల:- అన్నా! నే ననుటయేమి? ఎప్పుడువచ్చితిరో మీకుమాత్రము జ్ఞాపకము లేదా?

బ్రహ్మ:- లేకేమి తల్లీ? సమయము చిక్కినదికాదు.

చెల్ల:- అకటా! నే ననరాదుకాని యెన్నియసందర్భము లున్నను నీతోఁబుట్టువును జూడకున్న నీమనసుండునా? ఇంతకును నాదురదృష్టవశంబున మీకట్టికరుణ జనింపలేదు. నేఁటికి నాప్రాప్తి మంచిదగుట దర్శన మిచ్చితిరి. అదియే పదివేలు.

బ్రహ్మ:- తల్లీ!

ఆ॥ గద్గదప్రయుక్తకంఠంబుతో నిట్లు
కోపదృష్టి నన్ను గోడుగుడుపఁ
దలఁప నేటి కమ్మ దైవాజ్ఞచేత ని
వ్విధముగల్గె వినుము వెఱ్ఱితల్లి!

ధీరచిత్తవగు నీవును స్వల్పవిషయంబునకై చిత్తంబును దత్తరపెట్టుకొనఁదగదు. నా కపుడు గాదిపుడు స్వస్థత చిక్కె ననుకొంటివా? నీవియ్యంకుని కారణంబున మనమందఱమును మీఁదు

మిక్కిలి మన మాతృసీమయును బడు సంతాపము నానాటికి వృద్ధియగుచుండుటచే నట్టితాప మణఁపఁదగుయత్నము లొన రించుభారము మనవారందఱు నాపైనిడుటచేఁదిరికచిక్కక వెత లొందవలసివచ్చినది. నిజముఁజెప్పెద. ఇపుడుగూడ నేనిందు వచ్చుటకుఁ గారణము నినుఁజూచుతలం పొక్కటియే కాదు. వినుము. మనప్రేమలు మనబాంధవ్యములు నెల్లకాలమునుం డునవే. దేశక్షోభమాత్రఁ మటుండఁదగినదికాదని నీకు నేను బదింబదిగఁ జెప్పవలసినదిలేదు. ఆక్షోభ నెంతత్వరలో నణఁ చిన నంతమేలౌను. తాల్మిచేఁ దప్పక ముప్పువాటిల్లు. అద్దా నికి మనవారందఱు నాఁడినుండియు యుద్ధమే సమంజసమని పట్టుపట్టియున్నను నాకుమాత్రి మటులఁదోఁపకుంట యుద్ధ మేనాటికైన నుండునదేకదా! నయమార్గంబునఁ గొంతప్రయ త్నించిన ఫలముండునేమోయని యోజించి భిన్నాభిప్రాయు లైనవీరులఁ జివరకు విశ్వప్రయత్నమున సంధి కొడంబఱచితి. రాయబారిని బంపవలసె. దానికి నీకుమారుని లోకైకవీరుని సమధిక ధీరుని నిపుణవాక్సారుని మనవారందఱు నేకగ్రీవము గా సమ్మతించిరి. నీయభిమతమును గొని నామేనల్లు నలరా జును రాయబారిగాఁ బంప వచ్చితి. కావున

ఉ॥ అండజయాన! చెప్పఁదగునట్టిది సెప్పితి మంగళాప్తికై
యొందుతలంపు మాని నమయోచిన కార్యభరంబు నూని నీ
యండను జేరినట్టి నను నారడిపెట్టక క్షేమకాంక్షఁ ద
ద్భండనభీము నీదుసుతుఁ బంపుము దీవనలిచ్చి చెచ్చెరన్.

చెల్ల :- (నిర్విణ్ణురాలై యూరకుండును)

బ్రహ్మ:- అమ్మా! ఏమట్లు నిశ్చేష్టురాలవై యూరకుంటివి ?

చెల్ల:- అన్నా! అలరాజును బాసి నేఁ గలనేని నిలువఁగలనా? సుతులు లేక లేక తుద కాగారీపతి యనుగ్రహమునఁ గలిగిన వీనిమొదలఁ బంచప్రాణములం బెట్టుకొని యున్నారమని నీ వెఱుంగనిది కాదు. అట్టిచో నా యుద్దేశమును గనుగొన నీ విట్లాడెదవు గాక. సంధి నొనఁగూర్చుటకు మనవీరులం దెందఱు లేరు?

సీ॥ అని మొన నిల్చిన నరికాండమును జేత
నలిపివైచెడు పెద్దనాయుఁడుండ
దుష్టులౌ వైరు లక్షోహిణు లున్నను
రా యని పోరు పేర్నాయుఁడుండ
క్షణములోపలనె లోకము లెల్ల దిగమ్రింగు
శూరుండు మన రాయవీరుఁడుండ
నాయకురాలిఁ గుయ్యోయనం జేసెడి
ధట్టుండు కన్నమదాసుఁడుండ
మఱియు నెందఱో వీరులు తఱుఁగకుండ
పోటుమన్నీల శౌర్యాబ్ధి పొంగుఁ బాప
గొప్పదొర లెందఱో మిమ్ముఁ గొలుచుచుండ
అకట! యలరాజె కనఁబడెనా మహాత్మ!

బ్రహ్మ:- అమ్మా! ఏల బేలవయ్యెదవు? సంధికిఁ బంపఁదగినవీరులు మనసంఘములో నెందఱో కలరు. నిక్కమే. అయిన నేమి లాభము? పరాక్రమబలదర్పోపేతులని ప్రతివారిని సంధికిఁ బంపవచ్చునా? రాయబారిగా నేగువాఁ డనన్యగుణాధికుండు కావలయును. నాఁ డా భారతయుద్ధంబునకు శ్రీకృష్ణుఁడే తగియుండె. అప్పుడు

ఉ॥ కౌరవవీరు లెల్లఁ దుదఁ గంజదళాక్షుని గట్టనెంచ న
వ్వారల గుండియ ల్వగుల స్వామియొనర్చిన దీ వెఱుంగవా?

# అభినవసరస్వతి.

| సంపుట | జానపాడు | సంచిక |
| --- | --- | --- |
| ౨౨ | ప్రమోదూత సం॥ శ్రావణభాద్రపదములు | ౫, ౬ |

## —♦ స్వవిషయము ♦—

వర్తమానమాసము భాద్రపదము. అయినను దీని శ్రావణ మాసపత్రిక యింతవఱకు వెలువడదు. ఆషాఢ బ ౧ మొదలు భాద్రపద శు ౧ పర్యంతము నెలపదియేనుదినములును నేను జలిజ్వరముచేఁ బీడింపఁబడియుంటచే నీస్థితి పట్టినది. ఇప్పటికిని జ్వరము విడిచినను రక్తవిహీనశరీరుఁడనగుటఁ గూర్చుండి యొకవ్యాసము వ్రాయుటకేని శక్తిలేక కూపకూర్మమువలెఁ బడియుండియుఁ దుద కెట్లో శ్రావణ భాద్రపదమాసపత్రిక లొక్కసారిగాఁ బ్రచురించినందులకుఁ జనవరులు క్షమింతురుగాక. ఈపత్రిక కిది ౨౨ వ వత్సరము. ప్రథమ వత్సరమునను నిట్లే జ్వరగ్రస్తుఁడనై యాజ్వరముచే నొక్క సం॥ పీడింపఁబడితిని - ఇతరామయము లెవ్వియు రాకయుండలేదు కాని పిల్చి పిప్పిఁజేసెడి యింతజ్వర మీలోపల నెప్పుడును వచ్చియుండమి నే యిట్లు నిర్విఘ్నముగాఁ బత్రిక నడపఁగలిగితిని. అట్లే మఱి కొంత కాల మారోగ్యమిచ్చి యభినవసరస్వతికి శుభములొసంగుటకై యిభ రాజ్వరదుఁ డియ్యకొనుఁగాక.

---

## —♦ కృతివిమర్శనము ♦—

గర్గభాగవతము — ఇయ్యది సికింద్రాబాదుపురనివాసులును బాలనీత్యాద్యనేకగ్రంథకర్తలును నగు చిప్రుకుల అప్పయ్యశాస్త్రి గారిచే రచితము. వెల 3-0-0. ఇందు శ్రీభాగవతంబునందువలెఁ గృష్ణకథయే విశేషించి కీర్తితము. కాని యందులేని రాధాసంబంధ గాధ చాలఁ గలదు. గోలోక బృందావన గిరిరాజ మాధుర్య మధురా ద్వారకా విశ్వజి ద్బలభద్ర విజ్ఞానములను నవఖండములచే

సిది మండితము - దీన వ్యాసాద్యను క్తవిషయంబులు విపులముగను దను క్తప్రధానవిషయంబులు క్లుప్తముగను గోచరించెడిని. పండ్రెండు వేలశ్లోకములచే బ్రహ్మర్షియగు గర్గుఁడు రచించిన గ్రంథమున కిది యాంధ్రీకరణము - అప్పయ్యశాస్త్రిగారు పోషకధనమని ౧౨౫ రూపాయల కేర్పఱచి ౧౨ మంది పోషకుల సంపాదించి తద్ద్వారమున నీగ్రంథము ముద్రింపించిరి. ఇందలి కవితాధార ధారాళమై శబ్దాలంకారములతోడను నర్థాలంకారములతోడను గూడుకొని యసూయాపరులుగాక కేవల గుణమునే గ్రహించెడి పండితకవుల నానందింపఁ జేయుననుట కించుకంతయు సందియము లేదు. కాని సర్వత్ర విద్వత్తాభివ్యంజక మగుటనో యేమో చదువ మొదలుపెట్టిన సరసునకెల్ల మఱికొంత భాగము చదువఁ బ్రోత్సహించు సామర్థ్య మీగ్రంథమునకుఁ దక్కుఁవ - దీనిపైఁ జివుకుల వెంకటాచలశాస్త్రిగారిచ్చిన యభిప్రాయ మొకపరి యీపత్రికయందుఁ బ్రచురించియుంటిని. స్వాభిమతముగాని వ్యాసమును సంపాదకులు సాధారణముగాఁ బ్రకటింపరన్న సంగతి సకలలోకవిదితము. వేయేల. బ్రహ్మాండపురాణ వాల్మీకిరామాయణాద్యద్గ్రంథములఁ దెనిఁగించి యాంధ్రదేశమంతట నాత్మీయయశోవల్లిక నల్లించియున్న జనమంచి శేషాద్రిశర్మగారీశాస్త్రిగారి గ్రంథముం దిలకించి తమయభిప్రాయ మనుపుటలో మహాకవిశిరోమణియని మిమ్మనవచ్చునని వ్రాసియుండ నది మొదలు వీరు మహాకవిశిరోమణియని ప్రతివ్యాసారంభమునను బ్రకటించుకొనుచుండ నంతవారియట్టి భాగవతముపై నల్పజ్ఞులమగు నస్మదాదుల మభిప్రాయమీఁగడంగుట యతిసాహసము - అయినను నస్మత్కార్యాలయమున నీగ్రంథ మభిప్రాయప్రదానార్థమయియే యనుపఁబడియుండుటవలనను గనఁబడినపుడెల్ల గ్రంథకర్త జ్ఞాపకము చేయుచుండుటవలనను దోఁచిన ముక్కలు రెండు వ్రాయనైనయది. ఈగ్రంథము వలయువారు సికింద్రాబాదులోని యిమాంబావిడిబజారునం దున్న గ్రంథకర్త పేర వ్రాసికొనఁ బడయఁగలరు.

స్వరాజ్యావాప్త్యుపాయద్విశతి—ఇది స్వరాజ్యకాములగు మనవారిఁగూర్చి చేయఁబడిన ప్రథమబోధ. ఇందు స్వరాజ్యమును సంపా

పెంచుటకు వాస్తవమైన యుపాయ మంతయు ౨౦౦ శ్లోకములచేఁ జెప్పఁబడినది. ఆంధ్రతాత్పర్య సమేతము - గుంటూరుమండలాంతర్గత బాపట్లగ్రామవిరాజమాన శంకరవిద్యాలయ పండితమండలాధ్యక్షులును శతావధానులును బిండాండరామాయణా ద్యనేకగ్రంథప్రణేతలును పాణినీయోత్తరమీమాంసానిపుణులును నగు వేమూరు నృసింహశాస్త్రిగారిచే విరచితమై కీర్తిశేషులైన మండ చినవెంకయ్యగారిచే నేఁటికి మూఁడువత్సరములనాఁడే ముద్రాపితము. ఈగ్రంథకర్తశిష్యులే యెందఱో పండితులై యుండ నట్టిమహాపండితుల కవిత్వ మస్మదాదులచే నేమాత్రము విమర్శనీయము కాదు - గుణముల వేఱుగా విమర్శింపనేలయని యీ గ్రంథమందలి శ్లోకములే కొన్ని క్రిందఁ బొందుపఱచుచున్నవాఁడను.

౨ న పరిత్యబ్దం భారతీయమహాజనసభాకృతే,
న మండలసభారంభా త్స్వారాజ్యం లభతే నరః
౭ ప్రాచీనాచారసంత్యాగా న్నూత్నాచారనిషేవణాత్
న సంఘసంస్కరణత స్స్వారాజ్యం లభతే నరః
౮ తురుష్కస్నేహతో నైవ చండాలస్పర్శనా న్నహి
కారాగారప్రవేశా న్న స్వారాజ్యం లభతే నరః
౧౨ కులాంగనానాం నిర్లజ్జం మహాజనసభాతలే
స్థితో ప్యవన్యసనా న్నైవ స్వారాజ్యం లభతే నరః
౧౩ న తపోదూషణా న్నాపి పూర్వాచారస్య దూషణాత్
వేదవిద్దూషణా న్నైవ స్వారాజ్యం లభతే నరః
౧౭ యథాపూర్వం యథాశాస్త్రం వర్తనా జ్జగతీశ్వరః
యేనకేనా ప్యుపాయేన స్వారాజ్యం దాపయిష్యతి
౧౯ సకలాసుచ చర్చాసు బ్రహ్మద్వేషప్రధానతా
ప్రకటీక్రియతే సభ్యై రైకమత్యం కథం భవేత్

౧౪౨ తురుష్క-మ్లేచ్ఛజాతీయై స్సోదరత్వం యదీష్యతే
భాషామతాచారభోజ్యకృత్యేషు త్వేకతా కథం
౧౪౪ హింసాప్రధానా స్తే మ్లేచ్ఛా అహింసాప్రవణా వయం
తేషాంచ కథ మస్మాకం హృదయే మిత్రతా భవేత్
౧౩౧ కారాగారప్రవేశేన సర్వవర్ణేషు సంకరః
సంకరో నరకాయైవ తేన త త్త్యజతాదరాత్
౧౩౩ దేవాగారే విప్రకూపే చండాలాదిప్రవేశతః
బ్రాహ్మణ్యా ద్ధీయతే నైవ స్వారాజ్యం లభతే నరః
౧౩౪ బ్రాహ్మణ్యా ద్ధీయమానస్య తపోవృద్ధిః కథం భవేత్
తపస్సంపాదనాభావే దేవతానుగ్రహః కథం
౧౩౫ దేవతానుగ్రహాభావే స్వారాజ్యాప్తిః కథం భవేత్
స్వారాజ్యాప్తే రభావేతు కుతః కోలాహలోదయః
౭౫ యదా జనానాం శాస్త్రోక్తోల్లంఘనే సమభూ న్మతిః
తదా రాజ్యం పరాక్రాంతం కిము ద్వేగేన మానవాః
౭౬ అల్పబుద్ధిం పరిత్యజ్య ఘనబుద్ధిం శ్రియంతు భోః
ఇయమేవ ఘనా బుద్ధి రీశాజ్ఞాపాలనం హి యత్
౭౭ ఈశః పశ్యతి సర్వత్ర పుణ్యాపుణ్యాని వై నృణాం
సాక్షీ సర్వస్య లోకస్య సృష్టిస్థిత్యంతకారకః
౮౦ అజ్ఞాతశ్చే త్సాధుమార్గ స్తద్జ్ఞాన్ పృచ్ఛత సాదరం
వేత్తారో ద్యాపి వర్తంతే పూర్వాచారపరాయణాః
౮౧ పూర్వాచారా న్సముత్సృజ్య కిం శ్రేయ స్సమనుష్ఠితం
పూర్వాచారపరాన్ దృష్ట్వా కుతో నిందితు ముత్సుకాః
౮౨ యది శృణ్వంతి మద్వాక్యం తథా కుర్వంతి చే న్నరాః
వాంఛాసిద్ధి ర్భవే న్నూనం స్వారాజ్యం లభతే నరః

౧౧౧ పూర్వాచారపరాన్ దృష్ట్వా నానుతిష్ఠంతి తన్మతం
హూణభాషోత్తీర్ణజనై రుక్తే కథ్యం భవిష్యతి
౧౧౨ కిన్నో రాజ్యేన భోగేన జీవితేన మతే గతే
ఆర్యదేశే సముత్పన్నా అనార్యా అభవన్ ప్రజాః
౧౧౩ ఇతి మాతేవ పుత్రస్య దుర్వృత్తం వీక్ష్య రోదితి
ఇయం నో భారతక్షోణీ మాతా తాం పశ్యతాధునా॥

---

అధర్మానుతాపశతకము—ప్రకృతము మనదేశమునఁ బ్రబలుచున్న యధర్మమునకుఁ బరితాపపడుచు నీయధర్మ మణఁచుటకుఁగాఁ "కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్" తను మకుటముతోఁ గైలాసనాథు భూమిపై నవతరింపుమని ౧౦౦ శ్లోకములచేఁ జేసిన ప్రార్థనమే యీయధర్మానుతాపశతకము - ఇదియును వేమూరు నృసింహశాస్త్రి గారిచేతనే ప్రణీతము. కనుకనే విశేషించి మఱి యేమియు వ్రాయవలసినది లేమి నీగ్రంథమందలి శ్లోకములును గొన్ని మచ్చునకుఁ జూపింతును.

౬ హంతాధునా కలివశా త్స్వపితు ర్నిదేశం
నైవాచరంతి తనయాః పరధర్మసక్తాః
తద్వ త్ప్రజా స్తవ సుశాసన ముత్సృజంతి
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్
౭ పూర్వంతు సౌగతమతే పరితః ప్రపంచం
వ్యాప్య స్థితే నిగమధర్మగణే విలుప్తే
నైవాత్రి శంకరగురుః కి మవాతర స్త్వం
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్
౧౫ బాల్యే వివాహవిధి ర స్తి కులాంగనానాం
ప్రౌఢాంగనాపరిణయస్తు విధీయతేద్య

ఏకాశయై రిహ జనై రపి హూణభూపైః
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౧౯ ప్రౌఢాంగనాపరిణయే నిరయః పితౄణాం
కన్యాపతి ర్నిరయభాగితి తత్ప్రరోధాః
శంభో కృపాజలనిధే బహు శాస్తి శాస్త్రం
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౨౦ శాస్త్రే) దశోపదశవర్షవయా వివాహ్యా
బాలా తతోధికవయా స్సునిషిద్ధ్య తేహి
ఇత్థంస్థితే రజసి దృష్టచరే కథంస్యాత్
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౨౧ ఆజ్ఞాం త్యజేమ నృపతే ర్యది శిక్షణార్హా
యద్వాచరేమ నరక స్తవ శాసనాన్నః
కర్తవ్యమూఢమనసా వినివేదయామి
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౨౨ కాశ్యాదిభూరివిషయేషు సభాం విరచ్య
విద్వద్వరై రఖిలభారతవర్తమానైః
సంప్రార్థితో నరపతి స్తృణవచ్చకార
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౩౩ త్వచ్ఛాసనాని విలిలంఘుయిషూన్ లలాట
నేత్రేణ పశ్య; తవ శాసనవర్తినోస్మాన్
మౌళిలసద్విధుకరామృతసేచిదృష్ట్యా
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౩౬ ఏకైకశో నృపతయో బహుధార్థ్యమానాః
అభ్యర్థనాం భసితహోమసమాం ప్రచక్రుః
కింవాఫలం మనుజయాచనతో బహుస్యాత్
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౧౧ శంభో కలిప్రతినిధీకృత మర్త్యవర్గా
సంస్కృత్యా వేదనాశతత్పరతాం నయాస్వ
భ్రష్టా స్స్వధర్మనిరతానపి నాశయంతి
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౧౨ సర్వే స్వధర్మనిరతా మతరక్షకాశ్చేత్
సద్య స్స్వరాజ్య మనఘం నిజహస్తగం స్యాత్
సార్థం స్వరాజ్యపద మప్యభవిష్యదేవ
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౬౪ మ్లేచ్ఛాంచ పుల్కస మథ శ్వపచాంచ శూద్రాం
విప్రాం యథేహ సహసోపనయాంతి కేచిత్
ఏషా మహత్యపకృతి ర్జగతీతి మన్యే
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౭౭ సంధ్యానమఃప్రతినిధీహ సతీ క్షచూర్ణం
దుగ్ధం పిబం త్యవిశయం ద్విజశబ్దభాజః
ఏవంస్థితే కథ మహో తపసోవకాశః
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

౯౬ పాపం నివారయితు ముత్కట మస్తి కోవా
పీఠాధిపాః కలివశా ద్గురవో ప్యశక్తాః
సర్వేశ్వరస్య తవత ద్వినివేదయామి
కైలాసనాథ శశిశేఖర పాహ్యధర్మాత్

---

నాయకురాలిదర్పము—ఆంధ్రప్రచారిణీగ్రంథమాల కిది ౨౦ వ పుష్పము. చరిత్రాత్మకమైన నవల. గ్రంథకర్త చిలుకూరు వీరభద్రరావుగారు. ఈచరిత్ర పల్నాటివీరులది. అట్టి పల్నాటివీరవనితయే నాయకురాలు. చరిత్రయంతయు నామె దర్పముతోడనే కూడియున్నది.

కాన నీనవలకు నాయకురాలిదర్పమను నామ మన్వర్థము. ఇందలి వచనరచన మృదుమధురశబ్దభూయిష్ఠమై చక్కని నడకగలిగి పుస్తకము చేతఁబట్టి నాలుగుపంక్తులో నాలుగుపుటలో చదివి త్రిప్పి యవతలఁ బడనైవఁదగినస్థితిలో లేక మొదలిడిన నామూలాగ్రము జదివించితీరు యోగ్యత కలిగియున్నది. ఎన్నిమాఱులు చదివినను రుచు లూరుచుండునే కాని పిష్టపేషణవ్యవహార మీగ్రంథవిషయమై పట్టనేరదు. పల్నాటివీరచరిత్రకుఁ బ్రథమమాతృక శ్రీనాథకృత ద్విపదకావ్యము తత్తుల్యములు మఱికొన్నియు. తరువాతిది ముదిగొండ వీరభద్రకవి రచించిన వీరభాగవతమను పద్యకావ్యము. అవియన్నియుఁ దక్కు చమత్కృతు లెక్కువ గలిగియున్నను గొన్నిచోట్ల ద్రావిడప్రాణాయామమువలెఁ దలచుట్టుతిరిగివచ్చినఁగాని కథ సుళువుగాఁ దెలియని స్థితిలో నుండియున్నయవి అట్లుగాక యీనవల యాలోపమును దీర్చినది. కేవల చరిత్రము కాక నవలయని పేరిడుటచే యత్కించిత్కల్పనాకథ యున్నను ప్రాక్తనగ్రంథములలోని సోదెయంతయు లేక యథార్థాంశవిశిష్టమై యలరారుచున్నది. వలయుపట్ల నందులేని ధర్మము నీతి మొదలైనవి సప్రమాణంబుగం జాలఁ గలిగియున్నయది. నలగామభూపతికి బ్రహ్మనాయునిపై వైమనస్యముగలిగింప భారద్వాజ విశాలాక్ష పరాశర పిశున కౌణదంత వాతవ్యాధి బాహుదంత కౌటిల్యాది ప్రఖ్యాతరాజనీతిజ్ఞభాషితోదాహరణపురస్సరంబుగా నాయకురాలు కావించినబోధ యెంతసమంజసముగానైన నున్నయది. ఉదాహరణ కొక్కటి చూపితిని గాని యిట్టివింకను గలవు. లోకోక్తుల కియ్యది పుట్టినిల్లు. ఎచ్చట నేలోకోక్తి రసవంతమై కనుపట్టునో యచ్చట నది యుండితీరును - మొదలీపల్నాటిరాజకుటుంబమునకు నాయకురాలు బ్రహ్మనాయుఁడు ద్వారముననే భేదమేర్పడి క్రమముగా నది మహాయుద్ధహేతువైనట్లు వినుచున్నవారము. ఇం దట్లు

కాక యీభేదమునకు శైవబౌద్ధమతములే కారణమని సిద్ధాంతము చేయఁబడినది. తదర్థమై కావలసినంతకథ పెంపఁబడినది. పెక్కు పాత్రలు సృష్టింపఁబడినవి. బ్రహ్మనాయుఁడు వైష్ణవమతస్థుఁడై రామానుజాచార్యులుంబోలె భక్తులఁ బ్రాంతమునకుఁదీసి పాలించి నట్లు ప్రాచీనగ్రంథములఁ గనఁబడెడిని; గాని నాయకురాలేమతస్థు రాలైనది యంతగాఁ బ్రశంసింపఁబడదు. రాజతంత్రవిషయముననే యామెబ్రజ్ఞ చూపఁబడుచువచ్చినది. అట్టిచో నాకెమెడకును నొక లింగకాయ తగుల్పఁబడినది. ఇదియంతయు స్వకపోలకల్పితమకాని చరిత్రసిద్ధమైయుండదు. "మనోకళంకము, పాపిష్టిదైవము, బలవద్విరోధము, ఊరుకొనుచున్నాను, జ్ఞానములతోఁబాటు, మనోత్సాహము" మొదలైన వ్యాకరణదోషము లున్నను గ్రంథ మామూలాగ్రము నత్యంతశ్రవణపేయమై యనేకపర్యాయములు పఠించినను నానందము గలిగించుననుట కావంతయు సంశయముండదు. ఈగ్రంథమువలయు వారు పిఠాపురములోని యాంధ్రప్రచారిణీగ్రంథనిలయమునకు వ్రాసి కొనవలయును.

---

అవధానాదర్శము—ఇది పిసుపాటి చిదంబరశాస్త్రిగారి గ్రంథ మాలకు షోడశరత్నము. చిదంబరీయమగు నీయవధానాదర్శము తదను జులగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచింపఁబడిన భావబోధినీవ్యాఖ్యతో సంవళితముగూడ. మూలమంతయు మూఁడే శ్లోకములు-మూఁడుశ్లోకములకే మూరేఁడువ్యాఖ్య-పంక్తిసారళ్యము సుబోధము. అవధానసామాన్యస్వరూప మొకశ్లోకమునను, అష్టావధాన శతావధానలక్షణములు తక్కినరెంటను జెప్పఁబడియున్నయవి. "చిత్తైకాగ్ర్య మిహావధాన" మని పరమార్థగర్భితశ్లోకమునకుఁ దత్త్వ

విచారపూర్వకముగానున్న భావబోధినీవ్యాఖ్య మృదుమధురమై చదువరులమది నాకర్షింపఁగలదియై యున్నయది. ఈగ్రంథము గ్రంథకర్తయొద్దనే దొరకును. ఆయన ప్రకృతము పిఠాపురసంస్థానపండితులలోఁ జేరియున్నవాఁడు - కావునఁ జిదంబరశాస్త్రిగారు, పిఠాపురము అని వ్రాయనగును.



## —∗ ధర్మప్రబోధము ∗—

( వేలూరు నృసింహాచార్యులుగారు )

చ॥ సరసిజసంభవ ప్రభృతి సర్వసుపర్వనుతిప్రపూర్ణమై
దురితలతాలవిత్రమయి దుర్భరకష్టవిదూరమై పరే
శ్వరునకుఁ బ్రీతిదంబయి శుభంకరమై తగు ధర్మ మిప్డు దు
స్తరవిపదంబుధిన్ బడఁగ సాగెను మేల్కొనరయ్య సోదరుల్ !

సీ॥ త్రాఫింగు బూట్సు నెక్టై దాల్చ నింగ్లీషు
భాషనే సేవింపఁబఱఁగినారు
బూట్లకాళులతోడ సీట్లపై వేంచేసి
సాపాట్లు సేయఁగా సాగినారు
“ బైబిల్ కరెక్టు, ఈపాడువేదములు వ్య
ర్థము ” లని నిందింపఁ దవిలినారు
“ తండ్రి శ్రాద్ధ ” మటన్న “ ద్రవ్యహానియెకాని
పుణ్యమే ” మని పల్కఁబూనినారు
తే॥ గీ॥ కాఫితోడనె సంధ్యాదికములఁదీర్చు
కొనుచునున్నారు, సామాన్యజనులఁ జేరి

ద్రొక్కుచున్నారు స్వోదరపోషణార్థ
మక్కటా ! స్వీయగౌరవాజ్ఞానిజనులు ॥

సీ॥ ఋగ్వేదమున కనంత్యప్రశ్నార్థము లిఖించు
దేశభక్తుఁ డొకండు తేజరిల్లె
మనపురాణంబుల గుత మబద్ధంబను
పండితుఁ డొక్కండు పరిఢవిల్లె
చర్చించి యిఁక రజస్వలకుఁ బెండిలిసేయ
వలెనంచు నొక్కధీవరుఁడు వల్కె
విధవావివాహదుర్విషయంబు నడిపింప
ఘనుఁడొక్కరుండు కంకణము దాల్చె

తే॥ గీ॥ నాడువారికి స్వాతంత్ర్య మప్పగించి
వంటయిలు సేరఁదలఁచిన ప్రాజ్ఞవరుల
కాకరంబగుచుండె నీ యమలమైన
భరతభూమి యిదెట్టిపాపంబొ కాని ॥

క॥ నానాఁటికి ధర్మమునకు
హాని ఘటించుటను గాంచ నయ్యయ్యో ! కడుఁ
మానస మల్లాడెడుఁ జల
మూనక యిటు లూరకుండ నొప్పునె మనకుఁ ?

---

( ధర్మదేవతా విలాపము )

చ॥ తనయుల్ పితృవిరోధకారణచణుల్ ద్రవ్యానుకూలుల్ నృపుల్
వనముల్ పల్లవపుష్పహీనములు దుర్వ్యాపారశీలుల్ ద్విజుల్
కన నిస్సారము భూమి నీచజనముల్ మాహాత్మ్య సంశోభితుల్
కనులన్ గానరు నన్ను నీప్రజలు దుష్కాలప్రభావంబునన్ ॥

శా॥ నేనే ధన్యతమప్రభావ నగుదేనిన్ మామకీనోన్నత
స్థానంబే యగు నేని నైషధహరిశ్చంద్రాదులో రాముఁడో
క్ష్మానాథాగ్రణియైన యాపృథువో కా కాపాండుపుత్రాగ్రసం
తానంబో మనియున్న నాబ్రతుకు వ్యర్థంబౌనె యీతీరునన్ ?

శా॥ ఏవేళన్ గరుణాకటాక్షమున నన్వీక్షించుచున్ సత్పథ
శ్రీవర్ధిల్ల మదీయసంతతి నినున్ సేవింపఁగా నెంచఁగా
నీవైక్లబ్యముఁగూర్చినాఁడ విఁక నే నేమంచుఁజింతింతునో
దేవా ! యేగతినన్ను నేలెదవొ నీదే భార మో శ్రీహరీ !

సీ॥ కులగోత్రముల పేరు గూలఁద్రోయఁగనున్న
విధవావివాహముల్ వ్రీలుఁగాక
కాలమాహాత్మ్యసంఘటితంబులైన దు
ర్మార్గసంఘము లెల్ల మడయుఁగాక
సతతంబు సదమలాచారసంపన్నులై
క్ష్మాసురాదులు కీర్తిఁగాంత్రుగాక
పతిపాదచింతనాపరు లౌచు వనితలు
సదమలమతి నెగడెదరుగాక
తే॥ గీ॥ మహిని బ్రౌఢావివాహముల్ మ్రగ్గుఁగాక
భారతీయులధర్మప్రచారమునకు
భీప్రదంబగు శారదాబిల్లు రద్దు
పఱుపఁబడుఁగాక శుభములు వఱలుఁగాక ॥



## బెజవాడలో జరిగిన ప్రథమాంధ్రదేశ స్త్రీసనాతన వర్ణాశ్రమధర్మ మహాసభలో నధ్యక్షురాలైన గుడిపూడి యిందుమతీదేవిగా
## —* రిచ్చిన ఉపన్యాసము *—

నేఁడు మన మిచ్చట సమావేశమగుట సనాతనధర్మాచారవిరుద్ధమగు శారదాశాసనమువలనఁ గలుగు నరిష్టములంగూర్చి సంభాషించి తెలిసికొనుటకును తెలుపుటకును - నే నిదివఱకు ... నెక్కువగా సభలకు వెళ్ళలేదు. సభలయం దధ్యక్షత పూనలేదు. పూనుటయం దామోదమును సమర్థతయును లేదు. నేఁడీ యధ్యక్షతను బూనుటకియ్యకొనుటకైనను సనాతనధర్మాచరణతత్పరులును నార్యులును బూజనీయులును జనకసమానులును నగుపెద్దలయనుమతి ద్రోసివేయఁజాలకయు సనాతనధర్మవిషయములు ముచ్చటించుతలంపుతోడనే కాని గొప్పఁదనమునకుఁ గాదు. ఎవ రెట్లు తలంచినను సరియే.

ఇదివఱకు మన దేశమున ద్విజజాతులయందుఁగల బాల్య (రజస్వలకాకపూర్వము చేయు) వివాహములు మంచివి కావనియు, నందుచేఁ బసితనమునందే మరణములును బాలవితంతువులును బలహీనసంతానములును బ్రబలుచున్నవనియు స్త్రీల నడఁగఁ ద్రొక్కుచుండిరనియు, స్త్రీలకు స్వాతంత్ర్యహీనత కలుగుచున్నదనియు నిట్టి యరిష్టములను దొలఁగించి స్త్రీల నుద్ధరించి దేశమున కౌన్నత్యము గలిగించు తలంపుతో నీ వివాహగర్భాధానవయోనిర్ణయశాసనమును దెచ్చిపెట్టి కృషిసల్పి మనవారు కొందఱు విజయము నందిరి. రాఁబోవు నష్టములు యోజింపలేదు. మఱియు సనాతనధర్మపరాయణులగు ఛాందసులు శారదాబిల్లునకు విరుద్ధాభిప్రాయము లిచ్చి యోడిపోయిరనియుఁ బరిహసించుచున్నారు. సత్యమే. కలిలో ధర్మపరులే యోడుచున్నారు. ఉభయపక్షములును గెలుచుట కలదా? గెలిచెడువ్యాజ్యములన్నియు న్యాయవంతములేనా? ఈఛాందసులు పేరుకొఱకును మంటిమొద్దయినను మామొద్దే గెలువవలె ననుతలంపుతోను బంతమునకుఁ బోరాడుటలేదు ... స్త్రీలమర్యాద భంగమగుచున్నదనుతలంపుతో నీ రీ బిల్లునకు వ్యతిరేకభావము కలవారగుచుండిరి. ఈ బిల్లునకు స్త్రీలును బురుషులును నందఱుగాని యెక్కువమందిగాని

పాశ్చాత్యనాగరకతాభిలాషులును పాశ్చాత్యవిద్యాసంపన్నులును నగు పురుషులే పాశ్చాత్యవ్యామోహములపాలై పూర్వాచారముల నిందించుచు స్త్రీలనుగూడ బలాత్కారముననీయుద్యమములోనికి దింపిరి మూఢవంతులు పాశ్చాత్యపద్ధతులయం దభిలాషగల స్త్రీలే యీయుద్యమమునఁ బాల్గొనిరి. రాఁబోవుకష్టములను గుఱుతింపఁజాలనివారును నమాయికలును నగుబాలిక లరచేత స్వర్గమును జూపెద మను మాటలు నమ్మి సరియనిరేమో! సిమ్లాలో నిట్టివిద్యార్థినులగు బాలికలనే కొందఱను దీసికొనివచ్చి వారిచే శారదాచట్టము కావలెనని పలికించిరఁట - బాలికలకు వివాహము పదునాలుగేండ్లకు లోపలఁ జేయరాదని విధించిరేకాని యటుపైని వివాహమొనర్చుట కిన్నియేండ్లవయసను నిర్ణయమే లేదుకదా! ఇంకేమున్నది? కట్టుబాటు లేకుండుట శ్రేయోహానియు ధర్మనాశనమునుగదా? పదునాలుగేండ్లకు వివాహమైనచో బాల్యమరణములు తప్పునా? భర్త యప్పుడు పోయినను నామె బాలవితంతువేకదా! సరే. బాలవితంతూద్ధరణమునకుఁ బునర్వివాహమున్నదికదా! ... కన్నబిడ్డలయొక్క శ్రేయమును దల్లిదండ్రులకంటె నెక్కువగా విచారించువారెవరు? కన్య కనుకూల వరుఁడు లభించువఱకును దలిదండ్రులు పడుకష్టము లెవరెఱుంగరు? ...సంసారమందలికష్టసుఖములును బాధ్యతాబాధ్యతలును గుర్తెఱింగిన తలిదండ్రులకంటెఁ గన్య యెక్కువ విచారింపఁగలదా? ఇష్టమైనవాని వరించుబాధ్యత యామెకే యియ్యవలెననుట న్యాయ్యమా? ఇంతకాలము గడచినజననీజనకులకంటె నేపాశ్చాత్యవిద్యనో యభ్యసించినకన్య వరునియందలి యేసుగుణాధిక్యము కనిపెట్టి వరింపఁగలదు? నేఁడు రూపవంతుఁడుగా నుండువాఁడు రేపు కురూపి గావచ్చును. బలవంతుఁడు బలహీనుఁడు గావచ్చును. నేఁ డభిప్రాయము లేకమైనను రేపు భిన్నములు గావచ్చును. ఉభయులందును బలుతావుల నిట్టిమార్పు జరుగుచుండుట చూచుచున్నారము. అంతమాత్రమున నాదాంపత్య మనుకూలము కాదనవచ్చునా? బాల్యవివాహములైనవారికే యిట్టిభేదములు కలుగునుగాని ప్రౌఢావివాహములైనవారికిఁ గలుగుటలే దనుటకు వీలులేదు. అభిప్రాయభేద

కొడనాడి వేఱుస్త్రీలఁ బెండ్లాడుదు రనియుఁ జెప్పుచున్నారు కదా! బాల్యవివాహములైనవా రందఱు నట్లు చేయుచున్నారా? లేదు. గడుసు భార్యలును గడుసుపురుషులును లెక్కకు మిక్కిలి గలరు. పౌరుషముచేఁ బురుషుఁడు స్త్రీలగడుసుదనము ప్రకటింపక ధీరత్వముతోఁ దిరుగుచున్నాఁడు. అయితే భారతస్త్రీలలో గడుసువారలును బాశ్చాత్త్యులవలె వేఱొకనిఁ గట్టుకొనుట కిచ్ఛగింపరు. కావునఁ హిందూదేశమున నీకను బుణ్యాత్మల మింక లేదు. కీర్తిజ్యోతి చల్లారలేదు. స్వభావముచేతఁగాని సంఘమర్యాదవలనఁగాని సనాతనధర్మబద్ధలగుటవలనఁగాని భారతరమణీమణులు తమమానమును దేశమహిమను రక్షించుచున్నారు. అయితే నట్టిసాధ్వీమతల్లులు పురుషులకు లోఁబడి యేల యుండవలెననియు వారికిని బురుషులతోపాటు కొన్ని హక్కులు కావలెననియు నట్టిహక్కులు సంపాదించి స్త్రీల నుద్ధరింపవలెననియు నిట్టిచట్టమును నెలకొల్పితి మనియందురు. వంశప్రతిష్ఠకై సంతానోత్పాదన నిమిత్తము వివాహమని యార్యుల సదుద్దేశముకాని కేవలము విషయలంపటులై సమయజ్ఞత లేకుండ వర్తించుటకై కాదు. అట్లు సంతానము భార్యయందు లేనపుడు వేఱొక సత్కులప్రసూతయగుకన్యను బెండ్లాడి పడయుటకుఁ బురుషునకు హక్కు గలదు. అయితే సంతానములేనివారందఱు నట్లు చేయుచున్నారా? లేదు. దత్తపుత్రుని స్వీకరించి సద్భావముతో వర్తించుచున్నారు. కాకున్నను భార్యపోయినపుడును రోగిష్ఠయగుటచే సంతతి లేనపుడును మరల వివాహమాడుటకుఁ బురుషునకు హక్కుగలదు. అది న్యాయవిరుద్ధము కాదు. పురుషుఁడు బీజప్రదాతయగుటచే సంతతిని గలిగించుట కాయధికారము సంఘ మిచ్చినది. అట్టియధికారము స్త్రీలకుఁగూడ నిచ్చినచో మానహానియు నారోగ్యనాశనమును నాయుర్నాశనమును జాతిసంకరమును ధర్మభంగమును నగునని యిచ్ఛగింపలేదు. అట్టిపాడుధర్మము నార్యు లుపదేశింపరాదు. స్త్రీ లిట్టివాని కియ్యకొనరాదు. ఇచ్ఛగింపరు. జనకులు క్రూరులై బాలికలను ధనవంతులగు క్రూరులకుఁ గట్టిపెట్టుచున్నారఁట. సరి. ఇట్లు బాలికల నమ్ముకొనువారు నూటి కొకరిద్దరే కాని యందఱు నట్లు చేయుచుండిరా? దారిద్ర్య

పరమదరిద్రుఁడు. వరశుల్కము దీసికొనువా రుత్కృష్ట ధనవంతులు గదా! వరశుల్కము పాశ్చాత్య విద్య హెచ్చినతోడనే హెచ్చినది. మున్ను ధనవంతులు కన్యాదాతను ధనము కోరలేదు. అయితే తెలివిలేని విద్యాహీనుఁడగుటచేఁ గుజ్జువాఁడు వరశుల్కము కోరలేదని యిప్పు డీబిల్లునుగోరుచువా రపహసింతురు. ఇఁక బలహీన సంతానమునకును వివాహమునకును సంబంధమేమి ? బలహీను లనుగా వివాహము చేయలేము. అందులకుమార్గము లనేకములు గలవు. స్త్రీపురుషులు పూర్వధర్మములను వదలిరి. జపతపోధ్యయనాదినిత్యసత్కర్మములు మానిరి. స్వభాష్యస్వవిద్య మానిరి. పాశ్చాత్యవిద్య రాకముందు వేదశాస్త్రపురాణాదుల నభ్యసించి మహావిద్యావంతులైన మనపూర్వులలోఁ జత్వారమువచ్చినప్పుడు తప్పఁ గన్నులకు జోడు తగిలించినవారు గలరా ? ఇందులకుసాయము కిరసనాయిలు దీపములు చాలక యింటిలోను వాకిటిలోను విద్యుద్దీపములుగూడ వెలిఁగించిన దృష్టిబలము నశించుట కాలస్యముండునా ? ధనవంతుల సౌకర్యములు దరిద్రులకొంపలు తీయుచున్నవి. ప్రతిదినమును రాత్రుల నాటకములును సినిమాలును జూచుచు మేల్కొనుటచే నజీర్ణరోగమును బగలు నిద్రించుటచేఁ గఫవాతోద్రేకమును సూర్యోదయాస్తమయవేళల నిద్రించువానికిఁ గుష్ఠక్షయరోగములును దస్మాలమున నాయుఃక్షీణతయుం గలుగును. బ్రాహ్మముహూర్తమున మేల్కొనకయు నకాలమున నిర్వర్తించుకర్మములఁ ద్యజించియు స్నానాదికములాచరింపకయే యాహారము పుచ్చుకొనుచు స్త్రీపురుషులందఱును గాఫీగతప్రాణులైరికదా ! ఎప్పుడు నిద్రలేతురో యప్పుడు కాఫీ సిద్ధముకావలె. కాఫీహోటలులయందు నానాసంకరపదార్థములను భుజించుట యారోగ్యహానిగదా ! ఇఁక బలహీనత రాకుండునా ? అట్టి వారికి బలముగలసంతతి గలుగునా ? కాఫీగూడఁ బాశ్చాత్యవ్యామోహమేకదా ! కొన్నిజాతులు సురాపానముచేఁ జెడుచున్నవనియే దుఃఖించుచున్నాము. ఇప్పు డన్నిజాతులను నీకాఫీపానము ముంచి వేయుచున్నది. ఋతుదోషము స్త్రీలకుండుటచే నెప్పటికప్పుడు తద్దోషనివారణార్థము లఘువ్యయములతో లభించువస్తువులను మన

ధము. ముఖమునకును పాదములకును నొడలికిని బసుపు పరమౌష
ధము. ఇవియే స్త్రీల కలంకారములగుటగూడ సత్యము. వితంతువు
లకుఁ బసుపు మొదలగునలంకారములు వలదనిరిక దా! అందుకుఁ బ్రతిగా
గోమయతులసీమృత్తికాదు లలఁది స్నానమొనర్ప విధించిరి. చందనలే
పనముగూడ ముఖ్యమగు నారోగ్యౌషధముగా నిశ్చయించియే భారతీయు
లాచరించిరి. ఇట్టి సద్విధులు త్యజించుట బలహీనతయు నాయుఃక్షై
ణ్యముగదా! బలవంతులగుబిడ్డ లెట్లుకలుగుదురు? సరియే వివాహము
పదునాల్గవయేటఁ జేసినను నింకను ప్రౌఢత్వముగలిగిన వెనుకఁ జేసినను
దరువాత వారికి నిరంతరము నైతికబలము వలదా? బ్రహ్మచర్య మవ
లంబించుపద్ధతియు నందులకుందగు బుద్ధిబలమును వలయును. దాని
కొఱకు నీతిసహితమగు స్వజాతివిద్య కావలెను. ఎంతకాలము పాశ్చా
త్యవిద్యావలంబులై పాశ్చాత్యలంపటలఁ జిక్కుకొని పాశ్చాత్యపద్ధ
తులఁగని యుబ్బితలూఁగుచుఁ గత్తిమీఁదితేనె నాకనెంచెదరో
యంతవఱకును మనవారికి సుఖమును స్వాతంత్ర్యమును నారోగ్యమును
బలమును నీతియు ధర్మమును బుద్ధియు నశించుచుండును. ఇది
ముమ్మాటికి నిజము. మేయోకన్య మనదేశమునంగల లోపముల
నెత్తి యవహసించుచు నందులో నీబాల్యవివాహ మొకలోపముగాఁ
జెప్పి యిందుచే భారతీయులు స్వరాజ్యాధికారమున కర్హులుకారని
పల్కినదఁట. దానితో మనవారికి మఱింతయావేశము కలిగినది. ఆ
యాక్షేపణఁ బాపుకొనుటకు మనవారు గట్టియత్నమొనర్చిరి. పురు
షులే యత్నించిరి. బలాత్కారపఱచి స్త్రీల కుత్సాహముగలిగించి
దింపిరి. మహాత్ముఁ డింతకాలమునుండి సత్యాగ్రహముచేతను నిట్టుప
వాసములచేతను వివిధోపాయములచేతను సాధింపఁజాలని స్వరాజ్యము
వీరు రజస్వలావివాహముచేఁ దేనెంచిరి. మహాత్ముఁడు శాసనముల
బాధల నిగ్రహింపనెంచెను. ఇదివఱకున్న శాసనము లుండఁగా నవి
చాలక వీరు బిడ్డలపెండ్లిండ్లకుఁగూడ నింకొకక్రొత్తశాసనముం దెచ్చి
పెట్టిరి. వివాహము లిట్లు చట్టములోఁ బెట్టుటకు మహాత్ముఁ డొప్పు
కొనినాఁడని కొందఱనిరి. మహాత్ముఁడు పురుషులనే పాశ్చాత్యవిద్య
మానుఁడని చెప్పియుండె. ఎవరో కొందఱు మానిరి. అట్టిచో స్త్రీలను
గూడఁ బాశ్చాత్యవిద్య నభ్యసింపుఁడని చెప్పెనా ? జపానుసిల్కులు

మునకు నాడంబరములే కదా ? ఇవన్నియు నేల ? నిశ్చయముగా విదేశాచారములఁజూచి నిజస్థితి సావధానబుద్ధితో విచారింపక వారం దఱును స్వతంత్రులై నవనాగరకతాప్రభావముతో సుఖవిలాసము లతోఁగలియుగస్వర్గ మనుభవించుచుండిరని యెంచిమనవారలు నట్లుండ వలెనని తలంచిరి. కాని యాదేశములోఁ బ్రౌఢలకే వివాహములు కాకపోవుటచేతను సంఘములో జాతినీతిమతములకుఁ గట్టుబాటు సరిగా లేకపోవుటచేతను పెద్దలయాజ్ఞకు బద్ధులుగాక వర్తించుటచేతను స్త్రీలలోఁ గలుగుదురాచారములును భ్రూణహత్యలును నవివాహి తలు బిడ్డలతల్లులగుటయు మొదలగు కీర్తినీతిశ్రేయోనాశనకరకృత్య ములు లెక్కకు మిక్కిలి జరుగుచుండుట చదువుచున్నారము. వినుచున్నారము. ఎవరికి నక్కఱలేని తండ్రు లెవరో తల్లు లెవరో తెలియని శిశువులు వేలకొలఁదిగ నచ్చటఁ గలరఁట. ఇఁకఁ జెప్పవల సినదేమున్నది ? ఇట్లని దేశభక్తాగ్రగణ్యులును బాశ్చాత్యదేశపద్ధతు లన్నియుఁ దమకన్నులతోఁ జూచినవారును నగులజపతిరాయి మొద లగుధీరులు చెప్పియుంటయేకాక పాశ్చాత్యులుగూడఁ దమదేశాచార ములు దురంతములుగను దమకే కంటకములుగను నుంటచేఁ దమ పద్ధతుల నవలంబించి స్వచ్ఛనీతిపరులగు భారతీయులు ధర్మభంగ మొనర్చి పాడుగావలదని పలుమంది పలుసారులు హెచ్చరించి వ్రాసి యుండిరని వినియుఁ జదివియు నున్నారము. రజస్వలావివాహమువలనఁ జెడుట యేలకలుగునని కొందఱడిగిరి. దాని కిదివఱకు మనపెద్దలు చెప్పినసమాధానముకంటె నే నెక్కువగాఁ జెప్పఁజాలను. అయినను స్త్రీల కిక్కడఁ దోఁచినంత చెప్ప నెంచితిని. ప్రౌఢావివాహముఁజేయు జాతులు కొన్నిగలవు కాని రజస్వలలై యవివాహితలగుకన్నెలను గాపాడుటకే ఘోషాపద్ధతి నేర్పఱచి వారు పడుకష్టము లిన్నికాదు. ఘనవంశజులగువారు చాలనిబ్బందులు పడెదరు. ఇఁకఁ గొన్నిసంకర జాతులు గలవుకాని వారు జాతినీతిదూరులై పాశ్చాత్యాచారముల వంటియాచారములు పూనుచున్నారు. ఉత్తమజాతివారమగు మనకు వారిజోలి యేల ? బాల్యవివాహములైనవారికే చిన్ననాటనుండి వీరు తనవారనుస్నేహము పాదుకొని పోవుటచేఁ బ్రేమములు మెండుగా నుండును. ఎప్పుడును విడనాడఁ జాలరు. బాల్యస్నేహమే విలువగలది.

టచేఁ దాత్కాలికసుఖము నిచ్చగించి జాత్యంతరపురుషులతోఁ జేరవచ్చును. రజోదర్శనమునకుఁ బూర్వమే జనకులు భర్తను విధించియుంటచే వయోవతియై హృదయము వేగమునొందినను నీతికిని సంఘమర్యాదకును గురుజనాజ్ఞలకును బద్ధురాలయి నిర్ణీతభర్తయందే లగ్నమైనచిత్తవృత్తిగల దగుచున్నది. రయిలులో నొకరు నాతో "బాల్యమున జననీజనకు లొకరికిచ్చి వివాహముచేసి వానిఁ బ్రేమింపవలసినదిగా విధించిరికదా! బుద్ధి దెలిసిన వెనుక నామె కింకొకచోటఁ గోరిక గలిగినచో మనంబు నరికట్టియుండఁగలదా? పుట్టినకోరికల ననుభవింపకుండు టెట్లు? కోరికలు కలుగకుండవలెనే కాని కలిగిన వెనుకఁ దీర్చుకొంటయే యుక్తముగాని మనసులో నడఁచిపెట్టి పైకి లేనట్టుల నటించుటచే నేమిమేలగు" ననిప్రశ్నించిరి. అందుకు యోగశాస్త్రప్రవీణులును ధర్మనీతిశారీరక శాస్త్రసంపన్నులును గుణగ్రహణపారీణులును నాధ్యాత్మిక చింతానిమగ్నులును నగు భారతఋషులధ్యాత్మవిద్యోన్నతి దేశమున స్థాపించి మనోనిగ్రహోపాయముల నెఱింగించిరి. దుశ్చింతలు మనంబునఁగలుగుట దోషమే. అట్లుకలిగినను నిగ్రహింపలేకుండుట మఱియు దోషము. చెడ్డతలంపు కలుగుట మంచిదికాదు. కలిగినపుడు నిగ్రహించుటచే ధీరోదాత్తయగును. ... ... ఎప్పుడును భారతస్త్రీల పాతివ్రత్యప్రభావముచేతనే భారతపురుషులకు సుఖగౌరవానందౌన్నత్యములు సేకూరుట. దేశమున కభ్యుదయము గలుగుట. ప్రకృతము పురుషు లాధ్యాత్మిక విద్య గోల్పోయి స్త్రీలకును లేకుండఁజేసిరి, చేయుచున్నారు. ఇంకనేకొంచెమైనను స్త్రీలయందు జ్ఞానధన మున్నదేమోయని నిర్మూలనమొనర్పఁ గంకణముగట్టిరి. స్త్రీలను దయచే నుద్ధరించుటకుఁ గాదు. సనాతనపద్ధతుల నణఁగఁద్రొక్కి యధోగతిపాల్చేసి చెడుపేరుదెచ్చుటకే వీరితలంపులు, మార్గములు. ఇవి పాశ్చాత్యసహవాసజనితదోషములే. మనదేశమున కెట్లుపకారకములగును? స్త్రీలమహిమచే నింతదనుక మంచిపేరుతో నున్నదేశము స్త్రీలు ధర్మభంగ మొనర్చినచోఁ గీర్తిసౌఖ్యములు చెడి నశింపదా? గీతలయందుఁ బ్రథమాధ్యాయమునఁ గృష్ణార్జునసంవాదమునందుఁ జెప్పిన ట్లధర్మమువలనఁ గులము నశించును. స్త్రీలు కులధర్మమును దప్పివర్తించుటచే జాతి సంకర మగుచున్నది. జాతి సంకరమగుటచే వర్ణాశ్రమాచారములు నశించుచున్నవి.

వాదము లొనర్చువారి కివి యన్నియు రుచింపకపోవచ్చును. వారప
హాస్యము లొనర్పవచ్చును. లోప మేమి? పూర్వాచారపరులగు ఛాం
దసు లెంతవాఁగిన మన కేమి, ప్రభుశాసనములు దెచ్చిపెట్టి ...
మనపట్టుగెలిచిన దనిపించుకొందమని పూర్వాపరవిచారణ మొనర్పక
రాఁబోవుచిక్కులఁ దలంపక యందఱిని నొక్కమార్గమున బురదలో
దింప నెంచుటయే వీరికి ధర్మమనితోఁచినది. సనాతనధర్మపరు లిప్పు
డేమిచేయుదురు? అందఱు నీశాసనమునకు బద్ధులైతీరుదురని కొంద
ఱపహసించుచున్నారు. నలుప్రక్కలను దావాగ్నిమండుచు దరికొని
నపుడు సంతోషించువారును దుఃఖించువారును దానిలో భస్మముకా
వలెను. క్రొత్తలోఁ గష్టముగానున్నవి తరువాత సంతోషదాయకములు
గా మాఱును, రామమోహనుఁడు సహగమనము మాన్పినపుడు క్రొత్త
లో దూషించి తరువాత నందఱును భూషించిరి, ఈబిల్లువిషయము
నట్టిదే యని కొంద ఱనుచున్నారు. సహగమనము మాన్పినపుడు
బాలవితంతువులు ధర్మబాహ్యముగా వర్తింతురని వారే దుఃఖించిరి.
కొంతవఱకు వా రూహించినట్లే జరుగుచున్నది. సహగమనము వారి
యిచ్ఛానుసారము కాని బలాత్కృతము గాదు. ... ఈశారదాబిల్లు
దేశము నాక్రమించెనని కొద్దిరోజులలోనే బిల్లుకోరినవారే మరల
విచారపడఁగలవారలు. కావున బాగుగా యోజించి భారతనారీమణు
లెల్లరును బైపూఁతకు భ్రాంతిఁజెందక రాఁబోవుహానివృద్ధులఁ దెలిసి
కొని బిల్లునకు వ్యతిరేకమగుసనాతనధర్మమును వీడక యీ బిల్లును
రద్దుపఱపుఁడని ప్రార్థించుచుఁ బ్రభుత్వమువారిని భారతధర్మమును
ధ్వంసమొనర్చుపద్ధతులకుఁ జేయూఁతనుండకుండుటకుఁగాఁ గోరుచు
విన్నవించుకొనుటకై మనవిచేయుచున్నాను. ధైర్యసాహసములతో
మనద్విజజాతిధర్మపద్ధతి వివాహములొనర్చుటకు బద్ధకంకణులు కావలె
నని కోరుచున్నాను. శ్రీమతి విక్టోరియారాణిగా రొనర్చిన వాగ్దాన
మును భంగంబొనర్చి సర్వజనసమ్మతము కానిదియుఁ గొలఁదిప్రజలు
మాత్రమే కోరినదియు నగుచట్టమును భారతీయులకుత్తుకలఁ దగిలిం
చుట ప్రభుత్వమునకును కీర్తిభంగము. ఇదియంతయు యోజించి ప్ర
భుత్వమువారు భారతీయులయభ్యుదయౌన్నత్యముల నిల్పఁగోరుచు
బహుజనాభిప్రాయవ్యతిరేకమగు నీచట్టమును మార్పుచేయుదురనియుఁ

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి; 'వాణి నా రాణి'

"వశ్యవాక్కులగు పండితాగ్రగణ్యుల యభిప్రాయములను, లోకమునఁ జిరకాలముగ నూఁదివచ్చు పుక్కిటిపురాణములను సులభముగాఁ బూర్వపక్షముచేసి యబద్ధమని స్థాపించుట మహామతుల కేనియు సంపూర్ణ సామగ్రితో నైనను గడు దుష్కరము." అని బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రొకసందర్భమున వ్రాసిన వాక్యము లెంతయు సత్యసమ్మతములు. పైవానిలోఁ బ్రత్యేకముగ నొకొక్కట్టియే పూర్వపక్షముచేయుటకు దుష్కరమయినప్పు డా రెండు నేక విషయమునఁ బ్రసక్తమయినప్పు డింకఁ జెప్పవలసినది యుండదు. పుక్కిటిపురాణములు వ్యాప్తమయినకొలఁది నానురాను వానికిఁ బోషకములయి టంకపుఁబొడులవంటి చాటుపద్యములు కొన్ని బయల్వెడలుచుండుట సాజము. క్రమక్రమముగా నీరెంటియందును విశ్వాసముగొని పండితవరులుగూడ విభ్రాంతచిత్తులయి యవి పూర్వకవీశ్వర సంబంధికములయినప్పుడు తదనుగుణముగ నా కవీశ్వరుల గ్రంథములందలి పద్యములకు విపరీతార్థములు గల్పించి యాదిక్కుమాలిన పుక్కిటికథలయు, బూటకపుఁజాటువులయు ప్రాబల్యమునకుఁ దాముగూడఁ దోడ్పడుచుందురు. ఇందులకు శ్రీనాథ మహాకవి విషయము తార్కాణము. శ్రీనాథుని శీలమునుగూర్చి వ్యాప్తములయి యున్న పుక్కిటిపురాణములు, చాటుపద్యములు పామరజనైక విశ్వాస్యములయినను, వశ్యవాగ్భూషణులగు శ్రీవీరేశలింగము పంతులుగారు తమ కవిచరిత్రములోఁగూడ శ్రీనాథుని గ్రంథములందలి పద్యములు కొన్నిటికి విపరీతార్థములొనర్చి యాతఁడు శృంగారనాయకుఁడను నభిప్రాయమును బ్రకటించుటచే విద్వాంసులు సయితము పలువురామహాకవి శీలమునుగూర్చి శంకించి యావిషయమయి తాముగూడఁ గ్రమక్రమముగా వెఱ్ఱివెఱ్ఱివ్రాఁతలు వ్రాయుటకుఁ గారణమయినది. కవుల రసజ్ఞతను వెల్లడించుటకయి వారెట్టి మహాభక్తులయినను వారికి శృంగారనాయకత్వము (స్త్రీలౌల్యము) నారోపించి యందుల కనుగుణములగు గాథల నల్లుట మనదేశములోఁ జాలవఱకుఁ బరిపాటియైనది. శ్రీకృష్ణకర్ణామృతమును రచించిన భక్తశిరోమణియగు లీలాశుకముని విషయ మాలోచింపుఁడు. ఆతని గ్రంథమందలి "చింతామణిర్జయతు" అను చిన్న పదమునుబట్టె లోక మెట్టి వింతకథను గల్పించినది!!! ఆ దిక్కుమాలిన కథ నితివృత్తముగ గ్రహించి, పామర జనరంజనమును దన్మూలమున ధనసంగ్రహము నభిలషించి కొందఱు కవీశ్వరులు నాటకములు రచించుటయు నవి పలుచోటుల మిక్కిలి మక్కువతోఁ బ్రదర్శింపఁబడుటయు నందఱెఱింగినదియేకదా! ఈ విషయ మింతటితోఁబోక సినీమా ప్రదర్శనములలోనికిఁ గూడ నెక్కినది. ప్రభుత్వమువారు కేరళదేశమం దొనర్చిన ప్రాచీనగ్రంథపరిశోధనములో లీలాశుకమునీంద్రునియు నాతని శిష్యులయు గ్రంథరాజములు కొన్ని నూతనముగా లభించినవి. వానివలన లీలాశుకుని యథార్థచరిత్రము బయలుపడి యాతని నామాంతరముగా లోకము గ్రహించుచున్న

వచ్చినది. ఈవిషయములను వెలువరించుచు, ఆంధ్రపత్రిక దుందుభి సంవత్సరాది సంచికలో శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు "పుష్పాంజలి; శ్రీకృష్ణలీలాశుకకవి" యను వ్యాసమున నితని ప్రియ సర్వస్వమగు "చింతామణి" భక్తజనచింతామణి యగు శ్రీకృష్ణుఁడే కాని చర్మసుందరియగు నాఁడుది (చింతామణి యను వేశ్య) కాదని నిరూపించిరి. అయిన నేమిప్రయోజనము ? గతానుగతిక మగు లోక మిది పాటించునా! పైని జెప్పిన నాటకప్రదర్శనములు గాని సినీమా యంత్రదర్శనములుగాని యించుకయిన విరమించినవా ? లేదు. ఒకరొక నాటకమును రచింపఁగా నాకథకు మఱికొన్ని వన్నె చిన్నెలు గల్పించి యింకొకరింకొక నాటకమును రచించుచున్నారు. ఇట్టిగ్రంథములు వ్రాయువారును, ప్రదర్శనము లొనర్చువారును, పామర జనరంజనముచే ధనమునార్జించుటయే ప్రయోజనముగా నెంచుచుండిరే గాని కీర్తిశేషుఁడయిన యొక మహాపురుషునియెడఁ దామెట్టి యపచార మొనర్చుచున్నది యించుకయిన గుర్తింపఁజాలకున్నారు. ఇది మిగుల శోచనీయము.

ఇఁకఁ బ్రకృతవిషయ మాలోచింతము. కవితాపట్టభద్రుఁడగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు పలికినట్లు వినవచ్చు "వాణి నారాణి" యను నాభాణకమును దానినిగూర్చిన గాథయుఁ గూడఁ బైగణములోఁ జేరినవే యని నాయభిప్రాయము. సుగుణశీలుఁడగు శ్రీనాథునవలెనే యీసుకవిచంద్రునకుఁ గూడ వేశ్యాలంపటుత్వ మారోపితమయి యందులకుఁ బోషకమగు సందర్భమునకయి యాతని జైమిని భారతరచనమునుగూర్చి యొక యద్భుత కథ యుత్పన్నమయి రానుగాను,

క. పిల్లలమఱ్ఱి పినవీరన కిల్లాలఁట వాణి యట్టులే కాకున్నన్
తెల్లముగ నొక్క-రాతిరిఁ దెల్లగఁ దెలవాఱువఱకుఁ దేఁగలఁడే కృతిన్?

అను చాటుపద్యమునకు జననకారణమయినది. కథ యంద అంతేంగినదే గాన నిచ్చట వివరింపఁ బనిలేదు. విమర్శదృష్టితో వీక్షించువారి కీకథ పినవీరుని యనర్గళ కవితాధారను, వాగ్దేవతాప్రసాదమును స్థాపించు యత్నముతోఁ గల్పింపఁబడినదని తోఁపక పోదు. కాని యీకథను గల్పించిన బుద్ధిమంతునకుఁ గవి విశేష మహిమాన్వితుఁడను విశ్వాసమును లోకమున సృష్టింపఁగల్గుదు ననను కుతూహల ప్రవాహములో జగజ్జననియగు వాణీదేవిని దనరాణిగాఁ జెప్పుచో నాకవీశ్వరుఁ డామెయెడ నపచార మొనర్చువాఁడవు ననెడి శంక గాని, కరణీయకృత్యమునుగూడ మఱచునంతటి వేశ్యాలంపటుఁడని చెప్పుటచే లోకమున నాతని కపకీర్తి గలుగుననెడి తలంపుగాని యించుకయుఁ దోఁపకుండఁ గొట్టుకొనిపోయినవి. సద్విమర్శనమున నిర్మూలింపఁ దగిన యీకథను నట్లొనర్చుటకు మాఱు దానిని మఱింత వ్యాప్తమొనరించుటకుం బోలె "భారతి" (రక్తాక్షిసంవత్సర) శ్రావణమాససంచికలోఁ దత్పత్రికాధిపతు లీకథాసందర్భమును బ్రదర్శించు వర్ణచిత్రమును శ్రీయుత ఎస్. బ్రహ్మయ్యగారను చిత్రకారునిచే వ్రాయించి ముఖపత్రమునఁ (Front species) బ్రకటించిరి. ఇది యెంతయు శోచనీయమని నాయభిప్రాయము. ఇట్టి చిత్రములు లీలాశుకుని విషయమునవలె రానురాను సినిమా, ప్రదర్శనములకును, నాటకరచనములకును

గూడఁ గారకములు కాఁగలవు. పినవీరన రచించిన జైమినిభారతము నవతారికను లెస్సగాఁ బరికించు వారికి గ్రంథరచనమును గూర్చిన పయిపుక్కిటికథ కించుకయు నవకాశములేదని విస్పష్టమగును.

జైమిని భారతరచనారంభమునకుఁ బూర్వమే పినవీరన సాళ్వగుండ నరసింహ రాయల యాస్థానకవిగా నుండెను. నరసింహరాయలు సభదీర్చి జైమిని భారతము నత్యల్పకాలములో రచింప సమర్థులెవ్వరని పండితుల నడుగగా వారు పినవీరన యందు లకు సమర్థుండని చెప్పిరట. అందుమీద రాజు పినవీరనను మూఁడు నెలలలో గ్రంథము రచించి తేఁగలవా యని ప్రశ్నించుట, అందుపై నాతఁడు "వాణి నారాణి" అనుష్ఠయైన నొక నెలయే చాలునని మనవిచేయుట మున్నగు నైతిహ్యములోని సంగతులెల్ల నిరాధారములు. తక్కిన కవులవలెనే పినవీరన యొక్కనాఁడు గ్రంథరచనా కుతూహలుండై యిష్టదేవతా ప్రార్థనంబును, ఆదిసుకవినుతమును గావించి యొక్క పురాణంబు చెప్పఁగ

క. ఉద్యోగించి సుకవి జన । హృద్యంబును నాద్యము మతి యితిహాసానే
కద్యోతిత పద్యావై । శద్యంబై నవియుగా విచారించి తగన్.

క. స్తుత్యముఁ గలి కల్మష రా । హిత్యము నాఖ్యాయికా విహితబీజ చతు
స్సీత్యము శ్రీహారికథలను । నిత్యంబును నైన జైమినిజభారతమున్.

జంబూ కావ్యము చేసెదనని యాలోచించి, తన యేలిక యగు నరసింహ మహీపాలునిఁ గృతిపతిఁ గావింతునని తలంచి, గ్రంథము చెప్ప నుద్యోగించు సమయంబునఁ గాకతాళీయంబుగ నారాజేంద్రుండు గూడఁ బేరోలగంబుండి పురాణేతిహాస కథాప్రసంగంబుల వినోదించుచు, సప్తసంతతులలోఁ గవిత్వసంతతికిఁ గల ప్రశస్తిని ప్రశంసించి —

క. నామది నిరతము భారత । రామాయణకథలఁ బేర్చు రంజిలు నందున్
జైమిని భారత మనఁగా । భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

గీ. ఆపురాణంబు గనఁ దెనుఁగయ్యె నేనిఁ । జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగు నుడికారమునమించు గనియె నేనిఁ । గుందనము కమ్మ వలసిన చందమగును.

అని చెప్పి సభాసదుల మొగంబుదెస దృష్టిఁ బఱపెను. అందుపై నారా రాజసత్తముని చిత్తము నెఱింగి

క. "ఏరీతి నెఱిఁగెనో పిన । వీరన దేవర తలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టిదియును దమ । పేరన రచియింపఁబూనె బేశలఫణితిన్."

అని విన్నవించిరి. నరసింహరాయ లంత సమీపమునఁ దన్నుఁగొలిచియున్న పినవీరనను వీక్షించి 'నా ధనంబు ఋణంబుగాఁ దనక యశోధన ముపార్జించితివి. ఆశ్రితత్వంబిట్లు గావలదె" అని సాదరముగఁ బలుకుచుఁ గృపాతరంగితాంతరంగం బున నాతని విలోకించి "మామక మనోరథం బెఱింగినట్లు చెప్ప నుద్యోగించితివి. హృద్యానవద్య గద్య పద్యానుబంధంబుగాఁ బ్రబంధం బంధురభావను జైమిని భారతమునం దశ్వమేధపర్వంబు నిర్విఘ్నంబుగా రచింపుము" అని యానతీయ నాకవివరుండును బ్రసాదంబని యంగీకరించి గ్రంథారంభమునకుఁ గడంగెను.

ఇదియు మనకుఁ బినవీరన గ్రంథమున స్వయముగా వ్రాసిన దానినిబట్టి తెలియు విషయము. యథార్థ మిట్లుండఁగా నైతిహ్యమందలి కథనము దీని కత్యంతవిరుద్ధముగ నుండి, "ఇంటివాఁడు గొడ్డగేదె యనఁ బొరుగువాఁడు పాఁడిగేదె" యను నట్టి లపహాస్యమునకుఁ గారణమగుచున్నదని వేఱ చెప్పనక్కఱలేదు. మఱియు నీగ్రంథమునఁ బినవీరన యిష్టదేవతా ప్రార్థనములో వాణీస్తుతి నీక్రింది విధముగాఁ జేసియున్నాఁడు.

సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ । నుండు నే దేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరా పశ్యంతి మధ్యమా । వైఖరు లే దేవి వర్ణసరణి
జపహారకీరపుస్తకవిపంచిసమంచి । తంబు లే దేవి హస్తాంబుజములు
కుందేందుమందారకందళీబృందంబు । చంద మే దేవి యానందమూర్తి
గీ. కాంచె నే దేవి కాంచనగర్భచతుర । పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రికాంత శిరోగృహస్థలవిహార । మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు.

మాతృభక్తితో వాణీదేవి నిట్లారాధించిన వాఁడు "వాణి నా రాణి" యని యనియుండుట యసంభవమని సహృదయులకుఁ దోఁపక పోదు.

పినవీరభద్రుని సంతతివాఁడనని చెప్పికొను పెనుమళ్ళ సోమనమంత్రి తన సీమంతినీకల్యాణములోఁ దనవంశావతారం బభివర్ణించు సందర్భమునఁ బినవీరన జననవృత్తాంత కవిత్వమహిమాదుల వర్ణించుచు
గీ. వాణి యిల్లాలుగాఁ గవిశ్రేణికెల్లఁ । బృహతరాశ్చర్యకరమైన బిరుదు వ్రాసె.
అనియు
సీ. ఒక్కరాత్రియందు నొనరించె మధురవాక్ప్రౌఢిచే జైమిని భారతంబు

అనియు వ్రాసియున్నాఁడు. సోమన పినవీరుని వంశీయుఁడవునా యను విషయము సంశయాస్పదముగ నున్నది. ఆతఁడు వాస్తవముగా పినవీరన వంశీయుఁడైనను నాతఁడు చెప్పిన వంశానుక్రమమును బట్టియే పినవీరన కాతఁ డెనిమిదవ పురుషాంతరము వాఁడని తెలియుచున్నది. అనఁగాఁ బినవీరనకు నితనికి నించుమించుగ 300 సంవత్సరముల యంతరమున్నది. పైనిజెప్పిన నైతిహ్యమును జాటుపద్యమును సోమనమంత్రికాలమునాఁటికే లోకమున వ్యాప్తమైయుండును. అందుచే నిప్పటి కొందఱవలె నాతఁడు గూడ వానియందలి విశ్వాసముచేఁ దనగ్రంథమునఁ బినవీరనఁ గూర్చి యారీతిని వ్రాసియుండుననఁ దోఁచుచున్నది.

పినవీరన స్వహస్త లిఖితములగు గ్రంథస్థవిషయములకు విరుద్ధముగనుండు నిట్టి కట్టుకథలకుఁగాని వానిని బట్టి తరువాతఁ జిరకాలమునకు సోమనమంత్రి తన గ్రంథమున వ్రాసిన వాక్యములకుఁ గాని యేపాటిప్రామాణ్యముండునో విజ్ఞులే నిర్ణయింతురుగాక; కావున, మహాశయులారా! అప్రమాణములగు నిట్టి పుక్కిటిపురాణములను, చాటుపద్యములను నాదరించి కీర్తిశేషులయిన మహాపురుషుల కీర్తిని గళంకిత మొనర్చుట మంచిపని కాదనియు, సద్విమర్శనమూలమున నిట్టి యైతిహ్యములను రూపడంచి నిర్మూలించుటయే భాషాభిమానుల కర్తవ్యమనియు విన్నవించి యీవ్యాసమును విరమించుచున్నాను.

---

# ఆయుర్దాయము

---

బాలారిష్ట ప్రకరణము - తద్యోగములు.

తే॥ లగ్న మష్టమభావంబు లగ్ననాథుఁ
డష్టమాధీశ్వరుండు తారాధిపతియు
నశుభదుష్టగ్రహములమధ్యమున నున్న
జాతకునకు బాలారిష్టసంప్రదంబు.

తే॥ అరయ లగ్నేశచంద్రలగ్నాధిపతుల
యం దెవండైనఁ గాని నవాంశపతియుఁ
గాని యస్తంగతత్వంబు గాంచెనేని
జాతకునకు బాలారిష్టసంప్రదంబు.

క॥ రెండింటను శని మఱి పం
డ్రెండింటను రాహు వుండి ధృతి శనికుజులు
ద్దండత రేతులఁ జంద్రు న
ఖండముగాఁ జూడ బాలగండము నిజమే.

తే॥ రెంట శని యుండి మఱి యెన్మిదింట రాహు
వైన నేడింటిలోఁ గుజుండైన నుండి,
శనికుజులు చంద్రుఁ జూచిన, జాతకునకుఁ
బ్రబలమైనబాలారిష్టభయము గలుగు.

క॥ ఆరింటను శని మఱి యీ
రారింటను గుజుఁడు నిలిచి యశుభేక్షణాలన్
తారాధినాథుఁ జూచిన
మారకము నిజమ్ము సుమ్ము మఱి బాల్యమునన్

తే॥ ఒకటిలో నెన్మిదింటిలో నుగ్రు లుండి
చంద్రుఁ డతిబలహీనుఁడై కేంద్రమందు
గురువు లేకున్న యెడ జాతకునకు నిక్క-
వంబు సుమ్ము బాలారిష్టభయము ధరణి,

తే॥ పాపులును శాత్రవులు నగువారియిండ్ల
నిలిచియైనను వారితోఁ గలిసియుండి
యైనఁ దద్గ్రహవీక్షితుండైన నష్ట
మాధిపతి యున్న మృతి బాల్యమందు నిజము.

సీ॥ ఆదిలోఁ గుజుఁ డుండి యాఱింట నేడింట
నెనిమిదింటను శని దనరుచుంట
శని లగ్నమున నుండి సప్తమాష్టమరాశు
లందుఁ గుజుండు రూపొందియుంట
తనుభావమున రవి శనికుజు లేడింట
జన్మాన రాహు వష్టమమున శని
యింటిలోఁ గుజుఁ డెన్మిదింటిలో రాహు వె
న్మిదిలోన భౌముండు మొదట రాహు

తే॥ వెలమి నొకచోటఁ గుజరాహువులు మెలంగు
చుంట గలిగిన జాతకుఁ డొందఁ గలఁడు
శైశవంబింత జననట్టిసమయమందె
ప్రబలమైన బాలారిష్టభయము నిజము.

తే॥ జననకాలంబు శశిహోరా సంధ్య వేళ
అగుచు రాసులచివర నవాంశములను
నిన కుజ శనైశ్చరులు నిల్చి రేని శిశువు
జన్మమొందిన వెంటనే చచ్చిపోవు.

తే॥ చంద్రుఁడును సూర్య కుజశనైశ్చరులయందు
నొక్కొకరు కేంద్రముల నిల్చియుండిరేని
కాక రెంట పండ్రెండింటఁ గాని షష్ఠ
మాష్టమగృహంబులందైన యలరుచుండి
రేని పసిబిడ్డ వెంటనే మృతిని గాంచు.

కం॥ అష్టమభావాధీశుం
డష్టమమున నుండ, దుర్బలాత్ముని చంద్రుఁ

దుష్టేక్షణాలన్ శని గన
కష్టారిష్టంబు గలుగు కడుబాల్యమునన్

తే॥ కటక వృశ్చికములను లగ్నంబు గాంచి
రవి కుజ శనైశ్చరులఁ బూర్వరాశులందు
సద్గ్రహంబులఁ బశ్చిమస్థలములందు
గల్గునెడఁ బుట్టుశిశువు శీఘ్రంబ చచ్చు.

తే॥ అష్టమాధీశ్వరుండు లగ్నాధిపతియు
బలము చెడియుండి త్రిషడాయభావముల శు
భగ్రహంబులు నిలిచి పాపగ్రహములు
కేంద్రకోణములందున్నఁ గీడు మూడు.

తే॥ లగ్నభావంబు చంద్రుండు లగ్నమైన
రాశి వ్యయరాశి దూషితగ్రహసమన్వి
తంబగుచుఁ జంద్రుఁడు శుభేక్షణంబు నొంద
కున్న వెంటనే మృతినొందుఁ జిన్నబిడ్డ.

కం॥ తనువున నొకపాపగ్రహ
మెనిమిదవగృహంబునందు నేర్పడ శని గ
ల్గిన జాతకునకు బాల్యం
బున మరణభయంబు గల్గు భూమీస్థలిలో.

తే॥ క్షీణచంద్రుండు వ్యయమందుఁ జేరియున్న
వరుస లగ్నాష్టమంబులఁ బాపు లున్న
గ్రహము లేమియు లేక కేంద్రంబు లున్న
శైశవంబున మృతినొందుఁ జంటిబిడ్డ.

షష్ఠాష్టమవ్యయస్థానంబులందున
లగ్నాధిపతి యుంట; లగ్నమునకు
వరుస నాస్థలముల గురుచంద్రు లుంట; తొమ్మి
భవుఁడు రాహువును లాభమున నుంట;
శనిరవుల్ శనికుజుల్ శనిరాహువులు మఱి
గురుశుక్ర గురుకుజుల్ గురుబుధులును

ఇనచంద్ర కుజచంద్ర ఘనబుధచంద్రులు
సమసప్తమాయతస్థలములందు
తే॥ నిలిచియుండుట; హస్తతో నలరుచంద్రు
శనికుజులు చెడ్డచూపులఁ గనుచునుంట
జాతకునకు బాల్యావస్థ చనకమున్నె
మరణభయము బిరాన సంభవిలఁ జేయు
కం॥ తుల రవి; కన్యన్ కుజుడున్;
వెలయగ సింహమున బుధుఁడు; వృశ్చిక భావ
స్థలమున శుక్రుఁడు; నిలిచినఁ
గలుగును బాల్యమునఁ బ్రాణగండంబు వెసన్
తే॥ పరఁగుపాపగ్రహంబుతోఁ బ్రథమసప్త
మాష్టమవ్యయములఁ జంద్రుఁ డలరుచుండ
వానిఁ జూడక కేంద్రాలలోన లేక
సద్గ్రహము లున్నఁ బసిబిడ్డ చచ్చిపోవు,
తే॥ షష్ఠమాష్టమరాశుల చంద్రువంకఁ
జెడ్డగ్రహ మేదియైన వీక్షించెనేని
బ్రహ్మయంతటివానిపుత్రకుఁడుగాని
జనన మొందినవెంటనే చచ్చిపోవు.
తే॥ క్షీణచంద్రుండు లగ్నానఁ జేరియున్న
పాపు లష్టమకేంద్రభావముల నుండి
అవ్వి పాపద్వయీమధ్యమాశ్రితంబు
లైన మృతి నిశ్చయంబు బాల్యంబునందె
తే॥ లగ్నమునఁ జంద్రుఁ డుండి తల్లగ్నరాశి
పాపులకు మధ్యమున నుండి పరఁగ సప్త
మాష్టమంబులఁ గ్రూరగ్రహంబు లున్న
తల్లికిని బిడ్డకును మృతి దప్ప దొకట.
తే॥ గ్రహణవేళలఁ జంద్రభాస్కరుల నొకఁడు
లగ్నమునఁ గ్రూరుతోడ వెలంగుచుండి

మంగళుం డష్టమమున నెసంగుచున్న
తల్లికిని బిడ్డకును మృతి దప్ప దొకట,
ఆ॥ వె॥ ఏకరాశి నున్నయినచంద్రులకును ద్వా
దశమమందు గురుబుధగ్రహములు
కవిని గూడియున్న ఘనరాహు వొకఁ డున్న
బాల్యమం దరిష్టభయము నిజము.
కం॥ ఇనచంద్రుల శనికుజు లొ
య్యనఁ జూచిన శుక్రునకును వ్యయ మగుభావం
బున రాహువున్న సాధా
రణబాలారిష్ట మగుచు రహియిల్లు ధరన్.
కం॥ దుష్టగ్రహవీక్షితుఁడౌ
నష్టమపతి, లగ్నమునకు నటవ్యయమందు
తత్కృష్టగ్రహంబు, వెలసిన
కష్టారిష్టంబు గల్గుఁ గడుబాల్యమునన్.
కం॥ శనిఁ బండ్రెండింటను గుజు
నెనిమిదవగృహంబునందు నినుని నవంబం
దునఁ జంద్రుని లగ్నంబునఁ
గనినన్ జాతకుఁడు పుట్టఁగానే చచ్చున్
తే॥ జన్మపంచమసప్తమాష్టమనవమము
లందు వ్యయమందుఁ గ్రూరగ్రహంబుతోడఁ
జంద్రుఁ డొక్కఁడుమాత్రంబె జతగ నుండె
నేని మృతినొందు శిశువు జన్మింపఁగానె
కం॥ మృగశీర్షప్రథమపదమునఁ
దగ రవిచంద్రులు వసించి తద్గురుబల మొ
ప్పగ లేనిజాతకునకున్
బెగడు నరిష్టంబు సంభవిలు బాల్యమునన్
తే॥ శతభిషము పుష్య ముత్తరాషాఢ మృగశి
రముల ప్రథమపాదంబులు ప్రబలమైన

భరణి మఖ చిత్త లందు నుత్తరధనిష్ఠ
లందు రెండవపాదంబులందు జన్మ
మైనయెడల బాలారిష్ట మగు నిజంబు.

తే॥ జ్యేష్ఠకృత్తి కానూరాధ లెనయ మూట;
నలవిశాఖోత్తరాభాద్రిలను జతుర్థ
పాదములను; బాలారిష్టభయము నిజము
బ్రహ్మకైనను మఱియంత వానికైన.

తే॥ రెండ నాల్గింట నశ్విని; రెంట, మూట,
మూల; నొకట, రెండింటను, నాలుగింట,
రోహిణియు; మూట, నాల్గింట, రూఢి హస్త;
పసితనంబున మృతిభయప్రదములగును.

క॥ రవిచంద్రులకును వ్యయమం
దవిరళగతి శుక్రబుధబృహస్పతు లున్నన్
రవిచంద్రులకు గురుం డే
డవనాఁడైనను నరిష్ట మగు బాల్యమునన్.

—♦ బాలారిష్ట ప్రకరణము - తద్భంగయోగములు ♦—

తే॥ లగ్నమందున గురుఁడు మెలంగుచున్న
తద్గురుండైదవింటిలోఁదనరుచుండి
సూర్యశనికుజచంద్రులన్ జూచుచున్న
వాస్తవముగ బాలారిష్టభయము లేదు.

తే॥ గురువు రవిరాహువులతోడఁ గూడియున్న
వారలకు సప్తమస్థానవాసుఁడైన
లగ్నమందున్నఁ దల్లగ్నలక్ష్యుఁడైన
జాతకునకు బాలారిష్టభీతి లేదు.

క॥ బలముగలలగ్ననాథుని
జెలువొందఁగఁ గేంద్రముల వసించుచు శుభవీ
క్షలుగల మంచిగ్రహంబులు
దిలకించిన జాతకునకు దీర్ఘాయు వగున్

తే॥ లలి శుభగ్రహమధ్యస్థలమున లగ్న
మై, శుభగ్రహమధ్యలగ్నేశుఁ డున్న
లగ్నము శుభగ్రహేక్షల మగ్నమైన
గలనునైన బాలారిష్టఘాత లేదు.

తే॥ అమరగురుశుక్రులం దెవండైనఁగాని
అష్టమాధీశ్వరుని గూడి యైన నతని
చోటనైన మెలంగినచో మ ఱెట్టి
వానికైన బాలారిష్టభయము లేదు.

తే॥ సరిగ షష్ఠాష్టమవ్యయచంద్రుఁ డైన
గాక బుధశుక్రగురుల ద్రేక్కాణములందు
నతఁడు నిలిచిన స్వప్నమందైనఁ గాని
జాతకునకు బాలారిష్టభీతి లేదు.

తే॥ సరిగ్రహంబులఁ బూర్ణిమాచంద్రుఁ డున్న
ఆతఁడు శుభగ్రహములమధ్యమున నుండి
శుక్రుచే శుభవీక్షలఁ జూడఁ బడిన
జాతకునకు బాలారిష్టభీతి లేదు.

క॥ గురుబుధ శుక్రిలలో నొ
క్కరుగాని పూర్ణబలము గలిగియుఁ గేంద్రం
బులలో నొక్కట నిలచినఁ
గలుగదు మృతిభీతి బాల్యకాలమునందున్

తే॥ కుజుఁడు చంద్రుఁడు నొకచోటఁ గూడియున్న
అష్టమగృహంబు మఱి యష్టమాధిపతియు
మంచిగ్రహములమధ్య వసించుచున్న
జాతకునకు బాలారిష్టభీతి లేదు.

తే॥ నిండుచంద్రుని గేంద్రస్థితుండు గురుఁడు
చూచినను జంద్రుఁ డున్నట్టిచోటు నేలు
గ్రహముగాని మ ఱెశుభగ్రహముగాని
కేంద్రమున నున్నఁ జిననాటికీడు సున్న ॥

తే॥ గురుశుభగ్రహములు కేంద్రకోణములను

పాపులౌ వారు త్రిషడాయభావములను
వెలయుచున్న నాయుర్దాయబలము గల్గు
వ్యస్త మైన నరిష్టభయంబు నిజము ॥
తే॥ పరఁగ మూడింట, నారింట, పదునొకండ
వింట, రాహువు వసియించి, యేశుభగ్ర
హంబుచేఁ గాని వీక్షితుండైన యెడల
జాతకునకు బాలారిష్టభీతి లేదు ॥
తే॥ గ్రహములన్ని శిరోదయరాశులందు
కలిగినను నిండుచంద్రుని గ్రహములన్ని
అరసిన; శుభగ్రహములమధ్యమున నతఁడు
నిలచినను బాల్యమున మృతి కలుఁగ దెపుడు ॥
తే॥ మీనమున జన్మమైనను మీనమందు
శుక్రుఁడున్న బృహస్పతి శుభదలగ్న
లగ్నపతులను గూడిన లక్ష్యమందు
వారి గనిన బాలారిష్టభయము లేదు.
ఆ॥ వె॥ మిథున కుంభ మకర బుధుఁడైన వృషభ కుం
భ రవిభాములైన బలయుతాష్ట
మాధిపతి శుభగ్రహముతోడ లగ్నస్థుఁ
డైన బాలగండ మసలె లేదు.
క॥ తుల కటక మిథున మీనం
బుల నుత్తరభాద్ర హస్త పుష్యమి మఖతా
రలఁ జంద్రుఁడు నిలిచినయెడఁ
గలనైనన్ లేదు బాలగండం బవనిన్.
తే॥ ఆర్ద్ర పుబ్బ పునర్వసులందుఁ బూర్వ
భాద్ర స్వాతి నాశ్రేష రేవతులయందు;
మృగశిరను రెంట మూట నాల్గింటఁ జిత్త
మూట నాల్గింటను; విశాఖ మూట రెంట;
వాస్తవముగ బాలారిష్టభయము లేదు.

---

# శ్రీవిద్యారణ్యాష్టోత్తర శతనామస్తోత్రము.

శ్లో॥ విద్యారణ్యమహాయోగీ మహావిద్యాప్రకాశకః
శ్రీవిద్యానగరోద్ధర్తా విద్యారత్నమహోదధిః ॥ ౧
రామాయణమహాసప్తకోటిమన్త్రప్రకాశకః
శ్రీదేవీకరుణాపూర్ణః పరిపూర్ణమనోరథః ॥ ౨
విరూపాక్షమహాక్షేత్రస్వర్ణవృష్టిప్రకల్పకః
వేదత్రయోల్లసద్భాష్యకర్తా తత్త్వార్థకోవిదః ॥ ౩
భగవత్పాదనిర్ణీతసిద్ధాన్తస్థాపనప్రభుః
వర్ణాశ్రమవ్యవస్థాతా నిగమాగమసారవిత్ ॥ ౪
శ్రీమత్కర్ణాటరాజశ్రీరాజ్యసింహాసనప్రదః
శ్రీమద్బుక్కమహీపాలరాజ్యపట్టాభిషేకకృత్ ॥ ౫
ఆచార్యకృతభాష్యాది గ్రన్థవృత్తిప్రకల్పకః
సకలోపనిషద్భాష్య దీపికాదిప్రకాశకృత్. ౬
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞో మన్త్రశాస్త్రాబ్ధిమన్థరః
విద్వన్మణిశిరశ్శ్లాఘ్య బహుగ్రన్థవిధాయకః ॥ ౭
సారస్వతసముద్ధర్తా సారాసారవిచక్షణః
శ్రౌతస్మార్తసదాచార సంస్థాపనధురన్ధరః ॥ ౮
వేదశాస్త్రబహిర్భూతదుర్మతామ్భోధిశోషకః
దుర్వాదిగర్వదావాగ్నిః ప్రతిపక్షేభ కేసరీ ॥ ౯
యశోజైవాతృకజ్యోత్స్నా ప్రకాశితదిగన్తరః
అష్టాఙ్గయోగనిష్ణాత స్సాఙ్ఖ్యయోగవిశారదః ॥ ౧౦
రాజాధిరాజసన్దోహ పూజ్యమానపదామ్బుజః
మహావైభవసమ్పన్న ఔదార్యశ్రీనివాసభూః ॥ ౧౧
తిర్యగాన్దోళికాముఖ్య సమస్తబిరుదార్జకః
మహాభోగీ మహాయోగీ వైరాగ్యప్రథమాశ్రయః ॥ ౧౨
శ్రీమాన్ పరమహంసాది సద్గురుః కరుణానిధిః
తపఃప్రభావనిర్ధూత దుర్వారకలివైభవః ॥ ౧౩
నిరన్తరశివధ్యాన శోషితాఖిలకల్మషః

శాన్తాత్మా సుచరిత్రాఢ్యస్సర్వభూతహితోత్సుకః ॥ ౧౫
కృతకృత్యో ధర్మశీలో దాన్తో లోభవివర్జితః
మహాబుద్ధి ర్మహావీర్యో మహాతేజా మహామనాః ॥ ౧౬
తపోరాశి ర్జ్ఞానరాశిః కల్యాణగుణవారిధిః
నీతిశాస్త్రసముద్ధర్తా ప్రాజ్ఞమౌళిశిరోమణిః ॥ ౧౭
శుద్ధసత్త్వమయో ధీరో దేశకాలవిభాగవిత్
అతీన్ద్రియజ్ఞాననిధి ర్భూతభావ్యర్థకోవిదః ॥ ౧౮
గుణత్రయవిభాగజ్ఞ స్సన్న్యాసాశ్రమదీక్షితః
జ్ఞానాత్మైకదణ్డాఢ్యః కౌసుమ్భవసనోజ్జ్వలః ॥ ౧౯
రుద్రాక్షమాలికాధారీ భస్మోద్ధూళితదేహవాన్
అక్షమాలాలసద్ధస్త స్త్రిపుణ్డ్రాఙ్కితమస్తకః ॥ ౨౦
ధరాసురతపస్సమ్పత్ఫలం శుభమహోదయః
చన్ద్రమౌళీశ్వరశ్రీమత్పాదపద్మార్చనోత్సుకః ॥ ౨౧
శ్రీమచ్ఛఙ్కరయోగీన్ద్ర చరణాసక్తమానసః
రత్నగర్భగణేశాన ప్రపూజనపరాయణః ॥ ౨౨
శారదామ్బాదివ్యపీఠ సపర్యాతత్పరాశయః
అవ్యాజకరుణామూర్తిః ప్రజ్ఞానిర్జితగీష్పతిః ॥ ౨౩
ఆజ్ఞావశీకృతజగ ల్లోకానన్దవిధాయకః
వాణీవిలాసభవనం బ్రహ్మానన్దైకలోలుపః ॥ ౨౪
నిర్మమో నిరహఙ్కారో నిరాలస్యో నిరాకులః
నిశ్చిన్తో నిత్యసంతుష్టో నియతాత్మా నిరామయః ॥ ౨౫
గురుభూమణ్డలాచార్యో గురుపీఠప్రతిష్ఠితః
సర్వతన్త్రస్వతన్త్రశ్చ యన్త్రమన్త్రవిచక్షణః ॥ ౨౬
శిష్టేష్టఫలదాతా చ దుష్టనిగ్రహదీక్షితః
ప్రతిజ్ఞాతార్థనిర్వోఢా నిగ్రహానుగ్రహప్రభుః ॥ ౨౭
జగత్పూజ్య స్సదానన్ద స్సాక్షాచ్ఛఙ్కరరూపభృత్
మహాలక్ష్మీమహాయన్త్ర పునశ్చర్యాపరాయణః ॥ ౨౮
విద్యారణ్యమహాయోగి నామ్నా మష్టోత్తరం శతమ్
యః పఠే త్సతతం సంపత్సారస్వతనిధి ర్భవేత్ ॥ ౨౯

## శ్రీవిద్యారణ్యాష్టోత్తర శతనామావళిః

ఓంవిద్యారణ్యమహాయోగినేనమః
మహావిద్యాప్రకాశకాయ నమః
శ్రీవిద్యానగరోద్ధర్త్రే నమః
విద్యారత్నమహోదధయే నమః
రామాయణమహాసప్తకోటిమన్త్రప్రకాశకాయ నమః
శ్రీదేవీకరుణాపూర్ణాయ నమః
పరిపూర్ణమనోరథాయ నమః
విరూపాక్షమహాక్షేత్రస్వర్ణవృష్టిప్రకల్పకాయ నమః
వేదత్రయోల్లసద్భాష్యకర్త్రేనమః
తత్త్వార్థకోవిదాయ నమః ౧౦
భగవత్పాదనిర్ణీతసిద్ధాన్తస్థాపనప్రభవే నమః
వర్ణాశ్రమవ్యవస్థాత్రేనమః
నిగమాగమసారవిదే నమః
శ్రీమత్కర్ణాటరాజశ్రీ రాజ్యసింహాసనప్రదాయ నమః
శ్రీమద్బుక్కమహీపాలరాజ్యపట్టాభిషేకకృతే నమః
ఆచార్యకృతభాష్యాదిగ్రన్థవృత్తిప్రకల్పకాయ నమః
సకలోపనిషద్భాష్య దీపికాదిప్రకాశకృతే నమః
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞాయ నమః
మన్త్రశాస్త్రాబ్ధిమన్థరాయ నమః
విద్వన్మణిశిరశ్లాఘ్య బహుగ్రన్థవిధాయకాయ నమః ౨౦
సారస్వతసముద్ధర్త్రే నమః
సారాసారవిచక్షణాయ నమః
శ్రౌతస్మార్తసదాచారసంస్థాపనధురన్ధరాయ నమః
వేదశాస్త్రబహిర్భూతదుర్మతామ్భోధిశోషకాయ నమః
దుర్వాదిగర్వదావాగ్నయే నమః
ప్రతిపక్షేభకేసరిణే నమః
యశోజైవాతృకజ్యోత్స్నాప్రకాశితదిగన్తరాయ నమః
అష్టాఙ్గయోగనిష్ణాతాయ నమః
సాఙ్ఖ్యయోగవిశారదాయ నమః
రాజాధిరాజసన్దోహ పూజ్యమానపదామ్బుజాయ నమః ౩౦
మహావైభవసమ్పన్నాయ నమః
ఔదార్యశ్రీనివాసభువే నమః
తిర్యగాన్దోళికాముఖ్య సమస్తబిరుదార్జకాయ నమః
మహాభోగినే నమః
మహాయోగినే నమః
వైరాగ్యప్రథమాశ్రయాయనమః
శ్రీమతే నమః
పరమహంసాదిసద్గురవే నమః
కరుణానిధయే నమః
తపఃప్రభావనిర్ధూత దుర్వారకలివైభవాయ నమః ౪౦
నిరన్తరశివధ్యాన శోషితాఖిలకల్మషాయ నమః

దారిద్ర్యోన్మూలనక్షమాయ నమః
జితేన్ద్రియాయ నమః
సత్యసన్ధాయ నమః
దృఢవ్రతాయ నమః
శాన్తాత్మనే నమః
సుచరిత్రాఢ్యాయ నమః
సర్వభూతహితోత్సుకాయ నమః
కృతకృత్యాయ నమః ౪౦
ధర్మశీలాయ నమః
దాన్తాయ నమః
లోభవివర్జితాయ నమః
మహాబుద్ధయే నమః
మహావీర్యాయ నమః
మహాతేజసే నమః
మహామనసే నమః
తపోరాశయే నమః
జ్ఞానరాశయే నమః ౬౦
కల్యాణగుణవారిధయే నమః
నీతిశాస్త్రసముద్ధర్త్రే నమః
ప్రాజ్ఞమౌళిశిరోమణయే నమః
శుద్ధసత్త్వమయాయ నమః
ధీరాయ నమః
దేశకాలవిభాగవిదే నమః
అతీన్ద్రియజ్ఞాననిధయే నమః
భూతభావ్యర్థకోవిదాయ నమః
గుణత్రయవిభాగజ్ఞాయ నమః
సన్న్యాసాశ్రమదీక్షితాయ నమః
నియతాత్మనే నమః
నిరామయాయ నమః

కౌసుమ్భవసనోజ్జ్వలాయ నమః
రుద్రాక్షమాలికాధారిణే నమః
భస్మోద్ధూళితదేహవతే నమః
అక్షమాలాలసద్ధస్తాయ నమః
త్రిపుణ్డ్రాఙ్కితమస్తకాయ నమః
ధరాసురతపస్సమ్పత్ఫలాయ నమః
శుభమహోదయాయ నమః
చన్ద్రమౌళీశ్వర శ్రీమత్పాదపద్మా
ర్చనోత్సుకాయ నమః
శ్రీమచ్ఛఙ్కరయోగీన్ద్రచరణా
సక్తమానసాయ నమః
రత్నగర్భగణేశాన ప్రపూజన
పరాయణాయ నమః
శారదామ్బాదివ్యపీఠసపర్యాతత్ప
రాశయాయ నమః
అవ్యాజకరుణామూర్తయే నమః
ప్రజ్ఞానిర్జితగీష్పతయే నమః ౯౧
ఆజ్ఞావశీకృతజగతే నమః
లోకానన్ద విధాయకాయ నమః
వాణీవిలాసభవనాయ నమః
బ్రహ్మానన్దైకలోలుపాయ నమః
నిర్మమాయ నమః
నిరహఙ్కారాయ నమః
నిరాలస్యాయ నమః
నిరాకులాయ నమః
నిశ్చిన్తాయ నమః
నిత్యసన్తుష్టాయ నమః ౧౦౦
గురుభూమణ్డలాచార్యాయ నమః
గురుపీఠప్రతిష్ఠితాయ నమః

సర్వత స్త్రీస్వతన్త్రాయ నమః
యన్త్రమన్త్రవిచక్షణాయ నమః
శిష్టేష్టఫలదాత్రే నమః
దుష్టనిగ్రహదీక్షితాయ నమః
ప్రతిజ్ఞాతార్థనిర్వోఢ్రే నమః
నిగ్రహానుగ్రహప్రభవే నమః

జగత్పూజ్యాయ నమః
సదానన్దాయ నమః
సామ్రాజ్యకరమాపభృతే నమః
మహాలక్ష్మీమహాయన్త్రపురశ్చ
ర్యాపరాయణాయనమః ౧౦౮

ఇతి శ్రీవిద్యారణ్యాష్టోత్తర శతనామావళి స్సమాప్తా.



## మేలుకొలుపు

వర్ణాశ్రమధర్మ పరాయణులారా ?

మేలుకొంటిరా ! పడకనుండి లేచితిరా ! ఇంకను ఉపేక్ష యను నిద్దురనుండి లేవలేదా! అయియుండవచ్చును. సంఘసంస్కారులనఁబడు మన నవనాగరకసోదరులు, ఇప్పుడిప్పుడు కొలదిసంవత్సరముల నుండి పాశ్చాత్యవేషభాషాయోషాపద్ధతిమోహితులై వేదశాస్త్ర శిష్టాచారధర్మవిహితంబగు మన ధర్మహర్మ్యమును గసిమై కాల్చివేయ నిప్పంటించినారు. వింటిరా ! కంటిరా ! లెండు. కనుల దెరువుడు. వినుఁడు. సంఘసంస్కార నామకాగ్నిని జల్లార్పుఁడు. ఈ యగ్నిని జల్లార్చి ధర్మసౌధమును సంరక్షించుకొనుటకై మన ధనమును గౌర

వమును, లాభమును, ప్రాణమునుగూడ సమర్పించి కృతకృత్యులము గావలసిన కాలము సంభవించినది. ఇంతవఱకు సహాయనిరాకరణ వాదులము, స్వరాజ్యవాదులము, కాంగ్రెసువాదులము మొదలగు పేరులఁ బెట్టుకొని మహాత్మ, దేశోద్ధారకేత్యాదిబిరుదంబులం దగిలించుకొని రాజకీయనాయకులమని పలుకుచు నొక యేడులోపల స్వరాజ్యము దెచ్చి యిచ్చెదమని వచించుచుఁ బ్రవర్తించిరి. మఱికొందఱు స్వరాజ్యము, రాజకీయస్వాతంత్ర్యము, మొదలగుదేశోపకారములగు పనులంగావించి తీరెదము మాకు వోటునొసంగుఁ డొసంగుఁడని పలుమాఱు మన యిండ్లచుట్టు దిరిగి చెప్పి నమ్మించి బ్రతిమాలుకొని మనవోటు లాగుకొని నెగ్గి శాసనసభ్యులైరి. ఈ పైవారందఱి యొక్క మాటలను నమ్మికొని యీ పేర్లు యింతవరకు మనము వహించుటచేతనే తుదకుఁ బలుకష్టములకును, నష్టములకును, లోబడి బాధపడి కష్టించి సంపాదించి యైహిక పారమార్థికములకు ధర్మయుక్తముగా వినియోగించుకొనుటకై నిర్ణయించుకొనిన కుటుంబమునందును, మనము కని పెంచి పెద్దచేసిన బిడ్డలకుఁగొడుకులకుఁ బెండ్లి మొదలగు శుభకార్యములం జేయుటకుగూడ మనకు స్వాతంత్ర్యము లేకుండ పోయినది. ఆహా ! కలిమహారాజా ! ఎంతవాఁడవోయి ! నీకత్తి కెదురుకత్తి లేదుగదా. నీయనుచరులు మంచి నేర్పరులు సుమీ ! ఎంత యన్యాయము !! గృహస్వాతంత్ర్యముగూడఁ బరతంత్రమయ్యె గదా! ఇట్లుచేయుటకుమనలను నమ్మించివోటులాగుకొని మనసహాయముచే నెగ్గిన యీస్వరాజ్యసహాయనిరాకరణ కాంగ్రెసువాదులే యీదుర్గతికిఁ గారకులని తెలిసికొనుఁడు. గంధినెహ్రూప్రభృతులు సహాయనిరాకరణస్వరాజ్యవాదులు పిల్లకు 18 సంవత్సరముదాక వివాహముజేయగూడదని తీర్మానింపవలసినదని శ్రీదయాకరులగు వైసురాయగారికిఁ దెలియఁజేసిరి. స్వరాజ్యము, స్వాతంత్ర్యము గోరు నీపుణ్యాజనో

త్రము లిట్లు గృహరాజ్యస్వాతంత్ర్యములంగూడఁ బరతంత్ర మొనర్చుట దేశదౌర్భాగ్య మనకతప్పదు. వీరి ననుసరించుపత్రికాధిపతులు మొదలగువా రిట్లే వేదశాస్త్రధర్మనిరతులను దూలనాడుచు వ్రాయఁగడంగిరి. కానిందు భయము లేదు. అప్పుడప్పు డిట్టి ధర్మవిరోధులు పుట్టి గిట్టుచునే యున్నవారు. కాని జగద్రక్షకుండును, ధర్మస్వరూపుండును, నగు శ్రీపరమేశ్వరుని దయావిశేషమువలన నింతవఱ కావైదికధర్మములు చెక్కుచెదరక నిలిచియున్నవి. ఇప్పుడు కొందరు పుంగవులు వేదశాస్త్రధర్మములు మాకక్కఱలేదనియు, వానిని మేము నమ్మమనియు, విధవారజస్వలావివాహాదు లాచరణీయములనియు, వర్ణసాంకర్యము స్వరాజ్య ప్రథమసోపానం బనియు జెలరేగి బోధించి సంఘమునందు బలవంతముగా బ్రవేశింపఁజేసి తాము బాధపడుచు నితరులను బాధించుచున్నారు. ఇది యేటిన్యాయమో తెలియరాదు. ఈమహామహులు, స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః, యను భగవద్గీతావాక్యమును మరచిరా ? తెలిసియు నితరులను బాధపెట్టుటకా ? లేక యిదియేనా స్వరాజ్యము ? ఇట్లు బాధపెట్టుటకేనా ? మానుండి వోట్లు తీసికొనినది ? వాహ్వా ! వాహ్వా ! కాంగ్రెసు, ఔరా ! స్వరాజ్యము, బలే స్వాతంత్ర్యము.

ప్రస్తుతంబునందు ధర్మనిలయంబగు మననైజాము దేశమునందుఁగూడఁ గొందఱు మహానీయులుపరదేశములనుండియిచటికి వచ్చిచేరి సంఘసంస్కార్యాదినామధారులై యీదేశవాసులగు కొంతమందిమహాశయులను గూడఁ దమవలలో వేసికొని వారు వీరునుం గలిసి విధవారజస్వలా వివాహాదులం గావింపంజేసి మమ్ము బహిష్కరించెడివారీదేశగ్రామంబులందు లేరని వ్రాయసాహసించిరి. కాని యీధర్మవిరుద్ధకార్యంబుల గావించెడి వీరింగూర్చి పురప్రముఖులు పండితులు, ధర్మిష్ఠు లెందఱెందఱు చాతుర్వర్ణ్యజను లెంత నిందించుచున్నారో

యెంత యేవగించుకొనుచున్నారో యెల్లెట్లు కరపత్రములం బ్రకటిం చుచున్నారో పతివ్రత లెంత చింతించుచున్నారో చూచియు నిట్లు వాపోవుట యెందులకో తెలియరాదు. ఇది యిట్లుంచుడు.

ఎన్నివిధములజూచినను మన తనుధనమానములను సమర్పించి యైనను వేదశాస్త్రశిష్టాచారవిహితవర్ణాశ్రమములను గాపాడుకొన వలసియున్నది. అందునను శారదావివాహశాసనము వెంటనే నిర్మూ లింపవలసియున్నది. శ్రీప్రభుత్వమువారు రాజభక్తిపరాయణులమగు వర్ణాశ్రమధర్మరతుల మొఱయాలకించి ధర్మవిరోధు లగు వారిమాట లను నమ్మక శ్రీ శ్రీ విక్టోరియా చక్రవర్తిని వాగ్దానానుసారముగా నీదుశ్శాసనమును నిర్మూలించి (రద్దుచేసి) మతస్వాతంత్ర్యము మా కనుగ్రహించి సంస్తుతిపాత్రు లగుదురుగాక ! బ్రాహ్మణులు మున్నగు వర్ణాశ్రమధర్మపరాయణులు తమపాండిత్యమును, ధనమును, యుక్తిని, శక్తిని, భక్తిని తమతమ యమోఘప్రతిభాబలములనువిని యోగించియీ వివాహశాసనము నిర్మూలించి ధర్మమును రక్షించి సుఖింతురుగాక !

" సంఘే శక్తిః కలౌయుగే " యను ప్రమాణము చొప్పున ఈ ధర్మవిషయంబులందు మనమందఱము నొక్కవిధమున గష్టపడి ధన్యులమగునట్లు ధర్మమూర్తియగు భగవంతుఁ డనుగ్రహించుగాక.

క॥ ధర్మంబుఁ జెఱుపఁ జెఱచును
ధర్మము రక్షించువానిఁ దా రక్షించున్
ధర్మంబు జెడకయుండను
నిర్మలమతిఁ బ్రోవవలయు నిశ్చలనియతిన్. "



వారిని వీరి నంప నటువంటిపనిం బొనరింతురే? మహా
వీరులు సంధికేగుటకు వేలును లక్షలు లేరె వారిలోన్.

కావున రాయబారమున కెట్టివాఁడుపోవలెనో యట్టివాని నను పుటయే కర్జము—అట్టివాఁడు నీకుమారుఁడే—తక్కిన మనవీరులసంగతి నీవెఱుంగనిదికాదు. నీవు క్రొత్తదానవుకాకుంట వివరింపఁ బనిలేదు. వారు పోయినచోఁ గానున్న సంధి చెడకమానదు. తక్కినవీరులందఱును నరసింగునికిఁ బ్రబలవిరోధులగుట నచ్చఁజెప్పలేరు. ఒకవేళఁ జెప్పినను రాజు వానిని పాటింపఁడు. ఇఁక నీకుమారుఁడన్ననో

క॥ మనకెల్లం బరమాప్తుఁడు
జనపతి నరసింగు పెద్దజామాతయుఁ బే
రెనసినవాఁడును శాంతుఁడు
జనసౌఖ్యముగోరువాఁడు చతురుఁడు నబలా!

చెల్లి॥ అన్నా! నీవెన్ని చెప్పినను నాయుల్లం బొల్లకున్నయది

ఉ॥ చిన్నతనంబునుండి యరచేతులఁ బెంచితి నిమ్మపండునా
వన్నెదొలంగనీయక. లవంబును లౌకికమైన తెన్నునం
దెన్నడు సంచరింపక యదేపనిగా సత మాటలాడు నా
చిన్నికుమారుఁడా తుదకుఁ జెల్లినయాతఁడు సంధిగూర్పఁగన్!

అందును బోవునది క్రూరభుజంగోపముఁడగు నరసింగుని పాలికి. అతఁడు మాయామయశక్తిస్వరూపిణియై మనపాలిటికిని విశేషించి మనసీమపాలిటికిని నకాలమృత్యువుగా నుదయించిన దాని చేతిలోఁ గీలుబొమ్మచందంబున నున్న జ్ఞానశూన్యుఁడు. అట్టివానికి స్వకీయుఁడనియుఁ బరకీయుఁడనియుఁ దోఁచఁగలదే? అంతజ్ఞానమేయున్న బాలమద్దేవుల కీయు చాట్లు దెచ్చిపెట్టునా? ఇంత యోజింపవలెనా?

తే॥ పల్లెనాఁడనుదివ్యమా వనమునందు
వీరు లనుమావిగున్నల వెదకి కాల్చ
జననమొందిన దావాగ్ను లనఘ! వార
లట్టివారికి మంచి యొంతైనఁగలదె?

బ్రహ్మ॥ చెల్లెలూ! అశ్లీలమునకుఁ జోటులేదు. బాలమల్దేవుల విష
యము జ్ఞాతివర్గములోనిది. జ్ఞాతివైరము లోకసహజము. మన
యలరాజు చుట్టరికము తద్రక్తసంబంధము. కావున
భీతిల్లఁజనదు.

చ॥ తనసుత యొద్దనుండఁ దనదండకువచ్చిన యల్లుఁడైన వా
నిని దెగటార్చ నేకుమతి నీచపథంబును ద్రొక్కఁజూచు? లోఁ
దనకు ననిష్టమైనఁ బరితాపముఁజెందఁగఁబోవు కూఁతునై
నను దిలకింపఁడే? కులమునాశమొనర్చునె యేరు సెప్పినన్?

సహజముగా రాజు కపటి గాఁడు. కాలానుగుణంబుగా
నతనిబుద్ధి మాఱినది.

ఉ॥ చెల్లినఁ జెల్లకుండినను జెప్పెడుమాటల వించునున్నవాఁ
డెల్లపు డేకరీతిఁ జరియించునె? లేశము జ్ఞాన ముండదే?
కల్లనిజంబులం దెలియ గట్టిప్రయత్నము సేయఁబోఁడె? భూ
వల్లభుఁడౌచు లోకపరిపాటిఁ దలంచి మెలంగనేరఁడే?

చెల్ల॥ అన్నయ్యా! ఏటికీ శైత్యోపచారములు? వినుఁడు

మ॥ వనజాతాక్షి యుషాసతీమణి మదిన్ వాంఛించి తెప్పించి తం
డ్రిని లెక్కింపక కృష్ణపౌత్రు రతికేళిం గూడి తా గర్భధా
రణచే సంతసమంద బాణుఁ డతిరౌద్రస్ఫూర్తి సంగ్రామసీ
మను బాలుం గబళింపఁజూడఁడో? ప్రేమల్ క్రుద్ధులం జేరునే?

మీ రేమైనను జెప్పుఁడు. అతనిపైఁగల మరులు నన్నను
మతింప నీయకున్నది. అట్టి నన్నీకఠినకార్యమున కనుమతింపు
మని చెప్పుటకు నీకు నోరెట్లాడినది? నీవే కాఠిన్యమూనినఁ
బరులచెంత నాముద్దులు చెల్లునా?

బ్రహ్మ॥ అమ్మా! నీపుత్రుని సామర్థ్య మెఱుంగక బెంగపెట్టుకొం
టివి. వానిశక్తి సామాన్యమైనది కాదు. వినుము.

సీ॥ అసిని శేఁబట్టినా యరిదళమ్ములఁ బటా
పంచలు చేయు శుంభద్బలుండు.

ఈఁటెపో టొక్కటి మీఁటెనా గజకోటి
సమయింపఁజాలెడి శౌర్యధనుఁడు.
మాటాడెనా యెట్టిమేటినైనను నోరు
మూయింపఁగంజాలు న్యాయవిదుఁడు.
నేత్రంబులను విప్పి సలువెల్లఁజూచెనా
వైరిగుండె పగుల్చు ధీరవరుఁడు.
అఖిలశుభలక్షణంబుల కాలవాల,
ముభయులకుఁ బూజనీయుఁడై యొప్పువాఁడు.
దేవదానవులను నొక్కరేవునందు
నీరుద్రావింప నేర్చును నీసుతుండు.

నీవైనను నిట్టిఘనకార్యములకు నియోగించి వాని యశశ్చంద్రికల దిఙ్మండలంబున వ్యాపింపఁజేసి వీరమాతయను యశమందవలసిన దానికి మాఱుగా బేలచందంబున భీతిల్లుచుఁ దత్కారణప్రసారణమున కడ్డాయమాన వగుచుంటివిక దా! మనల నమ్మిన వారి సౌఖ్యములకంటె మన సౌఖ్యముల నెంచుట యొకఘనతయా? ఆయు వల్పము. శరీరము బుద్బుదప్రాయము. అందు వీరమాతలే పెడదారివట్టినఁ దదితరులమాట నేమన వలె?

ఉ॥ ఎన్నఁ బదాఱువర్షముల యీడుగలాఁడు. గృహంబు వీడలే
డెన్నఁడు. నేకపుత్త్రుఁడు మహీధరతుల్యులు వైరివర్గముల్.
చిన్నది భార్య, గర్భవతి. చెల్లని సంగతు లిన్నియుండినన్
మున్ను సుభద్ర పంపదొకో పోరికిఁ దా నభిమన్యు ధీరమై?

ఆరీతి నిది యుద్ధమున కంపుటయా? కాదు. పట్టి రాయబారము. ఇట్టి స్వల్పకార్యమునకే వెనుదీయుచుండినఁ గర్మవశంబున రేపు యుద్ధమే తటస్థించిన నపు డెప్పాట నొప్పి సుతుని బంపఁజాలుదువు? దేశమున వీరమాతృశబ్దము నేటితో నంతరించునా?

అలరాజు॥ (ప్రవేశించుచుఁ దనలో)

చ॥ అనయము నాదుసేమమును నారయుచుండెడి కన్నతల్లి నె
మ్మనమున నాదుమాటయణుమాత్రము నెంచక కోపమూనితాఁ
గనులను జూడకుండుటకుఁ గారణమేమొ యెఱుంగనైతి. నే
వినయము వీడినాఁడనొ వివేకములేక చరించియుంటినో.

ఆమెకడ కరిగి కారణ మారసి నాయెడఁగలిగిన దోసంబుల సవరించుకొని క్షమింపఁ బ్రార్థించెద. ఏమీ? మామగారు గూడ నిందుండినారే. వీరెపుడు వచ్చిరో. మాయమ్మ తత్సంభాషణాయత్త చిత్తయై యున్నదికాఁబోలు. మంచిదేకాని యామెమోము వన్నెదఱిగి చిన్నవోయియున్నది. కారణమేమైయుండునో! ఒకవేళ నేనే హేతువైయుండునా? (ఆలోచించి) ఏమో! కానిమ్ము (సమీపించి) అమ్మా! వందనములు. మామగారూ! జోహారులు.

శా॥ మామా! యెప్పుడువచ్చితీవు? సుఖులే మాచిన్నిమామల్? సదా
సేమం బారయు వీరవర్గములు వాసిన్ సౌఖ్యముం గాంతురే?
ధీమంతుండగు బాలచంద్రుఁడు మహాతేజస్వియై యుండెనే?
భూమీశుల్ మిముఁగొల్చుచుందురుకదా మోదంబు సంధించుచున్.

మాయమ్మల ధన్యులఁజేయుటకుఁ గాక మీరాకకు వేఱుకారణ ముండదని నమ్మెద. (తల్లివైపుతిరిగి) రాక రాక వచ్చిన మహామహుని దర్శనభాగ్యంబున కుప్పొంగవలసిన తరుణమున మీమోము మాఱువిధంబు దోఁపఁజేయుచున్న దేమమ్మా?

చెల్ల॥ (మాటలాడక యూరకుండును)

బ్రహ్మ॥ అబ్బాయీ! నారాక మాచెల్లెలికి సంతోషదాయకమే యయినను నేవచ్చినకార్యము దుఃఖావహముగాఁ బరిణమించుటచే నట్టిసంతోషమును వెలిపుచ్చుట కవకాశము గలుగనీయకున్నది.

అలరా॥ సామాన్యముగాఁ జింతింపని మాతల్లిగారి కిట్టివంతగూర్చిన కార్య మేదియో నే నెఱుంగవచ్చునా?

బ్రహ్మ॥ పుత్రా! ఎఱిఁగియుందువుకదా మనదేశపు దుస్స్థితియు మీ మామగారి చైదంబులును. దానికై దేశక్షోభ మడఁగింప సమకట్టి సంధిరూపంబునఁ గార్యము చక్కఁబెట్టుకొన నిన్ను రాయబారిగాఁ బంపఁగోరితి. క్రూరుండగు మీమామ చెంత కనుప నిష్టములేక దిగులొందుచున్నది.

అల॥ అమ్మా! ఇదేనా నీదుఃఖకారణము? చాలుఁజాలు. వీర మాతలు విన్న నవ్విపోదురు. భారతదేశస్త్రీపాళికి మేలుబంతిగానుండవలసిన వీరరాల వెల్లవారిలోఁ దలవంపుఘటిల్లు నట్లు ప్రవర్తింపఁ దలఁపడుదువని కలనైనఁదలంపనైతినిగదా! దేశప్రేమముకంటెఁ బుత్రప్రేమము మిన్నయగునే? అక్కటా! నీచేత నేఁడిటుల మాఱుత్రోవ త్రొక్కించిన విధాత నెంతని దూఱవలయు.

తే॥ స్వర్గమునకంటెఁగూడఁ బ్రశస్తతమము
మాతృదేశము జనులకు మహితలమున.
దానిఁ జెఱుపంగఁజూచిన హీనగుణుల
రక్తమును గ్రోలుటను మించు ముక్తి కలదె?

అయ్యో! దేశక్షేమమునకు నన్నంపుమనిన వెనుకాడుచుంటివే. మాతృదేశసేవకంటె మనకు మాన్యతఁగూర్చు కార్యమేది?

తే॥ పెంపు సొంపును మఱచి సంప్రీతి విడిచి
ప్రాణములనైనఁ దృణముగా లోనఁదలఁచి
పుత్రులనుగూడ బలివెట్టఁ బూనవలయు
సాహసంబున మాతృదేశంబుకొఱకు.

అనికదా పెద్దలు వక్కాణింతురు. నీవెంచినట్లు మామామ క్రూరుఁడే యగుఁగాక. నాకేమిభయము? నన్నేమిచేయఁగలఁడు? నన్నతనికడకుఁబంపుట కేలవెనుకాడుచుంటివి? [కొంచెమూరకుండి] అయ్యోతల్లీ! మాటాడవేమి? ఏల నీకీ

భ్రాంతి ? అతఁడు బలవంతుఁడనియుఁ గ్రూరుఁడనియుఁ గదా నీయూహ. అయిన నేమాయె, నేనుమాత్రము బలవంతుఁడనుగానా ?

మ॥ బలదర్పంబులు లేవె? సాహసము లుప్తంబాయెనే? యుద్ధకౌ
శల మొప్పారదె? మొక్కవోయెనె ప్రశస్తంబైన నా కత్తి? వీ
రుల పేర్వాసి నశింపఁజేతువాఁకొ? ధీరుండైన మాతం డ్రశీ! కీ
ర్తిలతం ద్రుంచుదునే. త్రుటింబరులకీర్తిన్ రూపుమాపుదునే.

కాక వారు పదుగు రేకమై వచ్చి నన్నుఁ జుట్టుకొని గిట్టింతురనియా నీకు భయము? మాతా! అది కల్ల. వారందఱేకమై వచ్చిన నేమి? పదుగురు కాదు, పదివందలు కాదు, పదివేలొక్కసారిగా రానిమ్ము. వచ్చినవారి కందఱికి నన్నిరూపులై,

ఉ॥ సంగరరంగమందు నిజశాత్రవరాజుల నెత్తురోళ్ళ న
ర్భంగనమాచరించునను నచ్చెరువందఁగఁ జూచి దేవతల్ [సే
గంగసుతుండొ యర్జునుఁడొ కాలుఁడొ చక్రియొ యంచునూహ
యం గలవారుపో. తెలియ వమ్మరొ! నాదు ప్రతాపసంపదల్

కాక నాకే విపత్తు సంభవించిన సంభవింపనిమ్ము. దైవవిధానముఁ దప్పింప నేరితరమగును? అట్లు దేశక్షేమమునకై దేహమర్పించుటచే నాకుఁగలుగఁబోవుయశంబు నీయదియే కాగుఁ గదా! పదుగు రేకమై పన్నిన పద్మవ్యూహమును ఛేదింగియుండియు నాథుఁ డింటలేనితఱి సుభద్ర సంతోషంబునఁ దన ముద్దుసుతు నభిమన్యుకుమారుఁ బంపియుండలేదే ? అప్పుడు వైరులు వాని దేహమునే యపహరింపఁగలిగిరి కాని యశము గైకొనఁగలిగిరా? ఆ యశస్సు నేఁటిదాఁక ధాత్రిని స్థిరముగా నిలిచియుండలేదే ? అంతియగాక జననీ !

మ॥ స్థిరకీర్త్యంగనఁ బెండ్లియాడుకడకన్ ధీరుండు స్వప్రాణముల్
వరుసన్ దేశహితార్థమై విడుచు. న వ్వాఁడే దివంబందు వ

స్సురకోటుల్ నివసించుఁ. బ్రాణమన నాసఁజెందు జీవన్మృతుం
డురుదుష్కీర్తి గడించుకొంచు నెపుడో డుల్లుం బశుప్రాయుఁడై

అట్లుకాక నీయానతి నే నెందుం గదలక యుందే యుండిన విధివశమున రానున్న విపత్తులు రాకయుండునా? పోనున్న ప్రాణములు పోకయుండునా? పుట్టిన ప్రతిజీవికిని మరణ మెప్పటికైన నుండునదే కదా! మఱియు

తే॥ బుద్బుదప్రాయ మరయంగ భువిని బ్రాణ.
మేక్షణం బేమియూఁడునో యెఱుఁగలేము.
నేఁడో రేపో నశించుట నిశ్చయంబు.
దాని శాశ్వతమని జనుల్ తలఁచుచుంద్రు.

ఇపుడు దేశహితార్థముగా నన్నంపలేనిదానవు రే పేకారణంబుననో మరణించిన నెట్లు సహింతువు? సహింప కేమి చేయఁగలవు చెపుమా. వెఱ్ఱితల్లీ! ప్రాణములే స్థిరములు కానప్పుడు ప్రేమానుబంధంబులు మాత్రము స్థిరములా? ఇహసంబంధము లన్నియు ఋణానుబంధంబులుసుమీ! అట్టిదానికి నజ్ఞానులు

తే॥ మోహవారిధిలోపల మునిఁగి చిరము
చచ్చుచుం బుట్టుచును జన్మశతముఁగూడ
వమ్మొనర్చుచునుందురు వైరబుద్ధిఁ
గొంతవడి స్నేహబుద్ధిచేఁ గొంతవడియు.

జ్ఞానయుతవైన నీవుగూడ నట్లొనర్పఁ బాడియే? మోద మొందవలసిన దానికి ఖేద మొందుచుఁ బూజ్యులైన మామగారితో వాదంబొనరింప నీయట్టిగుణనిధికి నీయట్టిధీరచిత్తకుఁ దగినపనికాదు. అందును నే నేగనుండినకార్య మలఁతిగాదు. మాతృదేశదాస్యవిముక్తిసాధకమును శౌర్యస్థాపనాధారమును వీరస్వర్గసంపాదకమును వీరమాతృయశ ఉద్ధారకమును. అట్టిదానికై నీవిట్టి గుట్టువీడి రట్టుఁబెట్ట సమకట్టుట దిట్టతనంబు

గునే? ముందటి వీరమాతలు నీదారిఁద్రొక్కినచో నట్టిశబ్ద మునకు సద్గ్రంథములఁ దావే లేకయుండెడిదికదా! అమ్మా! అపరాధముకాని నిజముగా నీయట్టి దేశద్రోహిని మఱియొక రుండఁబోరని నాయభిప్రాయము.

బ్రహ్మ॥ (తనలో) బళే బాలకా! నీతత్త్వోపదేశము మెచ్చఁదగినది. నీయట్టి వీరవరులఁ గనుటచేతనే భరతమాత కెనలేని యౌన్నత్యము గలిగినది.

చెల్ల॥ ఏమీ! దేశద్రోహినినా ? నేనా? యెంతమాట !

తే॥ నాగళంబునఁ బ్రాణ మున్నంతవఱకు
దేశవిద్రోహి ననుపేరఁ దిరుగఁబోను.

కుమారా! వీరమాతనైనప్పటికి నాఁడుపుట్టువుగనుక సహజముగు బేలతనము నన్నుఁ గ్రిందుమీఁదుఁజేయఁ బ్రేమపిశాచము వెంటనే నన్నావహించి కొంతవఱకు కూగించినది కాని నేనుమాత్రము దేశక్షేమము కోరనా? స్వరాజ్యస్థాపన కాశింపనా? తండ్రీ! త్వద్వాక్యమంత్రాక్షతలచే నన్నావహించిన పిశాచము పాఱిపోయినది. నేనిప్పుడు నిక్కపు వీరమాతనైతిని. (బ్రహ్మనాయునిదిక్కు మొగంబై) అన్నా! ఇదుగో పుత్త్రుఁ ద్వదధీనుఁ జేసితిని.

జన్మభూమికి సాయంబు సల్పుటకయి
సుతుని బంపెదఁ గార్యంబు చూచుకొనుము.

నీవు వీని నెట్టికార్యమునకు నియోగించినను సమ్మతింతును. వేయేల? కత్తిఁబట్టి నన్ను రమ్మనినప్పటికిని సంశయింపక రయంబునఁ బయనమైవత్తును. నాయనా! అలరాజా! వనికేగునపుడు మున్ను కౌసల్య తనకుమారుల కెట్టిదీవనలొసంగి పంపెనో యట్టియాశీస్సు లిడుచున్నదానఁ గైకొనుము. నిర్జరులు నిన్నోముదురుగాక. పోయి రమ్ము శుభం బయ్యెడు.

అల॥ అమ్మా! ఇప్పటికిఁగదా ధన్యుఁడనైతిని. ఇదుగో నమస్కరించువాఁడ. మామా! నాకిపు డేమియాజ్ఞ?

# అభినవసరస్వతి

సంపుట ౨౨ | జానపాడు
ప్రమోదూత, ఆశ్వయుజము | సంచిక ౭

## స్వవిషయము.

రెండుమాసములు జ్వరగ్రస్తుఁడనగుట శ్రావణభాద్రపదములకు రెంటికిని నొకమాత్రే పత్రిక ప్రచురించితినని వెనుకటిపత్రికలో వ్రాసికొనియుంటిని. రెండుమాసములకు నొక్కసారిగాఁ బంపినను పన్నా సాంతమున నైనను బంపుకొనలేనందులకుఁ జింతిల్లుచున్నవాఁడను. ఏమి చేయను? ఏనెల కానెల ముద్రాక్షరశాలాధికారులకు నేను డబ్బిచ్చుట లేదు. ఏనెల కానెల వారు నాకుఁ బత్రిక ముద్రించి యిచ్చుట లేదు. సన్నిహితవార్ధక్యుఁడనగుట నోపికలేనియు నారోగ్యాభావమునను గ్రహచారవశత నేర్పడిన వ్యవహారపుఁ జిక్కులవలనను సర్వదా కాలికి బలపముగట్టుకొని సంచరింపమిని చందాలు వసూలుగాక ముద్రాపకులకు సకాలమున నేను డబ్బీయలేకుంటిని. ఇంతకును మా పత్రికాపాఠకులు సకాలమునఁ జందాలు దయచేసినచో సర్వమును చక్కపడును.

———:o:———

## శారదాశాసనము

శారదాశాసనము మొదలిండియాగౌర్నమెంటుఆక్టుకే విరుద్ధము. హిందూమహమ్మదీయ న్యాయశాస్త్రముల ననుసరించి తల్లిదండ్రులయొక్కయుఁ గుటుంబయజమానులయొక్కయు నధికారమును రక్షింపవలయుననియు మతాచారముల గౌరవింపవలెననియు వర్ణాశ్రమాచారములఁ బాటించు కులములవారిచేఁ జేయఁబడు నెట్టికార్యము నైనను నింగ్లీషు న్యాయమునకు విరుద్ధముగ నున్నను నపరాధముగాఁ

తీర్మానింపఁబడఁగూడదనియు బ్రిటీషిండియాలో నేయధికారియైనను నిందులకు విరుద్ధముగా శాసనముఁ జేసినయెడల నా శాసనములో నట్టి విరుద్ధముగానున్న భాగముమాత్రము నిరర్థకమగుననియు 1780 వ సం॥ ఆక్టు 18 వ సెక్షనులోను 1797 వ సం॥ ఆక్టు 12 వ సెక్షనులోను 1915 వ సం॥ ఆక్టు 84 వ సెక్షనులోను వివరింపఁబడియున్నది. ఇట్లని హెచ్. యస్. సుహృద్వర్ది బారిష్టర్లు, వరేంద్రనాథసేను, అడ్వకేటు చారుచంద్రమిత్రి మున్నగు బెంగాలు బొంబాయి మదరాసు హైకోర్టులకుఁ జేరిన బ్యారిష్టరులును లాయరులును నసెంబ్లీసభలోఁ బ్యాసయిన శారదావివాహ శాసనమును విమర్శించుచు నభిప్రాయము లొసంగుచున్నారు. వాని ననుమతి మొదలైన యింగ్లీషుపత్రికలు ప్రచురించుచున్నవి. కావున శారదాశాసనముప్రకార మెవరైనను క్రియమాణబాలికా వివాహములపైఁ గేసులు తెచ్చుచోఁ బ్రతివాద మొనర్పవచ్చును. ఈయేప్రియలు ప్రారంభమునుండి శారదాశాసనము అమలులోనికి వచ్చినది. తద్విరుద్ధముగా వివాహములు వేసవేలగుచున్నయవి. కాని వివాహములుచేసినవారిమీఁదమాత్రము తెలుచు కేసులు తీసికొని రాఁబడుటలేదు. మనపూర్వులచేత శాస్త్రీయమును విశ్వాసముతో నాచరింపఁబడు వర్ణాశ్రమాచారములు శాసనసభల చేత నశింపఁజేయఁబడుట కెవఁడును సంగీకరింపఁడు. కాని హిందూ ధర్మశాస్త్రములకు లోఁబడి తలిదండ్రులచేతఁ జేయఁబడు వివాహములలోని మతాచారముల లక్ష్యపెట్టని ధార్మికులుగూడఁ గొందఱు లేక పోలేదు. వారే సంఘసంస్కర్తృనామము వహించి వర్తిలుచున్న వారు. వారే దేశోద్ధారకబిరుదాంకితులు. అట్టిదేశనాయకం మన్య లాంగ్లేయపరిపాలనము నాక్షేపించుచు నాక్షేపింపఁదగు వహాచరించుచుండుటయుఁ బ్రభుత్వమువారిచే బహిష్కృతులగుచుండుటయుఁ బ్రజలందఱు నెఱింగియున్న విషయము.

అట్టియలజడికి సర్వారు గుఱికాకయుండిన శారదాశాసనము నతిక్రమించి వివాహములుపువా రందఱును జైలునకుఁ జనవలసిన వారలే యయియుందురు. కాని దానికి భగవదనుగ్రహముచేఁ బ్రస్తుతము పరివర్తన మేర్పడినది. మరల దీనికిఁ బరివర్తనమేర్పడి యాచరితబాలికావివాహములపై సర్వారు కేసులనే తెచ్చిపెట్టనిండు. సనాతనధర్మపరాయణులు పైనిజెప్పఁబడిన యాక్టులప్రకారము కోర్టులలోఁ బ్రతివాదములు చేసితీరవలయును. వ్యక్తులుకాక సంఘములే కేసులు తెచ్చిపెట్టిన యెడల సనాతనధర్మసంఘములే యీవిషయమై కోర్టులలోఁ బ్రతివాదములుచేసి కేసులుతెచ్చిన సంఘములవలనఁ బరిహారములఁ బడయఁ బ్రయత్నింపవలయును. ఐహికమైన స్వాతంత్ర్యమును సంపాదించుటకే సంఘసంస్కర్తలమనుకొనువారు శరీరధనప్రాణముల నర్పించుచుండ నాముష్మికములును ననాదిసిద్ధములును నగు వర్ణాశ్రమాచారముల రక్షించుకొనుటకు సనాతనధర్మానుయాయులు శరీరధనప్రాణములనైనను సంత్యజించుటకు సంసిద్ధులై యుండవలయును. గ్లాని తురుష్కులుమొదలైన దుష్టరాజుల పరిపాలనసమయముల నింతకన్నను నెక్కువగనే ధర్మమునకు ధ్వంసము తటస్థింపనుండుటయుఁ దనుధనప్రాణములనైనను త్యాగముచేసి మనవారు మతమును గాపాడుకొనియుండుట మనము మఱువఁగూడదు. కావున వర్ణాశ్రమాచారములయందు విశ్వాసముగలవార లెప్పటివలెనే వచ్చెడికష్టముల లక్ష్యపెట్టక బాలికలకు శాస్త్రమునందుఁ జెప్పఁబడిన యుక్తకాలమునందే పెండ్లిండ్లుచేయుట శ్రేయమనియు న్యాయమార్గమననుసరించువారికిఁ బెక్కండ్రు తోడ్పడఁగలరనియు భయపడవలసినపని లేదనియుఁ బూర్వాచారపరాయణులు త్రికరణశుద్ధిగా విశ్వసించెదరుగాక.

—:O:—

# పంచవ్యసనవివరము

[ కీర్తిశేషులైన మండ చినవెంకయ్యగారు ]

ఆర్యులారా !

ఇదివఱకు గాంధిబోధించిన పంచబహిష్కారము లొనరించినఁగాని మన హిందూదేశమునకు స్వరాజ్యము రాదనియు మన వ్యాసులు బోధించిన సప్తవ్యసనములలో ముఖ్యమైన పంచవ్యసనములు మానుటయే స్వరాజ్యమనియు వ్రాసితిని. ఇపు డాపంచవ్యసనవివరము చేయుచున్నాను. గుణగ్రహణ పారీణులు నిజ మూహయుదురుగాక.

మొదటిది వెలఁది, (స్త్రీలోలత) శ్లో॥ దాసీ మానధనం హంతి, హంతి వేశ్యా ధనాదికం, ఆయూంషి విధవా హంతి సర్వంహంతి పరాంగనా॥ దాసీసంగమమువలనఁ బరువు (ప్రతిష్ఠ) పోవుననియు వేశ్యాసంగమమువలన ధనమానాదులు పోవుననియు విధవాసంగమమువలన నాయువు హరించుననియుఁ బరాంగనాసంగమమువలన ధనమానప్రాణాదులన్నియు నశించుననియుఁ బెద్దలు నిర్వచించిరి. కాన భర్తృహరి చెప్పినట్లు స్వభార్యతప్ప సర్వస్త్రీలును బరిహరింపఁదగినవారలని భావము. రెండవది పానము. కం॥ సిగరెట్లును బీడీలును బొగచుట్టలు కాల్చువల దన్నట్లు చుట్టలు కల్లు సారాయి యిప్పటివి దేశీయములగు విస్కి బ్రాండి వైన్ బీరు ఫయిన్ డేగరు త్రీడేగరు మున్నగునవి యొక దానినిమించి యొకటి మత్తును ధనవ్యయము గలుగఁజేయును. గంజాయి నల్లమందు మున్నగునవియు మత్తుగలుగఁజేసి మతిచెడఁగొట్టుట చీనాదేశచరిత్ర నెఱింగినవా రందఱికి విదతమే. కాన నిట్టి మత్తుద్రవ్యములు మానవలయునని భావము. మూడవది జూదము. ఇందుఁ బట్లాట మొదలు డంకా పలాసు పెంకాట మున్నగు ద్యూతభేదము లాడుటచేఁ

గొప్పలు గుల్లలగునుగాన వీనినన్నిటిని మానుట యుక్తము. నాల్గవది
వేఁట. ఇది పూర్వరాజులకు సహజవ్యసనము. ఇపు డారాజులు లేక
పోయినను ప్రజాసామాన్యము రాజభోగులగుటచే వేఁటకుమాఱుగా
వ్యాజ్యమను వ్యసనము బయలుదేరినది. పూర్వపు గ్రామములలోని
ధనవ్యయములేని పంచాయతితీర్మానపుఁబద్ధతి పోయినది. డిస్ట్రిక్టు
మునసబుకోర్టు జిల్లాకోర్టు హైకోర్టులుగాక కొన్ని కేసులలోఁ బ్రీవి
కౌన్సిలునకుఁగూడ నప్పీళ్లుచేసి యాడినవాఁడు కోర్టువద్దను గెలిచినవాఁ
డింటివద్దను నేడ్చుటయు భూధనములు గోల్పోవుటయుఁ గనులారఁ
జూచుచున్నారము గాన సర్వదా కోర్టులకెక్కుట మానవలయునని
భావము. రెండెద్దులు లాగినఁగాని బండి సాగనట్లు భార్యాభర్తలు
హితముగా వాడినఁగాని సంసారము నిల్వనట్లు వాదిప్రతివాదు లిర్వుర
కును వివాదకాంక్ష తగ్గినఁగాని యియ్యది సాధ్యపడదు. కాని హిందూ
దేశము చీఁకటిలోనుండుటచేఁ గనులుగానక గోతిలోఁబడినట్లు కోర్టుల
కెక్కుచున్నారు. కాన గాంధిబోధననుసరించియయినను నీ కోర్టుకె
క్కుడీ వ్యాజ్యపు వ్యసనము మానినఁగాని కుటుంబరాజ్యము నిల్వదని
నున్నను. అయిదవది సొమ్ము. ధనము నిష్ప్రయోజనముగ వమ్ము
సేఁత (దుర్వ్యయము). ఇందుననే యిప్పటి హిందూదేశ దారిద్ర్య
మిమిడియున్నది. భోజనపుహోటలులలోఁ బూట కాఱణాలు. కాఫీ
హోటలులఖర్చు దీనికి రెట్టి. సాధారణక్షౌరమునకు రెండణాలు. క్రాపింగు
నకు రెట్టి. విగ్ పావలా, జాకెట్టు రూపాయి. ఎద్దుబండిలోఁబ్రయా
ణము మైలు కొక యరణా. జట్కాబండి కణా. రైలులో నాల్గు
పైసలు. మోటారులో దీనికి రెట్టి. ఇపు డేరోప్లేన్లు జప్పినులు సిద్ధ
మైనవి. సినిలోఁ బ్రియాణము పైవానికి నాల్గైదురెట్లయిన నగును.
పల్లకీయూరేగింపులు పోయినవి. పూలరథములు పూసలపల్లకీలు
నేర్పడినవి. బజంత్రిమేళమునకు నాలురెటతోఁ బట్టుఘుసన్నాయిలు

గన్నెట్లుమేళములు భోగపుమేళములు నేర్పడినవి. ఇట్టి యతివ్యయములు వారియఁబూనినచోఁ గొన్ని వాల్యూమము లగును. పూర్వమాయమునకుఁదగినవ్యయమే చేసెడివారు. ఇపుడు పులినిజూచి నక్కవాఁతలువేసికొనినట్లు ధనవంతులనుజూచి ధనహీనులును నమితవ్యయమును జేయుచుఁ బూర్వులార్జించినభూము లమ్మి యిన్‌సాల్వెంటు లగుచున్నారు. గాంధిగారన్నట్లు నిర్మాలముకుఁదగిన నిర్మాణము లేదు. అన్నవస్త్రములిచ్చెడి నాగలి రాటముఁ జేఁబట్టువా రసలే శూన్యము. సౌంకెన్ పేనా గుండుసూది యయినను జేయువా రరుదయిరి. ఇఁకఁ బాశ్చాత్యవస్తువులు రాకున్న హిందూదేశ మంధకారమయమగునట్లున్నదికాన దీనిని సంస్కరించు సాధనము గ్రామపునర్నిర్మాణమే.

—:o:—

# ఆర్యసంఘ క్రీడలు

[ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ]

ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామని యొకయభియుక్తోక్తి గలదు. ధర్మాధర్మనిరూపణ కేవలప్రాకృతమతుల కసాధ్యమనియును బాజ్ఞులకైనను స్థూలదృష్టితో నిది ధర్మ మిది యధర్మమని రూపించుటకు వీలుకాని సూక్ష్మాతిసూక్ష్మములగు తత్త్వములను జక్కని పౌర్వాపర్యగమనమును వాని నిర్ణయించు వైదికమార్గములను నెఱిఁగిన పెద్దలవలన మాత్రమే విని యెఱుంగఁదగినట్టి మర్మము లనేకమిందుఁ గలవనియును గావుననే ధర్మముయొక్క తత్త్వము పరతత్త్వమువలెఁ బ్రాజ్ఞజనైకసాధ్యముగా నుండునట్లు గుహానిహితము గావింపఁబడినదనియును బ్రజ్ఞావృద్ధులు వర్ణింపఁగా వినియుంటిమి. కాని కాలక్రమముగా మనముచేయు కొలఁది యీవ్యవస్థ మిక్కిలి యథార్థమను విశ్వాసము జనించుచున్నది.

ఆర్యసంఘముయొక్క ధర్మతత్త్వమువలెనే సాంఘికతత్త్వము కూడ నీకాలమునఁ దత్త్వజ్ఞుల యసాన్నిధ్యముచేత దురూహ్యమై ప్రాకృతమతులకుఁ గొఱుకుడువడనట్టిదిగమాత్రమై యుండుటయే కాక కొందఱభిజ్ఞంమన్యుల యవిమృష్ట విమర్శనములకుఁగూడఁ బాల్పడవలసివచ్చుచున్నది. కాని యిం దాశ్చర్యమునకుఁదావులేదు. కేవల నైహికభోగవ్యగ్రమైన పాశ్చాత్యహృదయము నాదర్శముగాఁగొన్న సోదరుల కైహికాముష్మికఫలానుబద్ధమగు ప్రాచ్యహృదయముయొక్క నిజతత్త్వము గోచరింపకపోవుటలో నాశ్చర్యములేదుకదా! కాఁబట్టి ప్రస్తుత మీవ్యాసమున నార్యసంఘక్రీడ లనువిషయమునుగూర్చి ప్రాచీనగ్రంథములందు లభించెడి యాధారములను జూపింప యత్నించెదను.

ఆర్యుల సాంఘికవ్యవస్థలను జూపింపఁగల ప్రాచీనగ్రంథములలో వాత్స్యాయనమహర్షి రచించిన కామసూత్రము లనుగ్రంథము చాల నమూల్యమైన విషయములను దెల్పునట్టిది. కేవలమును నమూల్యములగు విషయములను వెల్వరించుటలోమాత్రమే కాక ప్రాచీనతలోఁగూడఁ బ్రకృత ముపలభ్యమానములగునట్టి గ్రంథము లన్నిటికంటెఁగూడఁ బ్రకర్షతనొందియున్నది. ఈ గ్రంథమునకు వాత్స్యాయనమహర్షి లోకతంత్రమని పెట్టినపేరు లోకముయొక్క (సంఘముయొక్క) వ్యవస్థలను జక్కఁగ సూచింపఁగల్గియుండుటచేత సార్థకపఱచుచున్నయది, (ఇట్టిగ్రంథము గతానుగతికన్యాయమున నధఃపతనము నొంది ప్రచారమునకు రాకపోవుట యాంధ్రుల దురదృష్టమనక తప్పదు. అందునను సాధారణాధికరణమునందలి నాగరకవృత్తమను నధ్యాయ మార్యుల సాంఘికవ్యవస్థల నుల్లేఖించుటలో నసాధారణమైనదని నాభావము.

ఏకార్యమునొనర్చినను సేవితము చేసినను నార్యు లద్దానిని భుక్తిముక్తిఫలప్రదముగానుండున ట్లేర్పాటుచేసినారు. (ఆటలుగాని పాటలుగాని వ్రతములుగాని యుపాసనలుగాని తదితరములగు గోష్ఠీ ప్రసంగాదులుగాని యేదినాచరించినను నైహికమును నాముష్మికమును నొకదాని కొకటి కలసిమెలసినచ్చున ట్లుండవలయునని వారి సిద్ధాంతము. కనుకనే వారు గోష్ఠీప్రసంగములు గోష్ఠీసమవాయములు సమాపనకోత్సవములు నుద్యానవిహారణములు సమస్యలు క్రీడలు మున్నగునవి యన్నియును నాగరకు లాచరింపవలసిన నైమిత్తికకృత్యములుగాఁ బరిగణించినారు. వారికాలములో నిప్పటి పాశ్చాత్యరీతులను వేయింటినైనఁ దలఁదన్నఁగల్గిన చక్కని వ్యవస్థలును సంస్థలును ననేక ముండెడివి.నగరము నగరమునందును ధర్మవ్యగ్రతను నాముష్మికపరాయణతను లోకోపకారశీలతను నింకను నిట్టివియేయగు పెక్కు సుగుణములను బ్రదర్శనములమూలమున బోధించి ప్రజల నాచరణమార్గమునకుఁ గొనిరాఁగల్గినట్టి సమాజము లుండెడివి. ఎచ్చటఁ బట్టిన నచ్చట సమస్తవిజ్ఞానసారమును బంచిపెట్టఁగలిగిన సరస్వతీ భవనము లనేక ముండెడివి. అందలి సమాజము లొకవిధముగా రూపమున కిప్పటి నాటకసంఘములవంటివి. కాని గుణమునుబట్టి కావు. ఆసమాజము లార్యనాగరకత నుద్దీపింపఁజేయు మణిదీపములు. ఇప్పటివి దాని నున్మూలింపఁజేయు మషీకూపములు. ఇఁకను సరస్వతీ భవనముల విషయము చెప్పనక్కఱయే లేదు.... కాని మన యిప్పటి గ్రంథాలయములవలె నెలుకపెంటలతోను జింపికాగితముల కట్టలతోను నిండియుండెడునట్టివిమాత్రము కావు. చతుష్షష్టికళలలో నేకళయందుఁ బాండిత్యము గడించినను బరీక్షింపఁగల చినచిన్న విశ్వవిద్యాలయములన్నచో నప్పటి సరస్వతీభవనములయొక్క పరిశ్రేష్ఠత బోధపడఁగలదు.

వాత్స్యాయనుని కాలమునందలి సాంఘికక్రీడలు సమస్యలని మొత్తమునఁ జెప్పఁబడుచుండెడివి. ఈ సమస్యలనుమాటకు సమస్యంతే సమగ్రీభవంతి నాగరకా యాసు తా స్సమస్యా యని యశోధరుఁడు వ్యుత్పత్తిని జెప్పినాఁడు. నగరవాసులును కళావేత్తలు నగు చతురు లనేకులు గుంపులుగుంపులుగవచ్చి చేరి ప్రవర్తిల్లఁజేయునట్టివికనుక సమస్యలనఁబడినవి. అనేకులుచేరి యానందముగ నైహికాముష్మికావిరుద్ధముగ నాడునట్టి క్రీడలని తాత్పర్యము. ఈక్రీడలను బ్రవర్తింపఁజేయుటకై వారు ఘటానిబంధనములు గోష్ఠీసమవాయములు నాపానకోత్సవములు మున్నగువానిని గూర్చుచుండిరి. ఘటలనఁగా దేవతల నుద్దేశించి చేయునట్టి తిరుణాళ్ళలు మున్నగునట్టి యాత్రలు. అంతర్వేది తీర్థము భద్రాచలము కల్యాణోత్సవము మంగళగిరి తిరునాళ్ళ మున్నగునవి నామమాత్రసామ్యమున నింకను వెనుకటి ఘటానిబంధనములను దలపించుచున్నవి. ఈఘటానిబంధనములయందే యభినవములగు నాటకప్రదర్శనములును జరుగుచుండెడివి. కాళిదాసుమొదలుకొని మొన్నమొన్నటి కృష్ణమిశ్రునివఱకును గల యేనాటకము నుద్ఘాటించినను నేదోయొక ఘటాసందర్భమునందుఁ (యాత్రాసమయములందు) బ్రదర్శించుటకై వ్రాయఁబడినవిగానే కనఁబడును. ఈయాచారము రానురాను దక్కిన యార్యవిజ్ఞానవిభవముతోపా టంతరించినది. ఇది చాల శోచనీయమగు నవస్థ. గోష్ఠియనఁగా ననేకులు కావ్యశాస్త్రనిపుణులగు విద్వాంసు లొక్కచోటఁ జేరి కావ్యకళావిషయాదిచర్చలతోఁ జేయు కాలక్షేపములు. గోష్ఠులను బ్రవర్తింపఁజేయుటయే గోష్ఠీసమవాయమని చెప్పఁబడుచున్నయది. ఈ గోష్ఠీసమవాయములందుఁ జేయునట్టి చిత్రములగు విషయము లనేకము గలవు... కాని కేవలము తప్పఁదాగి స్మృతిదప్పి పడిపోవుటలు మాత్ర మందు లేవు. చతుష్షష్టికళావైదగ్ధ్యముగల యభియుక్తుల

ప్రదర్శనములు (పెరఫార్మన్సు) అందు జరుగుచు లోకులను జక్కని నాగరకులనుగాఁ జేయునట్టి సదుపాయము లుండెడివి. ఇప్పటికే ప్రస్తావవశమున శాఖాచంక్రమణము నొనర్చి యప్రస్తుతమునఁ బడితిని. ఇందులకు క్షమింపవేడుచుఁ బ్రకృతమునకు వచ్చుచున్నాను.

... సాంఘికక్రీడలు వాత్స్యాయనుని కాలమునందు రెండువిధములుగా నుండెడివి. అందొకవిధమువి మాహిమాన్యక్రీడలనఁబడుచుండెను. రెండవవిధమువి దేశ్యక్రీడలు. గణపతిచతుర్థి సరస్వతీపంచమి శివాష్టమి కృష్ణాష్టమి మున్నగు పర్వసందర్భములందుఁ జేయునట్టి క్రీడలు మాహిమాన్యక్రీడలని యనఁబడును. ఇయ్యవి రానురాను బ్రజలలోనుండి తొలఁగి యాయా దేవతలయొక్క యుత్సవవిశేషములుగాఁ బరిణమించి తుదకు మనకాలమునాఁటికి నామమాత్రములుగ నిలచియున్నవి. గణపతిచతుర్థి మున్నగు వ్రతకాలములం దైహికముకొఱకై యేర్పఱచిన క్రీడాదు లంతరించి కేవల మాముష్మికతకై యేర్పఱచిన పూజాదు లతిసంగ్రహముగ నిలచియున్నవని భావము. ఆచరణమునుండి తత్సంబంధములగు పరమార్థములు తొలఁగినవని యర్థము. కనుకనే యిప్పుడు మనవారిని విదేశీయు లాక్షేపించుట కనువేర్పడినది. ఇఁక మిగిలినవి దేశ్యక్రీడలు. దేశసంప్రదాయముల ననుసరించి జనతయందుఁ బరంపరగ వచ్చుచున్న క్రీడలని యర్థము. ఈ క్రీడలయందుఁగూడ నాముష్మికసంబంధము లేకపోలేదు. కాని యయ్యవి వాత్స్యాయనుని కాలమునాఁటికే యాముష్మికమునుండి వేఱుపడినట్లు తోఁచుచున్నది. లేనిచో మాహిమాన్యక్రీడలనియు దేశ్యక్రీడలనియు ద్వివిధముగా విడఁదీయుటకు వీలులేకుండ నుండెడిది. అగుఁగాక. ప్రకృతమునకు వత్తము. వాత్స్యాయన మహర్షి చెప్పినట్టి సాంఘికక్రీడలు యక్షరాత్రి సువసంతకము నభ్యూషఖాదిక బిసఖాదిక నవపత్రిక యుదకక్ష్వేడిక పాంచాలానుయానము నేకశాల్మలి కదంబయుద్ధము స్వృహాయంతీవ్రతము యవచతుర్థి మదనోత్సవము దమనభంజక హోలాక యశోకోత్తంసిక పుష్పావచాయిక చూత

లతిక యిక్షుభంజిక మున్నగునవి. ఇంకను నిట్టివియే యనేక మున్నను బ్రకృత మిందు వాత్స్యాయనుఁడు చెప్పిన క్రీడలనే వివరించుచున్నాను.

౧. యక్షరాత్రి—ఇయ్యది కార్తికశుద్ధ పూర్ణిమనాఁడు వచ్చునట్టి పండుగు. యక్షులందఱు నాఁడు మహానందముతో లోకమునందు సంచరించుచుందురు. జనులు పగలంతయు నుపవసించి సాయంకాల మగుటతోడనే యీశ్వరాభిషేకములు మున్నగువానిని జరిపి ప్రసాదస్వీకరణముచేసి స్వేచ్ఛగ సుఖముల ననుభవించెదరు. కనుకనే దీనికి సుఖరాత్రియనికూడ మఱియొక పేరు కలదు. స్త్రీలాజన్మమును సుఖభంగము కాకుండున ట్లనుగ్రహింపుమని కామధేనువు నర్చించి యతని యనుగ్రహమునఁ బ్రసాదమును గ్రహించి సుఖానుభవముల నారంభించెదరు. శ్లో॥ కుర్యాచ్చ యక్షరాత్రిం సుఖరాత్రి స్సాధకథ్యతే లోకైః॥ అని వీరభద్రుఁడు స్మరించినాఁడు. యక్షప్రీత్యర్థమై యర్చనాదులను జరిపి సౌభాగ్యమును బడయునట్టి రాత్రిగనుక యక్షరాత్రి యనఁబడినది. వృత్తిని రచించినట్టి నృసింహపండితుఁడు దీనిని బక్షరాత్రిగా గ్రహించి "పక్షరాత్రిః పక్షస్య కృష్ణపక్షస్య రాత్రిః" అని వ్రాసినాడు. కాని యిందు సత్యమెంతయో తెలియదు. శ్లో॥ బాహుళ్యాం పౌర్ణమాస్యాంతు యక్షరాత్రిం ప్రకల్పయేత్। లోకాన్సంచర్చయతి హ్యత్ర వరదోస్మీతిచ బ్రువన్॥ యక్షేశ స్సంచరతి యతో యక్షరాత్రి స్తతో భవే॥ త్తని వ్రతఖండము చెప్పుచున్నది. ఇప్పటికి నీవ్రతాచరణము నేపాళమువారిలోఁ గలదు. కాని క్రమముగా నీరూపము మాఱి వీరశైవాభినివిష్టతఁ గాఁబోలుఁ గార్తికపూర్ణను యిపుడు కేవల ముపవాసవ్రతముగా మాఱినది.

౨. సువసంతకము— ఇది భరతఖండమునందలి చాలఁ బ్రాచీనతమమైన యుత్సవము. భరతవర్షమునందలి యన్నిమతములవారు

కూడ దీని నాచరించెడివారని ప్రాచీనములగు కాళిదాసాదుల నాటకములందుఁగూడ సూచనలు కలవు. ప్రస్తుతము సువసంతకమహోత్సవముయొక్క తత్త్వమును బూర్ణముగా రూపింపఁగల సాధనములు విరళము లైనను నిర్ణయసింధువు మున్నగు గ్రంథములం దుద్ధృతము లైన సందర్భములనుబట్టి చైత్రమాసమునం దంతటను నీయుత్సవమును నడపుచుండిరని తెలియుచున్నది. మొత్తముపైన శైవసంప్రదాయమువారును వైష్ణవసంప్రదాయమువారును నుభయులుకూడఁ దమతమ సంప్రదాయముల కనుగుణముగా మార్చికొని యీయుత్సవమును హరప్రీతికొఱకును హరిప్రీతికొఱకును నాచరించుచు వచ్చుచున్నారు. చైత్రమాసమునం దనంగవ్రతము హరగౌరీడోలోత్సవము మున్నగు పేరులతో వీనిని సాగించెడివారు. అందు హరగౌరీడోలోత్సవము మిక్కిలి ప్రాచీనమైనది. ప్రస్తుతము చూచుట కైన దుర్లభమైనట్టిది. దీనిని గుఱించి దేవీపురాణమునందు "తృతీయాయాం యజే ద్దేవీం శంకరేణ సమన్వితాం, కుంకుమాగరుకర్పూరమణివస్త్రసుగంధకైః, స్రగ్గంధధూపదీపైశ్చ దమనేన విశేషతః, ఆందోళయే త్తతో వత్సం శివోమాతుష్టయే సదా" యని చెప్పఁబడియున్నది. హరగౌర్యుత్సవసందర్భముననే పుణ్యస్త్రీలు సౌభాగ్యశయనవ్రతమని విశేషప్రశస్తమైన యొకవ్రతము నాచరించుచుందురు. మఱియు నీమాసమునందు భవానీయాత్రయను నుత్సవముగూడఁ జేయఁబడుచుండును. కాళిదాసుని శాకుంతలనాటకమునందుఁ జైత్రసందర్భనాటకమున సుప్రేక్షింపఁబడిన దానినిబట్టి యియ్యది కేవలము వ్రతోపవాసాదులచే ప్రధానముగాఁ గలది కాక యనంగపూజాది తంత్రము ప్రధానాంగముగలదనికూడ నూహింప ననువగుచున్నది.

3. అభ్యూషఖాదిక — చెట్టుమీఁది పాలుగనున్న సెనగలు మొదలగు పచ్చిధాన్యమును గోధుమలు మొదలగువానితోఁగూడఁ దంపటవేసినచో (నిప్పులపై వైచి వేయించినచో) అభ్యూషములని యందురు. అట్టి యభ్యూషములను దినెడి యాట యభ్యూషఖాదిక. ఇయ్యది హిమవదృతువునందువచ్చెడి పండుగు. మంచుగురిసెడి రోజులలోఁ బంటకాలము (పుష్యమాసము) నందు వచ్చునట్టి పండువు. ఈపండుగునాఁ డూరిలోనున్న వారందఱును జీఁకటితో నాల్గుగంటల వేళనే లేచి చక్కఁగ స్నానముచేసి యలంకరించుకొని పొలములకు వెళ్ళెదరు. అచ్చట క్షేత్రపాలకు నర్చించి యవ్వరిక్షేత్రములలోనున్న ధాన్యమును వారు సమూలముగాఁ దంపటవేసి భుజించి సాయంకాలముదనుకఁ జక్కఁగ నాటపాటలతోఁ బ్రొద్దుపుచ్చి యిండ్లకువచ్చెదరు. ఇది మిక్కిలి పురాతనమైన క్రీడ. ఈక్రీడయొక్క చిహ్నములే యిప్పటికిని బల్లెటూళ్ళయందు సంక్రాంతిపండుగులలోఁ బాల వెల్లిరూపమున మనకు గోచరమగుచున్నవి. ఆ ప్రాచీనాచారములు నూలఁబడినను గుఱికి బారె డెచ్చుతగ్గుగ నిలచియుండుట శుభచిహ్నమే యనవచ్చును. నాగపంచమియను బౌద్ధుల కథలో నీయాట యొక్క వివరములు విపులముగా నీయఁబడియున్నవి.

४. బిసఖాదిక— బిసములనఁగాఁ దామరతూండ్లు. వీనినే సంస్కృతమున మృణాళములని యందురు. బిసఖండములను దినెడి పండుగగనుక నియ్యది బిసఖాదిక. వర్షర్తువు కడచని శరదృతువు ప్రవేశించునట్టి సంధిసమయమున నాచరణమునకు వచ్చునట్టిది. వైద్యక వాఙ్మయమునం దియ్యది మహోత్తమమగు చికిత్సగఁ జెప్పఁబడినది. బిసఖండములు శ్లేష్మమును హరించి సమప్రకృతికి శరీరమును గొని వచ్చునట్టివని ద్రవ్యగుణదీపికయం దుదాహరింపఁబడినది. అభ్యూష

ఖాదికవలెనే యిదికూడఁ జాలఁ బ్రాచీనమైన క్రీడ. కాని యశోధరునినాఁటికే ప్రచారమునుండి తొలఁగుచున్న ట్లతఁడువ్రాసిన ద్వే క్వాచిత్క్వాచి ద్దృశ్యతే యన్న వాక్యమువలనఁ దెలియుచున్నది. సరస్సులు మిక్కిలి విస్తారముగా నుండెడి ప్రదేశములలో నియ్యది వాడఁబడెడి దఁట.

౫. నవపత్రిక— నవపత్రికలని యొకవిధమగు మొలకలు. వీనికిఁ గందళులని మఱియొకపేరుగూడ సంస్కృతమున నున్నది. ఈనవపత్రికలు తొలకరివర్షము కురిసినవెంటనే యంకురించును. ఆంధ్రమున వీనిని నేలతాటిగడ్డలందురు. ఆనేలతాటిగడ్డలను భక్షించినచో మహాతిమహావ్యాధులైనను సమసిపోవునని వైద్యకాభిప్రాయము. కందళీ శ్చానుగచ్ఛ న్నని కాళిదాసు మేఘదూతకావ్యమునఁ బేర్కొన్న వివియే. వర్షర్తువు కాముకజనప్రియమైనదగుటను నవపత్రికాంకురములు వర్షర్తుచిహ్నములగుటను గాముకులు మహోత్సాహముతో నాటలు పాటలు మున్నగువానిని జరిపి వీనిని భక్షించెదరు. ఇయ్యాట తఱచుగ నడవులసమీపముల నుండువారిలోను నడవులయందే వసించువారిలోను వాడుకగా నుండవచ్చునని యశోధరుఁ డూహించుచున్నాఁడు. కాని నవపత్రికలకై యడవులకుఁబోవలసిన పనిలేదు. ఏపల్లెయందైనను లభించును గనుక నియ్యది ప్రచారాధిక్యముగల క్రీడయే యైయుండునని తలంపవచ్చును. ఇదిగాక దేవీపూజావిధానమునందు నవపత్రికయని యొకపూజ పేర్కొనఁబడినది. దీని ననుసరించినచో కదళీదాడిమీధాన్యం హరిద్రామానకంకచు, బిల్వాశోకా జయంతీచ విజ్ఞేయా నవపత్రికా” యను నీతొమ్మిదివిధములగు పత్రిలును నవపత్రికలగును. ఈ పత్రములతోఁ జేయునట్టి దేవీపూజయే నవపత్రిక యనబడుచున్నది.

౬. ఉదకక్ష్వేడిక— ఉదకములను బూరించి చిమ్మునట్టి గొట్ట
ము. (పిచికారి) దీని ప్రాచీనమైన నామధేయము శృంగక్రీడ. దేవీనవ
రాత్రిలలో దుర్గాష్టమినాఁడు వసంతమునుగలిపి పిచికారీలనుబోలు
శృంగములతో నొకరిపై నొకరు చల్లులాడుట ప్రాచీనాచారమైన
ఆగమములు చెప్పుచున్నవి. కాని యియ్యది క్రమముగా మాఱి
పోయి పెండ్లిండ్లమున్నగు సందర్భములలో వసంతములు చల్లుకొను
వేడుకగా నీకాలమునకుఁ బరిణమించినది. ఈ యుదకక్ష్వేడిక గంగా
యమునామధ్యదేశమునందు వసించువారిలో వాడుక యున్నట్టులు
యశోధరుఁ డుదాహరించినాఁడు. కాని యుదకక్ష్వేడికయును బైఁజె
ప్పిన నవపత్రికయును సాధారణక్రీడలని వీరభద్రుఁడు చెప్పుచున్నాఁడు.

౭. పాంచాలానుయానము— పాంచాలములు లేక పాంచా
లికలు ననునీశబ్దములు బొమ్మలు లేక ప్రతిమలు నను నర్థము నిచ్చును.
బొమ్మలను రెండు తెగలుగా విభజించి యుత్సవమునఁ బాల్గొను ప్రజ
లును రెండు తెగలుగా విడిపోదురు. ఒక తెగవారు పిల్లనిచ్చువారుగను
రెండవతెగవారు పుచ్చుకొను వారుగను నేర్పడి వివాహక్రియలను
జరుపఁదలపడి యందు వరుసలు వావులు సంబంధబాంధవ్యములు సరస
ములు సంభాషణములు మున్నగువానిని జేసికొనుచు నాడెడి యాటపేరు
పాంచాలానుయానము. ఇయ్యది మిథిలాదేశస్థులలో నుండునని యశో
ధరుఁ డనెను. కాని సర్వసాధారణక్రీడ, మనలోఁగూడ నిప్పటికిని
గల్యాణోత్సవసందర్భములలో నాచరణలోనున్నది.

౮. ఏకశాల్మలి— శాల్మలియనఁగా బూరుగుచెట్టు. పెద్ద
దై చక్కఁగఁ బూచి యొక్కటిగానున్న బూరుగువృక్షమునొద్దఁ జేరి
పూజాపురస్కారాదు లైనపిమ్మట నా కుసుమములను స్త్రీపురుషు
లాభరణములుగా గుచ్చి పరస్పరము సమర్పించుకొని యాడుకొను

దాని నేకశాల్మలియని యందురని యశోధరుఁడు వ్రాసెను. వీరభద్రుఁడుమాత్ర మిపుడు మనలోఁ గొంతికొమ్మంచి యాటలాడునట్టులుగాఁ బెద్ద పొడవైన బూరుగుచెట్టునెక్కి క్రిందికి దుముకుచు నెగురుచు నాడునట్టి యాట యేకశాల్మలియని వ్రాసినాఁడు. కాని యీ యుభయుల నిర్వచనములందుఁగూడ నేకశబ్దమునకుఁగల యర్థము ప్రత్యేకముగా స్ఫురించుటలేదు. ఇయ్యది విదర్భదేశవాసులలో వాడుకయుండెడిదఁట.

౯. కదంబయుద్ధము—కదంబములనఁగాఁ గడిమిపూలు. ఈకడిమిపూవులను గదలుగాను ఖడ్గములుగాను గుంతములుగాను బంతులుగాను గట్టియుంచుకొని రెండుపక్షములుగా నేర్పడి వానితో నొకపక్షమువా రింకొకపక్షమువారితో యుద్ధము చేయవలయును. ఈయుద్ధముచేయుటలోఁ బూవులతోఁ గట్టిన యాయాయుధము లేమాత్రమును నలగరాదు. విఱుగరాదు. చాల మెలకువతోఁ బట్టుకొని ప్రహరించుకొందురు. ఇది చాల సుకుమారక్రీడ. ఇయ్యదియే యిపుడు మనవారి వివాహమహోత్సవములందుఁ జెండ్లాటగా మాఱియున్నది. పుండ్రదేశవాసులలో నీయాట నాడునప్పుడు చెండ్లలోపల నిటుకపెడ్డలు మున్నగువానిని బెట్టి కొట్టుకొందురనియు నది యనుచితమనియు యశోధరుఁడు సూచించినాఁడు:

౧౦. స్పృహయాంతీవ్రతము—ఇయ్యది యాషాఢమాసమునం దాచరించునట్టి యుపవాసవ్రతముగాఁ దోఁచుచున్నది. కాని నాయెఱిఁగినంతవఱకును దీనికి మాతృక కనఁబడుటలేదు. కోకిలావ్రతమని కమలాకరభట్టుద్ధరించునది యిదియే యగునేమో యనికూడ ననుమానపడుచున్నాను. దీని నింకను శోధింపవలయు.

౧౧. యవచతుర్థి— ఇయ్యది కార్తికమాసమునందు వచ్చునట్లు వినఁబడును. కాని యాచరణలో మాత్రము విదియనాఁడు జరుగుచున్నదే కాని చవితినాఁడు జరుగుటలేదు. కార్తికశుక్లద్వితీయనాఁ సూర్యోదయమునకే మంగళస్నానము నాచరించి క్రొంగ్రొత్తవియగు యవాంకురములను దెచ్చి గోవులకు వానితో నలంకరించి యారాత్రే గవు జరుపుదురు. దీనికే ధర్మశాస్త్రములం దభ్యంగ లక్ష్మీపూజన మనియును గోక్రీడనోత్సవమనియును బెక్కుపేరులు చెప్పఁబడియున్నవి. శ్లో॥ ఊర్జ్జే శుక్లద్వితీయాయాం తిథిషు స్వాతిబుక్షగే మానవో మంగళ స్నానం నైవ లక్ష్మ్యా వియుజ్యతే॥ మొదలగు శ్లోకములు చాలఁ గలవు. కాని నృసింహకారుఁడగు నృసింహుని మతము ననుసరించి యియ్యది వైశాఖశుక్లచతుర్థియందు జరుగునట్టిదని తెలియుచున్నది. కాని సందిగ్ధమే. వైశాఖమునందు యవాంకురములు దుర్లభములు. అయితే నాయన యవచతుర్థియనుమాట కింకొకయర్థము చు వ్రాసినాఁడు. యవలను బండిగొట్టి యాపిండితో బుక్కావలె నొకరిపై నొకరు చల్లుకొనునట్టి పండుగగనుక యవచతుర్థి యైనదనినాఁడు. ఇదియే నిజమగునేని యన పరిక్షేపణమని వ్రాసియుందును. విజ్ఞులింకను దీని నిజము తేల్పవలసియున్నది.

౧౨. మదనోత్సవము— దీనినే మనవారు కామదహనమని యును ఫాల్గుణపూర్ణిమ యనియును వాడుచుందురు. హరుని కోపానలమున కాహుతియైన పిదప గౌరి యనుగ్రహమునను రతీదేవి యొక్క సతీత్వమునను మదనుఁడు పునరుజ్జీవనము నొందిన పూర్ణిమ యాఁట యిది. కావున నీనాఁడు మన్మథని ప్రతిమనుంచి పూజలు జరుపుదురు. కాని గ్రంథప్రమాణములనుబట్టి యియ్యది వసంతకాలో

త్సవములలో నంతర్భాగముగాఁ దోఁచుచున్నది. విచారణచేయుకొలఁది నాచరణాంలో నున్నట్లోతే కనఁబడుచున్నది. దానిని జర్పింపవలయును.

౧౩. దమనభంజికి— దవనముతో నొకరినొకరు కర్ణాభరణముగ నలంకరించుకొనునట్టి పండుగగనుక దమనభంజికయని స్ఫురించునిభావము కాని యాగమములలో వర్ణింపఁబడిన దమనోత్సవ మొకవేళ నిదియే యైయుండునేమో యని యూహించుచున్నాను. శైవాగమమునందు శివప్రీత్యర్థమును వైష్ణవాగమములందు విష్ణుప్రీత్యర్థముగను దమనోత్సవములను జరుపువాడుక చాలఁ బ్రాచీనకాలమునుండి యున్నది. ఇప్పటికి దక్షిణదేశములం దీయుత్సవచిహ్నములను గనుగొనవచ్చును. అయితే మూలకారుఁడు దమనోత్సవమని పేర్కొనక దమనభంజక యననేలయన్నచో మాత్రము కారణము నూహ్యమే.

౧౪. హోలాక— ఇదియే హోళీపండుగ. ఇది యిప్పుడు చక్కఁగఁ బ్రచారమున నున్నందున విశేషించి వ్రాయవలసినదిలేదు. పైగా నిర్ణయసింధువుమున్నగు స్మృతిగ్రంథములయందుఁ గమలాకరభట్టు మున్నగు స్మర్తలుకూడ దీనిని జక్కఁగా సూచించియున్నారు. కాన నిట వదలుచున్నాను.

౧౫. అశోకోత్తంసిక— ఇయ్యది చైత్రశుద్ధాష్టమినాఁ డాచరించునట్టి వ్రతము. ధర్మశాస్త్రములం దీయష్టమిని భవానీ యాత్రయని పేర్కొనియున్నారు. అందు "భవానీం యస్తు పశ్యేత శుక్లాష్టమ్యాం మధౌ నరః, నజాతు శోకం లభతే సదానందమయో భవేత్" అని యున్నది. ఈభవానీయాత్రాసందర్భముననే గౌరీపూజనాదులు జరి

గీను. పిమ్మట నశోకవృక్షమునొద్దకుఁ బోయి స్త్రీలును బురుషులు నీ క్రిందిమంత్రమును జదువుచు నెన్మిదిదళములను గోసి భక్షింపవలయు ననియును దాన జన్మమధ్యమునం జెప్పుడును శోకాదులు కల్గవనియును స్మృతులు వ్రాసిరి.అశోకదళములు భక్షించునప్పుడు చదువవలసిన మంత్ర మియ్యది. శ్లో॥ త్వామశోకవరాభీష్టం మధుమాససముద్భవం పిబామి శోకసంతప్తో మా మశోకం సదాకురు॥ దీనికే యశోకాష్టమియనికూడ నొకకొక పేరుకలదు. క్రియమాత్ర మిదియే. కానియశోకోత్తంసికయొక్క తత్త్వ మశోకాష్టమికిఁగాని భవానీయాత్రకుఁగాని సంబంధించినది కాదని నా భావము. ఇంకనేమనఁగా దోహదక్రియలకు సంబంధించిన దని నామనవి. మన కావ్యములందును బురాణములందును స్త్రీల నొక్క పాదతాడనములచేత నశోకము పుష్పించునని యున్నది. కావున నియ్యది దోహదక్రీడాంతర్గతమై యుండనోపును. కారణము లింకను గలవు.

౧౬. పుష్పాపచాయిక— ఇయ్యది యాంధ్ర కావ్యములు పఠించు సోదరుల కెల్లను విదితమైనదే. కావున విస్తరించుటలేదు. పుష్పములను గోయునట్టి క్రీడగనుక. పుష్పాపచాయిక యనఁబడినది.

౧౭. చూతలతిక— ఇదియు నశోకోత్తంసికవంటిదే. చైత్రశుద్ధప్రతిపత్తునాఁ డాచరించునట్టిది. ఇత్యాదికూడ వసంతోత్సవ సందర్భములోఁ జేరినదే. కాని యాచరించునట్టి విధిమాత్రము భిన్నము. దీనిని గుఱించి కమలాకరుఁ డిట్లు వ్రాసియున్నాఁడు. శ్లో॥ ప్రవృత్తే మధుమాసేతు ప్రతిపద్యుదితేరవౌ కృత్వాచావశ్యకార్యాణి సంతర్ప్య పితృదేవతాః॥ వందయే ద్హోలికాభూతిం సర్వదుఃఖోపశాంతయే వందితాసి సురేంద్రేణ బ్రహ్మణా శంకరేణచ॥ అత స్త్వం పాహి

బ్రహ్మ॥ బాలకా! నీవిప్పుడొనరింపవలసిన విశేషకార్యము లేమియు లేవు. కాని కార్య మతిచాకచక్యమున నెఱవేర్చుకొని రావలయును. నీవు నరసింగునికడకు రాయబారిగా నేగి నయభయంబుల వాని సంధి కొడఁబడఁజేయవలయును. వాని కల్లుఁడవై మాకు రాజవగుట నుభయక్షేమంకరుండవని నిన్నీకార్యమునకుఁ బనుపుచుంటిమి. నీశక్తియుక్తుల బాలమద్దేవుల రాజ్యంబును బంచియిచ్చునట్లు చేయుము. ఇట్లు కోరుట వారికి జంకి కాదు. యుద్ధము సర్వానర్థములకును మూలమగుట నీదారి నరసితి. ఆతఁ డెంతకు నొప్పకున్న వానితో.

సీ॥ చిరకాలదాస్యంబుచేసిన మా బ్రహ్మ
నాయుని హితమెంచ న్యాయమనుము
పురుషుఁడై జన్మించి తరుణికి లొంగుట
నీతిజ్ఞునకుఁ గడు నీచమనుము
దేశసంక్షోభంబు దెచ్చిపెట్టెడుదాని
దరికిఁ జేర్చుట తన కుఱుమెయనుము
పల్నాటిసీమకుఁ బాటిల్లినయవస్థ
నణఁపఁజూచుట కరమర్హమనుము
చెట్టుచెడనున్న వేళను బుట్టుఁ గుక్క
మూతిపిందియులను మేటినీతి కీవె
మొదటితార్కాణమనుము వే మూఢబుద్ధి
మాని సన్మార్గమునఁ బోవ మంచిదనుము.

అట్లుకాదేని యుద్ధమే సర్వసిద్ధమనుము. నిర్భీతిగా మఱియును,

సీ॥ అరికరియూథపంచాస్యమై కలనికి
రమణమైఁ బెద్దన్న రాకమున్నె
క్రూరనారాచము ల్గుప్పి మీప్రాణముల్
ఘనుఁడు పేర్చఁడు కైకొనకమున్నె

కన్నమదాసుండు కత్తిని దూసి తా
భవదీయసేనపైఁ బడకమున్నె
రాయవీరుఁడు మిమ్ము రణములో నిహతులం
గావింప సిద్ధంబుకాకమున్నె
బాలమల్దేవరాజుల పాలిభూమి
పంచియీఁజూచుటెంతయు మంచిదనుము
చెడుగుదలఁచిన యుద్ధమే సిద్ధమనుము
అవలఁజింతింప ఫలములేదనుము చనుము.

ఇంకను సమయానుకూలంబుగా నీచెప్పవలసినవి యున్న సభామధ్యంబున నెల్లవారును విన నీచాతుర్యమొప్పఁబలికి మన శౌర్యబలదర్పంబులు విశదీకరించి యుక్తిచే భయపెట్టి సాధ్యమైనంత వఱకు యుద్ధముగాకుండఁ జూడుము.

అలరా॥ అయ్యా! ఇన్నివిధములఁ జెప్పవలెనా? నా కనుజ్ఞయిండు. పోయివచ్చెద.

బ్రహ్మ॥ కుఱ్ఱా! నీ వేగి ప్రయాణసన్నాహము చేయుము. నే వచ్చి కలిసికొనియెద.

అల॥ చిత్తము, (అని నిష్క్రమించును.)

బ్రహ్మ॥ చెల్లెలూ! నీదేశాభిమానము సంస్తవనీయము. బాలచంద్రుఁ డుగూడఁ జెన్న కేశవవరప్రసాదితుఁడేకదా! పుత్రప్రేమ నిన్ను మొదట గగ్గోలుపఱచినదికనుకఁ జెప్పుచుంటిని. నీ కుమారుఁడు మఱలివచ్చువఱకు బాలచంద్రుని నీయొద్దనుంచెద. నాఁడీక్షణమునుండి నీకుమారుఁడేయని స్వీకరింపుము.

చెల్ల॥ అన్నా! ఏటిభ్రాంతి? నాకుమారుఁడైననేమి? నీకుమారుఁడైననేమి? దేశార్థము దొలఁగింప నాదఱును బాధ్యులే. బాలచంద్రుని నావశ్యకమగు మఱియొకకార్యమునకు నియోగింపుము.

బ్రహ్మ॥ సంతోషము పోయివత్తును.

చెల్ల॥ అనుగ్రహింపుము. (అందఱును నిష్క్రమింతురు)

—• ఇది ప్రథమాంకము •—

# పల్నాటివీరచరిత్రనాటకము.

## ద్వితీయాంకము.

గురిజాలపురి - ఏకాకినియగు నాయకురాలి ప్రవేశము.

నాయకురాలు॥ (తనలో) ఆ! ఈనాయకురాలుపట్టినపట్టున కెప్పుడుకలిగినది యాటంకము? ఆ బ్రహ్మనాయుఁడు నన్నుసాధింప నెన్నివిధంబులనో నాచిన్నతనంబునుండియుఁ బ్రయత్నించుచుండెనుగాని యొక్కటియైనను సాగివచ్చినదా? అబ్బా! వానికేమిమత్సరమో, నాపేరనినఁ దోఁకద్రొక్కిన త్రాఁచువలె మండిపడుచు నిష్కారణముగా.

క॥ హరి బలిని ద్రొక్కినట్టుల
నిరతము నను మట్టఁబెట్ట నెంచుచునుండున్
తరుణిగదాయని తలఁపఁడు
హరహర! ప్రాగ్భవవిరోధ మది యెంతటిదో.

అతఁడెంతప్రయత్నించినప్పటికి నాఁడుదాననగుట మగవానితో నెదిరింప నిష్టపడక "కడవంతగుమ్మడికాయయైనను గత్తిపీఁటకు లోకువ" యనునట్లు నాశక్తికి నేనే జంకుచుఁ బోనీలెమ్మని యెంతయూరకుండినను దనపోకడ విడువక నాపేరు వినుటే విషప్రాయముగనెంచి తల్లడపడుచు నెక్కరణినైనను జిక్కులుపెట్ట నిక్కపడుచుండు వాని మత్సరము నానాఁటికిఁ బ్రబలమగుటచే సహింపలేక నేఁటి కిటులఁ దెగింపవలసివచ్చినది. అబ్బా! అదియేటిమచ్చరమో యదియేటిజన్మాంతరశత్రుత్వమో తెలియరాదు. కాళ్ళఁజుట్టుకొన్నపాము కఱవకమాన

దన్నట్లు వానివలన నాకెప్పటికైనను ముప్పుదప్పదని నిశ్చయించుకొని నాశక్తియుక్తులతో వానికిఁ దగుప్రతిక్రియ యొనర్ప మొదలిడి పెద్ద దాననగుకొలఁది నాబుద్ధి బలంబున.

సీ॥ హాలికసంఘంబు నాదరంబునఁజూచి
వాణిజ్యపరుల శుభంబు గోరి
కవుల నెంతయుఁ బ్రీతి సవిధంబునకుఁ జేర్చి
పండితశ్రేష్ఠులఁ బజ్జనుంచి
ఘనతఁ బురోహితామాత్యుల సేవించి
ఘనచమూపతులతోఁ గలసిమెలసి
ధరణీశ్వరులతోడఁ గరము స్నేహముఁజేసి
రాచచట్టంబుల క్రమమెఱింగి
పిన్నలని పెద్దలని మది నెన్నఁబోక
ఎల్లవారల నెల్లప్డు చేకరీతి
కాంచు చవ్వార లక్కఱగలిగినపుడు
చేరి నాపక్షముననుండఁ జేసికొంటి.

మఱియుఁ గొంతకాలంబునుండి రాజమందిరంబునకుఁగూడ రాకపోకల నెఱపి శుద్ధాంతకాంతాజనంబుల తలలోనినాల్కనై మెలంగుచుఁ జివరకు రాజస్థానంబునఁ బూజనీయురాలనై కృతకృత్యతను బొంది నా ప్రత్యర్థియైన బ్రహ్మనాయుఁడనినఁ బడిచచ్చు నల్గురాజున కాగ్రహంబు గలిగించి వారిరువురకును వైరంబుఁబుట్టించి యొకరికొకరు కాకుండఁ జేసితిఁ గాని నా యాట పూర్తిగా సాగకమున్నె నాయందు బద్ధానురాగుండై నాకనుసన్నల మెలఁగఁజొచ్చిన మండలేందుఁడు మరణించె. అంత నాభావికార్యములు వ్యర్థములగునేమోయని కొంత శంకించితినిగాని దైవముగూడ నాకుఁదోడ్పడుటచేతను నామనంబున నీర్ష్యానలంబు రగుల్కొనుటచేతను నాబుద్ధిబలంబును వినియోగించి చేతనగుపనులఁ జేయుచుంటిని.

ఉ॥ వేఁటకుఁబోయినట్టి పృథివీధవుఁ డౌనని మెచ్చునట్టు లా
ర్భాటముఁజేసి మన్నన లవారిగఁ గాంచితి శ్రీసతీమణీ
గాటను గట్టివేసితి నఖండయశంబును గంటి మంటి నా
యాటలు సాగుచుండె నహహా! కడకుం గడుఁ బెద్దనైతిఁగా.

తే॥ బ్రహ్మనాయుని వే మంత్రిపదమునుండి
తొలఁగఁ జేసితి నయ్యమాత్యునిపదంబు
గొంటి బాలమద్దేవులఁ గువలయేశు
నకు విరోధులఁ జేసి సానంద ముంటి.

ఇప్పటికైనను నాశక్తి నెఱింగి నాయుఁడు దానిజోలి నాకేలయని యూరకుండక యేమియో తలక్రిందుఁజేయఁదలంచుచున్నాఁడఁట. ఆతఁడేమిచేసిన నేమిప్రయోజనము? రాజే నేఁగీచినగీఁటుదాఁటక నాకనుసన్నల మెలఁగుచు గారడీవాని చేతిలోని భుజంగమట్లు బేలుపడియున్నాఁడు. వానియండ నాకుండునంతవఱకును బ్రహ్మనాయునియెత్తులు నన్నుత్తల పఱుపఁజాలవు. (నవ్వి) ప్రాప్తరాజానుగ్రహుల కెద్దిలోటగు? రాజులురాజు లనుటయేకాని నిజముగా వారికంటె జ్ఞానశూన్యులు లేరనియే నాయభిప్రాయము. లేకున్న రాజులచెంత నాఁడుదాననగు నాయాటలు సాగివచ్చునా? అనరాదుకాని,

తే॥ బహువిధామూల్యరత్నవిభాసిసింహ
పీఠముల నుపవిష్టులై విశ్వమెల్ల
నంకతలమునఁ దాల్చెద రంతెకాని
వారిసంగతి గన నేతిబీరకాయ.

అట్లున్నను మండలేంద్రులకు మంత్రులమూలముననే సకల గౌరవంబులును గలుగుచున్నవి.

తే॥ రాజు గుడిలోని మూలవిగ్రహమువోలె
కదల కొకచోటఁగూర్చుండి క్రమముగాను

దత్తులైనట్టిసచివుల ద్వారమునను
పనులఁ జేయించుచుండు నేమనఁగవలయు?

కావున రాజులు సచివులచేతి కీలుబొమ్మ లగుచుందురు. అట్టి సచివులు మాత్రము తమ భాగ్యంబునకుఁ దాము గర్వించి నిశ్చింత నుండరాదు. రాజుల మానసంబు లతిచంచలములగుట నిరంతరము వారిచెంత వసించువారు పాముకడ వసించు కష్టవిధంబునఁ బ్రాణంబు లరచేతినుంచుకొని దినగండము నూఱేండ్లాయువనునట్లు కష్టభాజనజీవనముఁ జేయవలసినవారగుచుందురు. దానికి నామాత్రపదవియు నాయుని పదభ్రష్టత్వములే తార్కాణములు. అయ్యో! నాకుమాత్ర మీపదవులును మన్ననలును శాశ్వతంబులని యెంచవచ్చునా? (యోజించి) కానిమ్ము. కానిపోనిమ్ము. దేహములే యస్థిరములై యుండఁ బదవులఁగూర్చి చింతింపవలెనా? ఉన్నంతవఱకే సంతోషము. ఇంతలో నేనీబ్రహ్మనాయుని పోటుతనం బణఁపఁ జాలనా? (మరల యోజించి విషాదముతో) అక్కటా! ఎట్లు సమర్థించుకొనఁగలనో? నేఁజేయుకార్యముల కన్నిటికిని బ్రతి విధానమాలోచించియో లేకో యెప్పటికప్పటికిఁ దప్పించుకొని తిరుగుచున్నాఁడు. అదెక్కడి వేతృత్వమో? నేనెంతరహస్యముగా నొనరించినప్పటికిని నా గుట్టులో యాతనికి ముమ్ముందె తెలియుచుండును. చీ! నేఁజేయుచున్నాననుచు నాలో నేను సంతోషించుచుంటినే కాని నావలన నాయుఁడుపొందిన నష్టి యేమున్నది చెపుమా. లేదు, లేదు; ఏమియు లేదు. ముమ్మాటికిని లేదు. నేఁబెట్టిన విషాన్నము గుడిచి చచ్చెనా? నదిలోఁ ద్రోయించిన మడిసెనా? వలసకుఁబంపినప్పుడు కూడుగుడ్డలు లేకపోయెనా? అన్నా! జనులాడుకొనునట్లు నాయుఁడు భగవదంశసంభూతుఁడే. కాకున్న నొక్కదానిచేఁగాకున్న మఱొక్కదానిచేనైనను మడియకుండునా? చూడఁజూడ నేనాతని

మఱియుంచుట కల్లగాని నన్నాతఁడు పొరిగొనుట నిక్కువము. నన్నాతఁ డిదివఱకే నిర్జింపఁగలిగియుండియు నాయెత్తెంతవఱకుసాగునోచూచి నాపనిఁబట్టించునుద్దేశముతో నుండినట్లున్నది. సమయముకొఱకు నిరీక్షించుచున్నట్లున్నది. (ఇంకను యోజించి యుత్సాహముతో నిర్లక్ష్యముగా) ఊఁ! అట్లనుకొననేల ? అంతసమర్థుఁడే యైనఁ దన కెన్నియో యపకృతులొనరించిన నాపై జాలిచే నూరకుండునా? చేతగాకయే కదా! నాకు జంకె తహతహపడుచున్నాఁడు. నాపేరనిన గుండెలో గాలమైనది. ఏమైనను గానిమ్ము. నాకతన వాఁడో వానికతన నేనో తగు ఫల మనుభవించు వఱకును వెనుదీయరాదు. వెనుదీయుట యన్న వానికి దాసురాలనగుటయే కదా ! (గర్వముతో) ఆ ! నాయకురాలా వానికి లొంగుట ? ఒకవేళ నేను లోఁబడఁ జూచినప్పటికిని నామాత్సర్యము నన్నాపనికిఁ బ్రేరేపించునా? అబ్బా! వానిచర్య లాలించిననాఁటినుండియు నాకాయ మాపాదమస్తకమును గంపమొందుచున్నది. (సరకుసేయక) వాఁడఁట. బ్రహ్మాంశసంభూతుఁడఁట. నిరుపమాన ప్రజ్ఞాధురీణుఁడఁట. ఏమోయఁట. ఆహా! జను లెంతయవివేకులు ? ఒక్కయూడుదాని చేఁతలకుఁ బ్రతిచేయఁ జేతఁగాక విగతోద్యోగుఁడై జోలెగట్టుకొని భిక్షుకుచందంబును దేశదేశంబులను గ్రామగ్రామంబులను సల్లాపువాని నధికునిజేసి బట్టుస్తుతిఁజేయుచుండిరి. మూఢవిశ్వాసమన నిట్టిదేకదా! ఇఁకవాఁ డేపన్నుగడ పన్నఁగలఁడో చూచెదఁగాక. వాని చేష్టితములఁ గనిపెట్టుటకు సమర్థులైన వేఁగులవాండ్రనియోగించియే యుంచితి. అందఱిలో వేఁగులయెల్లఁ డతిసమర్థుఁడు. నిరుపమాన ప్రజ్ఞాధురీణుఁడు. వాఁడువచ్చిన సకలమును దెలియనగును. కాని వాఁడుగూడ నమ్మియుండఁదగినవాఁడు కాఁడు. ధనాశాపిశాచగ్రస్తుఁడు. ఎవ రెక్కువరొక్కమిచ్చిన నెక్కువ వారిచక్కఁ

జేరు దుష్టస్వభావముకలవాఁడు. (యోజించి) అయిననేమా యె? వాని నొకకంటఁ గనిపెట్టియే యుంటిని. నాపనిపూర్తి చేసికొనినపిదప వానిఁ గడతేర్చునుపాయ మాలోచించెద. ఇప్పు డాసంగతి యనవసరము. ఎవ రక్కడ?

సేవకుఁడు॥ దేవీ! ఏమాజ్ఞ

నాయకురా॥ నీవేగి వేఁగుల యెల్లనితో నేను రమ్మంటినని చెప్పి త్వరితముగా నిటకుఁబంపుము.

సేవకు॥ చిత్తము (అని పోయి మరల వెంటనే ప్రవేశించి) అమ్మా! ఎల్లఁడే నాకెదురుగా వచ్చుచుండ మీయాజ్ఞ తెల్పి మఱింత తొందరపెట్టితి.

నాయకు॥ మంచిది. వాని నిచటికి కనిపి నీవు ద్వారముకడ నుండుము.

సేవ॥ చిత్తము (అనివెళ్లిపోవును)

ఎల్లఁడు॥ (ప్రవేశించును)

నాయకు॥ ఓయీ! వచ్చితివా? ఏమివిశేషములు?

ఎల్ల॥ లేకేమి? వలసగడువు నేఁటితోఁ దీఱిపోవుటచే సంధికై నాయుఁడు...

నాయ॥ (ఆశ్చర్యముతో) ఆ! సంధియా? ఎవరితో? ఏమని?

ఎల్ల॥ రాజుగారితో - బాలమల్దేవుల కర్ధరాజ్యం బీయుమని

నాయ॥ నాకాళ్ళుపట్టుకొనకుండ రాజ్యంబు దక్కఁగలఁడా? ఓరీ! నీ కిప్పటికైనను వానిశక్తి తెలియవచ్చినదా?

ఎల్ల॥ తెలియకేమితల్లీ! తదుపరి వృత్తాంతము వినుము. సంధివలదనియు యుద్ధమే కర్తవ్యమనియు వారిలో వారికిఁ గొంతవఱకుఁ దీవ్ర చర్చ జరుగఁ జివరకు నాయుని వాగ్నైపుణ్యమునకు వశులై తక్కినవారందఱును సంధిగావించుకొనుటకే నిశ్చయించుకొని రాయబారిగా మనరాజుగారియల్లు నలరాజుగారిని బంపినారు. వారును మనపురికి నేఁడే రానున్నారు.

# అభినవసరస్వతి.

సంపుట ౨౨ { ప్రమోదూత నామ సం॥ కార్తికమాసము. } సంచిక ౮

## కృతివిమర్శనము.

:O:

సర్వమంగళ :— ఇది యొక యపూర్వసాంఘికమైన నవల. గ్రంథకర్త వారణాసి నరసింహారావుగారు. వేగుచుక్కగ్రంథమాల కిది 21 వ పుష్పము. ఈగ్రంథమాలయందు నిరూపకములను సాంఘికములును నగు నవలలును బుణ్యచరిత్రములును బురాణములును మృదుమధురప్రబంధములును మనోహరములగు నాటకములును జక్కని క్యాలికోబైండుతో 3 మాసముల కొక్కొకటిగా వెలువడుచుండును. గ్రంథము వెలువడిన నెంటనే చందాదారులకుఁ బోస్టేజి కాక యొకరూపాయికే వీపీగాఁ బంపఁబడును. ఇతరులకు 1 8-0. సం॥నకు 4-0-0 లకు మించకుండ 4 గ్రంథములు లభించును. ఈ 4-0-0 లును ముందుగాఁబంపిన చందాదారులకుఁ బోస్టేజి గ్రంథమాలవారే భరింతురు. అందువలన 4 గ్రంథములపై 1-12-0 గలసివచ్చును. చందాదారులగువారు 0-4-0 లు ప్రవేశపురుసుము చెల్లింపవలెను. క్రొత్తచందాదారులు వెనుకటిగ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన లేదు. కాని కోరినవారికిఁ జవుకగా నిత్తురు. అప్పుడప్పుడు వెలువడు ననుబంధగ్రంథములు చందాదారుల కూరకయే యొసంగుదురు. హిందీభాషనుండి యాంధ్రీకృతములగు తులసీరామాయణము, ఉగ్రభైరవము మున్నగు పెక్కుగ్రంథము లీగ్రంథమాలయం దిదివఱకుఁ బ్రకటింపఁబడియున్నయవి. ప్రకృతగ్రంథమగు సర్వమంగళలో నచ్చటచ్చట వ్యాకరణదుష్టము లున్నను గథాకల్పనాచమత్కృతి మెచ్చఁ

దగియున్నది. చక్కని లోకోక్తులు విశేషించి కలిగి శ్రావ్యమును మనోహరమును నగు సీసపలను జేతఁబట్టిన రసికుఁ డామూలాగ్రముం జదువక విడువఁడు. మఱియు నిందుఁ బాతివ్రత్యమున్నగు కొన్ని ధర్మములు నేర్చుకోఁదగియున్నవికూడ. సనాతనధర్మిష్ఠుల సంఘపుఁ గట్టుదిట్టము లిందు వర్ణితములు కావునఁ బండితపామరుల కందఱకు నీ పుస్తకము పఠనీయమని యస్మదభిప్రాయము. వలయువారు బరంపురములోని వేఁగుచుక్క గ్రంథమాలా కార్యస్థానమునకు వ్రాసికొన వలయును.

---

# ధర్మవైపరీత్యము.

సృష్ట్యాదినుండి నేఁటివరకు నవిచ్ఛిన్నముగ నవ్యాహతముగ వచ్చుచుఁ బ్రపంచ పురోభివృద్ధికి హేతుభూతములై సకలదేశములలో నన్నివేళల సమస్త (జనుల) చేత ననుష్ఠింపఁబడుచు శ్రుతిస్మృతీతిహాస పురాణకావ్య చరిత్రాది గ్రంథరాజములలో నెల్ల నుద్ఘోషింపఁబడుచు నుండు ధర్మజాలముల కొక పర్యాయమే యన్నిదేశములలో నన్నికులములలో విఘ్నము సంభవించినది. మన కగోచరములై శాస్త్రైకవేద్యములైన ధర్మములు నశించుచున్నవిషయ మట్లుండఁ బండితపామరసాధారణములై యాబాలగోపాలము గ్రహింపఁదగిన స్వరూపఫలములుగల ధర్మములుగూడఁ జెడిపోయినవి. అట్టిధర్మములలో ముఖ్యమైనవానిఁ గొన్నిటి నుదాహరించుచున్నాఁడ. ౧ పితాపుత్రధర్మము ౨ గురుశిష్యధర్మము ౩ భార్యాభర్తృధర్మము ౪ బ్రాహ్మణబ్రాహ్మణేతరధర్మము ౫ స్వామిభృత్యధర్మము ౬ స్త్రీపురుషధర్మము ౭ పండితపామరధర్మము ౮ దాతృప్రతిగ్రహీతృధర్మము ౯ పూజ్యపూజకధర్మము మొదలైనవి. ఇందుఁ బితాపుత్రధర్మమునుగుఱించి నే నీమధ్యకాలములో రచించి ముద్రింపించి ప్రకటించిన యధర్మానుతాపశతకములోని యీ శ్లోకముం జదువుఁడు.

శ్లో॥ తాత స్సనాతనసుధర్మపరాయణ స్స్యాత్
పుత్రో నవీనమత వేషనివిష్టచిత్తః
పుత్రేణ తేన కథ మస్య పరా గతి స్స్యాత్
కైలాసనాథ శశిశేఖర పా హ్యధర్మాత్ ॥

(తండ్రి) ప్రాచీనమగు మంచిమతమునం దాసక్తి గలవాఁడు. కుమారుఁడు క్రొత్తమతమునందుఁ గ్రొత్తవేషమునందుఁ బట్టుదలగల చిత్తముగలవాఁడు. అట్టికుమారునివలన నాతండ్రికిఁ బరలోకగతి యెట్లు కల్గును? కానఁ గైలాసపతియగు నో చంద్రశేఖరా! ఇట్టి యధర్మమునుండి రక్షింపుము).

కనిపెంచి సకలసుబుద్ధులను నేర్పి విద్య నేర్పించి వివాహాది శుభంబులఁజేసిన తండ్రివిషయమై భక్తిలేకుండుటయేకాక యిక్కాల మందు వ్యాజ్యమువేసి భాగముపంచుకొనునట్టివార లుద్భవించు చున్నారు.

ఇఁక గురుశిష్యధర్మము. స్కూళ్ళలో నింగ్లీషుభాషను జదువు బాలుర కుపాధ్యాయులయెడల నెంతభక్తియున్నదియో వ్రాయ నవస రములేదు. మనదేశమున కింగ్లీషుభాష వచ్చినది మొదలు వేదశాస్త్ర ములు చదువువారే లేరని చెప్పవచ్చును. ఎచ్చటనేని విరళముగా నుండినను వారికి బహుస్థలములలోఁ బాఠశాలలను భోజనవసతులను నేర్పఱచి యుపాధ్యాయులకు జీతములిచ్చెడి మహనీయులవలనఁగలి గిన శ్రద్ధగాని సహజమైనది కాదు. కాన నావిద్యార్థుల కాయుపా ధ్యాయులయందుఁగాని యావిద్యయందుఁగాని భక్తి యేమాత్రము లేకుండుటచేత పురాణభాషార్థులవలెనే వేదాభ్యాసకులును వేషముల లోనేమి ప్రవర్తనలోనేమి సమానులుగ నగపడుచున్నారు. ఆయుపా ధ్యాయులకును మాసవేతనమునందున్న శ్రద్ధావిశేషము ప్రవచనము నందుఁగాని విద్యార్థులకు సత్ప్రవర్తనఁ గఱపుటయందుఁగాని యుం డదు. భార్యాభర్తృధర్మమును గుఱించి పైశతకమునం దిట్లు చెప్పితిని.

శ్లో॥ దాంపత్య మగ్నిసవిధే క్షిత మూర్జితంచ
కేచి ద్విధోజయితు మీశ్వర ! సంయతం తే
ఉద్వాహయంతి కతిచి ద్గతభర్తృకా వై
కైలాసనాథ! శశిశేఖర! పాహ్యధర్మాత్.

(ఓ సర్వేశ్వరా ! అగ్నిసాక్షిగ సంపాదింపఁబడిన దాంపత్యము నిప్పుడు విఘటనచేయుటకుఁ గొందఱు బుద్ధిశాలులు యత్నించి శాసన మేర్పఱుపఁబోవుచున్నారు. కొందఱు విధవా వివాహము సేయు చున్నారు. కాపాడుము.)

భర్తను జూచిన భార్యకు లక్ష్యమును భార్యమీఁద భర్తకుఁ బ్రేమయు స్వభావసిద్ధముగనే లేని యీకాలమునందుఁ బైడైవోర్సు బిల్లు ప్యాసయినతరువాతఁ బరస్పరప్రేమ కొంచెమైన నుండదని చెప్ప నక్కఱలేదు. ఇది బ్రాహ్మణబ్రాహ్మణేతర భావమునుగుఱించి నేను స్వారాజ్యవాస్తవోపాయవివేకలియనెడి గ్రంథములో నిటులఁ జెప్పి యుంటిని.

శ్లో॥ బ్రాహ్మణేషు తపోవృద్ధ్యా జ్వలత్సు కథయత్స్వపి
శుభాశుభాని సర్వేషాం పోషయత్స్వితరేషు తాన్
శౌచహీనా స్సమాగత్య హూణా రాజ్యం శనైశ్శనైః
సంపాద్య బ్రాహ్మణాదీనా ముద్యోగానాం పరికల్ప్యచ
బహూ న్యుద్యోగస్థానాని కల్పయామాసు రంజసా
ధనాశయా తపస్త్యక్త్వా బ్రాహ్మణాః ప్రావిశన్ శనైః
తదాది బ్రాహ్మణాదీనాం మహిమా లుప్యతే క్రమాత్
తదన్యేతు ద్విషంత్యేతాన్ ధిక్కుర్వంతి మహీభృతః.

ఈరీతిగా బ్రాహ్మణులు తగ్గిపోఁగా నదితరులు బ్రాహ్మణా చారతత్పరులై ద్వేషించుచున్నారు. స్వామిభృత్యన్యాయము. ప్రకృతమునందు భారతీయులకుఁ బ్రిటిషుపులయం దెంతభక్తివిశ్వాసములు న్నవో వేఱుగ వ్రాయనక్కఱలేదు. ఆతీరుగనే యితరులగు ధనికులు

కున్నగువారలవద్దనున్న భటులుసైతము ప్రవర్తించుచుందురు. స్త్రీ పురుషధర్మము విచారించినను దలక్రిందుగనే యున్నది. స్త్రీలు పురుషులవలె సభలలో నుపన్యసించుట బియేమున్నగు క్లాసులలో నుత్తీర్ణులగుట యుద్యోగమును జేయుట మున్నగు పనులచే ననాదిసిద్ధమగు స్త్రీలకుండవలసిన మర్యాద నుల్లంఘించి నడచుచున్నారు. పురుషులు స్త్రీవాక్యమును వేదవాక్యమువలె విశ్వసించి వర్తించుచుందురు. ఈ విషయమై కలివిడంబములో "యత్రి దారగికో వేదా" యని మనకుఁ బూర్వులే చెప్పియున్నారు. పండితపామర ధర్మముకూడఁ జెడిపోయినది. పండితుఁడు వేదములలోఁగాని ధర్మశాస్త్రములలోఁగాని యిటుల నున్నదని బోధించెనేని తదితరుఁ డాశాస్త్రమునందుఁగాని యా బోధకునియందుఁగాని విశ్వాసములేమిం జేసి యటుల నాచరింపకపోవుటయే కాక తద్వ్యతిరిక్తముగఁగూడ నాచరించి దానిని వెక్కిరించుచున్నాఁడు. పండితుఁడుకూడ నితరులకు బోధించుటయే కాని స్వయ మాచరింపకుండును. కనుకఁ బండితపామరధర్మము నశించినదని చెప్పవలెను. ఈ కాలమునందు దాతృప్రతిగ్రహీతృభావముగూడ మాఱిపోయినది. దాతలకుఁ బాత్రాపాత్రవిచారణ లేక (తఱచుగా) ధనము నపాత్రులకే చెందఁజేయుచున్నారు. ఆ యపాత్రప్రతిగ్రహీత యసత్కార్యములకే యా ధనమును వినియోగించును. మఱియు, పూర్వము సత్కార్యములని పేర్కొనఁబడినవి యిపు డసత్కార్యములుగ గణింపఁబడుచున్నవి. ఇప్పుడు సత్కార్యములని యాచరింపఁబడునవి పూర్వదృష్టి కసత్కార్యములు. ధర్మ మధర్మమనియు నధర్మము ధర్మమనియుఁ బ్రాచీననవీనమతప్రవిష్టుల యభినివేశమై యున్నది.

అట్లే యపాత్రులు పాత్రులైరి. పాత్రు లపాత్రులైరి. పూజ్యపూజకభావము మూలచ్ఛేదమే యైనది. పై గురుశిష్య భార్యాభర్తృ బ్రాహ్మణ బ్రాహ్మణేతరభావాదులు నశింపఁగాఁ బూజ్యపూజకభావ మెటుల నిలువఁగలదు ? పూజ్యపూజకభావ మేమియు లేనిది శ్రేయ స్సెట్లుకల్గును ? ఆదిశబ్దముచే యతిగృహి

న్యాయముమున్నగునవి గ్రహింపఁదగినవి. ఇట్టి ధర్మములన్నియు నశించినవి. నశించుచున్నవి. నశింపఁబోవుచున్నవి. ఇఁకఁ బ్రపంచమే పాడుగా వలసియున్నదేమో తెలియదు. పయినఁ జెప్పఁబడిన ధర్మబృందమాచరణలోనుండినయెడలఁ బ్రపంచాభివృద్ధి కాఁగలదు. అవి నశించినందునఁ జింతిల్లుచుండవలసివచ్చినది. పైధర్మములు లేని యితరదేశములవలె నీదేశము వృద్ధిలోనుండదాయెనని మన దేశ మాధర్మములతో నేఁటివఱకుఁ బ్రసిద్ధిగాంచి యితరదేశములకన్నఁ బవిత్రమైనదనియుఁ బుణ్యభూమియనియు ద్వీపాంతరస్థులచే నైతము కొనియాడఁబడినది. ఇంతియేకాక శ్రీభగవద్గీతలలో "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితా" త్తని శ్రీకృష్ణభగవానులు సెలవిచ్చినటుల మనదేశస్థులు పై ధర్మములనే యాచరింపవలెను. అట్టి ప్రపంచపురోభివృద్ధికిఁ గారణమగునట్టి ధర్మజాలము నశించుటకుఁ బ్రధమకారణము విదేశీయప్రభుత్వము. రెండవది శాస్త్రిస్మార్తాదులు హూణభాషాధ్యయనము సేయుట. మూఁడవది తత్సహవాసానులు. "పరధర్మో భయావహ"యని కృష్ణభగవానులు చెప్పియున్నారుకదా! ఇది యిట్లుండఁగ నిపుడా ప్రభుత్వముమీఁది ద్వేషము ప్రపంచమునకుఁ గలిగినను పై ధర్మములు నామమాత్రావశిష్టముగ నున్నవియై స్వరూపనాశనమును బొందుచున్నది. ఇది యొక చిత్రము. ఈచిత్రమునకు హేతువేమియైయుండవలెనని యడిగిన నాయాశయమును వెల్లడించుచున్నాను. కొన్ని సం॥ల నుండి యింగ్లండుదేశస్థుల పరిపాలనలో నుండి తత్సహవాసము తద్భృత్యత్వముఁ జేసి యిపుడు భరతదేశనివాసులు భరతదేశ మింగ్లండుదేశము కావలెనని యభిప్రాయపడి వారలతో ద్వేషించి యాదేశమునందు లేని ధర్మములు మనదేశమునందేలయుండవలెనని సాధ్యమైనంతలో బోధనలచేతను శాసననిర్మాణముచేతను బ్రవర్తనలచేతను నశింపఁజేయుచున్నారు. కానఁ బై ధర్మములకుఁ బునరుద్ధారణము కలుగునట్టు లేదు. కనుక నో ప్రామాణికులారా! మీరైన నెవరైన నీకారణమును దెలిసికొని యెటులైన ధర్మజాలము నశింపకుండునటులఁ జేసిననే ప్రపంచము

రాకుండును. లేనిచో నేమికాఁగలదో వేఱుగఁ జెప్ప
నక్కఱలేదు.

---

## విజయేశ్వర పరిభావసభారంభపు మంగళాశాసనము

శ్లో॥ విద్యార్థీకులశీలపౌరుషయశోభీష్టంచ నష్టంచ నో
యద్యత్తత్సకలం యథాద్య విభవం భూయా త్పునశ్శ్రేయసే
ఇత్యేవం విజయేశ్వరస్య కరుణాపాంగా నపేక్ష్యేహ యే
సేవంతే వచసా హృదాపి వపుషా తా నేష పోషేత్ప్రభుః.

శ్లో॥ స్వాంధ్ర్యాపత్రికయాహ్నికప్రవణయా సర్వేష్వచైకాదరాత్
దేశోద్ధారకవిశ్వదాతృబిరుదా యం ప్రాప్య తత్సార్థకా
కారాగారదశాస్థితాచ వివిధం పక్వాన్నదానాన్మహాన్
కాశీనాథకులాబ్జరుగ్దినమణే ర్నాగేశరాయా త్కృపకః.

కం॥ ఊర్జితపడ నాగేశుఁడు
దౌర్జన్యములేని దానధారలు చూడన్
గర్జనచేయక వచ్చెను
పర్జన్యుఁడు నేఁటిసభకుఁ బరుగిడుచు బళీ.

ఉ॥ జైలునఁగూడ ఖైదులకుఁ జక్కెరపొంగలి పిండివంటలున్
చాలెడురీతిఁ బెట్టఁగలసద్గృహి యెవ్వఁడు తాను ఖైదియై
వేలగుమాటలేల పృథివీస్థలి నాంధ్రపుఁబత్రికేశుఁడే
కేలునఁజూపు నర్హుఁడని కీర్తులు వీనికి నింపు మీశ్వరా!

కం॥ జీర్ణోద్ధారవిధానము పూర్ణముగా వినెడి సుజనపుంగవులెల్లన్
కర్ణాంశ నించుకైన నపర్ణాదుల సేవఁజేసి పరమొందవలెన్.

తే॥ ఇహపరంబులరెంటిలో నేదిగాని
కోరకుండఁడు మనుజుఁడు గుణిగనున్న

గురుకులాశ్రమము మిహము కాస్తరణము చేసి
పరము కీర్తిర సన్నిధుల్ పథమునందించి.

తే॥ ఇహపరంబుల రెంటి మీరాయెదుట నిడితి
నొక్కటైనను దయచేసి నొక్కకుండ
శుభముశుభమని చూడగే సుజనులార!
ధన్యతకు మనకులముల వరముతెలిసి.

కం॥ బెజవాడఁ గృష్ణ కెదురను
విజయేశ్వరమనెడిచోట వెలసిన మిగులన్
విజయము కోరెడుభక్తుల
విజయేశుడు ప్రోచుఁగాత వేడుక నెపుడున్.

శ్లో॥ మాతా బ్రహ్మేశ్వరీయం పితా విజయేశ్వరః
సంరక్షా జ్ఞానమోక్షేషు శ్రీసన్నారాయణో గురుః.

ఉ॥ దేవునిభక్తి బ్రాహ్మ్యకృతి నీతులశ్రీ గయ బాలశీలమున్
కావలెనంచుఁ జేయు ఘనకార్యసహాయము సౌమ్యవృత్తియున్
ఆవలిదారిచూపు తమకిచ్చెద కష్టంబు నాకు ముఖ్యుఁ డా
దేవళరాజుశర్మ కొకదీవన చెప్పి ముగింతు నీసభన్.

ఉ॥ ఆయన కోర నేను మన యాత్మను నెపుడు షష్టిపూర్తులన్.
చేయుట శాస్త్రమన్న విని సేవలుచాలవె వైదిసంస్థలన్
చేయుదునంచుఁ బూని శివశ్రీసులగుళ్ళనుఁ బట్టినిచ్చె నీ
ధ్యేయతటంబునందు మనదేవలరాజునుఁ గానె దీటగున్.

శ్లో॥ విజయేశకృపాపాంగాత్ దేవరాజాఖ్యశర్మణా
భారద్వాజసగోత్రిస్సన్ స్వసంతోష్యస్తు ధర్మగీః.



## ఉల్లాముజాబు

(సంపాదకీయము)

కం॥ కడపటి విజ్ఞాపన యిది
యొడయండ! తుదవెళ్లఁజదువుఁ డోపికతోడన్
చిడిముడిపాటున నావల
పడవేయకుఁ డిదియె నాదుప్రార్థన మొదటన్. ౧

ఆ॥ వేదశాస్త్రవిదుల వేడ్కమై రావించి శ్రావణింబొనర్చుసత్కృతులకు
ఉరుయశంబుగొన్న దుర్గాముసంస్థాన మెన్నొనాళ్లనుండి యిద్ధరిత్రి

కం॥ విద్వద్బ్రాహ్మణభక్తియు నద్వైతమునం బ్రసక్తి యలరుచుఁగననా
మీద్వారమునం దద్యశ ముద్వేలంబగుచువచ్చె నొకకొన్నిసమల్

ఆ॥ కాశిమొదలుచేసి కాశ్యపి రామేశ్వ
రంబువఱకుఁగలుగు రాజులందు
కానఁబడదు మీకుఁగలకీర్తి లక్ష్మిప్ర
సాదరాయ! సుకవిజనవిధేయ! ౪

ఆ॥ అదియ కతముగాఁగ నందందువసియించు
పండితులకు మఱియుఁ బత్రికలకు
మిమ్ము నాశ్రయించి మీవల్ల బహుమతి
పడయుకోర్కి యోజఁ బొడముటయును. ౫

కం॥ అభినవసరస్వతికి మీ
రభయంబిడఁగలరటన్నయాశను బంపన్
లభియించెను నైదేండ్లకు
ప్రభువర! చందాధనంబు పదియేన్ముద్రల్. ౬

ఆ॥ కాశికేగి నేను గ్రమ్మఱివచ్చుచో శ్రీమదీక్షణమును జేసియుంటి
అప్పుడు పోషకత్వ మంగీకరించితి రస్మదీయపత్రికాబ్జముఖికి ౭

తే॥ పోషకులలోన మీపేరు పొందుపఱచి
పత్రికను మీకుఁ గ్రమముగాఁ బంపుకొంటి
భూప! మఱికొన్నినాళ్లకుఁ బోషకభృతి
అనుపుఁడనుచును మనవుల ననుపుకొంటి. ౮

కం॥ వ్రాసితి శాస్త్రిలుగారికి
వ్రాసితి మానేజరునకు వ్రాసితి మీకున్
చేసితిఁ గరము ప్రయత్నము
భాసురయశ! కతమదేమొ పంపరు చందాన్. ౯

ఆ॥ వత్సరాంతమునకు వసుధేశ! వీపీగాఁ
బంపుకొంటిఁ జరమభాన్యమగుట
అద్ది తిరిగివచ్చె నకట! యింకేమని
పోషకార్థ మెట్లుఁ బుచ్చికొందు. ౧౦

కం॥ పదపడి రిప్లైకార్డును బృథివీశా! శాస్త్రిగారిపేరటఁ బంపన్
మదిఁదోపదేమిహేతువొ యదియునిరుత్తరమయియ్యెహా! యేమందున్.

ఆ॥ ఇంతయగుటఁ జేసి యేగకయున్నచో
ఎదియుఁ దెలియదనుచు నిందుకొఱకె
అంతదూరదేశ మరుదెంచియున్నాఁడ
అష్టరూప్యములను వ్యయముచేసి. ౧౨

కం॥ వచ్చినత్రోవం బుచ్చుక చెచ్చెరఁ జనుమనుమటంచుఁ జెప్పితిరఁట యీ
ముచ్చటపెద్దపిడుగునలెఁ జొచ్చెను మత్కర్ణములను క్షోణీనాథా!

ఆ॥ నూఱులొఱులిచ్చి గౌరవింపకయున్న మానె మీరు నన్ను మనుజనాథ!
దర్శనంబు నేని తగురీతి నీయకే పొమ్మటంచుఁ జెప్పఁ బోలునయ్య?

ఉ॥ పండితపక్షపాతులును బండితు లీరలు సత్కవివారలై
పండితులఁ బత్రికాధిపతి బ్రహ్మణులుం గని నీవిధంబునన్

ఖండితవహా జవాబునిడి ఖర్చులకేనియు నీక పంపుటల్
దండితుఁ జేయుచాను మఱి ధర్మమటం చనఁబోవ రెవ్వరున్. ౧౫

కం॥ మీ సంస్థానంబునకున్ వాసింజనుదెంచినట్టివారెవ రేనిన్
కాసున్ వీసముగొనకిటు లాసం దెగఁగోసికొంచు సరిగిరె చెపుఁడీ. ౧౬

ఉ॥ అంగన రూపుమాపి ద్విసహస్రముమాపిక లూడఁజేసియున్
భంగముగూర్చు నాదగు నభాగ్యపుదేవత వచ్చి మీయెడం
దం గయిసేసియుండనగుఁ దన్మహిమంబునఁగాక మీరిటుల్
రాంగనె లేదుపొమ్మనెదరా కృపణుండటు లో మహీశ్వరా! ౧౭

తే॥ కాదు లక్షలు వేలునుం గాదు మఱియు
పందలైనను గాదహో వసుమతీశ!
నాకొసంగెడి యీకొద్దినాణెములకు
వేఱుపల్కుదురా జమీందారులయ్యు? ౧౮

ఆ॥ నాఁడు మరలవచ్చు నాలుగుగంటలబండి మిగిలిపోవకుండఁగానె
పొమ్మటంచువార్తఁబుచ్చితి రాస్థానపండితాననమున బహుమృదూక్తి

ఆ॥ కానియాశ దెగమిఁగ ర్తవ్యమూహించిపద్యములను వ్రాసి పంపఁజూడ
ఓయిలాతలేంద్ర! యుర్లాములోపల మీకుఁ జేర్చువాఁడె లేకపోయె.

కం॥ మీపంక్తిఁ బెద్దపీటల సాపడఁదగువాఁడఁగామిఁ జాటున నాకున్
సూపోదనంబు వేసిరి రేపునుమాపుం ద్వదీయ గృహమున ననఘా!

ఉ॥ రం డిటుఁ గూరుచుండుఁ డను రాజనియుక్తులు నేని లేని యా
తిండికిరాక కే మొదలు తీఱనిలజ్జ వసించు నేను బ
న్నుండియు లేక కుర్చిపయి నుయ్యెలలూఁగుచు యున్న మీకడన్
మొండితనాన నిల్వఁబడి మోమెటులెత్తి పఠింతుఁ బద్దెముల్.

క॥ జరిగిన సత్కారమునకు దురపిల్లు చభోజనముగఁ దోఁతెంచితి న
త్తఱినేని మీకుఁ జెప్పఁగఁ బఱతెంచం డెపుఁడు మీదుభయమదియేమో

కం॥ నరనాయక! రెండేండ్లకు
ఇరువదికావ్యంబు లీర లీఁదగుచుండా
మఱి రెండు సూతసంహిత
లరయుఁడు పంపితినో లేదో యనుఁగుఁడు శాస్త్రిన్.

చ॥ ఇరువదియైదు కావ్యముల నీయఁగనుంటిరి మీర లేవిధిన్
కరుణదలిర్పఁగం దమరె గ్రక్కునఁ బంపకయుంటఁజేసి య
త్తెఱఁగున నేను రావలసెఁ దెల్పితి నుండిన సత్యమంతయున్
నరవర! మీదుచిత్తమును నాదగుభాగ్యము నెట్టులున్నదో. ౨౫

చ॥ ఇరువదియైదుమాపికల కే నరుదేఁ బటుమాఱుకావ్యముల్
సరిగ వ్యయింపఁగావలసె సత్ప్రభువు ల్గను రిప్పుడేనియున్
గరుణమెసంగఁ జేయుచును ఖర్చులతోఁ దను బంపుటర్హ మా
యిరువదియైదు మాపికల నిచ్చెదరిట్లు దార ల్గరాస్థలిన్. ౨౬

కం॥ ఏయేటిపోషకార్థం బాయేటం బంపుచుండుఁ డట్టులతఱునాతన్
ఈయుటకుఁ గష్టమగుచో వ్రాయుఁడు పేర్కొని వేయవలయునటంచున్.

కం॥ అల పాకయాజిముఖులకుఁ
బలె నెలమిని మాఱులిచ్చి పంపకయున్నన్
బలుశ్రీమలు పెట్టియైనను
నలుబదియొకమాప్యములను నా కిడవచ్చున్. ౨౭

చం॥ భరమగునేని తెల్పుఁడది పత్రికలోఁ బ్రకటించితు సూత నె
వ్వరు నరుదేరకుందురు భవత్సముఖంబున కింతలోన సు
స్థిరత ఘటిల్ల నప్పులును దీరెడి నట్లనికాదె శ్రీనిధిన్
జరిపెడి విద్వదాదృతియు క్ష్మాపరిపాలక! యూపి తీయ్యెడన్. ౨౮

కం॥ అవమానము నవగోష్ఠ్య
పరివిష్ట మది మరల నెటులో పాపుకొనంగన్

భవదంతికమున కీవిధి
సవినయముగ వ్రాసికొంటి క్ష్మాపాలమణీ ! 30

చం॥ మనవిని జిత్తగించి యది మాపిన మాపుడు లేకయున్నచో
జనవర! యీ యుదంతమును సర్వమునుం బ్రకటింతు నంత నె
వ్వరికిని భీతి వాటిలు భవన్నగరంబున కేగుదేర నీ
యనిజననాథుతోడిపని యర్థిజనంబుల కేమియుండెడిన్. 31

కం॥ ధనలాలస లేకుండిన
పని యే మున్షాముతో విపశ్చిత్ప్రజకున్?
ఘన కాశియ? గయయా? మఱి
యనఘ కురుక్షేత్రమా? ప్రయాగయ తలపన్? 32

ఉ॥ శ్రావణపూర్ణిమన్ జరుపు శాస్త్రవిదర్చన మాఁగినందుకే
తావకకీర్తికాంత ముఖతామరసంబు కళంకితంబు గా
కోవిదుఁ బత్రికాధిపతిఁ గూడ నమానితుఁ జేసిపంపు పై
నేవిధిగాఁగ నుండెడినో యీరలె యోజనచేయుఁడీ మదిన్. 33

శా॥ "పీసం జేని లభింపదిప్డు చని వెన్వెంటన్ లిఖింపంగ నీ
మాసాంతంబున నీయనున్నయది సన్మానంబుగాఁ బంపి మీ
గాసిం దీర్చెద" మంచు నంటిరఁట యోక్ష్మానాథ! యబ్భంగి నా
యాసం దీర్చి భవద్యశంబు భువిఁ బర్యాప్తంబు గావింపుఁడీ. 34

ఈ లేఖ ప్రత్యేకించి యున్షాముజమీందారుగారికే పంపఁబడినది. కాని యది వారు సఫలముచేయక బుట్టదాఖలుచేసిరి. కాన నీయుత్తరము వారికిఁ జేరెనో లేదో యను సందేహముతోఁ బత్రికాముఖమునఁ బ్రకటింపనైనయది.

---

## —* యాదగిరిక్షేత్రము *—

పశ్చిమాంధ్రదేశమునఁ (నిజామురాష్ట్రమున) బ్రసిద్ధములగు క్షేత్రములలో యాదగిరి యొకటి. ఇది హాయిదరాబాదునకు బెజవాడ నుండి పోవు ఇనుపదారికిఁ జెందిన వంగిపల్లి స్టేషనుకు మూఁడుమైళ్ళ దూరములో నున్నది. యాదగిరిపల్లె యను గ్రామమునకుఁ జెంతఁగల చిన్నకొండపైఁ జిన్నగుహలో స్వయంవ్యక్త నృసింహవిగ్రహము గలదు. ఈ దేవునిబట్టియే యీ క్షేత్రమునకంత పేరు వచ్చినది.

ఒరంగల్లు కంభముమెట్టు, దేవరకొండ, భువనగిరి దుర్గము లాంధ్రరాజులు పాలించుకాలమున నీ యాదగిరిక్షేత్రము మహావైభవోపేతముగ నుండెను. అనంతరము జరిగిన యవనదండయాత్రలలోఁ దొల్లింటి భోగభాగ్యములను దక్కుఁగల క్షేత్రరాజములతోఁ బాటీ క్షేత్రముగూడఁ గోల్పోయెను. రాజకీయవిప్లవము లడఁగి దేశీయ క్షేత్రములు కాలు నిలువఁ ద్రొక్కుకొను కాలమున లేములవాడ, ధర్మపురి, కాళేశ్వరము మున్నగు క్షేత్రములతోఁ బాటీ క్షేత్రముగూడఁ బూర్వప్రతిష్ఠ నిలుపుకొని భక్తుల ఆకర్షణపాత్రముగ నున్నది. యాదగిరి మనోహరమగు ప్రదేశము. చుట్టును జన్న చిన్నకొండలు పెక్కులు గలవు. దేవాలయము ప్రత్యేకించి యుండుట లేదు. లక్ష్మీసహితమగు నృసింహవిగ్రహ మొకయఖండశిలపైఁ గలదు. ప్రదక్షిణములు గావించువారు స్వామిసన్నిధినుండియే తిరుగవలయును. ఈమధ్యకాలమున దేవుఁడున్న గుహ ననుసరించి మండపాదులు కట్టి యాలయావరణమును ధర్మకర్తలు విశాలమొనరించి విగ్రహశిరోభాగమున నున్న మూతరాతిపై శిఖరము గట్టిరి. కొండపై నిప్పుడు కొన్ని గృహములఁ గట్టిరి. భగవత్సంబంధులగు అర్చకులు భక్తులు ప్రదక్షిణలకు వచ్చువార లాగృహములందు వసింతురు. ఈ క్షేత్రరాజ మొకభక్తకుటుంబమువలెఁ గనుపించును.

యాదగిరి నృసింహస్వామినిగుఱించి వ్రాసినపద్యములు పాటలు అసంఖ్యాకములు. ఒకవైష్ణవకవి యాదగిరి క్షేత్రమాహాత్మ్యమును రసవత్తరముగఁ బద్యకావ్యమొనరించెను. కొందఱు శ్రీస్వామివారి విభవమును శతకములలోఁ బ్రశంసించిరి. గేయవాఙ్మయములో యాదగిరీంద్రుని మహిమ మనంతముగా నున్నది. గేయరచనమునఁ బ్రసిద్ధులగు మరింగంటికవులు వ్రాసిన హారతిపాటలు, కీర్తనలు, మేలపాటలు, జోలపాటలు, తలుపువద్ద పాటలు నృసింహుని గుణకీర్తనమునకు ననుకూలముగనున్నవి. ఎవరేని యీవాఙ్మయమును సంగ్రహించిన నొకగ్రంథముకాఁగలదు. భూతావిష్టులు రోగపీడితులు కుటుంబములతో శైలముపయి నివసించి యచిరకాలమున నారోగ్యవంతులై పోవుటయు రోగులు ప్రార్థించుకొని మొక్కుబడుల ముడుపు గట్టినంతన ఆరోగ్యవంతులగుటయుఁ దఱచుగఁగాంచుచున్నారము. తిరువాయిపాటి వెంకటకవి యాదగిరీంద్రశతకములో శ్రీస్వామివారి మహిమ నిట్లు ప్రశంసించియున్నాఁడు.

ఉ॥ "రోగము రాఁగ నీపదసరోరుహతీర్థము లిచ్చి కావవే
బాగుగ క్షుత్తుబాధకును భారముతీర్చి ప్రసాద మిచ్చియుఁ
రాగము నిల్పి సౌఖ్య మిడరాద; మురారి సురారిభంజనా
యేగతి నిన్ను వీడునెడ నీశ్వర యాదగిరీంద్ర మొక్కెదన్."

యాదగిరినృసింహమూర్తికి భక్తుల మ్రొక్కుబడులవలన వేలకొలంది యాదాయము వచ్చుచున్నది. పూర్వరాజదత్తములగు భూములవలనఁగూడఁ గొంత యాదాయము కలదు. స్వామివారి యుత్సవవ్యయములు యథావిధిగఁ జరుపుచు ధర్మకర్తలు మిగిలిన ధర్మాదాయమును ఆలయనిర్మాణమునకు వాహనములకుఁ గర్చుపెట్టుటయే గాక ప్రతిసంవత్సరము మార్గశీర్షశుద్ధమునఁ గల్యాణాద్యుత్సవములు జరిపి

వివిధ దేశాగతులగు సంగీతసాహిత్యవిద్వాంసులకుఁ దగిన సత్కారములు జరుపుచున్నారు. దేవాదాయమును విద్వత్పోషణమునకుఁ గర్చుపెట్టి మనప్రాచీనవిద్యలయెడల నభిమానముఁ జూపు ధర్మకర్త లెంతయుఁ బ్రశంసాపాత్రులు. సంస్కృతాంధ్రములలో సమముగఁ గవితఁ జెప్పు విద్వత్కవులు, తర్కవ్యాకరణాదిశాస్త్రవిదులు వేదాంతశాస్త్రజ్ఞులు, అవధానులు, వేదపండితులు, గాయకులు, నృత్తగీతనిపుణలగు వేశ్యలు నీయుత్సవసందర్భమున కరుదెంచి ధర్మకర్తలచే నుచితసత్కృతుల నందుచుందురు. సత్కృతులు పండితపరీక్షానంతరము వార్షికముగ నేర్పాటుచేయఁబడుటచే ననన్యగతికులగు పండితులకు స్థిరవసతి యేర్పడుచున్నది. ప్రాచీనవిద్యాపోషణమునకు శ్రీస్వామివారిధనమును సక్రమముగా వ్యయపఱచుచున్న ఆలయధర్మకర్తలు ప్రశంసాపాత్రులు. బ్రహ్మశ్రీ ముల్లాది రామకృష్ణవిద్వచ్ఛ్రయనుల వారు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు, అన్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు మున్నగు విద్వాంసు లీయుత్సవములను దిలకించి వార్షికముల నొందువారిలో ముఖ్యులు. నిజామురాష్ట్రమునఁగల ప్రసిద్ధవిద్వాంసులయొక్కయు గానవిద్వాంసులయొక్కయుఁ బరిచయము సంపాదించి నిజామురాష్ట్రమున సంగీతసాహిత్యవిద్యల వ్యాపకమెట్లున్నదో పరిశీలింపఁదలంచిన జాతీయాభిరతు లీయుత్సవమును సందర్శించుట యవసరము. దైవద్రవ్యమును దేశీయకళాపోషణమునకు సక్రమముగ వ్యయమొనరించి యిహపరములకు సాధనభూతులైన శ్రీస్వామివారి ధర్మకర్తలగు మహారాజశ్రీ బీరకాయల హనుమంతరావువారి కార్యదీక్షను బ్రశంసించుచున్నారము.



నా॥ తక్కినకార్యము లంత బాధకరములు కావు కాని యలరాజు రాయబారిగా వచ్చుచున్నాఁడనుటచేఁ గొంత విచారింపవలసి వచ్చినది. రాజునకల్లుఁడగుటఁ బ్రేమచే వాని హితము నిరాకరింపలేక సంధి కొడఁబడునేమో ? సంధియే నిశ్చయమైన నాయుఁడుమరల నరసింగుని దనవలలో వేసికొనకమానఁడు. అప్పుడు నా వ్రాఁత కడురోఁత కాఁగలదు. ఎట్టులైనను నీ సంధి కంతరాయము గలిగించితినా మనము విజయముఁబొందినట్లే. తదుపరికార్యములు మెల్లగాఁ జూచుకొనవచ్చును.

ఎ॥ అమ్మా ! ఎంతయోజించితివి ? కనుకనే బృహస్పతితో సమానురాలవని జనులు నిన్ను వాకొనుచుందురు. కాని రాజుగారల్లునిమాట కన్యథా నడచునా? దాని నెట్లు సమర్థించుకొనఁగలవు?

నా॥ దానికొకయుపాయము గలదులే. నూఱువిధముల రాజు నామాట కెదురాడఁడు.

సేనకుఁడు॥ ( ప్రవేశించి ) అమ్మా! అలరాజు, మనరాజుగారియల్లుఁడేదియోపని గలిగి వచ్చినాఁడఁట. రాజుగారు ముందు మీతో మంతనమున మాటలాడ నున్నారఁట. మిమ్ము రాఁగోరుచున్నారు.

నా॥ ఓయీ! చూచితివా. రాజు నాయాజ్ఞలేక యల్లునిసందేశమును వినుటకుఁగూడ సందేహించుచున్నాఁడు. ఇఁక వానిరాక నిష్ఫలమైనట్లే. నీ విప్పటి కేగి పురిలోని విశేషంబు లరసి పిమ్మట నాతోఁ గలసికొనుము. నేను ఱేనిచెంత కరిగి సంగతులు తెలిసికొని తత్ప్రతీకార మొనరించెద.

ఎ॥ చిత్తము (అందఱును నిష్క్రమింతురు).

[ నాయకురాలును నరసింగరాజును బ్రవేశింతురు ]

నా॥ రాజచూడామణీ ! అతనియుద్దేశ మెట్టిదో యింకను స్పష్టీకరింపవలయునా? నీకుమాత్రము తెలియుటలేదా? నాయల్లుఁడు

నాయల్లుఁడని నీవు మురియుటయేకాని నీయందతని కణుమాత్రమైనను భక్తివిశ్వాసములు లేవనుట స్పష్టము.

ఉ॥ అచ్చపుభక్తి ప్రెమెక్కెనె నయంబునఁ గేలుమొగిడ్చి? యల్లుఁడై
వచ్చినయట్టివాఁడు హితవాక్యములాడెనె? దానికేమి తా
తెచ్చిన వర్తమానమును దెల్పెనె యే కపటంబు లేక? మీ
సచ్చరితంబునైనను విచారణసేయఁదలంచెనే నృపా !

ఇంతియేల? కన్నులారఁజూచి వీనులార వినసహింపనోపని సంగతిగూడ నీవు విచారింపఁ బొల్పడకుంటివి. నేఁజెప్పిన నీకుఁ గష్టముగానుండునని బయల్పెట్టుటకు భయపడుచుంటిని.

ఉ॥ తల్లికిలేనిదుఃఖమిఁక దాదికి నేటికటంచుఁదోఁచి నే
నెల్లిదమాడునన్న భయమేర్పడఁ జెప్పకయుంటిఁగాని నీ
యల్లుఁడుచేసియుండిన దురాగతమంతయు నాదుడెందముం
దల్లడమందఁజేయ నది దాఁపఁగలేక వచింపఁబూనితిన్.

నీమేలుకొఱకై వెసఁగులాడుదాననగుటచే నీకుఁ జెప్పవచ్చితిని. అతనిచర్యలు గౌరవపాత్రములుగాక చూచువారికి వ్యతిరేకముగాఁ దోఁపకమానవు.

నరసింగు॥ తరుణీమణీ! నీవు విస్తరించి వివరింపఁ బనిలేదు. నేనంతయు విచారించుచునేయున్నాను. మున్నెన్నఁడును నాయెడలఁ దిరస్కారభావములేక వినయవిధేయతలతో నాకనుసన్నల మెలఁగువాఁడు నేఁడు నాయెడల విముఖుఁడై తిరస్కారభావకలితుఁడై వర్తించుచు మదీయగౌరవాదుల సందుకొనక మిన్నకుండుటఁ జూడ నాలో నాకే యచ్చెరువగుచుండ నితరులకు వెఱఁగుగలిగించుట కేమివింత? అట్టి వైపరీత్యమునకుఁ గారణమేమియోయని యూహించుచునేయుంటిని.

నా॥ వేఱుకారణ మేమియుండును ?

తే॥ బ్రహ్మనాయునివా పోఁతపాలు దగిలి
మంచిచెడ్డల నించుకే నెంచలేక

గర్వమెగఁదట్టియుండుశే కాక వేఱు
కారణం బొకడుండునే ఘ్నాతలేండ్రి !

నరసిం॥ నిజము. నిజము. నీయోజన సమంజసమే. అందుచేతనే నా యింటికిఁగూడ రాక పెరచోట విడిదిచేసి న న్నేమో తలక్రిందుఁజేయనుండినట్లు వింటిని. వానిచర్యలు నాకు మిక్కిలి యాందోళన గలుగఁజేయుచున్నవి.

కం॥ ఆతని నిర్భీకములగు చేఁత లహంకారపూర్ణచి త్తంబును నా
ఖ్యాతికిభంగకరములై రోఁతనుబుట్టించుచుండె రూఢిగవినుమా.

నా॥ (హాస్యాస్పదముగా) వాఁడెట్టులున్నను నల్లుఁడుకాఁడా ? నీవు మామవు కావా? బంధువులుకదా ! ఎట్లున్నను మీారందఱు నొక్కటియే.

నర॥ అట్లనకు. ఎంత బంధువుఁడైనను ఖ్యాతికి భంగమొనరించిన వానిని సైఁపనగునా ? కాదు కాని

నా॥ కానీ లేదు. దమ్మిడియు లేదు. మీాయూహ నే నిదివఱకే కని పెట్టితిని. వానిదారియు నెఱింగితి.

ఉ॥ అల్లునిమీాఁద మీాకు దయ యంతగ నుండిన నుండకున్నఁ ద
త్ఫుల్లసరోజనేత్రయగు పుత్రికపై నభిమాన ముంటచే
నెల్లసుఖంబులన్ జరుపనెంచుదురం చతఁ డెప్పుడుం గటా!
చల్లగ గొంతుగోసి మిముఁ జంపఁదలంచుచునుండెఁ గుట్రచే.

నరసిం॥ తప్పే! నిజమే. వానికిఁ దగురీతి బుద్ధిఁజెప్ప నే నిదివఱకే యత్నించితిని గాని త్వరపడి నేనేదియైనను జేసితినేని

చం॥ అదిగని కాకులట్లు జను లారడిఁజేతురటన్నభీతి నా
హృదయమునందుఁ బాదుకొనియెల్లపు డుండుటఁజేసి యందుకై
అదనునువేచియుంటిని. నయంబునఁ గార్యము చక్కఁబెట్ట నే
విధమున నాకుఁగల్గుపరివేదన దీర్చునో దైవ మద్దిరా !

నా॥ రాజచంద్రమా ! ఎవరిమంచిచెడుగుల వారే యోజించుకొన వలెనుగాని పరులు చెప్పుట పాడిగాదు. అందు సమీాపబంధువులకు మొదలే చెప్పరాదు. ప్రేమ కడుచెడ్డది. తననెత్తిపైని

గత్తిదెచ్చిపెట్టినప్పటికిని ద్రోహబంధమును ద్రెంపఁజాలక వానినే యాదరించి మన్నించి పంపుచుందురు. అంతియకాక

చం॥ సుతుఁ డవినీతుఁడైనను స్వసుందరి జారిణియైనఁ బుత్రి స
మ్మతిని జరింపకున్న నవమానముఁ జేసిన నల్లుఁ డెంతో వె
న్నతలను ముంచ బందుగు లనేకప్రయత్నము లాచరించినన్
క్షితి విడనాడలేఁడు స్థిరచిత్తుఁడె యైనను మానవుం డిలన్.

వ॥ అతివా! నే నజ్ఞానినిగాను. వీరపురుషోచితలక్షణముల నాకుఁ గ్రొత్తగా నుపదేశింప నక్కఱలేదు.

ఉ॥ కూఁతురు దుఃఖమొందుననె కోమలి రవ్వయొనర్చునంచు సం
జాతుఁడు వైరియౌనని ప్రజల్కుడు దూఱుదురంచు దిగ్భ్రమన్
చేతులు నల్పుకొంచు రిపుచేష్టల నాత్మఁదలంపకుండినన్
ఖ్యాతికి నిల్వఁజోటుకలదా? యటు లెంచెడువాఁడు వీరుఁడే?

కార్యముల నిశ్చయానిశ్చయములనుమాత్రము గుర్తెఱింగి చరింపవలయు. వేగిరపాటు పెక్కులకు మూలమగుట నింత యోజింపవలసివచ్చినది. ఊరకుండవలసివచ్చినది.

నా॥ ఊరకుండక యిపుడే నిన్నుఁ బరుపులు పెట్టుమనుటలేదు. అతని చర్యలు నీకుఁ దెలియునో తెలియవోయని ముచ్చటించితిని. మునుపటివలె వాఁడు నమ్మియుండఁదగినవాఁడు కాఁడని హెచ్చరించుచుంటిని. నీ భావిక్షేమముననే ప్రయాసపడుచుంటిని. స్వలాభపరాయణత్వ మిందు లేశమును లేదని విన్నవించుకొనుచుంటిని.

వ॥ వనితా! ఎఱింగియే యొకకంటఁ గనిపెట్టియున్నాను. వాఁడు వచ్చినకార్య మిప్పటికిని వెలిపుచ్చలేదు. లేకున్న వాని నీవటు లెటులఁజేయవలయునో యటులఁ జేసియే యుందును. విరోధిపక్ష మూనినవాఁ డల్లుఁడైననేమి? కొడుకైన నేమి?

నా॥ కానిండు అతఁడు వచ్చుసమయమైనది. వచ్చినకార్య మెఱుంగువఱకును నిచట నాయునికి సమంజసముకాదు. అందుచేఁ

చాటున నిలచియుండెద. అతఁడు వచ్చినపి సంధికేయైన నీ యుద్దేశ మే నెఱుంగవచ్చునా ?

స॥ ఏమున్నది. నీవెఱుంగవా ?

చ. మనకు విరోధులౌ దురభిమానులు నిష్కపటాత్ములౌచుఁ బ్రీ
తిని గబురంపినారని మదిం దలపోతునె ? ప్రస్తుతంపు వ
ర్తనలు నిజంబులో కపటతంత్రము లేనో యెఱుంగకుండ మూ
ఢునిగతిఁబోయినం దుద కెటు ల్నమకూరు నకీర్తిఁ గానసే.

నా॥ ఎఱుంగరని కాదు. మీయభిప్రాయము గనుంగొనుట కోసమా ?

స॥ కాదు కనుకనే వ్యక్తీకరించితిని.

నా॥ ఆయుద్దేశమును వీడకుఁడు. అడుగులచప్పుడు వినవచ్చుచున్నది. వచ్చుచున్నట్లున్నది. మంచిది. మీతో నొక్కటిమాత్రము నొక్కి చెప్పవలసియున్నది. ఆలకింపుఁడు. ఈసభకుఁజేరవచ్చు వారలలోఁగూడ మనల సేవగించువా రనేకు లున్నారు.

మ॥ మన బాగుం దలపోయుచున్నటులఁ బ్రేమంజూపుచుం బైకి వే
తనముంగొంచును మేఁకవన్నెపులులై తంత్రంబుతో లోన యో
జనలన్ శాత్రవకోటితో సలుపుచున్ సంతోషితస్వాంతులై
మన కెగ్గుం దలపెట్టువారు గల రేమార్గాన నైరింతురో.

మీ రెవ రేమిచెప్పినను వానినెల్ల నమ్మిచు నందఱును మనవారేయని యుబ్బి తబ్బిబ్బులగు నిష్కపటాత్ములరు. ఇదియే జాగ్రత్తగా నుండవలసిన సమయము.

( అని చాటున కేగి నిలువఁబడును )

(అలరాజు ప్రవేశించును. సభికులు లేచి నిలుచుందురు)

అల.రా॥ రాజమార్తాండా ! అభివాదనములు. వీరవరులారా ! సుఖాసీనులుకండు.

సభికు॥ అలరాజ మహీవల్లభా ! హర్షమా ?

అల॥ దైవకృపచే నింతవఱకును సుఖమే

స॥ బాలకా! మీ యెల్లరకును క్షేమమే? రమ్ము కూర్చుండుము. నీరాక చిత్రముగా నున్నది.

ఉ॥ ముచ్చటదీర నాకయిన ముద్దులయల్లుఁడవయ్యుఁ బ్రీతిచే
వచ్చితివంచు నీదుముఖవైఖరి తోఁపదు కోరిపిల్చినన్
వచ్చుటలేదు మున్నెపుడు వచ్చితి వీగతిఁ బిల్వకుండ నీ
వచ్చినకార్యముల్ తెలుపవచ్చెడిదైన నెఱుంగఁజెప్పుమా.

వినికిడికిఁదోఁచు నీప్రవర్తనచే నాయనుమానము ద్విగుణీకృతమగుచున్నది. బాంధవ్యంబును బట్టివచ్చితివో లేక మఱే కార్యమైనను గల్పించుకొని వచ్చితివో తెలియదు.

అ॥ రాజచూడామణీ! వచ్చినకార్యము చెప్పసందేహింపను, వెఱవను, వెనుక కేగను.

తే॥ చల్లకని వచ్చి పాత్రను జాఁచునందు
దాఁచుకొనునట్టివెఱ్ఱి యీధాత్రిఁగలఁడె ?
బంధువుఁడనని రాలేదు బాంధవుండ
గాకయును నుండలే దహా కాశ్యపీశ !

వినుము, నేవచ్చినకార్య మతిముఖ్యమైనది. నీవు బాగుగ యోజింపవలసినది. త్వరపడి ప్రత్యుత్తరమీయఁదగినది కాదు. దీని కేమాత్రము వ్యతిరేకముగా నడచినను బంధునాశనము. దేశారిష్టము, కడకు దుర్యశము.

స॥ నిజముకుఱ్ఱా! నిజము. ఈపీఠికలతో నాకవసరము లేదు. సంగతి విన్నఁ జాలును. నీమాత్రపుజ్ఞానము నాకుఁగూడఁ గలదు. వృథా కంఠశోషణ మేల ?

అ॥ ( తనలో ) ఇతఁ డప్పుడే తిరస్కారేర్ష్యల వెలిపుచ్చుచున్నాఁడు. కానిమ్ము (ప్ర) రాజా ! ఆఱునెలలువాయించిన రోలు గట్టిదో యోటిదో యెఱుంగఁబడదే ? పూర్వము నీగుణగణము లంతగాఁ దెలియకున్నప్పటికిని నీతో బాంధవ్యము నెఱపిన దాడిగా నెఱుంగవచ్చినవి. అంతకుఁబూర్వము నీబుద్ధి

యోలాగునఁ బ్రసరించుచున్నను గొంతకాలమునుండి వక్రపథము ద్రొక్కుచున్నదని నిర్భయముగాఁ జెప్పవచ్చును. మహా మాయాశక్తియే నాయకురాలిరూపమున నీయింటఁ బ్రవే శించినది. సర్వస్వము నాయువతి యధీనమైనది. ఆమెయే విధిప్రాయమై నీకన్నులు మూసినది. ఆయంధత్వముచేఁ బల్నాటికిఁజుట్టుకొన్న కార్చిచ్చు నీకుఁ గనఁబడుటలేదు. కావున

తే॥ మిమ్ము మీవారినందఱ మేలుకొలిపి
దుర్నయంబుల నణఁగించి తోఁచినంత
మేటిపల్నాటిసీమకు మేలుచేయ
వచ్చినాఁడను లోకము ల్మెచ్చునటుల.

అట్లుసేయుటకు నీవే పెద్దవైతివాయని యందురేమో? వినుఁడు. కుటిలతంత్రపరాయణయు విషానలజ్వాలావృతహృద యయు నగు నాయకురాలి దౌష్ట్యనాటకంబునఁ గీలుబొమ్మవై తందనాలాడు నీ కాత్మీయు లెవ్వరైనను హితోపదేశము నొన రించినఁ జెవికెక్కనేమోయని వీరు లందఱును నన్నునుపుట చేతను దేశభక్తి మానవుల కవశ్యంభావ్యమగుటచేతను నీ కార్యనిర్వహణభార మూని రావలసివచ్చినది. కనుక నోరాజ చంద్రా!

తే॥ అల్లుఁడను మీకు వారల కాప్తవరుఁడ
నగుట నర్హుఁడనంచు న న్నంపినారు -
వీరనాయకులెల్లరు. వీనులలర
వినుఁడు. యోజనసేయుఁ డీవిషయములను.

నా॥ ఔరా! రాజునే కల్లుఁడను గదాయని నిండుపేరోలగమ్మునం దీదుర్మార్గుఁ డెంతనిర్భయముగా వదరుచున్నాఁడు. అబ్బా! వీనిమాటలు కర్ణశూలములై వేధించుచున్నవి. కానిమ్ము. కడవఱకును వినక త్వరపడరాదు.

వ॥ అలరాజా! సంధియా? ఆమాట నీవన రాదు. నేవిన రాదు. వినఁ దగినదికాదు. ముమ్మాటికిని వినువాఁడనుగాను. పాప మీా

కార్యమున కేల వృథాశ్రమపడివచ్చితివా' యని చింతకలుగు చున్నది.

అ॥ రాజా! రానురాను నీమతి వెఱతలఁబెట్టుచున్నది. నీ యంతము నీచేతులమీఁదుగాఁ దెచ్చిపెట్టుకొనుచుంటివి. అది నాకేల ? నేవచ్చినకార్యమునైనను వినుము. పైత్యరోగికిఁ బంచదార వెగటుగాఁదోఁచుభంగి నామాటలు నీకు రుచింపవని యెఱిఁగి యుండియుఁ గార్యభారమూని వచ్చినవాఁడనగుటఁ దద్విధ మాచరింపకుండ నేగుట పాడిగాదని చెప్పుచుంటిని. మామా! పొరపడితి; రాజా!

ఉ॥ నాయకురాలిబోధలను నమ్మి నిజంబు నెఱుంగఁజాల కా
నాయునితో విరోధమె ఘనంబని యెంచి మనించి మించి మీ
దాయల వెళ్ళఁగొట్టియుఁ బదంపడి తానని పిత్ర్యభూమి నా
శ్రేయమునే హరించుట కిసీయన నెల్లరు సిద్ధమెట్టిదో.

అయ్యయ్యో! ఉత్తమవంశసంజాతుఁడవై లౌకికవ్యాపార నీతిజ్ఞుఁడవై రాజ్యపాలనంబొనరించు నీవే లోకధర్మములను గులమర్యాదలను బెద్దల యశమ్మునుగూడఁ బాటింపక మంద బుద్ధివై ముందువెనుక లారయక చిందులుద్రొక్క రాజబృం దము లానందింతురే? అది నీ శ్రేయమునకు సహకారియగునా? నీకతంబున దేశ మెంతక్షోభపడుచున్నదో యోజించుకొనుము. ఆహా! ఎట్టిదేశమున కెట్టిసంక్షోభముఁ దెచ్చిపెట్టుచుంటివి? ఎన్నఁడు నీకు హృదయశాంతిగలుగునో తోఁపకున్నది. నినుఁ గాంచఁ గర్ణునిమాయలకు లోఁబడి క్రిందుమీఁదెఱుంగక వంశక్షయమొనరించుకొనిన సుయోధనునిచరిత్రముజ్ఞప్తికివచ్చు చున్నది. నీ బాగును నీవు కనుగొననేరకున్నావు. నాకేల యని యూరకుందమన్న నీ కల్లుఁడనైనపాప మూరకుండని చ్చుటలేదు. నీకు రుచించినను రుచింపకున్నను బలాత్కార ముగనైనను నాయునిసందేశ మెఱిఁగింతును. నాయుఁడన సామా న్యుఁడు కాఁడు. కాని పరికృతినిబద్ధుఁడగుట

# నాగరఖండము.

దశమాశ్వాసము.

———:o:———

క౦॥ శ్రీకాశీ రామేశముఖైకక్షేత్రయాత్రలెన్నియొనరాబుల్
ప్రాకటభక్తినొనర్చు మహాకాయా! శాకగాత్ర్వాంకశరాసా! ౧

## నీలవృషభ లక్షణము.

తే॥ అవధరింపుము శైవనాఖ్యసూదుఁ "డద్భుతాకృతియైనట్టి యావృషభము
నీలసంజ్ఞక మెటులయ్యెఁ గాలవ! వచియింపు" మనుటయు నమ్మునియిట్టులనియె.

ఉ॥ రంగునఁ జిత్రమై కరము రాజిలునట్టి మొగంబుఁ దోఁకయుఁ
బంగరుపూఁతపూసినటు పాండురమై మఱిగిట్టెలన్నియుఁ
శృంగయుగంబుఁ దెల్లనయి చెన్నలరారు వృషంబు నీలసం
జ్ఞంగను నివ్విధంబునను శాస్త్రవిదుల్ వచియింతురు సూదద్విజా! ౩

సీ॥ కమనీయతరములౌ కాళ్ళునాలుగు గల్గి నందితో సాదృశ్యంబునొందునెద్ది
ధర్మదేవతవోలెఁ దాఁ దోఁచుచుండెడుఁ బరికించుమాత్రన పాపులకెద్ది
నీలలోహితమైన నిజచిహ్నములచేత స్వాంతముల్ హరియింపఁజాలునెద్ది
ఖురచిహ్నములయందుఁ దఱచుగం గపిలమై ముద్దుసేయుచునుండుఁ దద్దనెద్ది
దేనివిశ్వరూపుఁడైన జనార్దనుం దలఁఘువేదమంత్రములను నిత్య
మర్చితంబుఁ జేయు నది నీలసంజ్ఞకం బదియె పంచవదనుఁడైన శివుఁడు. ౪

క౦॥ తద్దర్శనమాత్రంబునఁ బెద్దగ సిద్ధించు వాజపేయఫలం బిం
కద్ది సమర్చితమైనం దద్దయు జగమెల్ల నర్చితంబగుచుండున్. ౫

క౦॥ ఆనీలవృషభమునకున్ జానగు గ్రాసమునఁ దృప్తిసలుపంబడుచో
నీనిఖిలమైన జగమును దానాప్యాయనముగాంచు దాస! నిజముగన్. ౬

ఘనములలో నెల్లను శుచి తానయయ్యును భక్తిఁ దప్పుచుఁ గడుం బరిచరించె
గోరాజవాహను కూరిమిసతియయ్యుఁ గొలఁకంగడంగె నాగోగణము నె
దండిపార్శ్వస్థమునకుఁ బ్రదక్షిణించె నతిథిసత్కారములఁ గరం బాచరించె
భగవదుపదిష్టమంత్రజపంబు సేయుచును భవానీమహాదేవి మునివరేణ్య! ౧౬

సీ॥ నీలమేఘము డాలు నిరసించు మెయిమేనఁ బచ్చనిహోంబట్టు బట్టఁగట్టి
మకుటకేయూరాది మణిసుందరాభరణంబులం దత్తదంగంబులన్ ధరించి
కరముల నాల్గింట ఖడ్గగదాశంఖచక్రముల్ లాలుగు సరిగఁ బట్టి
శ్రీవత్సకౌస్తుభశ్రీమేళనమునను గమలసూర్యకోటి కాంతిగలిగి
వ్యాప్తలోకత్రయుండయ్యు వైనతేయుపై నధిష్ఠించి శంపత్రిపత్రనేత్రుఁ
డై విష్ణుండు "దేవి! నీయభిమతంబుఁ దెలుపు శుభమగు" నని ప్రీతిఁ బలుకుటయును

కం॥ "దేవా! యజ్ఞానంబున నావర్తనమందె దింక నత్యాకులంబై
త్రావెలసెడి యజ్ఞానము కావలయును నాకు సంగఁగదె దయ" ననుచున్ ౧౭

తే॥ సర్వమంగళ వచియింప శార్ఙ్గధరుఁడు శ్రీరమణుఁ డొనరించియిట్లను. శైలతనయ!
ఎవఁడు నా దేవదేవేశుఁడో వచియింపఁగలఁడు సద్భగవంతుండె కరుణ నీకు. ౧౮

సీ॥ సర్వసాక్షియెవండు సంసారవనంబునం దంతర్బహిర్వ్యాప్తుఁడగు నెవండు
జగములసృజియించి సాకెడి నెవఁడు పవిత్రులందెల్లఁ బవిత్రుఁడెవఁడు
ఆద్యంతములులేని యాలధర్మమెవ్వండు ధర్మాదికముల కధ్యక్షుఁడెవఁడు
అజుఁడయ్యు నెవఁడు మూర్తామూర్తరూపంబుతో జన్మములనెత్తి తోఁచుచుండు
అక్షరత్రయసంసేవ్యమైన బ్రహ్మమెవఁడు వాఁడె భవత్ప్రష్టమవువిషయము
తాను వచియింపఁగలవాఁడు కాని నాకుఁ దాదృగధికార మింతయున్ లేదు గౌరి;

ఆ॥ అనియిట్లు వచించి హరి యంతర్హితుండగు నంతలోన నచటి కతిరయమున
సార్వకామికముగ సంచరించు విమానవరముమీఁద నెక్కి వచ్చె శివుఁడు. ౨౧

ఆ॥ సకలభూతసంఘసహితుఁడై శివుఁడట్లు వచ్చుటయును హైమవతి స్వకీయ
సఖులయెదుట నతని సత్కృతుఁ గావించె జకప్రపాణి మిగుల సంస్తుతించె. ౨౨

ఆ॥ సంస్తుతించి యిట్లు శంకరు మెయి లయాంబగుడు నతఁడు వ్యోమయానమందె
యుండి "తృప్తిపడితి నో గౌరి! నీయెడ. మంతనమున కేగి మతివచింతు" ౨౩

కం॥ అనిపలికి యామె కరమును దనకరమునఁ బట్టుకొని ముదమున విమానం
బున నుంచుకొని రయంబున బొనరిచె దూరప్రయాణమును శంభుఁ డటన్ ౨౪

॥ వివిధధాతుమయములౌ వివిధగర్వ విచిత్రితంబులు సౌధరాధశతములు
భూరిప్రవాహసంపూర్ణమానంబులై కొమరారుచుండెడి గొప్పనదులు
కోకిలసముదాయకూజితయుతములై ప్రీతి నింపెడి పెద్దపెద్దపొదలు
సౌగంధికాదికసరసీరుహములను తావయి వెలయు సరోవరములు
వ్రీహిగోధుమయవముఖ్య వివిధసస్యచితములై వెలుగొందెడి క్షేత్రములును
ఘనతరారామములు దేవధామములును క్రమక్రమంబుగ వారిదాటి క్రమించి ౨౫

సీ॥ కుసుమితంబైయుండు కొండగోగులతోడ రమణీయకోవిదారములతోడ
తారాపథవ్యాప్తతాళతరువులతోడ ధరణిఁగప్పిన నేల తాడ్లతోడ
ఫలభారమునవీఁగు పనసమ్రాఁకులతోడ హానణించునలప్రియంగువులతోడ
సకిసలయంబులౌ వకుళశాఖులతోడ విమలమౌ తిలకవృక్షములతోడ
కాముకులతోడఁగూడిన ఘనవనములు దాఁటి చనిచని యట జహ్నుతనయదరిని
స్వర్ణవర్ణమృగద్విజసంకులమును స్వర్ణమయమును స్వర్ణభూస్థమునగుచు ౨౬

కం॥ ఫుల్లంబై విలసిల్లెడి తెల్లఁదనము సరిగ నిలిపి ప్రీతి విమానం
బిల్లాలి కచటనుండియె యుల్లాసముతోడ నొక్కటొక్కటిగాఁగన్. ౨౭

తే॥ తత్తటస్థులు నూర్ధ్వరేతస్కులునగు మునుల పెక్కండ్రదగ్రియాశ్రమంబులనుజూచె.
చంద్రపత్నులు కృత్తికలందు గూడి శుభ్రవస్త్రితలై సేవచూడఁబడిరి. ౨౮

కం॥ వారలు కరములు మోడిచి గౌరింగని "తనయుం గోరుకుఁగా నేగదరి
స్థైరమ్మమీర. లడుగొందుమారుఁడు భగవద్దృష్టిమార్గమునఁబడెన్" ౨౯

చం॥ అనుటయు గౌరి వారిఁగని "యింతటిభాగ్యము నాకు లేదు. కా
వున నెటు లస్మదంకమునఁ బుత్రుఁడెక్కుడు? భాగ్యహీనతన్
జనములకెప్పుడుండదిల సౌఖ్యము. పుత్రకశబ్దహీనియున్
వినిచితిరీర. లేటికిటు వేడుక వచ్చితిరో వచింపుఁడీ" 30

ఉ॥ నావుడు దేవి మంతనమునన్ మనమొండొరులున్న దాఁపు డి
చ్ఛావిహృతిన్ సఖీజనులు! సల్పెడు హాస్యము లంతెకాని మీ
కీవడికాదు తాదృశ. మీకెంతయు సత్యమె చెప్పెద"న్న రా
జీవదళాక్షుఁజాలుగురు చేతులు మోడిచి భక్తినమ్రలై 3౧

కం॥ నిజమే వచించుచుంటిమి రజనీశ్వరశేఖరవధూ! శరస్తంబంబుం
బ్రజమునను నడుమ మనాసుతు నిజహస్తములను గ్రహింపు నీ"వనియనుదన్ 3౨

# చందాదారులు

౧ దండెంరాజు లక్ష్మీనరసింహంగారు పిడుగురాళ్ల
౨ చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు గుడివాడ
౩ తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు చందోలు
౪ మారేపల్లి పిచ్చయ్యగారు, వసిష్ఠవేదాధ్యయన పాఠశాలా సంపాదకులు అమరావతి
౫ సెనగవరపు శేషగిరిరావుగారు కోవాపరేటివ్ ఇనస్పెక్టరుగారు
౬ తంగెడ వెంకటనారాయణరావుగారు,కరణం తంగెడ [గుంటూరు
౭ గుండు శేషయ్యగారు పోస్టుమేస్టరు చేటపర్రు
౮ కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు భాస్కరాచార్యులు ఏలూరు
౯ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తెలుగుపండితులు,సికింద్రాబాదు
౧౦ వేలేటి రాఘవశాస్త్రిగారు, మిడిల్‌స్కూలు టీచరు హైదరాబాదు
౧౧ సి. విఠ్ఠలరావుగారు దివాన్ దేవిడి హైదరాబాదు
౧౨ చతుర్వేదుల ధర్మారావుగారు, అకౌంటెంటు పోలీసు డైరక్టర్ [జనరలాఫీసు హైదరాబాదు
౧౩ రాఘవరావుగారు మునగాల
౧౪ లక్ష్మణరావు, దేశపాండ్యాగారు మల్లేపల్లి
౧౫ జూపూడి నారాయణరావుగారు, ఆక్టింగుకరణం గడిపెద్దాపురం
౧౬ ఇంగువ రామయ్యగారు భువనగిరి
౧౭ మైలవరం కృష్ణమూర్తిగారు కంట్రాక్టరు యేలూరు
౧౮ రాజా విక్రమదేవవర్మగారు విశాఖపట్టణము
౧౯ దంటు లక్ష్మీకాంతరావుగారు సుద్దపల్లి
౨౦ లోకుర్తి రాఘవాచార్యులుగారు, సెక్రెటరి, కేశవ వాచకాలయము కోడంగలు
౨౧ తోటపల్లి శేషయ్యగారు, సభాపతి కోయలకొండ
౨౨ జొహాన్సీ వెంకయ్యగారు మునికొండ
౨౩ చిప్పకుల వెంకటాచలశాస్త్రిగారు సికిందాబాదు
౨౪ పులిచి రామయ్యగారు పేరికలపూడి
౨౫ కొండా భోగిభూషణరావుగారు చినకోండ్రుపాడు
౨౬ శ్రీగిరిరాజు రాఘవయ్యగారు గుండ్లపల్లి

౨౭ లెటరరి అసోసియేషన్‌వారు కాకినాడ
౨౮ గుంటుపల్లి పేరయ్యగారు కరణం చెన్నుపల్లె
౨౯ కంచిరాజు లక్ష్మీనరసింహంగారు వకీలుగుమస్తా కడప
౩౦ వేలమూరి వెంకటసుబ్బారావుగారు సబ్‌జడ్జి బరంపురం
౩౧ పట్టాభిరామస్వామిశాస్త్రిగారు భాస్కరపంతులు బళ్లారి
౩౨ పిల్లుట్ల లచ్చిరాజుగారు రివిన్యూయినస్పెక్టరు ఏనుగుపాలెము
౩౩ బి. వి. నంజుండయ్యగారు బెంగుళూరు
౩౪ ఇంద్రకంటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కర్నూలు
౩౫ లక్కరాజు గోపాలరావుగారు తెనాలి
౩౬ పెద్దిభట్ల కామేశ్వరరావుగారు దుగ్గిరాల
౩౭ లంకా వెంకటనారాయణగారు పందిరిపాలెం
౩౮ వనం సీతారామశాస్త్రిగారు జటప్రోలుసంస్థాన విద్వాంసులు
౩౯ ద్రోణా సోమయ్యగారు సర్వవరము
౪౦ భువనగిరి కోదండపాణిగారు ఆ॥ జిల్లారిజిస్ట్రారు నెల్లూరు
౪౧ రాయప్రోలు వెంకటరామసోమయాజులుగారు ప్రొఫెసరు
నైజాంకాలేజి హైదరాబాదు
౪౨ కొండపల్లి జానకిరామయ్యగారు రేగులగడ్డ
౪౩ కొండుభట్ల గోపాలకృష్ణయ్యగారు వకీలు నర్సారావుపేట
౪౪ గొడుగుల నారాయణమూర్తిగారు కొప్పర్తి
౪౫ భాగవతుల యజ్ఞన్నావధానులగారి కుమారుఁడు సూర్యనా
యణగారు కొల్లూరు
౪౬ దివాకరుని కుటుంబశాస్త్రిగారు దుగ్గిరాల
౪౭ భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజులుగారు, సబ్‌కోర్టు బెంచి
క్లార్కు గుంటూరు
౪౮ తిరుక్కోవళ్లూరు చక్రపాణిగారు, డిష్ట్రిక్టకలెక్టరాఫీసుక్లార్కు
నర్సారావుపేట
౪౯ జంకా వెంకటసుబ్బారావుగారు, బియే బియల్ ప్లీడరు గురిజాల
౫౦ లంకా సుందరరామశాస్త్రిగారు అంబాపురం
౫౧ భమిడిపాటి సుబ్రహ్మణ్యంగారు పెదపులివఱ్ఱు
౫౨ దివాన్‌బహాదరు దురిశేటి శేషగిరిరావుగారు, బియే బియల్
౫౩ వ్యాకరణం వెంకటేశ్వరావధానిగారు తాళ్లూరు [కాకినాడ

సంపుట ౨౨ { ప్రమోదూత నామ సం॥ మార్గశీర్ష మాసము. } సంచిక ౯

# కృతివిమర్శనము.

పల్నాటివీరులు — గ్రంథకర్త సతీరత్నములు చరిత్రకథామంజరి మానసోల్లాసినీ కథలు మొదలగు పుస్తకముల రచించిన శిష్ట్లా రాధాకృష్ణయ్యగారు. దీని వెల 0-6-6. ఏతద్గ్రంథకర్త బాపట్ల తాలూకా మంచాళ్ళ గ్రామనివాసి. ప్రకృతము పల్నాడు తాలూకాఫీసుగల గురిజాలలో స్కూలు మేష్టరుగా నున్నాఁడు. ఈయన యిదివఱకే గ్రంథరచన కలవాటుపడియున్నవాఁడగుటఁ బల్నాటికివచ్చి వీరులచరిత్ర విన్నదాది తద్విషయికమగు గ్రంథము తాను నొకటివ్రాసి దాని స్కూలుపిల్లల కుపయోగించునట్లుచేసి తన్మూలమున యశోధన సమార్జనము గావింప నభిలాషవొడముటయుఁ బల్నాటివీరులను నీ పొత్తము వ్రాసి యచ్చొత్తించెను. అనవు డనపోతుడు మున్నగునవి యెక్కడనో యొకటిరెండుతప్ప దోషము లిం దంతగాఁ గానఁబడవు. భాషాచరిత్రాభిమానుల కందఱకు నుపయోగించుగ్రంథమే యయినను విశేషించి విద్యార్థుల కుపయోగపఱచుటయే తనయుద్దేశముకావున సంధులు విడఁదీసియు దీర్ఘసమాసములను దీర్ఘాన్వయములను జేర్పకయుఁ జిన్నచిన్నపదములతో నక్కిరాజు, ఉమాకాంతముగారు పల్నాటివీరులకథలంబోలె రాధాకృష్ణయ్యగారీగ్రంథమును జక్కఁగనే వ్రాసిరని యస్మదభిప్రాయము. ఏతచ్చరిత్రలేఖనమున కాధారముగాఁ దీసికొన్న గ్రంథములలో నాంధ్రులచరిత్రముగూడ నొక్కఁడని గ్రంథకర్త

యుపోద్ఘాతమున వ్రాసికొనియున్నాఁడు. అందుననే కాంబోలు "బ్రహ్మనాయఁడు ... హిందూదేవాలయములలోనికి ... పంచముల రావించుచుండెనని సాహసించి వ్రాసి తన సనాతన ధర్మవైముఖ్యమును సంస్కారప్రియత్వమును బ్రకటించుకొనియెను. ఆంధ్రుల చరిత్రమును వ్రాసినట్టియుఁ జాలకాలమునుంచి సంఘసంస్కర్తనని యనుకొనుచున్నట్టియుఁ జిలుకూరు వీరభద్రరావుగారు సహితము "బ్రహ్మనాయఁడు ... మాలలకు ... సపంక్తిభోజనము ... గలుగఁజేసెననియె వ్రాసెనుగాని దేవాలయములలోనికిఁ బంచముల రావించుచుండెనని వ్రాయలేదు. తాను వ్రాయనియంశములఁ దసగ్రంథ మాధారముగఁ దీసికొన్న యాయన వ్రాసినట్లే వీరభద్రరావుగారుగూడ వీరచరిత్రమునఁ జెప్పఁబడని విశేషముల విలిఖించియున్నవారు. ఇట్లొకరికంటె నొకరి కూహాలు పెరిఁగినకొలఁది నప్రమాణపు వ్రాఁతలు వ్రాసి యనభిజ్ఞుల నమార్గమునకు లాగుచుండిరి. మాడుగుల బ్రహ్మారెడ్డి బ్రహ్మనాయఁడు మొదలగువారికి విందుచేసిన సందర్భమందున్న "గోసంగికన్నమ గుణములకుప్ప, తనయిచ్ఛయగుచోటఁ దనరఁగూర్చుండు"నను వీరచరిత్రలోని పంక్తులు పుచ్చుకొని నాయఁడు కులభేదమును బాటింపక చండాలురతో సపంక్తిభోజన మాచరించినట్లు రావుగారు నిర్ధారణచేసిరి. ఇచ్ఛయగుచోట నన్నమాత్రమున నాయని నానుకొని యతనిపంక్తినే కూరుచుండెనని యెట్లర్థమగునో బోధపడదు. ఇవతలికి రమ్మన్న నిల్లావరించుకొనిన ట్లిట్టివాక్యములఁ గైకొని విమతస్థులుచేయు నర్థము లీదృశములు. ఇఁక "పరమపావనమూర్తి బ్రహ్మనాయనికి ... జ్యేష్ఠపుత్రుఁడనంగఁజెలఁగినవాఁడఁ, బుట్టితి వావెన్క"నని కన్నమదాసుఁడు బాలునితో నుడివిన నుడువులనుబట్టి బాలుఁడు జనింపకపూర్వము నాయనిచేఁ గన్నమ పుత్రభావమునఁ బెంపఁబడినట్లు స్పష్టపడుచున్నదఁట. ఆజ్యేష్ఠపుత్రత్వమును "నాయఁడు విష్ణువు నారాయణుండు, ప్రకట

దయాంబుధి వరముఁ బ్రసంగె, తగ జనించితి నేను దల్లిగర్భమున" నని కన్నమయే పై పంక్తులలో వివరించెను. ఈ యర్థమును ముదిగొండ వీరభద్రకవి తన వీరభాగవతములోని

కం॥ "తెప్పలి నాయఁడనంగా నొప్పు సమగ్ర ప్రతాపు నుదుబలుఁడని రా
జెప్పుడు మన్నించును. పైఁ గప్పిన కులమేమి? బలము గలిగినఁ జాలున్

సీ॥ ఆ పినాకీ క్షితికులజుని యగ్రమహిషి.
ధర్మగుణసీమ పతిదేవతాలలామ
అఖిలకల్యాణగుణధామ మఘవిరామ
దళితదుష్కర్మకామ మాతంగభామ.

కం॥ చేడియ బుద్ధిమతియై పతిఁ జూడక మాఘస్నానోత్కంఠ సిద్ధితపో
తోడుగ వసించి నాల్గవనాఁ డుదకములాడి కోరె నాథునిఁ జూడన్.

కం॥ ఆతని బ్రహ్మనాయుం డే తీరఁగ దైవఘటన మిదియని సంతో
షాతిశయంబునఁ జేతఃప్రీతి మెయిం జూచె సుందరీమణి తొలుతన్.

వ॥ తదనంతరంబ

కం॥ తొల్లిటివలెఁ బతితో నప్పల్లవమృదుపాణి పంచబాణాగమధ
ర్మోల్లాస మొప్ప రతులం గొల్లగ నోలాడెఁ దనదుకోరిక దీరన్.

కం॥ ఆనాటి దోహృదంబుం బూని సులగ్నమునఁ గేంద్రమున
గురుఁడుండన్
సూనుంగనెఁ బ్రాగ్దిక్సతి భానుంగనుపగిది నెల్లబాంధవు లలరన్.

కం॥ కన్నసుతుఁ జెన్నిధానముఁ
గన్న దరిద్రవతివోలెఁ గనుగొని యిఁక నా
కన్న సుభాగ్యలు లేరని
కన్నమనీఁడనెడు పేరు గావించె దయన్.

కం॥ కన్న మమతాదిగుణములకన్న విశేషంబుగాఁగఁ గరమొప్పిన కీ
ర్తిన్నలఁ జూచెను నాయఁడు కన్నమనీనిన్ విధూతకర్మజ్ఞానిన్.

కం॥ అహీరుండును నాయని భావించుం దనదుమదిని బ్రహ్మాత్మునింగా
పావని రాముంగొల్చిన భావంబున నహరహంబు భక్తిస్ఫురణన్.

అను పద్యములలోఁ దేటపఱచియున్నవాఁడు. ఇట్లు సేవకుఁడగుటఁ బుత్రవాత్సల్యమునఁ జూడఁబడిన వానరునిఁ బెంచుకొనె ననియు యుద్ధసంబాధమున నెచ్చటనో భుజించినంతమాత్రమున నంత్యజులతో సహపంక్తిభోజనము చేసెననియు నభిప్రాయపడి స్వాభిలషిత సర్వవర్ణ సాంకర్యమునకు ముడివెట్టుకొనుట యెంతయు గర్హ్యము. జీతమున కుంచుకొనిన చండాలురఁ బుత్రభావముతోఁ జూచు పురుషశ్రేష్ఠు లెందఱు లేరు? వనభోజనాదులలో దృష్టిదోషాదుల గణింపక తక్కువ జాతులవారినిగూడఁ దమతో భుజించు కాలముననే భుజింపఁజేయు బ్రాహ్మణు లెందఱు లేరు? దేశకాలానుగుణముగా ధర్మమును సంకుచితము చేయుచుండుటకు స్మృతికారులుగూడ నభిమతించియే యున్నారు. ఈప్రకారముగ జరిగియున్న పూర్వసంగతులు గోరంతలు కొండంతలు చేయుటవలన నచ్చులాభ మేమియు లేదు. ఇట్టి వ్రాఁతలఁ బ్రమాణముగాఁ జేసికొని పరిష్కృతగ్రంథకర్తయగు రాధాకృష్ణయ్యగారు చండాలుర హిందూదేవాలయములలోనికిఁ దీసికొని రాఁజూచుట విచారకరము. ఇచట వ్రాయవలసిన విశేషము లింకను ననేకము లున్నను గృతివిమర్శనమగుట నింతతో విరమింపనైనయది.

---

## ధార్మిక ప్రార్థనీయ ప్రభుత్వము.

( శ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థాన పండితులు
మల్లాది రామకృష్ణ చయనులుగారు )

సృష్ట్యారంభమున నియామకుండగు ప్రభువు లేమిం జేసి జనులు స్వేచ్ఛానుసారులై ధర్మోల్లంఘనముఁ జేసిరి. తన్మూలమునఁ దన ధనమనియుఁ దన స్త్రీయనియు వ్యవస్థయే దుర్లభమైనందున జను లిహపరసుఖభ్రష్టులైరి. అప్పుడు శాస్త్రానుసారముగా నాయాజనులచే

వర్ణాశ్రమధర్మముల నడిపించుచుఁ దన్మూలమున జనుల కిహపరసుఖ
ముల ఘటింపఁజేయుటకై రాజు పరమేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడెను.
శ్లో॥ అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః॥ అష్టదిక్పా
లకులయొక్కయు నంశములచే రాజు నిర్మింపఁబడెనని మనువు చెప్పెను.
శ్లో॥ నరాణాంచ నరాధిపం॥ మనుష్యులలో రాజును నన్నుఁగా భావిం
పవలయునని శ్రీకృష్ణుఁ డుపదేశించెను. ఇట్టివిషయమున ధార్మికులు
రాజును ద్వేషించుట ధర్మవిరుద్ధమగును. జనుల వోట్లనుబట్టి యధిపతి
నెన్నుకొనిన నతనిద్వారమునఁ బరిపాలనము జరుగుననుటయు సరి
కాదు. శాస్త్రజ్ఞానముగాని లోకజ్ఞానముగాని లేని జనులు బహుసం
ఖ్యాకు లుందురు. విజ్ఞులు మితసంఖ్యాకు లుందురు. అల్పజ్ఞానులు
నియమించిన పద్ధతులకే పండితులును బద్ధులుకావలసివచ్చును. దాని
వలన సంఘమున కనర్థమే కలుగును. కనుకనే సర్వజ్ఞులగు మహర్షులు
పరిపాలనవిధానమును వర్ణాశ్రమధర్మములను స్థిరములైన శాసనము
లుగాఁ జేసిరి. దానంజేసియే సృష్ట్యాదినుండి కొలఁదికాలముక్రిందటి
వఱకును జనులు స్వస్థచిత్తులై తమతమకృత్యముల నెఱవేర్చుకొనుచు
సుఖితులై యున్నవారలు. ఇప్పుడు మన భరతఖండమునకు సంభవిం
చిన యనర్థమును సూక్ష్మదృష్టిచేఁ బరికింపఁదగియున్నది. విదేశీయుల
శిక్షవలనను దద్వాసనావాసితుల పత్రికలచేతను వారి యుపన్యాస
ములచేతను భారతవర్షీయుల చిత్తములు కలుషితములై శ్రుతిస్మృతి
విహితధర్మములందు సందేహపూరితములైనవి. విదేశీయవాసనావాసిత
చిత్తులు నూటి కిరువదిమందికంటె నధికసంఖ్యాకులు లేరు. అయినను
రాజభాషావిదులుగనుక రాజకీయవ్యవహారములందు వారే పరిగణితు
లగుదురు. తక్కినవారలు వేదశాస్త్రములందును లోకజ్ఞానమందును
బరిపూర్ణులైనను దొరతనమువారి దృష్టిలో మనుష్యులుగాఁ గనఁబడుట
దుర్లభము. రాజకీయవిద్యాగౌరవముచేతఁ బామరజను లట్టి ధర్మ

విధ్వంసకులకే వోట్లనిత్తురు. అట్టివోట్లమూలమున శాస్త్రవిశ్వాసములేని ధర్మవిధ్వంసకు లెసంబ్లీ మొదలగు శాసనసభలలోఁ బ్రముఖులై జనుల నందఱను బాధించునట్టియు, ధర్మమును మొదలంట నశింపఁజేయునట్టి యు శారదాశాసనము మొదలగు ననర్థదాయకములైన చట్టములఁ జేయించుచున్నారు. ఇవియంతయు వోట్లమూలమున సంభవించిన యనర్థము. కనుక నిట్టిపద్ధతి ధార్మికులకు గ్రాహ్యముకాదు. శతాంధాః కూపం ప్రవిశంతి యనినట్లు వివేకు లెందఱు వోట్లనిచ్చినను నది ధర్మముకాఁ రదు. జనుల బుద్ధులకు గ్రాహ్యములు కాఁదగిన ప్రాపంచికవిషయ ములందు మహాజనుల యభిప్రాయముల నపేక్షించుట యవసరము గనుక నట్టి విషయములను వోట్లనుబట్టి నిర్ణయించినను నతీంద్రియార్థే శ్రుతిరేవ మానం, అనుపలబ్ధార్థే తత్ప్రమాణం బాదరాయణస్య యను శాస్త్రముప్రకారము వేదమునుబట్టియుఁ దదనుయాయులగు స్మృతిపురాణములఁబట్టియు నిర్ణయింపఁదగిన వర్ణాశ్రమ ధర్మములను దనుష్ఠానకారణమగు వివాహవయోనియమములను వేదశాస్త్రవిద్వే షులగుచు వాని ప్రామాణ్యము నెఱుంగని యార్యసామాజికులు బ్రహ్మసామాజికులు మొదలగు మెంబరుల సంఖ్యాధిక్యమునుబట్టియుఁ వారి యభిప్రాయమునుబట్టియు నిర్ణయించి దానిని జట్టముగాఁ జేయు టకంటె దుష్కార్యము వేఱొకటిలేదు. సున్నతులు చేసికొనవచ్చునా కూడదా యనుసంగతియుఁ గురానులోఁ జెప్పిన నియమముల నవలం బింపవచ్చునా కూడదాయను సంగతియు భరతఖండమున నధికసం ఖ్యాకులగు హిందువుల వోట్లనుబట్టి నిర్ణయించుట న్యాయ్యమగునా? కాదు. ఆ విషయము నామతమందు నమ్మకముగల ప్రముఖులగు యవన పండితులకే వదలివేయవలయును. అట్లనే వివాహవయోనిర్ణయ మును దాయభాగమును విగ్రహారాధనమును నస్పృశ్యస్పర్శనిషేధ మును వేదశాస్త్రములందు నమ్మకముగల మహాపండితులకును మతా

చార్యులకును వదలివేయవలయును. పూర్వము భరతఖండమును బరిపాలించిన హిందూచక్రవర్తులును మహమ్మదీయచక్రవర్తులును మతశాసనముల నిర్ణయమును మతాచార్యులకే వదలివేసిరి. శ్రీ శృంగగిరి పుష్పగిరి కామకోటి విరూపాక్షము మొదలగు సద్వైతపీఠములును బరకాలాహోబలప్రభృతి విశిష్టాద్వైతపీఠములును నుత్తరాదిమఠము వ్యాసరాయమఠము మొదలగు మధ్వపీఠములును నిట్టి ధర్మపీఠములు. ఘనతఁజెందిన విక్టోర్యాచక్రవర్తినిగారును మతధర్మములందు జోక్యముపుచ్చుకొనమను నానియమమునే పరిపాలించిరి. దొరతనమువారు మీహిందువులే బహుసంఖ్యాకులు కోరినందున నీచట్టమును ప్యాసు చేసితిమని యనఁజెల్లదు. వీరు హిందువులని యెంచెడి మెంబర్లు హిందువుల కుటుంబములలోఁ బుట్టిరేకాని ద్వీపాంతరస్థులకు మానసపుత్రులు. వేదశాస్త్రసిద్ధమగుసనాతనధర్మమునకు శత్రువులు. ఆంగ్లేయులకు హిందూధర్మములందు ద్వేషము కనఁబడదు. మతాంతరస్థులు గనుక వా రాచరింపకపోవుట దోషముకాదు. దొరతనమువారు మన దేవాదాయములను నేఁటివఱకుఁ జక్కఁగా నడిపించుచున్నవారలు. ఇప్పటిమెంబరులకో తఱచుగా నేమతమందునను నమ్మకములేదు. గ్రాసవాసఃప్రభృతి గ్రామ్యసుఖములకొఱకుమాత్రమే పాటుపడువారలు. కేవల నాస్తికులు. వీరిని జనులు మతధర్మముల మాన్పుటకై వోట్ల నిచ్చి యెన్నుకొనలేదు. పన్నులు తగ్గించుట, కాలువలు రోడ్లు మొదలగు సౌకర్యములు కలుగఁజేయుట యను నంశములను రాజసభలలోఁ బ్రస్తావించుటకుఁ బ్రతినిధులుగా నుండుటకు వోట్లనిచ్చిరి. ఆపనులు వీరిచేతఁగాకయు నూరకుండుటకు రుచింపకయుఁ బనిలేనిమంగలి పిల్లి తలగొఱిగినన్నట్లు ధర్మహానికరములగు బిల్లులు తెచ్చిపెట్టిరి. ప్రాజ్ఞులగు దొరతనమువారీనిజమును గ్రహించియుఁ బరస్పరభేదముకలుగ నున్నను వారి ననువర్తించినట్లు నటించుచున్నవారు. ఏదియెట్లునై

నను రాజభక్తిపరులగుచు రాజును దేవునిగా భావించెడి సనాతనధర్మపరులకు శారదాశాసనము మొదలగు ధర్మవిధ్వంసకములగు చట్టములమూలమున రాజవిద్వేషమును బుట్టించుట ఘోరకృత్యమని దొరతనమువారికి సవినయముగా మనవిచేయక తీరదు. ఎవరెన్నివోట్లనిచ్చినను వానిని సరకుగొనక యాయామతములవారికొఱకు వారివారి ప్రమాణగ్రంథములకు విరుద్ధములగు చట్టములఁ జేయకుండుటయే ధార్మికప్రభుత్వమునకు లక్షణము. మతధర్మములందు నమ్మకములేనివారు తా మాచరింపకపోవచ్చును. సంఘమునను మతిసహజముపక వేఱుగానుండవచ్చును. వేదశాస్త్రవిశ్వాసముగల జనులచే శాస్త్రవిరుద్ధములైన పనుల నిర్బంధపూర్వకముగాఁ జేయించుటకుఁ బాపాత్ములుఁ తలపెట్టినను దీనికి దొరతనమువారు సమ్మతించుట కేవలానుచితము. ఇహలోకమున జనుల యోగక్షేమములకుఁగాని పరలోకసాధనములగు ధర్మశాస్త్రనియమములకుఁగాని నష్టిఁగలుగఁజేయక పరిపాలించు నెడల నేదేశమువారైనను నేమతమువారైనను సనాతనధర్మపరులకు వారియం దెట్టియనాదరమును లేదు. అట్టిప్రభువును బరమేశ్వరుఁగానే భావించెదరు. దుష్కాలపరిణామముచేతఁ బ్రభుత్వ మట్టిది కానియెడలఁ బ్రభువునకుఁ బ్రభువగు సర్వశక్తుఁడగు పరమేశ్వరుని బ్రభువును న్యాయ్యముగాఁ బరిపాలించునట్లు చేయుమని ప్రార్థింతురు. ధార్మికు లేసత్కార్యముఁ జేసినను నంతమందు స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాయనియే ప్రార్థింతురు. లోకులకు మేలుకలుగుఁగాక, రాజులు ధర్మమునఁ భూమిని బరిపాలింతురుగాకయనియే నిజభావము. బాల్యవివాహమువలన సంతానము దుర్బలమగునుగాన జనక్షేమమునకై మేమీ చట్టమును జేయించితిమని నవనాగరికు లందురు. అది సరికాదు. నేఁటివఱకు భరతఖండమం దుద్భవించిన శూరాగ్రేసరులును మహాపండితులును

బాల్యవివాహితులకుఁ గలిగినవారలే. కనుక నిట్టి యుక్తులన్నియు హేత్వాభాసములు. కాంగ్రెసునాయకుల ప్రబలప్రయత్నములఁబట్టి భారతీయులకు స్వరాజ్యము వచ్చినను వారును వేదశాస్త్రసిద్ధములైన నియమముల నుల్లంఘించి పరిపాలింపఁదలఁచినయెడల వారలును సనాతనధర్మపరులకుఁ బ్రబలశత్రువులే యగుదురు. వారికిఁ బరాజయము కలుగుటకొఱకే వీరుఁ బరమేశ్వరుఁ బ్రార్థింతురు. ధర్మము హతమైన యెడల ధర్మహంతలును హతులగుదురు. కనుక నేమతమువారి నా మతధర్మములకు బాధకలుగకుండునట్లు పరిపాలించెడి ప్రభుత్వమే ధార్మిక జనప్రార్థనీయము.

---

శ్రీమదభినవ విరూపాక్ష పీఠాధిపతులు చిదానంద నృసింహ భారతీస్వాములవారి యాగమనము.

( కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు. )

శ్లో॥ యదీయగీతా పరిబోధనా జ్జనా
ముముక్షుతాం యాంతి సదేశికాగ్రిణేః
జయే చ్చిదానందనృసింహభారతీ
యతీశ్వర శ్శాంతమనా అనారతమ్.

సీ॥ పరగు హంపియను దివ్యక్షేత్రి మొక్కండు
వెలయు విరూపాక్ష పీఠ మచట
గలదు, తదీయశాఖాపీఠమై యొప్పి
యభినవ శ్రీవిరూపాక్షపీఠ
మందు, శ్రీమచ్చిదానంద నృసింహభా
రతు లతిసౌమ్యులు, యతివతంసు
లనవధికోపాసనా త్తదేవీప్రసా
దులు విధియుక్త పూజలను సల్పు

గీ॥ నియమశాలులు, మిగుల రెంతేని శనుము
పట్టుగొమ్మ లాస్వాములవారు జగతిఁ
బాగడుగనుచున్న వేలూరు నగరమునకు
శిష్టచిత్తంబు లలర విచ్చేసినారు. 2

మ॥ నవరాత్రోత్సవ నిష్ఠ్వారిన్ జరిపి యా ♦ నందంబుఁ జేకూర్పు మం
చు వచింపన్ విని, శ్రీజగద్గురు మన ♦ స్సుం దస్సుఁగా నెంచి, మి
త్రివతంసుల్, స్వీయశిష్యు లర్యజను తే ♦ తత్కార్యనిర్వాహక
త్వవిధం బర్మిలిఁజూపనే స్థిరను పి ♦ శ్వాసంబునం బూనితిన్. 3

శా॥ నాపూన్కిన్ సఱవేర్పఁజూపుఁ డనినన్ ♦ దాతల్, సుదీనాస్యులై
వ్యాపారంబులు లేవు, పెక్కుగతులం ♦ బాటిల్లె నష్టంబు లే
మీపట్లన్ భవదీయ వాంఛితము నె ♦ ల్లీడేర్ప మంచుం బరీ
తాపంబుల్ మఱి నొందు రెంతయు నిజౌ ♦ దార్యంబు దీపింపఁగన్

చ॥ సరసులు పల్కు రీగతి, ని ♦ సర్గవదాన్యతఁజూపి పల్కియుఁ
గరముఁ దపించుచుం బ్రకృత ♦ కాలపరిస్థితిఁబట్టి మారుపుల్
పొరిఁబొరిగల్గినన్ విమల ♦ బుద్ధులు సుప్రియమిత్రు లార్య లా
దరమునఁ గార్యపూర్తికగు ♦ ద్రవ్యమొసంగి రనేకభంగులన్. 5

సీ॥ వర్తకబృందంబు స్వాంతముల్ నొవ్వని
రీతి విత్తము సేకరించి తెచ్చి
స్వాములవారికి సవినయంబుగ సమ
ర్పించితి వారు సంప్రీతిఁ జెంది
కలశంబు స్థాపించి కలకల నవ్వమొ
గమ్మంతో మూఁడు కాలమ్ములందు
విధిపూర్వకముగ దేవి పూజలను చేలు
విప్రభోజనములు విబుధు లెన్న

గీ॥ సముచితంబుగ నెరపిరి జనుల కెపుడు
మంచిచెష్టలఁ దెలుపు ధర్మమ్ములెల్లఁ
జెప్పి మను చిదానందనృసింహభార
తులకు, నతుఁడనై నతిశతంబుల నొనర్తు. 6

సీ॥ సుశ్లోకతఁ గామించు సుమనోగణమ్ముచేఁ
బూజింపఁబడు పుణ్యమూర్తి విప్ర
రాజరాజేశ్వరీ పూజనాలోలుప
చిత్తాంబుజుఁడవై వెలఁగు దీప్త
విగత కల్మషుఁడవై విమలయశ్శాలఁ గారోసి
విబుధులు గణియింప వెలయు దీప్త
సద్గుణ గరిమయన్ శాస్త్రవిఖ్యాతిని
గంటి కామజయంబుఁ గొంటి విప్ర
సురుచిరబోధనన్ సుమతుల మానస
పద్మంబు లలరించు వలఁతి తనము
శుచివృత్తములని, సుజనులు మెచ్చంగ
నిరతంబుఁ జరియించు నిపుణతంబు
వేదాంత తత్త్వంబు వివరించి, సకల స
చ్ఛాస్త్రాదులకుఁ దెల్పు ప్రౌఢిమంబు
జ్ఞానంబు జ్ఞేయంబు జ్ఞాతయున్ వాని ల
క్షణములు వివరించు కౌశలంబు
సదసద్వివేచన క్షములైన ప్రాజ్ఞులు
సారెకు శ్లాఘించు శాంతిగరిమ
అమృతవాదులను మాయంగనీయక దన్న
దివ్వెలగా నెత్తు దంటతనము
గాసింబడెడువారిఁ గని చాల జాలివ
హించు నీ సదయుఁడన్ మంచితనము
మహనీయ ధర్మమర్మములెల్ల సరవి బో
ధింపఁగ నేర్చిన ప్రజ్ఞతనము

## అందఱును బాధపడిన హిందూదేశమునకుఁ గతి లేదు.

( శ్రీ గృహస్థులైన మాచ చిన వెంకయ్యగారు )

ఆయ్యలారా !

తే॥ భరతవర్షంబు చక్కని పాడియావు
హిందువులు లేఁగదూడలై యేపుమీఱ
తెల్లవారను గడుసరిగొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.

అను భరతవాక్య మొండు వందేమాతరమును మొదటిదినములలో మనవారు ప్రతినోటఁ బాడినపాటగాఁ బాడుచుండిరే కాని దానికిఁ బ్రతిక్రియగా మనమేమి చేయవలెనో తెలిసికొనలేని స్థితియందున్నారని యిదివఱకు హిందూదేశదురదృష్టమను వ్యాస మభినవ సరస్వతిలోఁ బ్రచురించియుంటిని. తదనుగుణముగా నిపు డీవ్యాసముఁ బ్రకటించినందులకుఁ జదువరులు దేవుఁడు గలఁడనెడి యాస్తికబుద్ధితోఁ బఠించి కార్యాచరణమునకుఁ గడంగుదురుగాక.

శ్లో॥ పంచమేహని షష్ఠే వా శాకం పచతి స్వే గృహే
అనృణో హ్యపరః ప్రేష్యోహోరాత్రంచ మోదతే.

అను నజాతశత్రుని బోధపరికార మన్నవస్త్రములు లభించినంత నఱకే మనపూర్వులు సంతృప్తినొందుచుండిరి. అయితే "అసంతుష్టో ద్విజో నష్ట స్సంతుష్ట ఇవ పార్థివ" యను నీతిననుసరించి యున్నదానితోఁ దృప్తిలేక రాజులు (భూమినేలువారు) సామ్రాట్టులు గావలెనను కోర్కె (పేరాస)తో నొకరితో నొకరు పోరాడి తమ్మునేకాక ప్రజాసామాన్యమునుగూడ మృత్యువునోటను బెట్టుచుండిరి. ఇందుకుఁ దార్కాణము మొన్నటి జర్మను యుద్ధమే. ఇంకఁ బ్రజాసామాన్యమునకుఁ

మేడలు మిద్దెలు గట్ట నారంభించిరి. దీని కనుకూలముగా "కాఁపు వచ్చినయెడ కఱవువచ్చు" నన్నట్లు కఱవును ధరయు నేర్పడుటచేఁ బంటుకాఁపులకు లభించిన ధన మవసరమైన యితరవస్తువులకే చాలియుం డాలక యున్నను భోగలాలసులను జూచి తామును దేవుని సృష్టిలోని వారమే కాన సమానభోగము లనుభవించు నాశతో శక్తికిమించిన వ్యయము నారంభించిరి. ఇదియే భారతదేశమునకు దేవుని దయతో మించఁగల్గిన దురదృష్టము. ఇట్లే కావేరీనది బొంగళూరు ప్రాంతము నెత్తుపరిదేశమునుండి పల్లమునకుఁబడు కోట నెలిక్ట్రిక్ పవరు కనుగొని దానిని గోలారుగనులలోను బెక్కుప్యాక్టరీలలోను నుపయోగించుట చూచి తాతా (యినుప) కంపెనీవారు జమ్షెడ్పురమువద్ద నొక జల పాతమువలన నెలిక్ట్రిక్ పవరుకనుగొని తమ యినుపపనులు మున్నగు వాని కుపయోగించి తాము బాగుపడి దేశమును బాగుచేయుచుం డిరి. భారతీయులలో మున్ముందు పారశీకులు వారివెనుక మార్వా డీలును మితవ్యయసద్వ్యయములలో నందెవేసినచేతులు.

అయితే దేవునిదయగల కొందఱుభారతీయు లీమితవ్యయ మవ లంబించినను బలువురు "ఋణంకృత్వా ఘృతంపిబే" త్తని యప్పు చేసి పప్పుకూడుదిని యాస్తి గోల్పోయినవారును దండిగ దినమునాఁ డైనను "దలదనుపకున్నఁ దప్పేమి? తడిపినఁ దల్లికిమగఁడ" నని యొప్పుంబెట్టుకొని తాముదినక ఇతరులకీక లోభాగ్రేసరులయినవారు నే. దీనికి ప్రధానుగ్రహాలోపమే కారణమని నమ్ముఁడు. లేకున్న మనదక్షా మజిలీను లయిరోపాదేశమున కంపుట కడచని లాంకషైరు మాంచె స్టరు బట్టల కాశించుకాలము తటస్థించునా? మనదేశపుఁ జెఱకుపం టతోనయిన పంచదారకుబదులు పరదేశపు బీటిదుంపలతీపికొనయిన పంచదార నాశింతుమా? మనదేశమునకు జీవనాధారమైన వ్యవసా యమున కాదికారణమగు నాగలి రాటము మఱచుటచే నింతకఱవేర్పడి

యున్నవస్త్రములకు దూరస్థులమైతిమి. ఇట్లే మనదేశములోఁ బ్రధానములైన యుద్యోగము, వర్తకము, వ్యవసాయము, శిల్పము, కూలి మొదలగునవి బ్రాహ్మణాదులచేఁ బ్రత్యేకము తమ కులవృత్తులుగాఁ గొంతకాలము భావింపఁబడినను నిటీవల నాయావృత్తుల నన్నికులములవారును మిశ్రముగాఁ జేయుచున్నను జాకల మంగల కుమ్మర వృత్తులుమాత్ర మితరు లింతవఱకు నాక్రమింపలేదు. బ్రాహ్మణులు విద్యావంతులై తపోనిరతులై మానసికపరిశ్రమచేయుచు గతవర్తమానభావికాలజ్ఞులయి యితరుల కవి తెల్పుటచే వాని నగ్రహారములనియు మాన్యములనియుఁ బ్రభువు లిచ్చిన భూములవలనను బ్రజాసామాన్య మొసంగిన ధనధాన్యాదులవలనను జీవించుచుండిరి కాన "బ్రాహ్మణస్య ధనం భైక్ష్య" మనియు నుపనయనమునాఁటిమాట యున్నది సుమతీ" యనియు లోకోక్తు లేర్పడినవి. ఇపుడిపు డభిమానవృత్తిలోఁ బలుజాతులవారు ప్రవేశించుచున్నారు. అందు గొల్లభాగవతులు చెంచులు పాములవాండ్రు బుడబుడుకులవాండ్రు దేవరవాండ్రు పరికెముగ్గులవాండ్రు దొమ్మరవాండ్రు మున్నగు పలువురు వ్యవసాయాది వృత్తులవారి నడిగికొని తినుచుండుటచేఁ బెక్కు బీడుభూములు సేద్యముచేయఁబడక యట్లే యుండుటవలనను సేద్యముచేయఁబడిన భూములలోఁబండినపంటయే పై పనికిమాలినజాతుల కాధారము కావలసి వచ్చుట వలనను గొంత కలతవేర్పడినది. ఇపుడిపుడు బ్రిటీషుప్రభుత్వమువారి సాయముచేఁ గొందఱు క్రిస్తవులు (మిషనరీలు) సెటిల్మెంటుల నేర్పఱచి పైనివ్రాసిన పనిచేయనిజాతులవారిలో నెఱుకల యేనాదులను దొంగతనముచే జీవించు వారినిగా భావించి వారిదొంగతనము మాన్పుమిషతోఁ గొన్ని చోటులఁ గూడెములుకట్టి వారిచే బీడుభూములలోఁ బనిచేయించుచు మతబోధఁగూడఁ జేయుచు స్వమత మభివృద్ధి చేసికొనుచుండిరి. ఇయ్యది కొంతవఱకు నీతిదాయకమే. ఈ యెఱుకల

జాతిలోఁ దట్టలల్లుజాతి యొకటి కలదు. వారును మేదరవారివలెఁ గొంత వ్యావసాయికులకుఁ గావలసినవారే. కాని వారివలెఁ జెంచులు బుడబుడ కులవాండ్రు గంగెద్దులవాండ్రు మొదలగువార "లెద్దులున్నన గుఱ్ఱము లు మేయు" నను సామెతగాఁ బాటుపడువారుపండించిన పంటతోఁ డనే జీవనము గడుపుచుందురు. అయితే భిక్షావృత్తికి మార్గదర్శకులు బ్రాహ్మణులేయని నవనాగరికులు కొందఱందురు. కాని బ్రాహ్మణుల భిక్షావృత్తికిఁ గారణము త్రికాలవేదిత్వాదులని ముందే వ్రాసియుం టిని. అట్టి త్రికాలజ్ఞత నశించిన యిప్పటిబ్రాహ్మణు లన్నికులముల తోపాటు శరీరపరిశ్రమాదులు చేయుచునే యున్నారు. కొందఱు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులవద్దఁ బౌరోహిత్యము నపహరించి దాన మిమ్మనియు ధర్మము చేయుమనియు దుర్బోధలుచేసి ధనముగడించి జీవించుచుండిరని యొకనేరము మోపి కొందఱు స్వకులపౌరోహిత్య మని యొకముఠాముంటు బయలుదేరఁదీసి ముల్లు దీసినచోటఁ గొఱ్ఱు గుచ్చినటులఁ దామును గోదాన ధనదానాదు లంగీకరించుచుండు టచేఁ గోడలికి బుద్ధిచెప్పి యత్త ఱంకుఁ జేసినట్లుగాఁ బరిణమించినది. ఇదిగాక పూర్వము ప్రతిజాతికి నొకయాశ్రితుఁడు (కులమును బొగడు యాచకుఁడు) ఉండువాఁడు. వారివారి యాశ్రితులను వారువారు సం పాదించినధనముతో రక్షించెడివారలు. అట్టి పొగడికకూడ నిపుడిప్పు డేవగింపుగా నుండుటచే వారును బాటుపడవలసినయవసర మేర్పడినది. నవనాగరికులలో యువజనసంఘములని కొందఱు బయలుదేరి కమ్యూ నిజమనుపేర నొకయుద్యమ మారంభించి లేబరు (కూలి) జనము నుద్ధ రింతుమనుచుండిరి. ఇదియే నిమ్నజాత్యుద్ధరణమని మఱికొంద ఱను చుండిరి. ఏదియెట్లున్నను రైల్వేకూలీలయు ఫ్యాక్టరీ కూలీలయు సమ్మెలు ప్రస్తుతము బయలుదేరుచుండుటచే నాసమ్మెల నాయకులగు సింగారివేలుసెట్టిమున్నగువారిని గవర్నమెంటువారు జయిళ్ళ కనుపు

చుండిరి. విదేశపు, కంపెనీల పెట్టఁబడిచే నేర్పడిన ఫ్యాక్టరీలును క్రైస్తును హిందూదేశమునందలి విశేషభాగ మాక్రమించుటచే వారి నుద్ధరించుటకై రష్యా బోల్షివిజము నిండియా కేగఁ బ్రోఁదు ననుకారణము చెప్పుచుండిరి. మనలో భూస్వాములుగాని వారును, కమ్యూనిజము కావలెనని చెప్పుచున్నారు. కూలీలుపడుకష్టమువలననే భూస్వామియు ఫ్యాక్టరీయధికారియు లాభమునొందుట యందులకుఁ గారణమందురు. ముందుకుఁబోయిన సూయియు వెనుకకుఁబోయిన గోయియు నను సందిగ్ధావస్థకుఁ బ్రస్తుతపు హిందూదేశస్థితి మాఱినది. రానురా నీకమ్యూనిజము వ్యవసాయపుఁగూలీలలోఁగూడ వ్యాపించుచిహ్నము లగుపడుచున్నవి. ఇంక మదరాసువంటి పెద్దపట్టణములలో సోమరులనొక తెగవారు కుడిచికూర్చుండి యెచ్చటనేని యొకరు పనికారుణ్యము చేఁజేయు నిమ్నజాతిసంతర్పణలకుఁ దయారగుచు పిలుగుచోఁ బరగ్రామస్థుల ముల్లెలుహరించుచుండుట కనులారఁ గాంచుచునే యున్నారము. కానఁ బ్రస్తుతము హిందూదేశము సర్వమానవులశరీరపరిశ్రమ యుండెనేని యచిరకాలములో నభివృద్ధినొందఁగలదని మహాత్మునికిని నమ్మెడు. ఇందులకు సహాయముగా నిజాము మున్నగు ప్రభువులును దమ బీడుభూములు సేద్యమున కనువగులాగునఁ జెఱువులు మున్నగు జలాధారము లేర్పఱచుచుండిరి. కావున నీయన వారును బోరాడకుండ సర్వమానవులును బాటుపడుబుద్ధి యొసంగుటకు సర్వేశ్వరుఁ బ్రార్థించుచున్నవాఁడను.

ఉ॥ పాండవనృపాలు రౌరవులఁ దానిఁక నాయుఁడు రౌద్రమూర్తియై
ఖండనభూమి నీ సకలబాంధవమంత్రిహితాళిఁ బట్టి యు
ద్దండతఁ జెండివైచు నిది తప్పదు. నాయకురాలునున్ సుహృ
త్కాండము వచ్చి యడ్డపడి కావఁగఁజాలరు నిన్నొకింతయున్

తే॥ ఎల్లభోగంబులకుఁ బుట్టినిల్లు గాఁగ
తనరి పసులకుం దగు స్థానమగుచు
పూతమైనట్టి పలనాఁడు భూతలములకు
ఆటపట్టగు నిఁక వేయుమాటలేల.

గం॥ కుత్రా! నీవు గావించిన బహ్వపకారములు నీకెట్లున్నను వినువారికి నిశ్చయముగ నిసుగలిగించుచున్నవి. పిలిచిపిల్లనిచ్చినందులకు నన్నిట్లు తూలనాడనలసినదే. దానికేమిగాని బ్రహ్మనాయుని గొప్పఁజేసి నుతించుచుంటివి. అతనిచరిత్రము నీవంటి యుక్తాయుక్తవిచారణశూన్యులు మెచ్చుకొందురేమో కాని పరిజ్ఞాతలుమాత్రము మెచ్చుకొనరు. ఏటికీనృథాకథారచన ? అట్టిది శ్లాఘ్యులచెవి కెక్కునా ? సరిసరి,

చం॥ ఘనుఁడగునేని నీవ నెడికై పడినాయుఁడు కోడిపందెమం
దున విజయంబునొందఁగల త్రోవ నెఱుంగక యోడు దానికిన్
దన విభవంబునోటునడి తాల్మిదొలంగి యరణ్యవాసమే
ఘనమని యేగి యచ్చటనె కాఁపురముండునె? చింతసేయుమా.

అతనిఘనత యప్పు డెందుఁబోయినది ? పెరుఁగుతోటకూరలోని పెరుఁగుమాడ్కి నాయునియందు బ్రహ్మశబ్దము వర్తించుచున్నదని యెఱుంగక భ్రమపడు నీమాఘ్యమున కేమందును ? మీ దురభిమానపిశాచము మిమ్మిట్లు పలుతెఱంగుల వాఁగించుచున్నది కాని వానియం దేఘనతయు మహిమయు లేదు. మీరు వాఁగినకొలఁది నాతఁడును మేఁకపోతు గాంభీర్యమునఁ బ్రవర్తించుచున్నాఁడు.

అ॥ మాహా! ఏల పిచ్చినిబడియెదవు ? అతని యసమానమహత్త్వం బనేకవారములు కన్నులఁగట్టినట్లు ప్రత్యక్షమైయుండినప్పటికి

వను నశించినపిదప మునుఁగులో డాఁగి బుధవర్యుల నీతివాక్య ములఁ దలపోసి బిట్టు వాపోయిన కురురాజుభంగి నెల్లవారును నశించినపిదపనైనను గుణమ్యో మెఱిఁగోరియని నెత్తిని నోరుఁ బెట్టుకొని విలపింపక మానవు. అప్పుడుగాని మాబోంట్లు చెప్పు నీతుల విలువ తెలియదు. ఏమైననా కేమి, నీకర్మము నీదిగాక పరులది కానేరదు. నే నరుగువాఁడఁ. గాని బ్రహ్మనాయుఁడు నతోఁ బ్రత్యేకించి చెప్పఁబంపిన వాక్యము లాలించి నీయిష్ట ప్రకారము వర్తింపుము.

న॥ చాలు నీ పురాణములు. అనేచునివాక్యములతో నాకుఁ బని లేదు. నీదారిని నీవు వెళ్ళవచ్చును.

అ॥ వెళ్ళక నేనిం దుండరాలేదు. వచ్చినపని సాంగముగా నెఱింగించి పోవుట ధర్మమగుటఁ జెప్పుచుంటిని.

న॥ సరే కానిమ్ము

అ॥ ఇదిగో వినుము

సీ॥ చిరకాలదాస్యంబుఁ జేసియుండినయుక్తి
నేఁ జెప్పునది విన్క నీకు హితము
పురుషుఁడై జన్మించి తరుణికి లోఁగుట
నీతిజ్ఞుఁడగునట్టి నీకుఁ దగదు
దేశసంక్షోభంబుఁ దెచ్చిపెట్టెడుదాని
దరికిఁ జేర్చుట గొంతు కుఱి నిజముగ
పలనాటిసీమకుం బాటిల్లినయవస్థ
యెఱుఁగఁజూచుట కరం బ్లాఘ్యమగును

చెట్టుచెడనున్న వేళను బుట్టు కుక్క
మూతిపిండియలను మేటినీతి కీవ
మొదటితార్కాణం. మటుగాన మూఢబుద్ధి
విడిచి సన్మార్గమునఁబోవఁ గడఁగు మింక.

మఱియు,

సీ॥ అరికరియూథపంచాస్యమై యాహవ
రమణాగ్రమైఁ బెట్టన్న నాకమున్నె
క్రూరనారాచము ల్గుప్పి మాపార్థివముల్
ఘనుఁడు పేర్చుఁడు కైకొనకమున్నె
కర్ణమదాసుండు క్షత్త్రని మాని తా
భవదీయసేనపైఁ బడకమున్నె
వాయుపుత్రుఁడు నిమ్ము రణములో నిహతులఁ
గావింప సిద్ధంబు కాకమున్నె

బాలమన్ద్రేపరాజుల పాలిభాగు
పంచియీఁజూచు టెంతయు మంచిపక్షము
చెడుగుఁదలఁచిన యుద్ధమే సిద్ధమగును.
అవలఁ జింతింప ఫలములే దరయుమింక.

అని సీతోఁ జెప్పమనిరి. వింటివికదా! ఏమిప్రత్యుత్తరం బిత్తువు?

స॥ (ఊరకుండును)

అ॥ ఏమి? మాటలాడవు? మౌనమే యర్ధాంగీకారమా?

స॥ మందెమునఁ బూర్వసువాసిని కోడి వెతలఁబడి పిలుఁచెనని వెట్టి పీఁగు బ్రహ్మనాయుఁడని యనుకొంటివా?

అ॥ లేదు. ఆపూర్వసువాసినికే లొంగిపోయిన పెద్దపూర్వసువాసిని యనుకొంటిని.

స॥ ఇదిగో. నాప్రత్యుత్తరము. శిరమునఁదాల్చి వాని కెఱింగింపుము.

తే॥ తల్లకిందుగ వేయేండ్లు తపముఁజేసి
మొత్తుకొన్నను నే బుద్ధిపూర్వకముగ
దాయభాగ మొసంగను. ధైర్యమున్న
చేతనగునేనిఁ గొనుమని చెప్పు పొమ్ము.

అ॥ యుద్ధమే కోరుచుంటివా? సంధి కొడంబడవా?

స॥ నామాటయందు దర్థమేమనుకొంటివి?

అ॥ సరే. వచ్చుమున్నతికి సిద్ధపడియుందుము. పోయెద.

(అని నిష్క్రమించును.)

నా॥ (ప్రవేశించి) రాజా! చూచితివా వానిగర్వము ? క్రిందఁబడితన్ను కొనుచున్నను నోటిబింకముల మాత్రము వీడకున్నారు. యుద్ధము సర్వసిద్ధమఁట. ఏమిచేతురో చూతము. యుద్ధమునఁ దమకంటెఁ జేతఁగానివారెవరు ? ఎట్లైనను మనము తగు సన్నాహములఁ జేసికొనియుండుట మంచిదని నా తలంపు.

న॥ మంచిది. రేపుదానికై సభఁగూర్చి యోజింతము

నా॥ ఆలాగే (తనలో) నన్నును రాజును నిండుపేరోలగంబునఁ దూల నాడినదానికేదియైనను దగినశాస్తిచేయక విడువరాదు. అల్లుఁ డగుటఁ గూఁతునుజూచి రా జూరకున్నను నాకేమికనికరము ? ఊరకున్న మంచిదాన నగుదునా?

( అందఱును నిష్క్రమింతురు. )

నా॥ (గురిజాలపురిలోని తనయింటఁ గూర్చుండి తనలో) అఘటనఘట నాసమర్థుండగు నిటలాక్షుని కృప నాయెడలఁ బూర్ణముగా నుం డుటచేత నాసంకల్పితకార్యముల కెట్టియాటంకములును రాక సంపూర్ణముగా ఫలించుచున్నను నోక్కొక్కప్పుడుమాత్రము కొన్నిటిపట్ల విజయము గల్గమికి వగవవలసివచ్చుచున్నది. అది కాలవశ మనుకొనవలెను.

సీ॥ కాలవశంబునఁగాదొకో సూర్యచం
ద్రులు రాహుపీడచేఁ దూలుచుంట ?
కాలవశంబునఁగాదొకో ఘనచక్రి
వర్తులు పేదలై యార్తిగనుట ?
కాలవశంబునఁగాదొకో పర్వత
రాజముల్ వజ్రిచే మ్రగ్గిడియుంట ?
కాలవశంబునఁ గాదొకో సంద్రముల్
మునిచేత నిమిడి సొంపును వాలఁగుట ?

కావునఁ బుచ్చుకొని భుజించుటకు మసలియుండుటచేఁ బర్యవసానము తెలిసికొని నాకు నివేదింప వేచియుందునని తలంచెద.

సేవకుఁడు॥ (ప్రవేశించి) అమ్మా; జయముజయము. ఎల్లఁడు వచ్చి మీ యాజ్ఞకై వాకిట నిలిచియున్నాఁడు. ప్రవేశమునకు సెలవా ?

నా॥ సంశయమా? త్వరగాఁ బ్రవేశపెట్టుము

సేవకు॥ చిత్తము. (నిష్క్రమించును.)

ఎల్లఁడు॥ (ప్రవేశించును)

నా॥ ఓయీ! విశేషము లేమి?

ఎల్ల॥ అమ్మా! అంతయు విషపరిణామమే. ఒకరికంటె నొకరుద్దండపుఁ బిడుగులవలెనున్నారు. అదెక్కడి తెలివియో? అదెక్కడి యోజనయో? ఎక్కడిదూరపుచూపో? అబ్బా అందఱును దైవసమానులనియే చెప్పవచ్చునుగాని సామాన్యులని చెప్పరాదు.

నా॥ ఓరీ! నీయధికప్రసంగములు చాలించి కలయుదంత మెఱిఁగింపుము

ఎ॥ ఎఱుఁగఁజేయుట కేమున్నది తల్లీ! మీరు పంపిన యుపహారముల మాయోపాయంబునఁ గొనిపోయి కన్నమదాసద్వితీయుఁడై యిష్టగోష్ఠి నోలలాడు రాజనందనున కొసంగ నందుకొని యారగింపనున్నంతలోఁ గన్నమదాసుఁ డతని చేయిఁబట్టుకొని యయ్యా! యియ్యవి కపటముగఁ దోఁచుచున్నవి కానఁ బరీక్షింపక మెసవుట సమంజసముకాదని యేమేమో బోధించి యందొకఖండము చెంతనున్న సారమేయంబునకు వేయ నది యద్దానిఁ దిని ప్రాణంబులు విడిచె. అంత వారిరువురును దక్షాధ్వరమునాఁటి యపరశివావతారములోయన నొప్పుచు నరసింగునిదుష్టత్వమును సాధ్యమైనంత శీఘ్రకాలములో నణఁచి వేయవలెనని శపథములుచేయుచుండ నన్నెక్కడఁ జంపెదరో యని చెప్పకుండఁ దప్పించుకొని పరుగిడివచ్చితి.

# అభినవసరస్వతి.

సంపుట ౨౨ { ప్రమోదూత నామ సం॥ మాఘమాసము. } సంచిక ౧౧

## స్వవిషయము.

చంపకమాలిక॥

ఇరువదిరెండువత్సరములేఁ దినియో తినకో మహాయశ
స్కరమని పత్రికన్ నడపఁజాలితిఁ గాని యిఁకెట్లొ తోఁప. దెం
దఱో స్వకుటుంబపోషణమె తా మొనరించుకొనంగలేక త
త్తఱపడఁదగ్గకాలమది దాపరమాటను జేసి గ్రాహకుల్
సరసులెయయ్యు మూల్య మిడఁజాలక వద్దనుచున్నవారు పె
క్కురును. సమస్తవస్తువులకున్ ధరతగ్గెను గాని ముద్రణా
క్షరముల కింకనుం బెరిఁగెఁ. జాలదు జీవికకే మదాయ. మీ
వఱకె సమృద్ధ మప్పు. మఱి వార్ధకముం జనుదెంచె. దేశముల్
తిరిగెడిశక్తి తగ్గినది. తీఱదు ధర్మము వెల్లడింపఁగన్
స్థిరపడియున్నబుద్ధి. మును చేయియుఁ గాలును నాడుదాఁక నే
కరణినొ దీని నడ్పుటకు గట్టిప్రతిజ్ఞ యొనర్చియుంటి. స
త్పురుషులు నగ్రహారికులు భూపతులున్ ధనవంతు లెంతయున్
గరుణను దోడ్పడన్ వలయు నాదు సుపత్రిక. కట్టిబుద్ధి యీ
శ్వరుఁడె యొసంగఁగావలయు వారికి ధర్మము నిల్పు పూనికన్॥

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన జానపాటి పట్టాభిరామ
శాస్త్రిగారి దివ్యచరణారవిందసన్నిధానమునకు.

నమస్కారసహస్రపూర్వకముగ వ్రాసికొను విజ్ఞప్తి.

మహాశయా !

నిజామురాష్ట్రములోని నల్లగొండజిల్లాయందలి హుజూర్ నగర్ తాలూకాకు సంబంధించిన పెదవీడుగ్రామనివాసులును రాజా జమీన్దార్, దేశపాండ్యేత్యాది బిరుదాంకితులును, శ్రీమట్టపల్లి లక్ష్మీనృసింహాలయమునకు ధర్మకర్తలును, నిరతాన్నదాతలును, బహుకాలమునుండియును దూరదేశసమాగతులగు విద్వచ్ఛేఖరుల ననేకుల నవిచ్ఛిన్నవార్షికప్రదానరూపకమునఁ బోషించుచున్న సత్త్వగుణప్రధానులును నగు బ్ర. మ. రా. రా. శ్రీ శ్రీ చెన్నూరి నరసింహారావుదొరవారు (నియోగిబ్రాహ్మణులు) తమ యాజమాన్యము క్రిందఁ బ్రతివత్సరమును జరుగుచుండు శ్రీమట్టపల్లి లక్ష్మీనృసింహస్వామివారి కళ్యాణోత్సవసందర్భమున రెండు హరికథాకాలక్షేపములును దమ దివాణమున వైశాఖ బహుళమున జరుగు తిరువధ్యయన (ఆబ్దిక) దివసమున నొక కాలక్షేపమును బ్రతివత్సరమును నేనరిగి యొనర్చుచుండులాగునను, నందులకు వార్షికముగ నొక పుట్టెడువడ్లు నాకుఁ దమను దయచేయుచుండులాగునను నొకశాసనమువ్రాయించిరి.

మఱియు శ్రీవారి గ్రామమునకుఁ బ్రాగ్దిక్కున నెనిమిదిమైళ్ళ దూరముననుండు లింగగిరి నివాసులును, రాజా జమీన్దార్, దేశపాండ్యేత్యాదిబిరుదాంకితులును, నిరతాన్నదాతలును, విద్వాంసులును, కవులును, గాయకులును, సత్త్వగుణనిలయులును నగు బ్ర. మ. రా. రా. శ్రీ మంత్రిప్రెగడ వేంకటహనుమంతరావు దొరవారును మంత్రిప్రెగడ వెంకటరాఘవరావుదొరవారును (నియోగిబ్రాహ్మ

ఘులు) తమ సంస్థానమున నొక హరికథాకాలక్షేపమును బ్రతివత్సర
మును జరుపుచుండులాగునను నందులకు వార్షికముగ నొక పుస్తకం
వస్త్రు నాకుఁ దమరు దయచేయుచుండులాగునను నొక శాసనము ననుగ్ర
హించిరి. నిజామురాష్ట్రమునందలి పండితబ్రాహ్మణ భక్తివిశ్వాసము
లను గుఱించి మఱియొకమాఱు వ్యాసరూపముగ లిఖించి సమర్పించు
కొనెదను. శ్రమకుమన్నించి యీదొరల మహౌదార్యము ప్రపంచ
మునకుఁ దేటతెల్లముగఁ దెలియులాగునఁ దమ యభినవసరస్వతియందుఁ
బ్రచురించి పుణ్యముగట్టుకొనఁగలరని మనవిచేయుచున్నాఁడను.

కృత్రిమవేదాంతులను శీర్షికతో సంసిద్ధముగనున్న వ్యాసము
సంపుకొన్నాఁడను. చిత్తగింపుఁడు.

ఇత్థం విధేయపరమాణుః
గోపాలుని హనుమంతరాయశాస్త్రి.

---

## కృత్రిమ వేదాంతులు - దొంగసన్యాసులు.

(గోపాలుని హనుమంతరాయశాస్త్రిగారు)

వేదములన విదధాతువునుబట్టి జ్ఞానమును బ్రసాదించు మంత్రములని తెలిసికొనవగు. అట్టి జ్ఞానప్రసాదకరములగు వేదములు ప్రతిమానవవ్యక్తియును వర్ణాశ్రమధర్మముల ననుసరించి కర్మములఁ జేయవలయుననియుఁ జేయునెడల స్వర్గభోగాదు లనుభవింప వలను పడుననియు నటులఁజేయలేని రౌరవాది మహానరకప్రాప్తి యగుననియుఁ జెప్పును. చేయవలసిన కర్మము లీవిధముగ నుండుననియు విస్పష్టముగా వక్కాణించును. కావున మన మింతవఱకు వేదములన ఫలసహితకర్మములఁ బ్రతిపాదించునవియని తెలిసికొంటిమి. కొందఱు మహానుభావులు ఫలాసక్తులై చేయు కర్మములవలన క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి యను న్యాయమున ముందునకు వెనుకకు నడచు

చుండుట తప్ప మఱెద్దియు లాభము లేదనియు నిష్కామకర్మములే
యన్నిటికంటె నుత్కృష్టమనియు నద్దాననే జన్మరాహిత్యము గలుగు
ననియు నిర్ధారణచేసి యానిర్ధారితభాగమునకే (ఉపనిషత్తులకే)
వేదాంతశాస్త్రమని నామంబిడిరి. శ్రీశంకరభగవత్పాదాదులు దానిపైఁ
జర్చించి యాచర్చ (విమర్శనము) ను భాష్యములను పేళ్ళతో వెల్ల
డించిరి. అందుచే నన్నిటికిని నతీతమైనది వేదాంతశాస్త్రము. అట్టి
వేదాంతశాస్త్రము జ్ఞానమేవ మోక్షః జ్ఞానంవినా మోక్షో నసిధ్యతి
యని యుపదేశించుచున్నది. అట్టిజ్ఞాన మెటులఁగల్గును? ప్రప్రథమ
మునఁ గర్మములవలననే కలిగితీరవలయును. కర్మములఁ జేసియే
తీరవలయును. అవి ఫలాపేక్షారహితములగు కర్మములు. పరమేశ్వర
ముద్దిశ్య పరమేశ్వరప్రీత్యర్థం ... కరిష్యె యనినచో నద్దియే నిష్కామ
కర్మము. ఇట్టి నిష్కామకర్మమే తరణోపాయమును జ్ఞానసాధనమును
నగుచున్నది. అట్టికర్మములఁ జేయవలయుననిన మన కొక లక్ష్యము
గావలెను. అట్టిలక్ష్యము దేవతారూపమునఁగాని సద్గురురూపమునఁ
గాని యేర్పడవలయును. నిష్ప్రపంచమునందుఁ బ్రపంచత్వారోపణ
యును శుక్తియందు రజతత్వారోపణయును రజ్జువునందు సర్పత్వా
రోపణయును దారువునందు మనుష్యత్వారోపణయును జేసినట్లు
శిశ్నోదరపరాయణులయెడఁ బరధనపరదారాభిరతులయెడఁ బరవంచ
నాసక్తులయెడ ననాఘ్రాతశ్రుతిస్మృతిపురాణేతిహాసగ్రంథులయెడ
నన్యాయప్రవర్తకులయెడ నప్రామాణికులయెడఁ దిష్టస్మాత్రులయెడఁ
బరనిందాపాండితీప్రకాండులయెడ సద్గురుత్వారోపణమొనర్ప బలా
త్కారబ్రాహ్మణార్థముగ స్వప్రయోజనార్థ మొక్కింత కనులుమూసి
కూర్చుందురుకాని ప్రగుంభితమగు దుర్వాసన వ్యాప్తమై ప్రపంచ
వ్యతిరేకముగ నప్పటికప్పుడే యగపడు. లిప్తమలప్రక్షాళనాత్తద
స్పర్శనమేవ వర మనురీతి నూరకున్నదానికన్న వేయిమడుంగులు
పాప మధిక మొనర్చుటగాదా? ఈశ్వరుఁ డట్టికుత్సితున కొసంగు
శిక్షకు మేరగలదా? సోదరులారా! సోదరి [illegible]ణ్యమునవో

యేనిర్జనప్రదేశముననో యేనదీతీరముననో యేయాశ్రమముననో స్వానుష్ఠానప్రక్రియాధురీణుఁడై జటావల్కలాజినుఁడై నిరాహారుఁడై నిరాడంబరుఁడై నిరంతరసత్యశౌచనిరతుఁడై యొక్కమహానుభావుఁడు సహజశాంతిశమదమతితిక్షాశ్రద్ధోపరత్యాదిసంపన్నుఁడై గురుశబ్దమున కర్హుఁడై యేప్రయోజనమును గోరక యుండఁ బూర్వకర్మపరిపాకమున నొకవ్యక్తి దేశమునం దంతటను దిరిగితిరిగి చిట్టచివర కమ్మహాత్ముని దర్శనంబగుడు వత్సరములకొలందిఁ బాచ గాచియుండి పాదసేవలఁజేయుచుండ నెన్నటికో యామహనీయుని కనుగ్రహము కలుగుటయు నెంతకాలమునకో యావ్యక్తి యభిమతమెఱింగి యుపదేశించుటయు జరుగుచుండెడిది. ఇప్పుడన్ననో ? ఉ॥ కూరకు నుల్లిగడ్డలకు గుమ్మడిపిందెకుఁ జల్లనీళ్ళకుఁ, నారకుఁ గట్టెపుల్లలకుఁగూడ గతిలేక యేమాత్రము లాభమైనను జాలుననుకొను గురువులు కొందఱు బయలుదేరి శిష్యుల నుభయభ్రష్టులఁ జేయుచుఁ బదచ్యుతులగుచున్నారు. నిజము విచారించినచోఁ బ్రకృతము గడ్డములఁ బెంచుచుఁ గాపీనముల ధరించుచుఁ గమండలువులఁ దాల్చుచు సాతా గంజాయి మాదముల స్వీకరించుచు షడ్రసాన్నముల భుజించుచు స్వేచ్ఛావిహారులై సంచరించుచుండు గురువులలోఁ గొన్నిరకములును శిష్యులలోఁ గొన్నివిధములును గలవు. అవెవ్వియన, మొదటివారు ఋణములక్రింద సర్వస్వమును గోల్పోయి తినఁ గూడు కట్ట గుడ్డ లేనివారు. రెండవవారు స్వగ్రామములో నధమ మొకదమ్మిడీ కిమ్మత్తైనను జేయనివారు. మూఁడవవారు భార్యలతో సంబంధము లేనివారు. నాలవవారు దారాపుత్రాదులచేఁ దఱుమఁగొట్టఁబడినవారు. అయిదవవారు కుటుంబభారమును వహింపఁజాలక దేశాంతరగతులైనవారు. ఆఱవవా రధమ మేకారణముననైననేమి ర పర్యాయములేని శ్రీకృష్ణజన్మస్థానము (జైలు) సందర్శించినవారు. ఏడవవారు స్వగ్రామమునఁ బార్టీలఁబెంచి సంసారముల నాశనముఁజేయఁ జివర కిరుప్రక్కలవారు నేకమై తమ్మెప్పుడు నామరూపక్రియాశూన్యులఁజేయుఁ

బ్రియత్నింతురో యప్పుడు స్వగృహముల నివసించుటకుఁ దావులేక గత్యంతరములేక బయలుదేఱువారు. ఎనిమిదవ వా రెల్లప్పుడు నల్లరి మూఁక (రౌడీలు) గాఁ దిరుగుచుండువారు. తొమ్మిదవవా రేవిద్య యందును బూర్ణపాండిత్యములేక యీవంకతోఁ బొట్టపోసికొనువారు. పదియవవారు బ్రహ్మద్వేషులు. ఇఁక శిష్యుల విమర్శింతము. మొదటి వారు రోగాదులచే వికలాంగులైనవారు. రెండవవారు ప్రభుత్వము వారిచే ననుమానితులు. మూడవవారు కూటికి మొగమువాచిన కుక్షింభరులు. నాలవవా రేకారణమునసైననేమి పెండ్లిపేరంటములు లేనివారు. అయిదవవారు గోఁచిపాతలవారు. ఆఱవవారు సప్తవ్యస నముల కలవడినవారు. ఏడవవారు విధురులు. ఎనిమిదవవారు నాస్తి కులు. తొమ్మిదవవారు లోకవంచకులు. పదియవవారు విధవలు. అశక్తదుర్జనులు. పరమకిరాతులు. అట్టిగురువులు నిట్టిశిష్యులుఁ దోడై ప్రపంచమును సాంకర్యమొనర్చుచుండ నిఁక వేదాంతుల నమ్మువా రెవరు? ఎవరును నుండరు. కటకటా! నేఁటికి వేదాంత శాస్త్ర మెట్టిహీనస్థితికి వచ్చినది. ప్రతివారును మేము వేదాంతుల మనియు మేము గురుపుత్రులమనియు బయలుదేఱి పది వేమన్నపద్య ములు నాలుగు తత్త్వములు మూడు కందార్థములు నేర్చుకొని వాని యర్థమునైనను దిన్నగ గ్రహింపఁజాలక మఱియొకవిధముగాఁ జెప్పుచు లోకమును నమ్మించి చివరకు నోట వచించుటకును వీలు లేనంత దుస్థితికి లాగుచుండుట మఱింత విచారకరమైయున్నయది. మనము చూచుచుండఁగనే యెంతమంది బయలుదేఱి వేలకువేలు ద్రవ్యము నమాయికులకడనుండి లాగుకొనిపోవుచున్నారో యెఱుఁ గని విషయమా? ఎఱిఁగియు నూరకుండుట సమంజసమా? అన్నన్నా! ఈశ్వరసృష్టిలో నిట్టిదొంగలు యథార్థవాదులవలె బయలుదేఱి నిష్కళంకమనస్కుల నయితము వలలలో వైచుకొని యవసరముకలిగినప్పుడు పనిముట్టులంబోలె వాడుకొనుచున్నారుకదా! ప్రపంచ మేల నిదురపోవుచున్నదో తోఁచదు. నిజము నెఱింగిన

పండితకవిలోకముగూడ గోడలపై వ్రాసియుంచిన నిక్షేపపత్రిములుం బోలె యంత్రిములుం బోలె నేల మిన్నకుండెనో తెలియదు. ఒక వైపునఁ గృత్రిమవేదాంతులబాధ యిట్లులుండ నింకనొకవంకనుండి సన్యాసులు చనుదెంచుచుఁ బ్రపంచమున నుత్కృష్టవర్ణ్యాలఁగూడఁ బతితులఁజేయఁ గంకణము ధరించి స్వవర్ణముల మఱుగుపఱచి బ్రాహ్మణులువోలె భిక్షావందనస్వీకరణ మొనర్చుచుండుటయుఁ బట్టణము లనక పల్లెలనక యుత్సాహంతలూఁగించుచుండుటయుఁ దటస్థించుచున్నది.

నర్సారావుపేటలోని వైదిక బ్రాహ్మణోత్తములను బండితులను సుప్రసిద్ధన్యాయవాదులును సుహృదులును నగు బ్రహ్మశ్రీ తాడేపల్లి అంజనేయశాస్త్రిగారు వైశ్వదేవమును జేసికొనుచుండు సమయమున నొక కృత్రిమసన్యాసి దయచేయ బ్రాహ్మణయతి యనియే నిశ్చయించుకొని వందనమొనర్చి భిక్షకుఁ బ్రార్థించిరి. అందుల కాసన్యాసియు నంగీకరించి యుచితాసనమునఁ గూర్చుండుటయుఁ దత్సమయమున నచటకు వచ్చిన బ్రాహ్మణులు వందనమొనర్చుటయు (అనభ్యస్తపాఠమగుటచే నారాయణయనికూడ నాసన్యాసి వచించిన పాపమునఁ బోలేదు) ఆతఁడు మిన్నకుండుటయు సభ్యులందఱును వీరి మత మిదికాఁబోలునని కపటసన్యాసియిచ్చు కమలాఫలపుఁదొనలఁ బరిగ్రహించి యెవరితోవను వారు చనిరి. అంత శ్రీశాస్త్రిగారియింట యథేచ్ఛముగ భుజియించి యటనుండి వెడలిపోయెను. ఆ మఱునటిదివసమున బ్రాహ్మణులలోఁ గొందఱు బజారున కరుగుచు నా కృత్రిమసన్యాసి యొక వైశ్యగృహస్థునింట విడిసియుండఁ గాంచి యాగృహస్థుఁ బిలిచి స్వాములవారు మీయింట నుండిరేమియని ప్రశ్నింప స్వాములవారు మావైశ్యులే యని యున్న వాస్తవమును వెలిపుచ్చెను. ఆపయిని బ్రాహ్మణులు విభ్రాంతులై శ్రీశాస్త్రిగారికడ కరుదెంచి నిజమును వెల్లడించిరి. ఎద్దియును దోఁచక శ్రీశాస్త్రిగారు పశ్చాత్తప్తులై యాతని (కృత్రిమసన్యాసిని)

బిలువనంపి యడుగ దాను నిజముగఁ గులమున వైశ్యుఁడేయనియు శాస్త్రిగారిగృహము సంపన్నవైశ్యగృహమైయుండునని యందుఁ బ్రవేశించితిననియు వందనముచేయువారందఱును వైశ్యులేయని నిశ్చయించుకొంటిననియు శాస్త్రిగారిని వర్ణభ్రష్టులఁజేయుతలంపున రాలేదనియు క్షమింపుఁడనియు వేఁడి పశ్చాత్తాపమును సూచించుచు గడగడ వడంకుచు శాస్త్రిగారిపాదములపైఁ బడి రక్షింపక విడనని మొఱ్ఱవెట్ట వదలి యథాశాస్త్రముగఁ బ్రాయశ్చిత్తమును జేసికొని పునీతులైరి. చూచితిరా? బ్రాహ్మణులకుఁదక్క నితరులకు సన్న్యాయాశ్రమస్వీకారాధికారమే లేకయుండ నీవిధముగా నొకవైశ్యుఁడు సన్న్యాసియై బయలుదేఱి బ్రాహ్మణ్యము సాంకర్యమొనర్ప నడుముకట్టెను. శాంతం పాపం. కానిందు మనము వర్ణాశ్రమాచారవిధుల నతిక్రమింపక భగవత్ప్రార్థనల విరమింపక కేవల హూణభాషాధ్యయనమే చేయింపక సంస్కృతభాషాధ్యయనముగూడ మన బాలకులకు విధియేయని తలంచితిమేని భయమున కెన్నఁడును గుఱికాఁజాలము. కాలప్రవాహ మతివక్రముగ నతితీవ్రముగ నున్నయది. కావున నార్షరక్తకణప్రసారముగల మనము పూర్తిగఁ గన్నులవిప్పి భూమిపై నడుగువెట్టుచుండవలసిన సమయ మరుదేరినయది. ప్రతివాఁడును బ్రాహ్మణుఁడన నావేశపడుచున్నవాఁడు. వేదపాఠయన వెక్కిరించుచున్నాఁడు. శాస్త్రపండితుఁడనఁ జప్పరించుచున్నాఁడు. ఒకరికంటె నొకరీవిధముగ నకాలవర్షపాతమ్మునఁ బుట్టకొక్కులుంబోలె బయలుదేఱుచున్న యిక్కాలమున బ్రాహ్మణులు నామమాత్రులుగాక వారల కింకను దఱుగైనపాఠముల వారి మంచములక్రిందఁ బాదముల సన్నిధిని జేరి బోధించి చివరకు మిడుతలవలె సుఖింపక మెలఁకువతో స్వధర్మము ననుష్ఠించుచు నాత్మసంరక్షణమొనర్చుకొనుట యుత్తమోత్తమమని మనవిచేసికొనుచున్నాఁడను.

---

# కెయిజరుసార్వభౌముని నిష్క్రమణము.

(కృష్ణ)

1914 వ సం॥ను జ్ఞప్తికిఁదెచ్చుకొనుఁడు. నాఁడు ప్రపంచ మంతయుఁ గెయిజరుసార్వభౌముని భుజాస్ఫాలనము గాంచి పలు రీతుల భీతిల్లియుండెను. ఈభూతలమున నాకు సాటిసార్వభౌముఁ డెక్కడ నని కెయిజరుచక్రవర్తి ఘీంకృతులు సలిపియుండెను. జర్మనుసేనల పదాఘాతమున కీ పృథ్వీమండలము దద్దరిల్లిపోయియుండెను. దేశము తరువాత దేశము రాజ్యముతరువాత రాజ్యము నా మహాసమరమునకుఁ దలక్రిందులుగ నీడ్వఁబడియుండెను. ఒక్కొకవిధముగ 4 సం॥ లాకసము యుద్ధమేఘము లావరించి రక్తమును గుంభవర్షముగఁ గురిసెను. కెయిజరు సాతా దుర్దుఁడేయని మానవకోటియంతయు హాహాకారములు సలిపెను. అవును నేను దేవునవతారమే యని కెయిజరు నిశ్శంకహృదయముతో గర్వించుచుండెను. అట్టి కెయిజరుసార్వభౌముఁడు తుదకు సింహాసనభ్రష్టుఁడై స్వసైనికుల తిరుగుబాటునకు భీతిల్లి పలాయితుఁడై నేఁడు హాలెండుదేశమున జీవచ్ఛవమై యున్న సంగతికంటె రాజ్యము లస్థిరములను సత్యమును జాటుటకు వేఱు ప్రబలనిదర్శన మేమికావలయును? కాని కెయిజరు జర్మనీనుండి పలాయితుఁడైన విధము లోకమునకు వివరముగఁ దెలిసిన నెట్టివారి కైనను దుఃఖము గలిగింపకమానదు. జర్మనుసామ్రాజ్యదౌర్జన్యము భస్మీపటలమగుట లోకానందకరమైనను గెయిజరుచక్రవర్తియంతటి కుధరము కూలిపోయినపు డొకవిధమైన విషాదము గలుగకమానదు. ఈసంగతి కెయిజరుగారి మిత్రుఁడును జర్మనుప్రధానసైనికశిబిరమునం దాక యున్నతోద్యోగియు నగు కర్నల్ నీమెనను గ్రంథకర్త బహు రమ్యముగ వర్ణించెను. సామ్రాజ్యములు కదలి కూలిపోవుచున్న యీరోజులలో నీవిషాదనాటకము పఠనార్హము. కర్నల్ నీమె నానాటకములోని తుదియంకము నిట్లు చిత్రించెను.

1918 నవంబరు 9 తేది సూర్యుఁ డింకను నుదయింపలేదు. వేకువజామున గ్రీవరుసేనాని నాయొద్దకువచ్చి యస్పష్టవచనములతో నేమియో చెప్పుటకుఁ బ్రయత్నించుచుండెను. రైనునదీతీరమున నిలచియున్న జర్మనుసైన్యములకు సప్లయి లాఁగిపోయినవనియు సైనికులలోనే తీవ్రములైన తిరుగుబాటులు ప్రారంభించినవనియు సూచించెను. కెయిజరుగారికీ యుపద్రవస్థితి తెలియునాయని నేను బ్రశ్నించితిని. సేనాముఖమున నున్నసంగతు లొకగంటలోపలనే తెలియుననియు సేనాపతులందఱును స్పాయొద్ద సమావేశమై సైన్యములో రగులుచున్న విప్లవాగ్నినిగూర్చి యాలోచించుచున్నారనియు నా వృత్తాంతమంతయుఁ గెయిజరుగారికిఁ ద్వరలో నివేదింపఁబడుననియు నతఁడు సమాధానము చెప్పెను. ఇంతలోఁ గెయిజరుగారియొద్దనుండి నాకుఁ డెలిఫోనువార్త వచ్చెను. కెయిజరుగారు ఫ్రెనూసీవిల్లాలో బసచేసియుండిరి. ఆ భవనముచుట్టును జక్కని యుద్యానవనము గలదు. ఆ చెట్లచాటుననుండి యా భవనము పంచదారతో నిర్మింపఁబడినదానివలెఁ దెల్లగఁ బ్రకాశించుచుండెను. ముందు చంద్రశిలామండపమును దాఁటి వెడలుటతోడనే యద్దాలహాలొకటి గన్పట్టును. ఎడమవైపున భోజనశాలయుఁ గుడిప్రక్క దర్బారుహాలును, వానినుండిపోయిన నొకగదిద్వారముకడ నాయుధపాణియగు సైనికుఁడు నిలువఁబడియుండును. అక్కడ మేడమెట్లెక్కినఁ బైయంతస్తులోఁ గెయిజరుగారి బస. అతఁ డుదయపుషికారునకు సంసిద్ధుఁడగుచుండెను. బహుదీర్ఘాలోచననిమగ్నుఁడై యున్నట్లు వానిముఖము తోఁచుచుండెను. బయటకు వచ్చుచుండెను. ద్వారముకడనున్న సైనికుఁడు సెల్యూటుచేయుచుండెను. అంతట నాసైనికుని మెల్లగఁ బిలిచి నేనీతోఁటలోనే పచారుచేయుచుందునుగాన నెవరైనను నాతో మాటలాడుటకు వచ్చినయెడల నాకు వెంటనే తెలుఫుమని చెప్పి హిమ

బిందువులతోఁ గప్పఁబడిన పచ్చికబయలున నడువసాగెను. అప్పుడు మంచు దట్టముగఁ గురియుచుండుటచే దగ్గఱనున్న మనుష్యుఁడుకూడఁ గన్పట్టుటలేదు.

చెట్లన్నియు నాకులు రాలిపోవుటచే మోడులై యా మంచులో నాయుధపాణులైన సైనికులవలె గోచరించుచుండెను. నేను జక్రవర్తిని గలసికొనుటతోడనే యాస్ట్రియా హంగేరీదేశములను ముంచివేసి జర్మనీకిఁగూడ బ్రవహింపనున్న బొల్షివిజమునుగూర్చి మాటలాడఁ దొడంగెను. ఇందువలన యుద్ధ మింకను దీర్ఘముకాక తప్పదనెను. ఈ బొల్షివిజము ప్రళయము పొంగకుండ నడ్డుకట్టవేయనియెడల జర్మనీనే కాక యూరపుఖండమంతయు ముంచివేయుననెను. యూరపును రక్షించుటకు మనముచేయుచున్న పనిని మన శత్రువు లెంతవఱకు గ్రహింపఁగలుగుదురోయనికూడఁ బ్రశ్నించెను. నేను వారితో నేకీభవించితిని. ఈ విప్లవకరములైన తిరుగుబాటులచే సైనికబలమున కాపదరానున్నది కాన వెంటనే పటాలములను బంపి తిరుగుబాటుల నణఁచివేసినయెడల నుపద్రవము తప్పిపోవునని కెయిజరు చెప్పుచుఁ దిరిగి గృహోన్ముఖుఁడయ్యెను. నావెంబడిరమ్మని కెయిజరు నాకు సైగచేసెను. మే మద్దాల ద్వారములను దాఁటి కన్సర్వేటరీలోనికిఁ బోతిమి. ఇద్దరు సేనాధిపతులును సర్వసేనాధిపతియగు హిండనుబర్గును రాజ్యాంగమంత్రియుఁ జేరువకువచ్చి యభివాదములొసఁగి నిలువఁబడిరి. కెయిజరు బల్లప్రక్కను నిలువఁబడి సర్వసేనాధిపతివైపునకు దృష్టి నిగుడించెను. సర్వసేనాధిపతి గజగజ వణఁకుచుండెను. వాని కంఠమునుండి మాట బయటికి రాదయ్యెను. నేను మాటలాడఁజాలనుగాన క్షమింపుఁడనియు గ్రీవరుసేనాని వివరములను దెలుపుననియుఁ దలవంచుకొనెను. చెప్పవలసినవిషయములను జెప్పలేకుండెను. కెయిజరుగారి ముఖము వెలవెలఁబోవుచుండెను. ఏమియుఁ దోఁచనివానివలె నిటు నటు నొక

మాఱు తిరిగి గ్రీవరుసేనానివంకఁ జూచి విశేషములేమియని ప్రశ్నించెను. గ్రీవరుసేనాని యంతట సేనాముఖమున జరుగుచున్న తిరుగుబాటులనుగూర్చి వివరించి యిఁక సైన్యములపై నాధారపడియుండఁజాలమనియు రైనునదీప్రాంతమున సైనికులకు సప్లయిలు జరుగుట యాఁగిపోయెననియుఁ బ్రజలలో విప్లవాగ్ని పూర్తిగఁ బ్రజ్వలింప నారంభించెననియు వచించెను.

స్కైన్స్బర్గసేనాని కీమాటలు రుచింపలేదు. సైన్యములోఁ గొంతభాగము తిరుగఁబడుచున్నమాట నిజముకాని చాలపటాలము లింకను రాజభక్తిపూరితములై యున్నవనియు నౌకాసైనికులుచేసిన విద్రోహమును వారు సప్లయిలు రాకుండఁజేసినకుట్రలను సరిగ విప్పి చెప్పినయెడల మనసైనికులు తప్పక మనకు విధేయులై యుద్ధమును గొనసాగింపఁగలుగుదురనియు నాసేనాని చెప్పెను. గ్రీవరుసేనాని యామాటలను నిరాకరించెను. మనప్రయత్నములకు దాఁటిపోయిన స్థితి సంఘటించినదనియు మన మిప్పు డెట్టిజోక్యము కల్పించుకొనినను దాపులేని రక్తపాతము వాటిల్లుననియుఁ గెయిజరుగారుకూడ నీయభిప్రాయమునే వెలిపుచ్చిరి. 4 సం॥లు యుద్ధముసలిపినపిమ్మట మనలో మన కంతఃకలహములను బెంచరాదనియు వైరులతో సంధిచేసికొని సైన్యములను వెనుకకు మరల్చెదననియుఁ గెయిజరుసార్వభౌముఁడు చెప్పుసరికి నందఱు నేకీభవించిరి. కెయిజరుచక్రవర్తిగారి సేనాధిపత్యముక్రిందమాత్రము కాక సైన్యములు వానియంతట నవియే సేనాధిపతులక్రింద మెల్లగఁ గ్రమముగ గృహోన్ముఖములగునని గ్రీవరుసేనాని చెప్పుసరికిఁ గెయిజరుగారి కన్నులనుండి నిప్పులుగురిసెను. ముఖమును బొడిగించుకొనుచు గ్రీవరుసేనానియొద్దకు వచ్చి కెయిజరుగారు సేనాపతీ! నీ రిపోర్టును వ్రాఁతమూలకముగా నిమ్మ

నియు సైన్యములు నాకు లోఁబడియుండనేరవని సేనాధిపతులందఱును సంతకములతో రిపోర్టులను బంపనిమ్మనియు సైన్యములన్నియు నాకు లోఁబడియుండునని ప్రమాణముచేసియుండలేదా యనియుఁ దీక్ష్ణముగఁ బలికిరి. అవునుగాని యా ప్రమాణము లిప్పుడు చెల్లవని గ్రీవసు సేనాని నొక్కివక్కాణించెను. అంతట హిండెనుబర్గుసేనాని వానిని సక్కి యూరకుండుమనెను. కాని గ్రీనరుసేనాని యూరకుండలేదు. సేనాముఖమునుండి వచ్చిన వార్తలను బట్టి సైన్యములపై నిఁక నాధారపడియుండిన లాభములేదని చెప్పునరికిఁ గెయిజరుగారి ముఖము మఱింత కఠినమయ్యెను. ఇంకను మాటయు నేడలేదు. భ్రమ. భ్రమ. కెయిజరుగా రక్కడనుండి పార్కులోనికిఁ బోయెను. అక్కడనున్నవా రచ్చటచ్చట గుంపులుగుంపులుగఁ జేరి తల లూఁపుకొనుచు గుసగుసలాడుచుండిరి.

ఇంతలోఁ టెలిఫోనువార్త వచ్చెను. అందఱిలోను నలజడిగలిగెను. అప్పుడే సైన్యములలో రక్తము పొంగిపోవుచుండెనని వార్త వచ్చినది. ఏమిటావార్తయని కర్నలుహై నడిగితిని. ఏమియు బాగుగా నుండలేదనియు నసంతృప్తికర మసంతృప్తికరమని కర్నలు హై జవాబుచెప్పెను. జర్మనుయువరాజు బయటనుండి వచ్చి తండ్రిగారికి నమస్కరించెను. అక్కడివారందఱు నీయువురిచుట్టును గూడిరి. కర్నలుహైకూడ వచ్చెను. మనసైనికులు శత్రువులతోఁ బోరాడుఁడనిన నెట్టిధైర్యముతోనైనను బోరాడెదరుకాని మనప్రజలతోనే పోరాడుఁడనినఁ బోరాడరు పోరాడరు ముమ్మాటికిని బోరాడరని యందఱు నైకకంఠ్యముగఁ జెప్పిరి. కాని తనప్రాణములను రక్షింతురని కెయిజరుగారు నమ్ముచుండిరి. అవసరమైనయెడల నా సార్వభౌమత్వమును వదలుకొని ప్రష్యారాజుగమాత్రము నాసైన్యములతో

నుండెదనని నుడివిరి. అందఱమును భోజనమునకుఁ గూర్చుంటిమి. ఎవరును మాటలాడరు. ఎల్లరును నిశ్శబ్దముగఁ గూరుచుండిరి. ఏనిమిషమున కేవార్తవచ్చునోయని నిమిషములను లెక్కించుకొనుచుంటిమి. కెయిజరు పెదవిని గొఱుకుకొనుచు బిరుసుగఁ గూర్చుండెను. ఎవరును మాటలాడక హృదయముల నూఱడించుకొనుచుండిరి. కెయిజరుగారు తిరిగి తోఁటలోని కరిగిరి. హృదయభావము కొంచెము సడలెను. సింహాసనము దిగుటకు నిశ్చయించుకొనెను. కాని యీవార్త యింకను బర్లినునగరమునకుఁ బంపలేదు. తరువాత సింహాసన మెవరెక్కవలెనను విషయము చర్చింపఁబడుచుండెను. ప్రిన్సుమాక్సును సింహాసనారూఢునిగఁ జేసి తా నెక్కడఁ దలదాఁచుకొనవలెనో తెలియలేదు. కెయిజరుగారు సైన్యములయొద్దకుఁ బోయి వారిని జేరఁదీసికొనుట క్షేమకరమని యువరా జర్థించెను. స్కాడెన్బర్గుకూడ నీసలహాను బలపఱచెను. కెయిజ రందుల కంగీకరింపలేదు. అది పిరికితనమనిపించుకొనుననియు నే నిక్కడనే యుందుననియు నాపక్షమువారు నన్నుఁ గాపాడఁగలుగుదురనియు నుడివెను. ఇంకను జక్రవర్తివలెనే మాటలాడెను. ఇంతలో నెవరో యత్యాతురతతో వచ్చి యోరాజవరా! ఒకక్షణ మీప్రక్కకు వచ్చెదరా? యని గద్గదస్వరముతోఁ బిలిచెను. కెయిజరు పాము త్రొక్కినవానివలె బెదఱి ప్రక్క కొక గంతు వేసెను. యువరాజును వానిచెంత నిలువఁబడెను. ఈ వచ్చినది గంటర్డుసేనాని. వణఁకుచు నొక కాగితమును జేబులోనుండి తీసెను. ఆయాసపడుచున్నవానివలె నూపిరి గట్టిగఁ బీల్చుచుండెను. చలికివలెఁ బెదవులు వణఁకుచుండెను. చెక్కిళ్లు లశ్రుపాతముతోఁ దడిసిపోవుచుండెను.

కెయిజరును యువరాజును సింహాసనభ్రష్టులుగఁ జేయఁబడిరి. ఏమి? ఇది కలయా? జ్వరములోని సంధిమాటలా? కాదుకాదు.

కెలిగ్రాములో స్పష్టముగ లిఖింపఁబడిన యక్షరములు. కెయిజరంతట నద్దాలమహాలుదాఁటి పచ్చికబయలున నిలువఁబడెను. ఇది ద్రోహము, కేవలము రాజద్రోహము, నిర్లజ్జతోఁగూడిన విద్రోహమని చేతు లెగురవేయుచుఁ జెవ్రులు గింగురుమనునట్లఱచెను. టెలిగ్రాఫుఫారములను దీసి యేమియో వ్రాయమొదలుపెట్టెను. కాని కలమాడదు. చేయి వణఁకెను. ఫారములతరువాత ఫారములను జింపివేసెను. షూల్డెన్బర్గూ! సర్వసేనాధిపతియగు హిండెన్బర్గుతో మాటలాడి సమాధానము చెప్పుమనియు నాసైనికులపై నాకు నమ్మకము కలదనియు నుచ్చైస్స్వరమునఁ బలికెను. సర్వసేనాధిపతికార్యస్థానములో సంగతిసందర్భములన్నియుఁ దీవ్రముగ నాలోచింపఁబడెను. కెయిజరుగారి సొంతసైన్యములుసహితము ప్రజలపై బాకులనువిడుచుట కొప్పుకొనుటలేదు. తక్కినసైన్యములన్నియుఁ బ్రత్యక్షముగఁ దిరుగుబాటునకుఁ బూనుకొనినవి. జర్మనీపరిసరములనుండి వచ్చుచున్నవార్త లతిభయంకరములుగ నున్నవి. రైల్వేస్టేషను ప్రజలవశమయ్యెను. ప్రజలలో విప్లవముపుట్టినదని యందఱును నమ్మిరి. ఆపత్తు సంఘటించినది. కెయిజరుగారికి శరణమెక్కడ? హాలెండుదేశమునకుఁ బాఱిపోవుటతప్ప గత్యంతరములేదు. కాని యందులకుఁ దగునేర్పాట్లు చేయుటకు వ్యవధియున్నదా? హిండెన్బర్గును సర్వసేనానియు హిన్టుజుమంత్రియుఁ బ్లీజనుసేనానియుఁ బ్రియరుసేనాపతియుఁ గెయిజరుగారిసన్నిధి కేతెంచిరి. కెయిజరుగా రిపుడు తిరుగఁబడినసైనికులను దప్పించుకొని బర్లినుచేరఁగలుగుట సాధ్యముకాదనియు నొకవేళ బర్లినుచేరినను బ్రభుత్వమును స్వీకరించిన విప్లవకారులు ఖైదీగఁ బట్టుకొనరని నేను హామీ యీఁజాలననియు హిండెన్బర్గు సర్వసేనాని ఖండితముగఁ జెప్పివైచెను. విషమపరిస్థితు లేర్పడి

నవి. స్వాకు రప్పింపఁబడిన సైన్యములుకూడ విశ్వసనీయములుగఁ గన్పట్టుటలేదు. ఇఁకఁజేయఁదగిన దేమియులేదు. రాజ్యాంగమంత్రి కెయిజరుగారు హాలెండు పాఱిపోవుటకుఁ దగినయేర్పాటులను జేయ వలసియుండెను. ఇఁక నాలోచింపవలసినది కెయిజరుగారి కర్తవ్యము. ఆయన విప్లవకారుల చేతులలోఁ బడవచ్చును. అది దురూహ్యముకాదు.

కాని ప్రజలు తిరుగుబాటుచేసి రాజమందిరమును ముట్టడింప నున్న సమయమున నామనుమలును బంధుగులును వారి క్రోధాగ్నికి బలికానున్నవేళ నేను బలాయితుఁడనగుటా ? కాదు కాదు. వెయ్యి మాఱులకును గాదని కెయిజరు పల్కెను. ఏమైనను గానిండు. ప్రాణ మున కపాయము వాటిల్లినను సరియే. కెయిజరు తనసైన్యమువద్దకుఁ బోకతప్పదు. రాత్రి పదిగంటలైనది. కెయిజరు రాయల్ ట్రెయినులో డిన్నరుకాఱులో నుండెను. గ్రినువాసేనాని వారియొద్దకేగెను. ప్లీసను సేనానియు ఫ్రియిషనుసేనాపతియు నతనివెంటనుండిరి. పరిస్థితులు చేయితప్పిపోయినవి. విప్లవజ్వాలలు దశదిశల వ్యాపించుచున్నవి. సైన్యములు ముట్టడింపఁబడినవి. కెయిజరుగా రొక గంటయైనను నుపేక్షవహింపరాదనియు హాలెండుకుఁ బాఱిపోవుటతప్ప నిపుడు చేయఁదగిన దేమియు లేదనియు నచ్చటకుఁబోయినపిమ్మటఁ బ్రాణ రక్షణోపాయము నాలోచించుకొనవచ్చుననియు గ్రూనోసేనాని తెలి పెను. కెయిజరు సరేయని తలయూఁచెను. అదే జరుగవలసినయెడల జరుగనిమ్ము కాని రేపుదయమువఱకు నేను గదలననియు మృత్యువు నకు భయపడినను నిందకుఁ బాత్రుఁడను గాఁజాలననియుఁ జెప్పి కెయిజరు తనబసకుఁ బోయెను. నేను గన్నీటిని గార్చుచు రైలెక్కితిని.

):———

మ॥ బుడుతా! మాకు హితుండవౌట మఱి యీభూనాథు నెయ్యంపు ట
ల్లుండవౌటన్ మలిదేవభూపతికిఁ బాలుం డెత్తు వీవన్న గం
పెడునాశన్ నిను సంధికై పనుపఁగా మీయమ్మ చెల్లాంబకున్
కడుపుందుఃఖముఁ దెచ్చిపెట్టి మముఁ బెన్నాఁచిచ్చునం ద్రోసితే.

లేకున్న నొంటివై పరలోకంబున కేగుట కేమంతి పెద్దవాఁడ వైతివి? అయ్యో! నీకు మే మేమియపకారంబు గావించితిమి? కుఱ్ఱా! నీవిప్పు డెక్కడ నేమిచేయుచుంటివనుకొనవలె? నా మీఁదిభక్తిశ్రద్ధ లెందుఁబోయినవి? నీ సంధిసంగతులు వినిపింపకుండఁ బోవుట తగవగునా? అక్కటా! రావేమి? అవును ఎట్లువత్తువు?

ఉ॥ ఎందఱో పెద్దలుండ బుధు లెందఱో యుండ నమాత్యులుండ వే
ఱెందుకు వాని ముద్దుకొడుకే తగియుండఁగ సంధిసేయ వా
రందఱి మాటయే తలఁప కక్కట! నన్నిటపంపె నం చెదన్
గుందుచు నాపయిం బాడముకోపముచే మఱి రాకయుంట హా!

నిజము. ఆగర్భశ్రీమంతుఁడవగు నిన్నొక్క బిచ్చగాని పగిది నీతల్లి వలదన్నను సంధినెపంబున బలాత్కారంబుగా నా నరహంత చెంతకుఁ బంపుట నాదియే దోసముగాని కుమారా! అది యంతగాఁ బాటింపఁదగినది కాదని నీవుమాత్ర మెఱుంగవా?

శా॥ దేశంబంతయుఁ బొందుచుండిన మహాదీనత్వముం బాపు సం
దేశం బంపుటకంటె వేఱుపథ మెంతే మేలుగాదంచు ని
న్నా శైలూషునివద్ద కన్పితిని. నన్నా! వైరమా నాకు? నీ
వీ శంకం బడనేల? యింతెఱుఁగవే? యీనాఁటిసంబంధమే?

ఇప్పుడు నీతల్లి కేమినుడువుదు? ఆమె నేముఖంబునఁ జూతును? నీకతంబున మేమును మావారును మాతృదేశంబును సుఖపడఁగల మనుకొంటిమి కాని దుఃఖసముద్రములో ముంచి పోదువని తలంపమైతిమికదా! హా మారసుందరాకారా!

సీ॥ నీసుందరాకృతి నిముసంబులోపల
మాయమైపోయెనా యోయితండ్రి!
సిఖస్థధగధగల్ నీరూపమయ్యెనా
మామ దుస్తంత్రంపు మహిమవలన!
నీచాకచక్యంబు నిష్ఫలంబయ్యెనా
విశ్వస్త యోజనావిధులఁజిక్కి?
నీధనుష్పాండితి నీరసంపడియెనా
కుటిలుల యారంభపటిమదవిలి?
పౌరుషమువీడి హితులను బాసి తుదకు
కపటవిప్రుని మాయాగ్నిఁ గనలినావె?
కటకటా! నేఁడు నీకెంత కష్టమబ్బె
నాకతంబునఁ జేసి గుణావలంబ!

హా సుప్రతిభాధురీణ! నీకింతలో నిట్టి యకాలమృత్యుప్రదాపరించునని కలనైనను దలంపనైతిఁగదా! అయ్యో! రాజకులైకభూషణా! నీమృదుమధురభాషణంబు లెంతటి కఠినులనైనను గరఁగించుచుండ సతతము నీక్షేమమారయవలసిన మామకుఁ బనికిరావయ్యెఁగా! ఛీ క్రూరా! నలగామక్షమావల్లభా! అంతకంతకు నీదుర్మార్గ మెంతహెచ్చుచుండెనురా! రాక్షసులకైనను నిట్టిబుద్ధి పుట్టదే. నీ కెట్లుకలిగెనురా? అక్కటా!

సీ॥ ఆజానుదీర్ఘ బాహాదండములచేతఁ
గనులపండువుసేయఁ గలుగువాని
నూనూఁగుమీసాల నూత్నయౌవనకళా
విఖ్యాతిచే బిట్టు వెలయువాని

చతురవచో సరసవచో మితభాషణంబుల
జగముల మెప్పింపఁజాలువాని
కటికవానికిఁగూడఁ గరుణగల్గించెడు
అందచందములచే నలరువాని
డంబుమీఱు విశాలవక్షంబువాని
అలఘు వినయాదిగుణముల నెలయువాని
ధీరు నల్లుని లోకైకవీరు సకట!
పట్టివధియింప నీకెట్లుపుట్టె బుద్ధి?

ఛీ! నీయట్టికులాంతకుఁ డీలోకంబున మఱియొకఁ డుండఁ బోఁడు. అపురా! నీ వెంతకఠినహృదయుఁడవురా?

ఉ॥ అల్లునిమీఁదఁ బ్రేమ మిసుమంతయు నుండకపోవుఁగాక. యు
త్ఫుల్లసరోజనేత్రయగు పుత్రికసౌఖ్యముఁగూర్చియైన నీ
యుల్లమునందు వత్సలత యుంచి కరంబు బహూకరింపఁగా
నొల్లక యింతపాపమున కొప్పితివే నరరూపరాక్షసీ!

మల్లిసీ॥ అన్నయ్యా! ఇంతకువచ్చినవాఁ డెంతకైనను రాఁగలఁడు. గుడి మ్రింగువానికిం దలుపు లప్పడంబులుగావే? ఇంతకును దుండగములకుఁ దగినట్లు తన్ను దండధ్వరువీటి కంపుట కుపేక్షించి నందులకుఁ దగుఫలమును బొందఁ జేసినాఁడు.

బ్రి॥ అవునుదమ్ముఁడా! తలఁచుకొన్న గుండియలు బ్రద్దలగుచున్నవి. ఎంతమాయదారితనము? [నలకాము నుద్దేశించి] ఓరీ రాజరూపచండాలా!

చం॥ అలసిపరుండుసింగమును నల్లన మచ్చునఁబట్టి యెట్టులో
హాలియఁగఁ జేసినట్టు లతిపూజ్యుని మోసమొనర్చి చంపఁగా
నలవడెఁగాక, లేక తగ న్యాహవభూమిని నిల్తువేని నీ
జిలిబిలిపోఁడునంతయును జిందఱవందఱఁ జేసియుండఁడే?

ఇంతవఱకు నీకాలము మంచిదగుట బ్రదుకుచుంటివి. ఇఁక నుండఁబోవు.

ఉ॥ ఓరినృపాధమా! విను మదున్నతశక్తిని సాధుమార్గసం
చారవిరోధివైన నినుఁ జంపి పదంపడి చీల్చివైచి నీ
క్రూరశరీర మంతయును గుక్కలచేఁ దినిపించువాఁడ భూ
భార మడంగఁగా సకలబాంధవసమ్మతమై చెలంగఁగా.

నత్నా! కన్నమా! ఇంకను విలంబమేల?

క॥ అయ్యా! ఇది కోపమునకు వేళగాదు. శాంతించి నేనుజేయు మనవి వినుఁడు.

బ్ర॥ ఏమీ? కోపమునకు వేళగాదా? కాకపోవచ్చును. సరే. నీమనవి యేమి?

క॥ అలరాజు కళేబరమును భార్యాసహితముగా నిచటికిఁ గొనివచ్చినాఁడు. వానికి విధ్యుక్తకర్మము లాచరింపఁ గొమ్మరాజాదులు సమకట్టి మీరాకకు నిరీక్షించుచున్నారు. అచ్చటికేగి ముందాకార్యమును నెఱవేర్చి పిదప వాని మాతను నర్థాంగిని నూరార్పవలయు. సమరసన్నాహముల మే మొనర్చుచుందుము.

బ్ర॥ ఎంతయవివేకకార్య మొనరించితివి? వారల నిచటికిఁ గొనిరావచ్చునా? దేశద్రోహులఁ బరిమార్ప నేగకుండఁ జిట్టాల శోకం బపనయించుకొనుచుఁ గూర్చుండవలయునా? (యోజించి) సరే. కానిమ్ము. అదియును నొకదానికి మంచిదే. పోదము రమ్ము. (అందఱును నిష్క్రమింతురు)

(శోకనిమగ్నయై పేరాంబ ప్రవేశించును)

పేరాం॥ సీ॥ హానాథ! హావీర! హాజీవితేశ్వరా!
నను బాసి యేగితే నాకమునకు
నాబహిఃప్రాణమా! నను విడనాడిపో
వ్లనుకాళ్లాడె నీ? కెఱుఁగనైతి.

తృ తీ యాం క ము

ఏకపత్నీవ్రతమే ముఖ్యమని చాటి
తగునా కో మోక్షకాంతను వరింప?
నిను(గాసి యే నొక్కనిముసమేనియు నింక
నెమ్మెన(బ్రాణముల్ నిలుప(జాల.

నిన్నె దైవంబుగా నమ్మి నిలిచియున్న
అర్థదేహిని నిట వంచి యరుగ నగునె?
కాలమున(గాని యీ బలాత్కారమరణ
మావహిల్లునటంచు నే నరయనైతి.

హా సుకుమారశరీరా! నాపైఁగల ప్రేమాతిశయ మేమి చేసిపోయితివి? నీకు నే నింతభారముగాఁ దోఁచుటకు నాయం దేమిదోసము కనుపట్టినది?

మ॥ అకటా! సంధియొనర్పవచ్చి మన నెయ్యంబైనఁ బాటింప కిం
కొకచోటన్ బసచేసినందులకె నే నుత్సాహముల్ వీడఁ బొ
మ్మిఁక నీ కప్పుడె తీఱె నాఋణమటం చిచ్ఛానుచందంబునన్
సకలంబున్ వృథఁజేసి నీ వరిగితే స్వర్గాభిలాషుండవై.

హా ప్రాణేశ్వరా! నాయం దిదివఱ కెంతయో యనురాగ మున్నట్లు నటించుచుంటివే. అదియంతయుఁ గపటవర్తనమేనా? లేకున్న నకస్మాత్తుగా నను వీడి యొంటిగాఁ బరలోకసుఖ మనుభవింపనేగుదువా? నీవే నన్నింత యనాదరణం బొనరిం చిన నాకు దిక్కెవ్వరు? పతికిఁ గొఱగాని పడఁతి మఱెవ్వరికిఁ బనికివచ్చును? అయ్యయ్యో! నాకిం కేటియాశ?

చం॥ విడువక రేయియుం బవలు వేడుకతో నెనలేనిసౌఖ్యముల్
తొడరఁగఁజేయుచుం దగిన తోడయి ప్రాణమునై మెలంగు నీ
వెడమయినన్ సఖా! జగమదేటికి? కాఁపురమేటి? కేఁడు మె
చ్చెడు? సకలంబు శూన్యమయి చీఁకటికొట్టువిధంబు దోఁపదే?

నాథా! నాథా! నిన్నఁగదా సంధిఁజేసి యుత్తమరాజలో కంబునకు క్షేమము చేకూర్తువని మనవా రెల్లరుం గర ముత్సా

హంబున నిన్నుఁ బంపిరి. అట్టినీ వింతలో నిట్టి యకాలమృత్యువు వాతంబడిపోయితివా? ఆఁ! పాపిమృత్యువా! నీకు వరించుటకు నానాథుఁడే చిక్కెనటే? నీమోహము మండిపోను. నీబాఁకి పాడైపోను. మా యనుకూలదాంపత్యముఁ జూచి కనులుమండి మమ్మిరువుర వేఱుఁజేసి నానాథుని నీలోఁ గలిపికొంటివటే? ఇక్లిందటికాఁపురంబులు దీయుచుంటివోకదా! జనకా! మామవుకదాయని నీబాగుఁగోరినవాఁడగుట నీతు-లుపదేశించి మంచిదారికిఁదెచ్చి దేశసంక్షోభ మడఁగింప దండ కరుదెంచిన యల్లునిపట్ల నిట్లన్యాయంబు గావించుటకు నీమనంబెట్లొప్పెనోకదా! కులాంతకా! నీబిడ్డ యర్ధముద్దులఁజూచుటకే నీకు బుద్ధిపుట్టక పండువంటికాఁపురమును భస్మముగావించుటకును బల్నాటిసీమను బాడుసేయుటకును బెనుభూతమువలెఁ బుట్టి నీయింటఁజేరిన కూరభుజంగి కుమతి కూరకర్మిణి కులద్రోహిని యగు నాయకురాలి వలలోఁజిక్కి యిట్టి దుష్కృత్యమాచరింతువే? ఇంక లోకంబున నేబిడ్డలు వీరు నాతండ్రులు వీరు నాతల్లులు వీరు నాబాగునకుఁ బాటుపడువారు నని నమ్మిచరింతురు? అక్కటా! నీవిట్టి కఠినకార్య మొనరించుటకు రక్కసివైనను గావే? అయ్యయో! వారలకుఁగూడ దయ వారిపై దయగలుగుచుండునుగాని నీకులేదయ్యెఁగా! నీచాతినీచుండవైన నిన్ను నృపుండని పిలువవచ్చునే? కూఁతుకాఁపురంబునే కూలఁద్రోయుటకు వెనుకంజవేయని నీ పాడుగర్భమునఁ బుట్టినపాపము నాకు జన్మజన్మములకైనను దీఱునా? బ్రహ్మనాయఁడా! కులాంతకుఁడని యాదినుండియు నెఱిఁగియున్ననీకు నారాజరూప నరభక్షకునికడకు రాయబారిగాఁబంపుటకు నానాథుఁడుగాక మఱెవ్వరును జిక్కకపోయిరిగా? అక్కటా! వారినిమాత్ర మీతఁడు మన్నించునా? వారిదుఃఖము నాదుఃఖమువంటిదిగాదా! ఛీ! నలకామరాక్షసాధమా! అమాయికవృత్తితో నిన్ను బాగుసేయవచ్చిన నాపతిని గ్రూరుండవై

మాయచేఁ గూలఁద్రోసినంతనే నిన్ను శాశ్వతముగా నుండెదనని తలంచితివా? పల్నాటిపీనుగులందఱును బాసటైరని యోజించితివా? రణశూరులందఱు నమాయికులై నీమాయలలోఁ జిక్కి నశింతురని భ్రమపడుచుంటివా? లేదులేదు. అవన్నియు వృథా యోజనలుసుమీ! ఈవార్త బయలుపడిన వెంటనే వీరందఱు నొక్కపెట్టున వచ్చి నీకాయమును నిన్ను నమ్మియున్న నాయకురాలి కాయమును ముక్కలుముక్కలుగా నఱకి కుక్కలకును నక్కలకును గమ్మనివిందొనర్పకుందురే? వారందఱిదాఁక నేల? నేనె నీక్షణములోనె విగతప్రాణునిజేసి నానాథుని జేరఁబంపఁగలనుగాని నాథునియాజ్ఞ లేకపోవుటచే సైరింపవలసివచ్చినది. భారతీయసతీమతల్లులకుఁ బతియాజ్ఞకన్న మించినశాసనము లేకపోవుట నీవింతవఱకు బ్రదుకఁగంటివి. అయినను నింతటితో సరిపోయినదం చెంచకుము. నేను వీరపతివ్రత నగుదునేని తండ్రీ! ఛీ! తండ్రియని సంబోధించుచున్నాను. చండాలా! బంధుపిశితాశనా! అధముఁడవై యాఁడుదానికి లోఁగి యకృత్యములాచరించు నీవిఁక విశేషకాల మీభూమి నుండఁబోవుసుమీ! నీపాపిష్ఠకాయమును గాకులు గద్దలుగూడ ముట్టకపోవుఁగాక. (శోకముతో) హా జీవితేశ్వరా! నీవియోగము నేనెట్లుభరించుదానను? నాకేదియో గతిఁజూపి యేగుము. నాథా! నాథా! నాథా! నా--- (అని మూర్ఛిల్లును)

బ్రహ్మ॥(ప్రవేశించి తనలో) ఎట్టెటో చెల్లెలు చెల్లాంబ దుఃఖానలముఁ జల్లార్పఁగలిగితినిగాని యీబిడ్డదుఃఖమును శాంతింపఁజేయుట నాతరముగాకున్నది. ఈమెను సమాశ్వాసించుటకుఁగూడ నాకు వాకు రాకున్నది. సతికిఁ బతివియోగము మిగుల దుస్సహము. దానిని శాంతింపఁజేయుటకు బ్రహ్మాదులకైనను శక్యముగానిదగుట నాకును శక్యముగానిదే యగుఁ. గాని ప్రయత్నించిచూచెద.

వీర॥ (మూర్ఛనుండి లేచి మరల శోకముతో) హా హృదయేశ్వరా! నాబ్రదు కెంతవ్యర్థము చేసిపోయితివి? నాకేదిగతి? నాయఁడా! నీ వీరాయబారమును నాకొంపఁగూల్చుటకే సంకల్పించితివి కాఁబోలు! నాపతిమరణమునకే తలపెట్టితివికాఁబోలు! ఎంత కఠినకర్ముఁడవైతివి? నా భావిఫలం బంతయుఁ బాడుచేసితివి కదా!

బ్ర॥ అమ్మాయీ! నీవనినట్లు నీ భావిఫలనాశనమునకు నేను గారణ మగుట నిజమే, కాని శోక ముడిగి నా - - -

వీర॥ (చూచి చిరాకుతో) ఆఁ! ఎవరు? బ్రహ్మనాయఁడా? ఏమను చున్నాఁడు? తండ్రీ! మీరందఱును నాయెడల నింతపగఁబూనుటకు నే నేమియపరాధము గావించితిని?

మ॥ కడుఁ జాతుర్యముతోడ సంధినొకటిం గల్పించి నానాథుతో
నెడఁబోఁ ద్రోయుటకంటె నాబ్రదుకు మీ కిష్టంబు గాకున్న-చో
వడి నాకంఠమె కోసివేసి పతిడా బంధంబు పోకుండఁజే
యుఁడు. నే నెంతయు సంతసింతు. నిదియేయుత్కృష్టమౌ నాకిఁకన్.

బ్ర॥ బిడ్డా! శోకార్తవగు నీ వేమియన్నను గాదనఁదగదు. కాని జ్ఞానవంతురాలవై యుండియు నజ్ఞానులవలెఁ బ్రవర్తిల్లుటమాత్ర మంగీకరింపఁదగినదికాదు. ప్రతిజీవికిని గష్టములు కలుగుచునే యుండును.

శా॥ బాలా! త్వద్భవబంధమోక్షకరుఁడౌ ప్రాణేశుఁడై యాత్మలో
జాలింబొందుచుఁ బెల్లు దుఃఖపడుటల్ సామాన్యమే కాని దీ
నాలాపంబుల మంచిచెడ్డలను నీ వాలింపఁగాలేక స
చ్ఛీలంబున్ విడనుండినందుల కయో! చిత్రింబుగానుండెడిన్.

ఆ॥ జ్ఞానయోగములకు స్వయముగ శ్రీయంత్రమైనయట్టి హరియె బ్రహ్మ. పంఖిలేశ
రూపుఁడైన యాతఁడే ప్రపంచంబు సృజించుఁ బెంచుఁ ద్రుంచుఁ జక్కఁ జాన. ౨౪
ఆ॥ నిఖిలమాసములకు నేత సనాతనుండైన శార్ఙ్గపాణి. యంగుళమున
నఖిలమాస దివస యామంబులందు నా హరి స్మరించి ముక్తిఁ బొందియు నవిరతము ౨౫
కం॥ చాతుర్మాస్యం కృతమగు వైతేయాంతిద్ధైన ధ్యానముబున నా
నాతీ! కలదు విశేషం. బేతన్మాహాత్మ్య మహాప! యేమిక వింతుక్. ౨౬
ఆ॥ భూధరాధిరాజపుత్రి! చాతుర్మాస్య సకలమాసములను సల్పవెనుక
చేయఁబడు సమూర్తసేవ గంగాతీర్థమజ్జనమునకంటె నతిశయము ఘనము. ౨౭
ఆ॥ ధ్యానమునను జేసి తలఁగుఁ జాతుర్మాస్య సర్వమాసములను సల్పనైనము.
అపుడు చేసినట్టి దత్కయ్యపగును శుభాశుభములనేదిర్థైనఁగాని. ౨౮
ఆ॥ అట్లుగాన సఖి! ప్రియత్నపూర్వకముగ సల్పు టుత్తమంబు జ్ఞానయోగ.
మిట్లు విష్ణురూప మెనసి సేవితమైన బ్రహ్మ మిచ్చు మెచ్చి పరమపదము. ౨౯
కం॥ మూర్త్యామూర్తస్థితి శుభమూర్తీ! విను సావధానముగ. నది యెపుడుక్
కీర్తింపఁజనదుచూ సద్వర్తనలేకున్న ముష్టుల నయునకైనక్. ౩౦
సీ॥ తపముమున్నగునట్టి తనుశోషణ క్రియల్ తలపఁజాలనియట్టి యలసునకును
విధిదూరమగుపను ల్విరచించుచును సదా నిందింపఁదగియుండు నీచునకును
ప్రజ మెచ్చుకొనుటకుం బ్రకటితభక్తియై తిరుగ నేరిచిన యధీనునకును
చిత్తచాంచల్యంబుచే స్వవాక్చ్యుతుఁడౌచుఁ జరియించుచుండెడి జాల్మునకును
చెప్ప కీయోగమర్మంబుఁ జేరఁదీసి శమముఖానేక సద్గుణసంయుతునకు
దాంతునకు నిర్వ్యసనున కింతి! సదుపదేశమీవలె బాగుగాఁ దెలియునటుల ౩౧
ఆ॥ విష్ణుభక్తుఁడేని విప్రునకే కాదు చరణజునకుఁ జెప్పఁజనును యోగ.
మశుచియును నభక్తుఁ డబల! బ్రహ్మస్థానమున కనర్హుఁ. డేమియనుచు నింక. ౩౨
తే॥ ఓతపోధన! నామీఁదనుండియున్న నీదుభక్తికి సంతసించితిని నేను.
యోగసిద్ధిని గైకొను మొసఁగినాఁడ భక్తి విలగా దొకప్పుడుక్ భంగిదెలియ. ౩౩
తే॥ నాదరూపంబునను భువనములనుండు నిఖిలదేహుల శిరమున నిర్వటిలు న
భూతు నారాయణుం బరుఁ బూవుఁబోఁడి సరిగ నెఱుఁగుము తడవేల జ్ఞానగమ్యు.
ఆ॥ అతఁడె జీవశిరమునందు మూర్తినిదాల్చి సూక్ష్మరూపమునను సూర్యబింబ.
మటు సదోదితుఁడయి యలరు. సదాభ్యాసమునను దత్పరాత్మ పొందఁబడెడు. ౩౫
సీ॥ హృదయపద్మంబున సదయాంతరంగుఁడై యెల్లప్పు నివసించు నీశ్వరుండు.
నాళికసమమైన నాళికేశంబున నందాసీనుఁడౌఁ బరుగాననుండు.

